శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః.

# శ్రీ మహాభారతము

## ఆంధ్రవచనము.

శాంతిపర్వము (1-389.)

దేవరాజసుధీప్రణీతము.



మద్రాసు

ఆనందముద్రణాలయమునందు

ముద్రితము.

ఆర్. వేంకటేశ్వర్ అన్డ్ కంపెనివారిచేఁ బ్రకటితము.

1915.

---

# విషయసూచిక.



# పటముల పట్టిక.





శ్రీరామచన్ద్రపరబ్రహ్మణే నమః.

# శ్రీ మహాభారతము

## శాంతి పర్వము.

---

శ్రీ వేదవ్యాసాయ నమః.

శ్లో॥ నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్ ।
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయేత్ ॥

### రాజధర్మపర్వము.

{ గంగాతీరమందు ధర్మరాజుకడకు ఋషులు వచ్చుట. నారదుని ధర్మపుత్రుఁడు కర్ణవృత్తాంతము నడుగుట. }

వైశంపాయనుఁడు జనమేజయునితో 'సుహృదుల కందఱకును జలతర్పణములు చేసినపిదప, పాండవులును, విదురుఁడును, ధృతరాష్ట్రుఁడును, భరతవంశపు స్త్రీలందఱును, మహాత్ము లయిన యాతక్కిన కౌరవులును, శౌచము చేసికొనువారై, పట్టణమునకు వెలుపల, నా గంగాతీరమందు నొకమాసము వసించి యుండిరి. అట్లు తర్పణములు తీర్చియున్న ధర్మాత్ముఁ డగుయుధిష్ఠిరునికడకు మహాత్ములును తపస్సిద్ధులును బ్రహ్మర్షిసత్తములు నగు

---

*'యుద్ధముజరిగిన పదునెనిమిది దినములందును ఆయానాఁటి మరణములకు ఆయానాఁడే శుద్ధియగుచున్నది. (మనస్మృతి. ౫-౯౮ శ్లో) పదునెనిమిదవ

వ్యాసుఁడు నారదుఁడు మహర్షియగు దేవలుఁడు, దేవస్థానుఁడు, కణ్వుఁడు, నుత్తము లయినవారిశిష్యులును వచ్చిరి. మఱియు వేదవిదులును జ్ఞానసంపన్నులును స్నాతకులును గృహస్థులు నయిన బ్రాహ్మణులును గురుసత్తముఁ డగుధర్మరాజును జూచిరి. ఆమహార్షులు మహాత్ముఁ డయినధర్మరాజును జేరి విధ్యుక్తముగఁ బూజితులై మిక్కిలి గొప్పవియగు నాసనములందుఁ గూర్చుండిరి. అంతన ట్లాబ్రాహ్మణు లక్కాలమునకుఁ దగినపూజం గయికొని పవిత్రంబగుగంగాతీరమున శోకవ్యాకులచిత్తుఁ డయియున్న ధర్మరాజు నూఱడించుటకై వేలకొలఁదిని బరివేష్టించి తమతమ యంతరువుల నెఱిచొప్పున నలుప్రక్కలఁ గూర్చుండిరి. నారదుఁడు వ్యాసుఁడాదిగాఁగలుగుఋషులతో మాటలాడుచు ధర్మరాజును జూచి తగుసమయమున 'ఓధర్మరాజా! అర్జును భుజపరాక్రమముచేతను శ్రీకృష్ణుని యనుగ్రహముచేతను, ధర్మముచేతను, నీ భూమియంతయు జయింపఁబడినది. లోకమునకు భయంకర మయినయీయుద్ధమునుండి భాగ్యవశమున విడివడితివి. పాండవా! క్షత్రధర్మమునం దాసక్తుఁడ వై యున్నావని సంతోషించుచున్నావేకద. రాజా! నీవు శత్రువులనెల్లఁ బొరిపుచ్చితివి. మిత్రులను సంతసింపఁ జేయుచున్నావేకదా? ఈసంపదను బొందినపిదప

---

దినము సౌప్తికపర్వమునందు మృతు లయినవారికొఱకు పండ్రెండుదినములు ఆశౌచము అనుష్ఠింపవలయును. యుద్ధదినములు పదునెనిమిది, ఆశౌచదినములు పండ్రెండు, రెండునుజేరి ముప్పదిదినము లనియొకపక్షముగలదు' అనియు 'కొన్నిసమయములందు కపటయుద్ధాదులు చేయుటవలని దోషము నివర్తించుటకై పుణ్యనదీతీరమందు ఒకమాసము వసించిరేకాని ఆశౌచనివృత్తికిఁ గాదు' అనియు పూర్వవ్యాఖ్య.

నిన్ను శోకము బాధింపదేకదా ?" అని యడిగెను. అందులకు యుధిష్ఠిరుఁడు 'మహాత్మా! కృష్ణుని బాహుబలము నండఁగొనియు బ్రాహ్మణుల ప్రసాదముచేతను, భీమార్జునుల బలముచేతను నీ భూమియంతయు జయింపఁబడినది. అయినను, నామనసునం దీమహాదుఃఖము నిత్యమును వేఁచుచున్నది. చూచుటకు భయంకరమయిన యీ జ్ఞాతినాశమును మిక్కిలియుఁ జేసియు, గారాబుకొడుకులగు సుభద్రకుమారుని ద్రౌపదిపుత్రులను జంపించుకొనియుఁ బడసినయీజయ మపజయముగా నే నాపుఁ దోఁచుచున్నది. ద్వారకయందున్న నామఱఁదలు సుభద్ర, కృష్ణు డిక్కడనుండిపోఁగానే యేమిచెప్పునో కదా ! ద్రౌపది యిది తనకన్నకొడుకులందఱును హతులై బంధువులును హతులై వెతలుగుడుచుచుండి యు మరల మాపుఁ బ్రియమును హితము నే జరుపుచుండుట నన్నుఁ బీడించుచున్నట్టే యున్నది. మహాత్మా! మఱియు మీకు నిదొకటి చెప్పెదను. కుంతి రహస్యమును దాఁచినందున నాకు దుఃఖమును గూర్చినదయ్యె. లోకములఁ బదివేలయేనుఁగుల బలిమిగలవాఁడై, యుద్ధంబున నెదురులేక, సింహముంబోలి గరువంపు నడగలిగి, జయశీలుఁడై, వ్రతనియతి దప్పక, ధృతరాష్ట్రునిపుత్రుల కెల్లఁ బ్రాపయి, మానియు, నుగ్రమయిన పరాక్రమముగలవాఁడునై, పగవారికి నయింపక, యెప్పుడును నుర వడించుచు, ఒక్కొక్కయుద్ధమందును 'మమ్ము నెగఁజిమ్ముచు, నతివేగములయిన యస్త్రములుగలిగి, చిత్రభంగుల యుద్ధముసేయుచు, సమర్థుఁడై, యద్భుతపరాక్రముఁడును గుంతికిఁ గూఢముగా బుట్టిన పుత్రుఁడు నయినయాకర్ణుఁడు మాకన్నయఁట ! ఆసమయమున, తర్పణమువిడుచునపుడు కుంతి యతనిని సకలగుణాసం

పన్నుఁడును తొల్లి జలమునందువిడువంబడినవాఁడు నగు కర్ణుఁ డనియుఁ దనకుమారుఁడనియు నాకుఁ జెప్పెను. ఎవనిని మందస యందుంచి గంగాప్రవాహమందు మునుంగఁజేసెనో, ఎవనిని సూతపుత్త్రుఁడనియు రాధకొడుకనియు లోకము తలంచినదో, ఆకర్ణుఁడు కుంతియందు సూర్యునకుఁ బుట్టినవాఁడు; తల్లివంకను బట్టిమా కన్నదమ్ముఁడయినవాఁడు. రాజ్యమునందు పేరాసగలిగి యేమియుఁ దెలియక నేనతనిని యుద్ధమునఁ జంపించితిని. అది యే, అగ్గి దూదిప్రోవునుంబోలె, నామేను నెరియించుచున్నది. అర్జునుఁడను నతని నన్నయని యెఱుఁగఁడయ్యె; నేను నెఱుఁ గను. భీముఁడు నెఱుఁగఁడు. నకులసహదేవులు నెఱుఁగరు. అతఁ డొ మమ్ముమాత్రము గెలరూపున నెఱింగికొనెను. కుంతి మాకు సంధినిగోరి యతనికడకు 'నీవను నాకొడుకవే' యని చెప్పుచుఁ బోయినదని మాకువినికి. పిదప నతఁడు మహాత్ముఁడుగాన కుంతి కోరికను గావింపఁడయ్యె. అతఁడు 'తల్లీ! మిక్కిలి తగనిమాట లు పలికితివి' అనియు 'దుర్యోధనుని యుద్ధసమయమున దిగవి డుచుటకు నేను శక్తుఁడనుగాను. దిగవిడిచితినా, అపూజ్యతయు, క్రూరత్వమును, నెనరులేమియు నాకు సంభవించును. నీమతము చొప్పున ధర్మరాజుతో సంధిగావింతునేని, నన్ను యుద్ధమునం దర్జునునకు వెఱచినాఁడని లోకము తలంచును. అట్లేని, కృష్ణ సహితుం డయినయర్జునుని యుద్ధమునజయించినపిదప ధర్మరాజు తోడ కలసికొనెదను' అని చెప్పెను. కుంతి మరల విశాలవక్షుం డగునతనితో 'నలువురకు నభయ మిమ్ము. ఇచ్చుచొప్పున నర్జును నితోడఁ బోరాడుము' అని చెప్పినదఁట. అతఁడు బుద్ధిమంతుఁడు గాన వడఁకుచున్న తల్లినిజూచి చేయిమోడ్చి 'దేవీ! నీనలువురు

కొడుకులును నాబారినిబడఁగాఁ ద్రోసిపుచ్చక వారిని జంపవల సియుండినను వారినిజంపను. కర్ణుఁడు హతుఁడయ్యెనా యర్జుననిఁ గూడియో, అర్జునుఁడు హతుఁడయ్యెనా కర్ణునిఁగూడియో నీకుఁ బుత్రులేవురే తిరముగానుండఁగలరు" అనెను. అంతఁ దల్లి కొడు కులయందు మిక్కిలి మక్కువగలదిగాన మరల నతనితో 'నీవే తోఁబుట్టువులకు మేలుసేయఁగోరెదవ్రా వారలకు క్షేమముగా వింపుము' అనెను. ఇట్లు చెప్పి కుంతి యతనిని వీడుకొని యింటి కిఁబోయెనఁట. తోడంబుట్టిన యన్నయగు నావీరుఁడు తమ్ముఁడ యినయర్జునునిచే హతుఁడయ్యెను. ఋషీశ్వరా! కుంతిరహస్య ము బయలువడదయ్యె. అతనిరహస్యమును బయలుపడదయ్యె. కాఁబట్టి మేటివిలుకాఁ డయినయాశూరుఁ డర్జునునిచే యుద్ధము నఁగూల్పఁబడెను. బ్రాహ్మణోత్తమా! పిదపఁ గుంతి మాటవలనఁ గర్ణునిసహోదరుఁడనియు,ముందుగా బుట్టుటచేనన్నయనియు నేను దెలిసికొంటిని. కాఁబట్టి యన్ననుజంపికొన్న నాకు మనసు పురపు రఁబొక్కుచున్నది. కర్ణునిని నర్జునునిఁ దోడుగాఁబడసితినేని, నేనిం ద్రునిపయితము గెలుతునే! దుష్టబుద్ధులయిన ధృతరాష్ట్రపుత్రు లచే సభయందుఁబీడితుండనైన పుడుతోడనే నాకు వెలికురవడించి నకోపము కర్ణుని మొగముచూడఁగానే యాఱిపోవును.సభయందు జూదమాడునపుడు కర్ణుఁడు దుర్యోధనుని హితముగోరి తొడంగిన పుడె కటువులై మిక్కిలి బిరుసుగాఁ బలుకుమాటలు విన్నప్పుడు నాకుఁ గలిగినకోపము, అతనియడుగులను జూడఁగానే యుడిగిపో వును. కర్ణునిపాదములు కుంతిపాదములకు సాటియైనవని నాతలఁ పు. కుంతికిని నతనికిని బోలికయుండుటకుఁ గారణము నెంత వెద కియు, ఎంత యాలోచించియు, ఏవిధమునను నాకుఁ దెలిసినది

కాదు. యుద్ధమునందు భూమి యతని తేరిచక్రమును మ్రింగుట యెట్లు? నాయన్న యేవిధమున శాపమునొందెను? ఇందలి కల రూపును జెప్ప నీవేయర్హుండవు. మహాత్మా! కలిగినది కలిగినట్టుగా నీవలననుండి యంతయును వినఁగోరుచున్నాను. నీవు సకలమును దెలిసిన విద్వాంసుఁడవు. లోకమునఁ జేసినదియుఁ జేయఁబోవునదియు నెఱుఁగుదువు' అనెను. ఇది ప్రథమాధ్యాయము.

---

## రాజధర్మపర్వము.

(కర్ణుఁడు బ్రహ్మాస్త్ర మిమ్మని ద్రోణుని వేఁడి యతఁడొల్లక పోఁగా పరశురామునికి శిష్యుఁడగుట. కర్ణనికి బ్రాహ్మణ శాపము.)

ధర్మరాజిట్లడుగఁగా మాటకారి యగునారదుం డపుడా కర్ణునికి శాపముగలిగిన విషయమంతయుఁ జెప్పఁదొడఁగి 'భారతా! నీవు చెప్పునది సరియే. కర్ణునికి నర్జునునికిని యుద్ధమున జయింపఁదరముగానిది యొకటియుఁ గలుగదు.అయినను రాజా! దేవరహస్యమయిన దీనిని నీకుఁ జెప్పెదను. తొల్లి యి దెట్లు జరిగెనో తెలియుము. క్షత్రియజాతి యాయుధములచేతఁ బరిశుద్ధమై యెట్లు స్వర్గము నొందునని యాలోచించి యందులకై కన్యయగు కుంతియందు వైరాగ్నిని బుట్టించుచు నట్టిగర్భమును దేవతలు కలిగించిరి. ఆగర్భమునం గలిగిన బాలుఁడు తేజంబుతోఁ గూడినవాఁడై సూతపుత్రుఁడు నయ్యెను; ఆంగిరస కులులలో మేటియు నీకు గురువు నయిన ద్రోణునివలన ధనుర్వేదము నభ్యసించెను. రాజోత్తమా! వాఁడు భీమసేనుని బలమును, అర్జునుని యస్త్రసామర్థ్యమును, నీదుబుద్ధినిని, అట్లె నకులసహదేవుల

వినయమును, అర్జునునికి నెలప్రాయముననే కృష్ణునితోడఁ గలిగిన స్నేహమును ప్రజల యనురాగమును, జింతించుచు మిక్కిలి వెఱియుచుండెను. వాఁడు స్వభావమువలనను దేవతలసంకల్పమువలనను మీతోడ నెప్పుడు వైరము పూనియున్నదుర్యోధనునితోడ బాల్యమందు స్నేహమునొందెను. పిదపఁ గర్ణుఁ డర్జునుని ధనుర్వేదమందు విద్యాధికుఁ డనియెఱింగి రహస్యమున ద్రోణునికడకుఁబోయి యతనితో 'బ్రహ్మాస్త్రమును దాని ప్రయోగోప సంహారక్రమములతోఁ దెలిసికొనఁ గోరుచున్నాను. యుద్ధమునం దర్జునునితోడ సమానుఁడుగా నుండవలయునని నాతలంపు. మీకుఁ బుత్రులయందును శిష్యులయందును స్నేహము సమముగానుండుట నిశ్చయము. మీయనుగ్రహమువలన నన్నస్త్రాభ్యాసము లేనివాఁడని తెలిసినవారు చెప్పకుందురుగాక'యనెను. అందులకు ద్రోణుఁ డర్జునునియందు మక్కువగలవాఁడు గావునను గర్ణుని దుష్టబుద్ధి తెలిసియున్నఁ దుననువానిని జూచి 'విధ్యుక్తముగా వ్రతమును నాచరించిన బ్రాహ్మణుఁడు బ్రహ్మాస్త్రమును దెలిసికొనఁదగినవాఁడు. లేక మిక్కిలి తపముగల క్షత్రియుఁడును దెలిసికొనఁ దగినవాఁడు. తక్కినవాఁ డేవిధమునను దెలిసికొన నర్హుఁడుగాఁడు' అనెను. అంతఁ గర్ణుఁ డాంగిరసవరుం డయిన ద్రోణునిఁబూజించి వీడుకొని మహేంద్రమనుపర్వతమునకుఁ దోడనేపోయెను. అకర్ణుఁడు పరశురామునిఁ జేరి తలసోఁక మ్రొక్కి 'నేను భృగువంశమునం బుట్టిన బ్రాహ్మణుఁడను' అని గౌరవముగాఁ జెప్పికొని యభివందనము చేసెను. పరశురాముఁడు గోత్రము మొదలగు వానినెల్ల నడిగి యతనిఁ గయికొని 'నీకు స్వాగతము, ఇచ్చట నుండువచ్చును' అనిచెప్పి మిక్కి

లియుఁ బ్రీతిగలిగియుండెను. స్వర్గమునకు సమానంబగు నమ్మహేంద్ర పర్వతమునఁ గర్ణుఁడు వసించియుండఁగా నతనికి గంధర్వులతోను రాక్షసులతోను, యక్షులతోను, దేవతలతోడను సమాగమము కలిగెను. వాఁడచ్చట యథావిధిని బరశురామునివలన బాణములను నస్త్రములను నభ్యసించెను; దేవతలకును, నసురులకును రాక్షసులకును మిక్కిలి ప్రియుఁడై యుండెను. ఆ కర్ణుఁడు తా నొకప్పుడు సముద్రమునకు సమీపమునం దున్న యాశ్రమము పొంత సంచరించుచు నొంటిమెయి విల్లును ఖడ్గమును గేలందాలిచి విహరించుచుండెను. అపు డగ్నిహోత్రము చేయుచుండిన యొక బ్రహ్మవాది యగు బ్రాహ్మణుని * హోమధేనువును (దూడను) దెలియక దైవికముగాఁ జంపెను. కర్ణుఁడు తాను దెలియక చేసిన దానిని దెలిపి బ్రాహ్మణునకుఁ దెలిపెను. వాఁ డతనికిఁ గోపము లేకుండునట్లు చేయఁ దలఁచి యాతనితో 'మహాత్మా! నీధేనువగు దీనిని నేను, వలయునని తెలిసికాక తెలియక చంపితిని. ఆవిషయమై నాయం దనుగ్రహింపవలయును' అని మాటిమాటికి వేఁడెను. ఆబ్రాహ్మణుఁడు క్రుద్ధుఁడై కర్ణుని మాటలచే నదల్చువానివలె ' దురాచారా! నీవు వధకు నర్హుండవు. దుర్మతీ! ఇందులకుఁ దగిన ఫలము పొందంగలవు పో! పాపీ! నీవెవ్వనితోడ నెప్పుడును మచ్చరించుచుందువో, ఎవ్వని కొఱకు నెపుడు జతనపడుచుందువో, యట్టి వానితోడ యుద్ధము సేయునపుడు నీదు రథచక్రమును భూమి మ్రింగఁగలదు. మనుజాధమా! అంత చక్రము భూమియందుఁ గ్రుంగఁగాఁ, దోడనే

* కర్ణపర్వమందుఁ జెప్పఁబడి యున్నట్లు ధేను వనఁగా నిట వత్సము (దూడ) గాఁ దెలియునది.

నీవు తత్తఱపడుచుండునపుడు పగవాఁడు నీతలను పరాక్రమించి కూల్పఁగలఁడు. మూఢా! పద! నేను పరాకున నుండఁగా నాగోవును దీనిని నీవెట్లు చంపితివో యట్లె పరాకున నీవుండఁగా, నామాటచేతనే నీతలను వాఁడుగూల్పఁగలఁడు' అని శపించెను. కర్ణుఁడట్లు శప్తుఁడై యాబ్రాహ్మణుని గోవులను ధనములను రత్నములను నిచ్చి ప్రసన్నునిఁ గావించెను. అతఁడు వానినిజూచి మరల 'ఈ నా చెప్పినమాట బ్రహ్మలోకమందును జెప్పఁబడనిదిగాఁ (పొల్లుగాఁ) జేయఁదరముగాదు. నీవు పోయినను బో; నిలిచిన నిలువు. లేక యేమిచేయవలయునో చేసికొనుము' అనెను. బ్రాహ్మణుఁడిట్లుచెప్పఁగాఁగర్ణుఁడు దుఃఖమునఁ దలవాంచి మనస్సున దానినే తలంచుకొనుచు భయమునొంది పరశురాముని కడకువచ్చెను. ఇది రెండవయధ్యాయము.



## రాజధర్మపర్వము.

> పరశురాముఁడు కర్ణుని తొడపయి నిదురించునపుడొక పురుగు వాని తొడను తొలుచుట. పరశురాముఁడు కర్ణుని శపించుట.

పరశురాముఁడు, కర్ణుని బాహువీర్యమునకు వినయమునకును దమమునకును గురుశుశ్రూషకును సంతసించెను. అంత మహాతేజుండును బరమ తపస్వియు నయినయాగొప్ప ప్రాజ్ఞుఁడు కనికరమునకుఁ బాత్రుఁడయిన యాకర్ణునకు బ్రహ్మాస్త్రమును, ఉపసంహారముతోఁగూడ నుపదేశించెను. కర్ణుఁడట్లస్త్రమునెఱింగి యాభృగువునాశ్రమమందుఁ గ్రీడించుచు నద్భుతపరాక్రముఁడై ధనుర్వేదము నభ్యసించుచుండెను. పిదప నొకప్పుడు పరశు

రాముఁడు కర్ణునిం గూడి యాశ్రమముసమీపమున సంచరించుచుండెను. ఆ గురుఁడు పరశురాముఁ డుపవాసముచే స్రుక్కి మనంబు వికాసంబులేక వాఁడువాఱ నమ్మికవలనినెయ్యంపుఁ బెంపుచే నా కర్ణునితొడయందుఁ దలయిడి నిదురపోయెను. అంత శ్లేష్మమయ మయినయొకపురుగు కర్ణుని యొద్దకువచ్చెను. దానికి మాంసమును రక్తమునే యాహారము. కాన యది చేయుపని భయంకరమగుటయే కాక దాని పొడయునుజూడ బెట్టిదముగానే యుండెను. అది వానితొడను దారసించి నెత్తురుఁ ద్రావఁగోరి దానిని దొలువఁజొచ్చెను. కర్ణుఁడు గురువులని భయమున దానిని జమ్మివైచుటకు శక్తుఁడు గాకుండెను. అట్లాపురుగుకఱచుచుండియు నాకర్ణుఁడు గురువుమేలుకనుటను వేచిదాని నుపేక్షించి నవాఁడయ్యె. కర్ణుఁడు సహింపనలవిగాని యావేదనను దాలిమిచే నడంచుకొని కదల్పకయు గాసి పెట్టకయుఁ బరశురామునిఁ దాల్చియుండెను. ఆ గురుఁడు తన దేహమంతయు రక్తము తాఁకు వడఁగా మేలుకొని చూచి సంరంభించి 'అక్కటా! అశుచి నాకుఁ గలిగినది! ఏమిది నీవుచేసినది? భయమని దాఁపక జరిగినది జరిగినట్లు నాకుఁ జెప్పుము' అని యడిగెను. కర్ణుఁడు తన్నాపురుగట్లు కఱచిన దని చెప్పెను. పరశురాముఁడును పందివలె నాకారము గలయాపురువును గాంచెను. దానికి నెనిమిదికాళ్లును వాఁడులయిన కోఱపండ్లునుండెను; మేనంతయు సూదులవంటి వెండ్రుకలచేఁ గప్పంబడియుండెను. దాని యవయవములు ముడుంగుకొని యుండెను. రాముఁడు చూడఁగానే యాపురుగు వానెత్తుటనే తోఁగుచు నుసుఱువిడిచెను. అది యొక యాశ్చర్యమువలె నుండెను. అంత నాకాశమున సకలరూపములు నెత్తుకొనఁ జాలిన

వాఁడును గ్రూరాకారుఁడును నగు నొకరాక్షసుఁడుకనుపట్టె
ను. వాని కుత్తుక యెఱ్ఱగాను దక్కిన దేహమంతయు నల్లగాను
నుండెను. వానికి మేఘమువాహనమై యుండెను. వాఁడు చేతు
లుమోడ్చి నిండుమనంబునఁ బరశురామునిఁ జూచి 'భృగుసింహ
మా! మీకు స్వస్తియగుఁగాక. నేనువచ్చినదారినే పోయెదను.
మునిసత్తమా! నరకమునుండి నీచేత విముక్తుఁడనయితిని. నీకు
భద్రంబును సిద్ధియుఁ గలుగుఁగాత.నాయిష్టము నీచేత సమకూ
డినది'అనెను. పరశురాముఁడు వానినిజూచి 'నీవెవ్వఁడవు? ఎందు
వలన నరకమొందితివి? దానిని జెప్పుము' అనియడిగెను. వాఁడు
'తండ్రీ! తొల్లి కృతయుగమందు దంశుఁ డనుగొప్పయసురను;
భృగువునకుఁ జెలివలె నున్నవాఁడను. భృగువునకు మిక్కిలి
ప్రియురా లయినయిల్లాలిని నేనుబలవంతముగా నపహరించితిని.
ఆమహర్షి యందులకు శపింపఁగాఁ బురువయి భూమియందుఁ
బడితిని. నీకుఁ బూర్వపితామహుం డయిన యాభృగువు కుపి
తుండై నన్నుఁ జూచి 'పాపాత్మా! మూత్రమును శ్లేష్మమును గుడు
చుచు నరకమును బడయఁగలవు' అని శపించెను. అంత నే నత
నితో 'బ్రాహ్మణోత్తమా! శాపమునకు నంతము దయసేయు
ము' అని వేడికొనఁగా నతఁడు 'భృగువంశమునఁ బుట్టు రాము
నివలన విముక్తిగలుగును' అని చెప్పెను, సాధూత్తమా!
నేను కుశలరహితుఁడు పొందునట్లు యీగతిని బొంది మిమ్ముఁ
జేరినపిదపఁ బాపయోనివలన విడివడితిని' అని చెప్పి రా
మునికి మ్రొక్కి వాఁడుపోయెను. రాముఁడు కోపంబునఁ గర్ణు
నిఁ జూచి 'మూఢా! ఈమహాదుఃఖమును నొకప్పుడును బ్రా
హ్మణుఁడు సయింపఁడు. క్షత్రియునకుంబోలె నీకు ధైర్యము చూ

పట్టుచున్నది. కపటముమాని కలరూపుఁ జెప్పుము" అనెను. అంతఁ గర్ణుఁడు శాపముకలుగునని భయపడి యతనినిఁ బ్రసన్నునిఁ గావించుటకై 'ఓభార్గవా! బ్రాహ్మణునకును క్షత్రియునకు వేఱయినచోటఁబుట్టిన సూతజాతివానిఁగా నన్నుఁదెలియుము. భూమియందు నన్నురాధకొడుకయిన కర్ణుఁడని జనులాడుదురు. నేనస్త్రమందుఁ బేరాసగలిగి యిటుసేసినందులకు నాయందనుగ్రహింపుము. వేదవిద్యను నొసంగసమర్థుం డయినగురుఁడు పిత యనుటకు సందేహములేదు. కాఁబట్టి మీకు భార్గవుఁడనని నేను గోత్రము చెప్పితిని " అనెను. ఇట్లు భూమిపయింబడి శోకంబున దురపిల్లుచు వడవడవడఁకుచు నంజలిగీలించి యున్నయా కర్ణునిఁ జూచి రాముఁడు కోపంబునఁ గాల్చువానింబోలెఁ జుఱచుఱం జూచి 'మూఢా ! నీవస్త్రమునందుఁ బేరాసగొని యిచటనన్నుఁ బొల్లుగా నుపచరించితివి. కావున యీ బ్రహ్మాస్త్రము సమానుఁడయినవానితో యుద్ధము సేయునపుడును నీదువధకాలమందుఁ దప్పఁ దక్కినకాలమునను, దోఁపకుండుఁగాత. బ్రాహ్మణుఁడు కాని వానియందొకప్పుడును బ్రహ్మాస్త్రము నెలకొనియుండదు పో. ఇప్పుడు దబ్బఱకాఁడవగు నినుబోఁటికిటచోటులేదు. యుద్ధమున నీకు సాటియైన క్షత్రియుఁడు భూమియందుఁగలుగఁడు ".అనెను. అంతఁ గర్ణుఁడు న్యాయముచొప్పున నమస్కారములు గావించి దుర్యోధనునిఁజేరి 'అస్త్రముల నాటితేటితి ' ననెను. ఇది మూఁడవయధ్యాయము.

---

## రాజధర్మపర్వము.

దుర్యోధనుఁడు స్వయంవరమున కళింగరాజు కన్యనపహరించుట. కర్ణుఁడు దుర్యోధను వెంటఁ దలపడినరాజుల నోడించుట.

ఓ! భరతసత్తమా! పరశురామునివలన నిట్లు కర్ణుఁడస్త్రమును బడసి దుర్యోధనునింగూడి ముదంబునఁ బొదలుచుండెను. రాజా! పిదప నొకకాలమందుఁ గళింగదేశమునఁ జిత్రాంగదరాజు స్వయంవరమున రాజులువచ్చి చేరిరి. ఆదేశమందు సిరిపెంపారుచున్న రాజపురమను పట్టణమునకు నందలి కన్యకుఁగాను రాజులు వందలకొలఁదిని వచ్చిచేరిరి. అచ్చట రాజులందఱును వచ్చిచేరియున్నారని విని దుర్యోధనుఁడు కర్ణునిఁగూడి బంగారుకండ్లతోఁ గూడిన రథమునెక్కిపోయెను. రాజోత్తమా! అంతఁ బెక్కుదేశములనుండి మహారథు లయినరాజులు కన్యానిమిత్త మా స్వయంవరమునకు వచ్చిచేరిరి. దక్షిణదిక్కునందలి శిశుపాలుఁడు జరాసంధుఁడు, భీష్మకుఁడు, వక్రుఁడు, కపోతరోముఁడు, నీలుఁడు, రుక్మి, స్త్రీరాజ్యమున కధిపతియైన సీగాలుఁడు, విశోకుఁడు, శతధన్వుఁడు, భోజుఁడు, వీరుఁడును మఱియుఁ బెక్కండ్రు రాజులును, అట్లె తూర్పునను నుత్తరమునను గల మ్లేచ్ఛరాజులును ఆర్యరాజులును వచ్చిరి. వారందఱును బంగారు బాహుపురులు దొడిగి యచ్చపుఁగడానిబంగరు చాయగలిగి, జిగిదొలఁకాడుచున్న మేనులతోఁ, బెబ్బులులవలెఁ జలంబున విఱ్ఱవీఁగుచునుండిరి. అంత నారాజులు కూర్చుండఁగానే యాకన్య,దాదితోడను హెగ్గడులతోడను నా స్వయంవరరంగమును బ్రవేశించెను. పిదప రాజులపేళ్లను వేఱువేఱఁ దెలుపునపు డావరవర్ణిని ధృతరాష్ట్రుని పు.

త్రుఁడయినదుర్యోధనునిఁగడచిపోయెను. కురువంశతిలకుండయిన యాదుర్యోధనుఁడో యట్లు దన్నుఁగడచిపోవుట కెంతమాత్రము సయింపఁడయ్యె. అతఁడు తక్కినరాజులను నవమానించుచు నా కన్నియను వారింపను వారించెను. అతనికి భీష్ముఁడును ద్రోణుఁడును నత్తియుండుటంబట్టి వీర్యంపుఁ గ్రొవ్వునమదించి యాకన్నియను రథమునందుఁబట్టి యెక్కించుకొని రాజులను యుద్ధము నకుఁబిలిచెను. ఆయుధధారులందు మిన్నయైన కర్ణుఁడు రథారూఢుండై ఖడ్గమును గేలంబట్టి వ్రేలికి నుడుపతోలియత్తె మునుదొడిగి దుర్యోధనుని వెంబడించి పోయెను. పిదప రాజులు రథములుఁ బూన్చువారును కవచములు దొడుగుకొనువారును పోరాడనుంకించువారునై యురవడింపఁగా రారాపు మిక్కిలియుఁ గలిగెను. ఆరాజులు మిక్కిలియుఁ గుపితులై శరవర్షములను గురియుచు మేఘములు రెండుపర్వతముల పయినడరునట్లు కర్ణ దుర్యోధను లిరువురపయి నేయఁదలపడిరి. కర్ణుఁడట్లు తమపయివేగ మున నడచుచున్నయారాజులవిండ్లను బాణసమూహముల ను దా నొక్కొక్కబాణముచేఁ గాఁడనేసి భూమింగూల్చెను. ఆకర్ణుఁడు యుద్ధంబుసేయువారియందెల్ల మిన్నగావునఁ గొంద ఱ విల్లుదునిమియు కొందఱవిండ్లను నిలువుననే నిలిపి, కొందఱ బాణముల దిగవైపించి, కొందఱను రథములును శక్తులను గద లను దూలునట్లుచేసి పెక్కండ్రకు సారథులు లేకుండఁజేసి, మిక్కిలి వ్యాకులపెట్టి వారినందఱను జుల్కఁగా జయించెను. ఆరాజులు మనంబులుదూల తామే గుఱ్ఱములను దోలుకొనుచు 'పదపద' యని చెప్పుచు యుద్ధమువాని పలాయితులయిరి. అట్లు దుర్యోధనుఁడు కర్ణునిచే రక్షితుండై సంతోషమునొంది

కన్నియనెత్తికొని హస్తినాపురము జేరినవాఁడగు్యో. ఇది నాలుగవయధ్యాయము.

---

## రాజధర్మపర్వము.

### కర్ణుని పరాక్రమమును వర్ణించుట.

"కర్ణుం డిట్లు యుద్ధమునఁ దనబలిమిని వెలిపుచ్చఁగా మగధరాజయిన జరాసంధుఁడు రథారూఢుండై వానిని యుద్ధమునకుఁ బిలిచెను. ఆయిరువురును దివ్యాస్త్రములఁ దెలిసినవారు కాన పెక్కులాయుధము లొండొరులపయి వర్షించుచు దెప్పరముగాఁ బోరాడిరి. అమ్మహాబలు లిరువురును బాణములన్నియుఁ దూలి, విండ్లన్నియు నశించి, కత్తులెల్లవిఱిగినపిదప నేలపయినిలిచి బాహుయుద్ధమునకుఁ దారసించిరి. జరయను దానిచేత సంధింపఁబడిన జరాసంధుని మేనిసంధిని గర్ణుఁడు బాహుకంటకమను మల్లయుద్ధబంధముచేత వ్రీల్చెను. ఆరాజు తన మేనిచీలిన వికారమును జూచి వైరమును దూరమునకుఁ ద్రోసి, 'ప్రీతుండ నయితి' నని కర్ణునిఁజూచి చెప్పెను. పిదప నతఁడు కర్ణునియందుఁ గలసంతోషముచేత మాలిని యనుపట్టణమును నతనికొసంగెను. పగవారినిగెలుచు దిట్టయగు నాకర్ణుఁడు, అంగదేశమునకు రాజుగా నుండెను. వాఁడాదుర్యోధనుని నుతముచొప్పున సకలవర్ణముల వారిని బరిపాలించుచు వచ్చెను. అది నీకును దెలియును. ఇట్లా కర్ణుఁ డాయుధముల వేండ్రముచేత భూమియందుఁ బ్రసిద్ధుఁడయ్యెను. దేవేంద్రుఁడు మీకుశలమును గోరి యాకర్ణుని కవచకుండలములను యాచింపఁగా దేవమాయచేత మోహితుండై దివ్యములును దనతోడం బుట్టినవియు

మిక్కిలి పూజితములు నయినకుండలములను సహజం బగుకవచ
మును నిచ్చిపుచ్చెను. కర్ణుఁడు కుండలములును సహజకవచ
మును బాసి, బ్రాహ్మణశాపముచేతను, మహాత్ముఁ డయిన పరశు
రాముని శాపముచేతను, కుంతికి వరమిచ్చుటచేతను, ఇంద్రుని
మాయచేతను, రథికులను కొలఁది యిడుకాలమున భీష్ముఁ డర్ధ
రథుఁడని చెప్పి యవమానించుటచేతను, శల్యుఁడు తేజముగుం
దించుటచేతను, కృష్ణుని నీతిచేతను, కృష్ణుఁడు చూచుచుండఁ
గా నర్జునునిచే యుద్ధంబున హతుఁడయ్యెను. రుద్రుఁడు దేవేం
ద్రుఁడు, యముఁడు, వరుణుఁడు, కుబేరుఁడు, ద్రోణుఁడు, కృ
పుఁడు ననువీరల దివ్యము లయినయస్త్రములనుబడసి గాండీవ
మను విల్లుదాలిచి యర్జునుఁడు సూర్యునివలె ధగధగ ప్రకా
శించుచుండు నాసూర్యపుత్రుని కర్ణుని యుద్ధమున వధించెను.
ఇట్లు పెక్కండ్రచే శపింపఁబడియు, వంచింపఁబడియు నీ యన్న
యగు కర్ణుఁడు యుద్ధమున హతినొందెను. అందులకు నీవు
దుఃఖింపవలదు " అనెను. ఇది యేనవయధ్యాయము.

## రాజధర్మపర్వము.

కుంతికర్ణునిఁగూర్చి దుఃఖించుచు ధర్మరాజు నూఱడించుట. ధర్మరాజు స్త్రీలకు రహస్యమును దాఁచుట లేకుండుఁగా తమని శపించి రాజ్యమునందు విరక్తుఁ డగుట.

దేవర్షి యగునారదుఁ డింతవఱకుఁ జెప్పి యూరకుండెను.
రాజర్షి యగుధర్మరాజు శోకంబునఁ దేలుచు, చింతయందు
మునిఁగియుండెను. కుంతి శోకంబు మేనంతయు నలమికొన,

దుఃఖమున మనసు వెంపుదూలిన దగుచు, మనసువిన్ననై తల వాంచి కుందుచు, సర్పమువలె నిట్టూర్పులుపుచ్చుచు, కన్నుల యందుఁ గన్నీరు దొరఁగుచుండ, నున్న ధర్మరాజును జూచి యప్పటికిఁ దగినట్లు లర్థవంతములగు నింపయిన మాటల ‘మహాబాహూ! ఈకర్ణునిఁగూర్చి నీవు శోకించుట దగదు. మిక్కిలి ప్రాజ్ఞుండవు. నీకుఁ దెలియనిదిలేదు; దుఃఖమును దిగవిడువుము. నేను జెప్పుమాట వినుము. *ఆకర్ణుని మున్ను నేనును దంద్రియగు సూర్యుఁడును నీకుఁ దెలుపుటకొఱకు బతిమాలుకొంటిమి. వాఁడు ధర్మవిదులందు మిన్న. వానికి సూర్యుఁడు, మేలుగోరు వాఁడును సంపత్తినభిలషించువాఁడు నయిన యొకఁడుసుహృదుల కేదిచెప్పవలయునో దానిని, దాను స్వప్నమునందును నాసమ క్షమందును జెప్పెను. వానిని, స్నేహకారణములచేత మునుపే నీతోడ నొరిమగలిగియుండఁ జేయుటకుఁగాని యుపశమింపఁజే యుటకుఁగాని సూర్యునకును శక్యముగాదయ్యె; నాకును దరము గాదయ్యె. అంత వానికి వైరమును వెలిపుచ్చుటయందే కన్ను గావునను, మృత్యువుచే గ్రస్తుఁ డగుటంబట్టియు, మీకు విరోధము చేయువాఁ డగుటవలనను, నేను వానినుపేక్షించితిని’ అనెను.ధర్మరాజు, కన్నీటిచేఁగలగుండువడుచుఁ, దల్లియిట్లుచెప్పఁ గానే, శోకంబున మిక్కుటముగాఁ గుందుచు ‘రహస్యమునుగప్పి యుంచుటవలన నీచేత నపుడు మేము మిక్కిలియు వంచితుల మయితిమి’ అని చెప్పి మిక్కిలి యూఱటపడుచు ‘సమస్తలోక ములందు నిదిమొదలుగా స్త్రీలు రహస్యమును దాఁచి పెట్టు

* ‘యాచితః సమయాపూర్వం భ్రాతృ్య’ మని పా. నీవు నీతోఁబుట్టు తనమును నెఱపవలయునని వేఁడితినని యర్థము.

కొన కుందురుగాక' అని శాపము పెట్టెను. అతఁ డాతఁబుత్రుల ను, పౌత్రులను, సంబంధులను, చెలికాండ్రను దలంచుకొని మన స్సు తల్లడిల్ల, బుద్ధికలంగినవాఁడయ్యె. ఇట్లు తండు దుఃఖమొం తయు నావరింపఁగా, పొగతోఁగూడిన యగ్నివలెఁ బొగులుచుఁ, దాపంబునఁ బురబురఁబొక్కుచు, రాజ్యమునందు విరక్తినొందిన వాఁ డయ్యె. ఇది యాఅవయధ్యాయము.

## రాజధర్మపర్వము.

### ధర్మరాజు దుఃఖించుట.

ధర్మరాజు దుఃఖమున మనసు పల్లటిల్లఁగా మహారథుఁడయిన కర్ణునిఁ దలంచికొని, పరితపించుచుండెను. అతఁడు దుఃఖశోక ములు పయికొన మాటిమాటికి నిట్టూర్పులువిడుచుచు, మిక్కి లియు స్రుక్కుచును నర్జునునిఁజూచి 'మనము వృష్ణులయు నంధ కులయు దేశమున భిక్షాచరణము చేసికొనుచుందుమేని, జ్ఞాతు లందు మనకపించుము లేకుండఁజేసిన యీదుర్గతిని బొందియుండక కుందుము. కురువంశమువారి పనపోయినది. మనపగవారి పన వెంపు సొంపారినది. మనము మనలఁజంపుకొంటిమేని యేధర్మ మువలని పన పొందఁగలము? ఇస్సీ! క్షత్రియుల యాచారము పాడయిపోవుగాక. ఇస్సీ! సేనయుఁ బౌరుషమును అర్థమును నింత్యములు! అర్థమనెడి కారణమునుబట్టి మనమిట్టి యాపద నొందితిమి. వనమందు సంచరించువారికి నోరుపు, అడఁకువ, శుచి, పగలేకుండుట, మత్సరములేమి, అహింస, సత్యవచనము ననెడి యివి యెప్పుడు నుండవలసిన ధర్మములు. ఇవి మిక్కిలియు మం చివి. మనమో లోభమువలనను, అవివేకమువలనను, గర్వము

నహంకారమును బొంది, రాజ్యమందలి కష్టముల ననుభవింపఁ గోరి, యీ యవస్థను బొందితిమి. భూమియందు భోగములను గోరిన మనలను, వధింపఁబడిన బంధువులనుం, జూడఁగా ముల్లోకములను రాజ్యముచేసినను మనల నొకఁడును గొనియాడఁడు. ఇట్టి మనము పుడమికొఱకుఁ జంపఁదగినవారిని జంపి బంధువులను మాలియు, ధనములనుమాలియు భూమియందు బ్రదికియున్నారము. ఒకమాంసపు ముక్కకై పేరాసగల కుక్కలకుంబోలె మనకుఁ (బంధువధరూపమయిన) యశుభకర్మము సంభవించినది. అయినను, అవి పోరి తుద కామిషము ననుభవించుచున్నవి. మనకో యదికలిగియుఁ దుదకు నిష్టమేకాక మఱి నష్టమేయయ్యె. హతులయిన యీజనులను, ఈభూమియంతటి లాభమువచ్చినను దిగవిడువఁ దగదే; బంగరురాసులకుఁ గానును, సకలగజతురగములకుఁ గానును, దిగవిడువఁ దగదు. పేరాసయుఁ బెనుశోకమును గ్రమ్ముకొనఁగాఁ గోపమును మచ్చరమును గలిగియుండినవారై, వారు, మృత్యువను వాహనము నెక్కి, యమునిపురమును బోయిచేరిరి. తండ్రులు తపంబువలనను బ్రహ్మచర్యమువలనను బెద్దలకు వందనముచేయుటవలనను, ఓరుపువలనను, బహుకల్యాణ యుక్తులగు బుత్రులను బడయఁ బ్రయత్నింతురు. తల్లులో, యట్లె యుపవాసములచేతను దైవపూజనములచేతను వ్రతములచేతను నుత్సవములచేతను మఱియుఁ దక్కిన శుభకర్మములచేతను, గర్భములను బడయుదురు. ఆగర్భములను బదినెలలు దాల్తురు. అట్లు వారా బిడ్డలకై వెతలుగుడుచుచు ఫలము నెదురుచూచుచు 'వారు క్షేమముగాఁ బుట్టుదురా? పుట్టి బ్రతికియుందురా! బ్రతికి

గౌరవమును బలమునుగలిగి మన కీహామందును బరమందును సుఖము గావింతురా !' యని యువిద్లోలాడుచుందురు. ఆ తలిదండ్రులు పడ్డపాట్లంతయు మిక్కిలియు నిష్ప్రయోజనమాగా ముగిసినది. ఈ తల్లులు కాచిమోచి కన్నపుత్రులు, మెఱుఁగిడ్డ కుండలములను దాల్చి వయసుకాండ్రయి వెలుంగుచుండిన వార, లిట్లు చంపఁబడిరి ; మఱి భూమియందలి భోగముల నను భవింపకయుఁ, బితరులయు దేవతలయు ఋణములను దీర్పకయు యమునివీటికి బోయిరి. అమ్మా ! *ఈరాజులు తాము మంచి బలిమియు సంపదయునొంది, తలిదండ్రులు తమకోర్కులు కొనసాగించుకొనఁజూచు సమయమునఁ జంపఁబడిన వారయిరి. వీరలాశయుఁ జూపోపమియు నెప్పుడును గలిగి కోపంబున నుట్టి పడుచు నుబ్బునఁజెలరేఁగుచు నుండిరి. కాఁబట్టి వీరెచ్చటఁగాని యెప్పుడేని జయమువలని ఫలము నించుకయున ననుభవింపఁ గలుగుట యుండదు. పాంచాలురలోను గౌరవులలోను యుద్ధమందెవరు హతులయిరో వారు (క్రోధాదులచే నట్టి పాపకృత్యములు చేసి స్వర్గదూరులయిరి గాన) నశించినవారే యగుదురు; కానిచో వారిని జంపినవాఁడును నిట్టికర్మములవలన సమస్తము లయిన పుణ్యలోకములను బడయవలయును గదా. ఈ లోకమునకుఁ గలిగిన నాశమునకు మనలనే కారణముగాఁ దలంచె దరు. కాని యందులకుఁ గారణమంతయు ధృతరాష్ట్రుని కొడు

---

* 'యదేషామమ్బపితరౌ జాతకామావుభావపి। సంజాతబలరూపేషు తదైవ నిహతాన్నృపాః' అని ఉత్తరదేశకోశపాఠము. 'పితరౌ జాతకర్మకరావిహ । సంజాతబాలరూపేషు' 'వీరల తలిదండ్రులు, పుట్టి బిడ్డలరూపుననుండు వీరికి జాతకర్మము చేసినపుడే వీరు చంపఁబడిన వారయిరి' అని దాక్షిణాత్యకోశము.

కులందే యున్నది. దుర్యోధనుని మనస్సు మనలను వంచించుట యందే నాసక్తమై యుండెను. వాఁడెప్పుడును మనలను ద్వేషించుచు మనయందు మాయలుపన్నుటయే బ్రతుకుగానుండెను. వానికి మన మొకప్పుడును నపకారము చేయకుండినను మనయెడలఁ గపటముగానే నడచుచుండినాఁడు. కోర్కులు మనకు నీడేరినవిగావు. వారికినిగావు. మనమును వారిని జయించినారము గాము. వారును మనలను జయించినారుగారు. ధార్తరాష్ట్రులీ భూమిని ననుభవింపలేరయిరి. పడఁతులను వాద్యములను ననుభవింప నేరరయిరి. వారు మంత్రులయు సుహృదులయు విద్వాంసులయు మాటలను బాటింపరయిరి. వారు తమ మేలయిన రత్నములను, బరిపూర్ణములయిన బొక్కసములను విరివియైన రాజ్యములను ననుభవింపఁజాలరయిరి. మనవలని పగచేత నెరియుచు వారు సుఖమును స్నేహమును జెందరయిరి. మనయందుఁ గలపెంపు సొంపునుజూచి వాఁడు వన్నెనూత్రియు వెలుకఁబాటియుఁ గృశించియు నుండెను. దీనిని శకుని ధృతరాష్ట్రునకుఁ దెలిపెను. అతఁడు కన్నకడుపు గాన కొడుకు నందలి మక్కువచేతఁ, దన తండ్రియగు భీష్ముఁడును నట్లె విదురుఁడును జెప్పిన హితమువినక, దుష్టవర్తనుఁ డగువానికి లోనయ్యెను. రాజయిన యీధృతరాష్ట్రుఁ డశక్తుఁడును, లోభియుఁ గావు పరతంత్రుఁడు నయికొడుకు నడంపక సందేహములేక మన సెట్లో యట్లే పోయినవాఁడయ్యె. దుర్యోధనుఁడు మనయం దెప్పుడును బగకలిగి తపించుచుఁ బాపబుద్ధినూఁది ప్రకాశించుచున్న పొగడ్తను దిగవిడిచి తోడఁబుట్టినవారిని జంపించి ధృతరాష్ట్రగాంధారు లనెడియీ ముదుసండ్లను దుఃఖాగ్ని

యందుఁ ద్రోచి తాననుభోయెను. వీఁడు పోరితముచేయవలయు ననియే యువ్విళ్లూరుచుండినందున, కృష్ణుని సన్నిధానమున మాటలాడినటువంటి మాటలను, మంచికులమునఁ బుట్టియు బంధువయ్యునుండు మనుష్యుఁ డెవ్వఁడు స్నేహితునియెడమాటాడును?- తేజంబుచే సకలదిక్కులను గాల్చు సూర్యులవలె మనము దుర్యోధను దోషమువలన మిక్కిలియుఁ గలకాలము నాశము నొందితిమి. దుర్మతియు మనవైరపురుషుఁడు నగువాఁడు మనకు దుష్టగ్రహముగానుండెను. దుర్యోధను నిమిత్తముగా మనకుల మిది మిక్కిలియు నశించునట్లు గావింపఁబడినది. చంపఁదగిన వారినిజంపి లోకమునందు నిందింపఁదగిన స్థితిని బొందియున్నారము. దుష్టబుద్ధియు నీకులము నాశమునకుఁ గారణభూతుఁడును పాపాత్ముఁడు నయిన దుర్యోధనుని రాజయిన ధృతరాష్ట్రుఁడు రాజ్యమున కధిపతిగాఁ జేసి యిపుడు దుఃఖపడుచున్నాఁడు. శూరులు హతులయిరి. పాపముచేసినయైనది. ఈదేశము నాశితమైనది. చంపినపిదప మనకుఁ గోపముడిగినది. ఈశోకము నన్నువీఁగొల్చుచున్నది. అర్జునా! చేసినపాపము మంచిచేయుటచే పోఁగొట్టఁబడుచున్నది; వెలిపుచ్చి చెప్పుటచేతఁగాని, తపముచేతఁగాని. విరక్తిచేతఁగాని, పుణ్యస్థలములకుఁబోవుటచేతఁగాని, శ్రుతిస్మృతులను జపించుటచేతఁగాని తొలఁగింపఁబడుచున్నది. త్యాగము (నివృత్తి) గలవాఁడు మరలఁబాపముసేయఁ జాలఁడనియు జననమరణములను బొందఁడనియు శ్రుతి చెప్పుటంబట్టి త్యాగమార్గము నొందినవాఁడు జ్ఞానముఁబడసి యపుడె బ్రహ్మమగును. పరంతపా! ' అర్జునా! నేను మిమ్ముందఱను వేఁడి సుఖదుఃఖాది ద్వంద్వములను మాలి జ్ఞానముతోఁ గూడినవాఁడనై మునినై యడవికిఁ

బోయెదను. త్యాగము మాని పరిగ్రహము (నివృత్తి లేక విషయ సంగము) గలవానికి-అనఁగా గృహస్థునకు, సమస్తధర్మములు పూర్ణముగాఁ బడయఁదరముగాదని వేదము చెప్పుచున్నది. ఇది నాకుఁ బ్రత్యక్షసిద్ధము. నేను జేసినది పాపమేచుమీ. పరిగ్రహమునుగోరు మనుష్యునకు జననమరణములకు నిమిత్తమయిన ధర్మమే పడయఁగూడునని వేదము చెప్పెడిని. కాఁబట్టి నేను బరిగ్రహమును రాజ్యమును, సమస్తమగు సుఖములను దిగవిడిచి, విముక్తుఁడును శోకరహితుఁడును, దేనియందును మమత లేనివాఁడునై పోయి చేరెదను. కురువంశ్యా! రాజ్యముచేతఁగాని భోగముల చేతఁగాని, నాకుఁ బ్రయోజనము లేదు. కాన యకంటకమై యున్న యీ రాజ్యమును క్షేమముగా మీరు పరిపాలింపుఁడు' అని చెప్పి యంతట నూరకుండెను. అంతఁ జిన్నవాఁడగు నర్జునుఁడతనికిట్లనియె. ఇది యేడవయధ్యాయము.



## రాజధర్మపర్వము.

### అర్జునుఁడు ధర్మరాజును దేర్చుట.

అంతఁ బలుకుదిటయు దృఢపరాక్రమమునుగల యర్జునుఁడు గద్దింపఁబడిన యొకచూపోపనివానివలెఁ దన్నుఁదోఁపించుచుఁ దేజంబు రాజిల్లుచుండ, పెదవులు నాకికొనుచుఁ, జిఱునవ్వు నవ్వుచు, మిక్కిలి నీతియుక్తంబయిన మాటల ధర్మరాజుం జూచి 'అమానుషమయిన కార్యముచేసి తీర్చి యెనలేని సిరి కలుగఁగా దిగవిడిచెదవే! అయ్యో! ఏమిదుఃఖమిది! ఔరా! ఏమిసంకటము! ఇంతటి యాడంగితన మెందునుగలుగునా;

శౌరా! పగవారిని జంపి స్వధర్మముచేతఁ బడలిన యీపుడ మిని బొందియు నెట్లు దిగవిడిచెదవు? ఇది బుద్ధిచుల్కనకదా? పిఱికిగుండెకు రాజ్యమెక్కడిది? సోమరికిఁ గాని యెక్కడిది? రాజ్యమొల్లవేని క్రోధమునఁ దెలివిమాలి రాజుల నెందులకుఁ జంపితివి? ఏమనుష్యుఁడు సుఖములుమాలి పేదవడి సకలలోకము లందును బ్రఖ్యాతినొందక, పుత్రులును బంధువులును లేక యుండునో వాఁడు బిచ్చమెత్తి బ్రతుకఁగోరును; కాని తన పౌరుషముచే మఱియెవ్వనియేని యర్థములనుగాని పడయఁగోరఁడు. నీవో సుఖములన్నియుఁ గలిగి సంపన్నుఁడవై సర్వలోకములఁ బ్రఖ్యాతుఁడవై పుత్రాది సంపత్తియుఁ గలిగి పౌరుషముచేఁ బరులయర్థములంబడసి బిచ్చమెత్తఁగోరుట తలక్రిందుగానున్నది! సమృద్ధమయిన రాజ్యమును దిగవిడిచి మిక్కిలియుఁ గుచ్చితమయిన బిచ్చపుఁ గప్పెర నెత్తువృత్తినిబొంది పొట్టఁ బ్రోచికొనఁ జూచుచిన్న నీ లోకముచూచి యేమనును? ప్రభూ! సమస్తము లయినధర్మాదిప్రయత్నములను ద్రోసి పుచ్చి సుఖంబులను వీడి యేమియులేక పేదవడినమూఢుని వలె నెందులకుఁ దిరిపమెత్తఁగోరెదవు? రాజకులంబునం బుట్టి భూమినంతయు గెలిచినపిదప ధర్మార్థము లన్నిటినిదిగనాడి మూఢత్వముచేత నెందులకు వనమునకు బయలువెడలెదవు? నీవు లేకపోవుటచేత దుష్టులగువారీహవిస్సులను జెఱుపుదురేని యాపాపము నిన్నేపొందును. 'ఆకించన్యము (ఏమియులేకుండుట) మునులకు ధర్మము' (కాని రాజులధర్మముగాదు.) ధనములేనపు డందులకై క్రూరంబగు కార్యముచేసి (బ్రతు

కుదురని) నహుషుఁడు *'ఇన్నీ! ధనములేమి మిక్కిలి నింద్యము' అనెను. † ఆశ్వస్తన్యవృత్తి ఋషులకుమాత్రమే చెప్పఁబడి యున్నది. అది నీవెఱుఁగుదువు. ధర్మమని ప్రసిద్ధముగా దేనిని జెప్పుదురో యది ధనముచేతఁ గొనసాఁగుచున్నది. ఎవనిధనము నెవఁడపహరించుచున్నాఁడో వానిధర్మమును వాఁడపహరించు చున్నాఁడు. ధనము నపహరింపఁబడి పోవుచుండఁగా మన మెందులకు శక్తులమగుదుము ? లోకులు ప్రక్కనున్నదరిద్రుని దోషవంతునిఁగాఁ జూతురు.లోకమున ధనములేమి (దారిద్ర్యమే) పాతకము. దానిని గొనియాడుటకుఁ దగువాఁ డెవఁడు ? పతితుఁడు దుఃఖపెట్టఁబడుచున్నాఁడు. పేదవాఁడును దుఃఖపెట్టఁబడు చున్నాఁడు. కాఁబట్టి పతితునకును బీదకును భేదముదోఁప కున్నది. అందందునుండి సంపాదించి కూర్చి మిక్కుటముగా వృద్ధిఁబొందింపఁబడిన ధనములవలననే, పర్వతములనుండి నదులు ప్రవహించునట్లు, సమస్తకార్యములును బ్రవర్తించుచున్నవి. అర్థమువలననుండి ధర్మమును గామమును స్వర్గమును సిద్ధించు చున్నవి. లోకమందలి దేహయాత్రయు ధనములేక సిద్ధి బొందదు. అర్థమునుండి వీడిన యల్పమతి యగుమనుష్యునకు సమస్తకార్యములును వేసవికాలమునందలి చిన్నయేళ్లవలెఁ దూలిపోవును. ఎవనికి ధనముగలదో వానికి స్నేహితులు గలరు; ఎవనికి ధనముగలదో వానికిబంధువులు గలరు ; ఎవనికి ధనము గలదో వాఁడే లోకమునఁ బురుషుఁడు. ఎవనికి ధనముగలదో

---

* ధనములేనందువలననే క్రూరకార్యము చేయఁబడుచున్నది గాన ధనములేమిని నిందించినాఁడనుట.

† ఆశ్వస్తన్యమనఁగా మఱునాఁటికి ఏమియులేకుండుట.

వాఁడే విద్వాంసుఁడు. ధనకాముఁడయినవానికి ధనములేనిచో ధనము సంపాదింప శక్యముగాదు. ఏనుఁగులచేత పెద్దయేనుఁగులు కట్టుపడునట్లు ధనములచే ధనములు కట్టుపడుచున్నవి. రాజా! ధర్మము, కామము, స్వర్గము, సంతోషము, కోపము, శ్రుతము, దమము ననెడియివియన్నియును నర్థమునుండి కలుగుచున్నవి. ధనమువలనఁ గులము గౌరవమొందుచున్నది. ధనమువలన ధర్మము వర్ధిల్లుచున్నది. ధనములేనివానికి నిహమును లేదు; పరమును లేదు. ధనములేనివాఁడు ధర్మకార్యములు కలరూపునఁ జేయఁజాలఁడు. పర్వతమునుండి నదివలె ధనములనుండియే ధర్మము స్రవించుచున్నది. ఎవనికి ధనమును, బశువులును, భృత్యులును, నతిథులును, గృశించియుండునో వాఁడే కృశుఁడనఁబడునుగాని శరీరము కృశించినవాఁడుగాఁడు. రాజా! న్యాయమును జూడు. దేవతులును, అసురులు నెట్లున్నారుచూడుము. దేవతలు, జ్ఞాతులవధము వలని ధనముదక్క మఱి దేనినిగోరుచున్నారు? పరునిసొమ్ము నపహరింపరాదేని ధర్మమెట్లు చేయనగును? సూక్ష్మధర్ములయిన వారు వేదములనుండి వీనినే సిద్ధాంతీకరించియున్నారు. అవియేవనఁగా 'నిత్యమును వేదము నధ్యయనము చేయవలయును. పండితుఁడు తప్పక కావలయును. అన్నివిధముల ధనమార్జింపవలయును. పటుపడి యజ్ఞములను యజింపవలయును' అనియె. దేవలోకమునందుఁగల పదవులన్నియు జ్ఞాతిద్రోహము వలననే దేవతలు పడసిరి. దేవతలు తమ యిష్టసిద్ధిని బొందినందులకుఁ గారణము జ్ఞాతిద్రోహము గాక మఱేమి? ఇట్లు దేవతలు నిశ్చయము చేసికొని యుండుటేకాక యిట్లు చేయఁదగునని వేదవాదములును

శాశ్వతముగా నున్నవి. అధ్యయనముచేసెదరు; చేయించెదరు; యజ్ఞములను యజించెదరు, యాజింపించెదరను. లోకమునంగల వస్తువులన్నియును బరులనుండి పొందినవే. అవియే మంచిగతికి మూలము. పరులకపకారము లేక కలిగిన ధనమెద్దిగాని యెక్కడ నేని మనకుఁ జూపట్టినదిగాదు. ఈ చందముననే రాజు లీ భూమిని పాలించుచున్నారు. వారలు గెలిచిన పిదప, పుత్త్రులు తండ్రిధనమును జెప్పునట్లు 'ఇది నాది' యని చెప్పుదురు. ఆ రాజర్షులును స్వర్గమున కర్హు లేయగుదురు. ఏలన వీరల ధర్మము మేలయినదిగాఁ జెప్పంబడుచున్నది. పరిపూర్ణమయిన సముద్రమునుండి నీరు పదిదిక్కులను బ్రవహించునట్లు రాజకులమునుండి ధనమును భూమియందుఁ బర్వుచున్నది. ఈ పుడమి దిలీపునిదిగా నుండెను; నృగునిదిగా నుండెను; నహుషునిదిగా నుండెను; అంబరీషునిదిగా నుండెను; మాంధాతదిగా నుండెను. అదియే నీయందు నున్నది. రాజా! సమస్త విధములయిన దక్షిణలుగలదై మిక్కిలియు ద్రవ్యము వెచ్చించి చేయునట్టి యొకయాగము నీకుఁ బ్రాప్తించియున్నది. నీవు దానినియజింపక పోయితివా రాజ్యమువలని పాపము నీవు పొందుదువు. ఎవ్వారిరాజు దక్షిణలతో నశ్వమేధమనెడి యాగముచేయునో వారందఱు నతని యవభృథంబునందుఁ బరిశుద్ధులగుదురు. విశ్వరూపుఁడయిన యీశ్వరుఁడు నశ్వమేధ మనెడిమహాయాగమందు సమస్తప్రాణులను వ్రేల్చెను. అట్లే తన్నును దాను వ్రేల్చుకొనెను. ఇదియె శాశ్వతమయిన విభూతిమార్గము. దీనికంతము లేదని వినుచున్నారము. రాజా! మహాజనులు పోయినదారినే పొమ్ము. చెడుదారిని బోకుము' అనెను. ఇది యెనిమిదవయధ్యాయము.

## ధర్మరాజపర్వము.

### ధర్మరాజు రాజ్యమువలన వెగటునొందుట.

ధర్మరాజు జర్జునునిఁజూచి 'మనస్సును జెవిని నంతరాత్మయందు లీనముచేసి మొదట గడియసేపు మనసు నొకచేదిటగా నిలిపి యుండుము. పిదప వింటివేని నామాట నీకు రుచించును. గ్రామ్యసుఖములను దిగవిడిచి, పెద్దలసమూహము పోవం దగిన మార్గమును బొందనున్నాను. నీకొఱకు మరల నా రాజ్యమును నొకప్పుడును బూనను. క్షేమకరమయినదియు నొంటరిగఁ బోవఁదగినదియు నయినమార్గ మేమున్నదని నన్నడుగుము. అట్లడుగ నొల్లవేని నీవడుగకున్నను నే నయిచెప్పెదను వినుము. విషయ సుఖముల నాచరించుట విడిచి, పెనుతపము సలుపుచు నడవియందు, ఫలమూలములఁ దినుచుఁ, గాలముదప్పక యగ్నిని వ్రేల్చుచు, రెండుపూఁటలును స్నానముచేయుచు, శరీరము కృశించి, కొలఁది యాహారముగలిగి, తోలును నారచీరలును జడలునుదాల్చి, చలిగాలి యెండలకోర్చి, యాఁకలిదప్పులను బడలికలను దాళికగలిగి, శాస్త్రోక్తమయిన తపమున శరీరమును శోషింపఁజేయుచు, మనస్సునకును జెవికి నింపయిన యడవిమృగములయుఁ బక్షులయుఁ బలువగల యుల్లాసంపు బలుకుల నెప్పుడును వినుచును, పూచిన ప్రాఁకులయుఁ దీఁగలయుఁ గమ్మని తావులు మూరుకొనుచును, నానారూపములు గలిగి సొగసులు గులుకుచునున్న యడవులందలి జంతువులను జూచుచు, నరణ్యమందు మృగములతోడ సంచరించెదను. నదీ తీరములందు వసించు వానప్రస్థజనులను దర్శించుటయేకాక, వారల కేమియు

నప్రియమును జేయననఁగా నీక గ్రామమున వసించు వారివిషయమై యప్రియముచేయననుట చెప్పవలయునా? రహస్యమున యోగాభ్యాసముచేయుచు, ధ్యానము సలుపుచుఁ, బక్వమైనట్టియు కానట్టియు పదార్థములచే బ్రదుకుచుఁ, బితరులకును దేవతలకును నడవియందలి వస్తువులచేతను వాక్కులచేతను (వేదమంత్రములచేతను) జలములచేతను, దృప్తిగావించుచు, నింత క్రూరమును నింతకంటెను క్రూరమునయిన యరణ్యవాసుల శాస్త్రములవిధి ననుష్ఠించుచు, నీ మేనిముగియిక నెదురు చూతును. లేక నేను బ్రత్యేకముగా నొక్కొకవృక్షముక్రిందను నొక్కొక్కనాఁడు భిక్షమెత్తుచు ముండనముచేసికొన్న సన్యాసినై శరీరమును నశింపఁ జేసికొనెదను. దుమ్ములు మేసంతయు గ్రుంగియుండఁ, బాడుపడినయింట నిలుచుచుఁ, జెట్టుక్రిందేయునికి పట్టుగాఁగొని, ప్రియములయినవానిని నప్రియములయిన వాని నన్నిటిని విడిచి, శోకమును లేక సంతోషమును లేక, నిందించినను నన్ను స్తుతించినను సమముగాఁ గొనుచు, ఆశయుడిగి, మమకారమునువదలి, ద్వంద్వముపీడి, పరిగ్రహముమాని, యాత్మస్వరూపమందు రమించుచు, మనస్సు కలంకవీడి,జడునివలెను గ్రుడ్డివానివలెను గుంటివానివలెను జూపట్టుచు, పరులతో నేనయమయమందుఁగాని యెట్టి సల్లాపమును జేయకయు, జంగమములు స్థావరములు జరాయుజములు మొదలు నాలుగువగలుగా నున్న సమస్తప్రాణులకును హింసగావింపక, స్వధర్మములందుఁ దప్పక వర్తించుచు, నింద్రియముల శోషింపఁజేయుచు, నున్నప్రజలయందు సమబుద్ధిగలిగి, దేనిని బరిహాసింపకయు, నేవిషయమును గుఱించియు బొమలు ముడువకయు, ఎప్పుడును దెలివితోఁ

గూడిన మొగముగలిగి, సమస్తములయిన యింద్రియములను లెస్సగాఁ గట్టువఱిచియుందును. మఱియు నెవ్వనిమార్గమును నేమి యని యడుగక, యెవ్వనితోడను గలియక పలానిదని గుర్తించి యొక దేశమునకు నొక దిక్కునకును బోవఁగోరక, దిక్కును దేశమును నిదియదియని యుద్దేశించుకొని పోవక, పోవుటయందు నపేక్షలేక, మరలియుఁ జూడక, సత్యము పలుకుచు, ధ్యానముతోడఁ బోవుచు, స్త్రీరూపమును వర్జించుచు సంచరింతును. పూర్వకృత కర్మవాసనారూపమైన స్వభావము ముందఱ పోవుచున్నది. వలయు నాహారములు దొరకుచున్నవి. అయినను విరోధులయిన యాద్వంద్వముల నన్నింటిని జంతింపక, భుజింపఁదగినది కొంచెమైనను, జవిగలదైనను, ఒకవేళ మొదటిపట్టున దొరకక పోయినను, వేఱుచోటుల దొరకినవానిని దినుచు, దొరకక పోయినయెడ నేడుచోట్లయందు నిండించుకొనుచు, పొగలేనట్టియు,ఱోఁకటి దంపకములేనట్టియు, నిప్పారినట్టియు, జనములు దినియైనట్టియు, పాత్రముల సంచారము కడచిపోయినట్టియు, బిచ్చగాఁడు లేనట్టియు, కాలమున రెండిండ్లయందో, లేక మూఁడిండ్లనో యవికానిచో నైదిండ్లనో యొకసారి భిక్షయెత్తుచు, స్నేహపాశమును విడఁదీసికొని, యీభూమియందుఁ ద్రిమ్మరుచును దొరకినను దొరకక పోయినను రెంటిని సమముగాఁజూచుచు గొప్పతపము సలుపుచు, బ్రతుకవలయునని కాని చావవలయునని కాని కోరునట్టి వానివలె నొకటియుఁ జేయకయు జీవనమును గాని మరణమునుగాని మెచ్చకయు రోయకయు, బాడిసతో నొకచేతిని జెక్కువానికిని జందనముతో నొకచేతిని బూయు వానికిని సెబ్బరగాని మంచిగాని తలంపకయు, బ్రతుకువాఁడు తన

యభివృద్ధికై చేయవలయు కార్యము లెవ్వియో వాని నన్నిటిని దిగవిడిచి, తెప్పపాటు మొదలయిన త్రోసిపుచ్చరాని వానిని మాత్రము వర్తించుచు, వానియందును నెప్పుడును బట్టులేక, సకలములయిన యింద్రియవ్యాపారములన్నియు దిగవిడిచి, మనస్సునందలి సంకల్పమును బోయినదారిని విడువక 'బుద్ధికలుష ములను జక్కఁగా శుద్ధముగావించి, సమస్తమయిన సంగముల నుండి విడివడుదును. మఱియు వలలనన్నింటిని గడచి, యొకని వశమందును లేక, వాయువునకు సాటియైన ధర్మముగలిగి, రాగములనుడిగి, యిట్లు గ్రుమ్మరుచు మనసునకు వలయుతుష్టిని బడయుదును. అజ్ఞానమువలనఁ గలిగెడి పేరాసచేత నేకదా మహా పాపముచేసినవాఁడనైతిని. కొందఱు మనుష్యులు సేమము గలవియు సేమముగానివియుఁ బుణ్యాపాపములు గలసినవియు నయినకర్మములను గావించి కార్యకారణ సంబంధము గల జనులను (అనఁగా తమకార్యములకుఁ గారణభూతులుగాను, వారికార్యములకుఁ దాము గారణముగాను నుండుజనులను) బోషించెదరు. ఒకఁడాయువు తుదిని బ్రాణము క్షీణించిన యీ శరీరమును విడిచి యాపాపము ననుభవించుటకై చేకొనును. ఏలనఁగా నాకర్మఫలము కర్తకేకదా. ఇట్లు రథచక్రమువలెఁ జుట్టుచున్న సంసారచక్రము దీప్రాణిసమూహము కార్యము నిమిత్తమై ప్రాణిసమూహముతోఁ గలియుచున్నది. జన్మము మృత్యువు, ముసలితనము, వ్యాధి, వేదనయును వీనిచేతఁ బీడి తమై దరిలేని సముద్రముంబోలి నిలుకడలేకున్న సంసారమును విడనాడువానికి సుఖముగలదు. స్వర్గమునుండి దేవతలు పడుట కును, మహర్షులు తమపదవిమాలి నశించుటకును వాస్తవ

మయిన కారణమును దెలిసికొన్న మనుష్యుఁడెవఁడు పుట్టుక (సంసారమున) కువ్విళులూరును? రాజు, ఇహసుఖమందాస గలిగి యుండుటచే బహువిధ లక్షణములుగలిగి నానావిధ ము లయినకార్యములను జేసికదా యల్పులయిన రాజులచే కట్టువడుచున్నాఁడు. కాబట్టి తెలివియనెడి యీ యమృతము బహుదినములుగా నన్నుఁ బొందియున్నది. దానిని బడసి యవ్యయమును శాశ్వతమును నేకరూపంబునగు పదవినిగోరు చున్నాను. నే నిట్టిధైర్యముతోడ నెప్పుడును సంచరించుచు నిర్భ యమయిన మార్గమునొంది జన్మమరణ జరావ్యాధి వేదనము లచేఁ బీడితమయిన దేహమును దుదముట్టించెదను" అనెను. ఇది తొమ్మిదవయధ్యాయము.

---

## రాజధర్మపర్వము.

### ధర్మరాజును భీముఁడు తేర్చుట.

భీముఁడు ధర్మరాజుతో 'రాజా! క్షత్రియుఁడు మందుఁడై యర్థంపుఁ దెలివిలేనివాఁడగునేని గ్రుడ్డిపారముచే వానిబుద్ధికొట్టువడును. అట్లె నీబుద్ధియు విపయమును గలరూపునఁ గనుఁగొనకున్నది. భరతసత్తమా! సోమరితనమందు బుద్ధినిజెల్లించి నీవు దానిచే రాజధర్మములందు నసూయగలిగి యున్నవాఁడవు. ఇట్టి నీకు ధృతరాష్ట్రునికొడుకుల నాశముసేయుటవలనఁ గలిగిన ఫలమేమి? క్షత్రియులకుఁ దగుమార్గమునఁ బ్రవర్తించు వానికెవ్వనికిని, బంధువుగానుండినను, నీకుండునట్లు ఓరుపును, జాలియు, కరుణయు, మొగమోటమును నిట్లుండదు. నీదుబుద్ధి యిటువంటిదని మును పె తెలిసికొనియుందుమేని మే మాయుధ

మును ముట్టియేయుండము; దేహమును విడుచుపర్యంతము భిక్షా
టనమునే చేయుదుము. రాజులకు భయంకరమయిన యీయుద్ధ
మును జరిగియుండదు. సూక్ష్మదృష్టిగలవారు, ఈజగమంతయు
బలిమిగలవానికి నన్నము (భోగ్యము) అని తెలియుదురు. స్థావ
రజంగమములన్నియు బలవంతుఁడగువానికి భోగ్యవస్తువులగును.
క్షత్రధర్మము నెఱింగిన ప్రాజ్ఞులు, 'రాజ్యమును గయికొనువా
రికి విరోధులెవరో వారినిజంపవలయును' అని తెలిపెదరు.
మన యన్నమునకు విరోధులును, గావుననే దోషవంతులు
నయిన యాదుర్యోధనాదులు మనచేత హతులయిరి. వారిని నీవు
ధర్మముననే చంపితివిగాన యీభూమి ననుభవింపవలయును.ఒక
మనుష్యుఁడు బావినిద్రవ్వి నీటినిబడయక పోవుటేకాక బురద
చేతఁ బూయఁబడినవాఁడునై మగలఁ బడినట్లు మన యీకార్య
మగుచున్నది. పెద్దమ్రానిపయినెక్కి యక్కడనుండి తేనియ
నుగొనివచ్చి దానినిగ్రోలక మృతినొందుటకు సాటిగా మన
యీకార్యమున్నది.ఒకమనుష్యుఁ డాశచే దూరపుదారినిఁబోయి
వాఁడే యాశ యొడఁగూడక తిరుగుకొనుటకు సరిగా మన
యీకార్యమున్నది. ఒకపురుషుఁడు బగవారిని బొరిపుచ్చి పిదపఁ
దన్నును జంపికొనుటకు నెనఁగా మన యీకార్యమున్నది. పసి
గొన్న వాఁ డన్నమునుబడసియు నే కారణముచేతనేని దానిని
భుజియింపకయుండుటకును, తాను గామించిన మించుఁబోఁడిని
బడసియు నిచ్చలు ననుభవింపకుండుటకును, బురుడుగా మనయీ
కార్యమున్నది? నీవు మందమతివి. ఇట్టి నిన్ను 'ఇతఁడన్నగదా'
యని వెంబడించు చున్నమమ్మే యీవిషయమున నిందింపఁదగి
యున్నది. మేము చేతుల బలిమిగలవారము. విద్యలనెల్లఁ గఱ

చినవారము. మనస్సును మాకుఁగొప్ప. ఇట్టివారమయ్యు నశక్తులుఁబోలె మగతనములేని నీబోఁటి మాటకుఁ గట్టుపడియున్నారమే! దిక్కులేని వారికిని దిక్కయి కాచునట్టి మేమే ధనము నష్టమయిన వారమయితిమేని, జనులు ధనము సమకూరుకొనుట నే విధమున నాలోచింపకుందురు? ఇది యెటువంటిదో కనుఁగొనుము. ముసలితనము గ్రమ్మినవాఁడును, పగవారిచే దుర్గతిపాలయిన వాఁడును, నాపత్కాలమందే కదా సన్న్యాసము చేయఁదగునని చెప్పఁబడుచున్నది. కాఁబట్టి మిక్కిలి ప్రాజ్ఞులయినవారు క్షత్రియులయందు సన్న్యాసమును గొనియాడుట లేదు. సూక్ష్మదర్శులగువారు సన్న్యాసమును ధర్మవ్యతిక్రమముగానే తలంచెదరు. క్షత్రియజాతియందుఁ బుట్టి, యందే నెలకొనియుండి దానినే యాశ్రయించి, యాజాతిధర్మమునే నిందించిపలుకుట యెట్లు? అధర్మమును గఱపినదానినే (దైవమునే) యేల నిందింపరాదు? సన్న్యాసము వేదము తెలియనివారిచేతను, ధనము లేనివారిచేతను, నాస్తికులచేతను ననుష్ఠింపఁబడునది. అది వేదము నర్థవాదముచేత వెలువడినది. అది సత్యమువలెఁ బయికిఁదోఁచునే కాని యనృతమే. సన్న్యాసమునుబూని తన్నుఁదానే భరించువాఁడు మిథ్యాధర్మమును నూఁదిపడియునేకాని బ్రతుకనేరఁడు. పుత్రపౌత్రులను, దేవతలను, ఋషులను, అతిథులను, పితరులను, తృప్తిపఱుపక యొంటిమెయి నడవులయందు హాయిగాజీవించుట కలిమియగునేని, యట్లే మనుచున్న యడవి మృగములు స్వర్గమును జయింపవేల? పందులును జయింపవేల? పక్షులు గెలువవేమి? ఒంటిమెయి నున్నజనులు నయితము (పశుపక్ష్యాదులకు లేని) మఱియొక ప్రకారమునఁ దమకుఁ బుణ్యము

గలుగుటను జెప్పకొనలేదే? రాజుగానుండువాఁడు సన్న్యాసముచే సిద్ధినిబొందునేని పర్వతములును వృక్షములును శీఘ్రముగా సిద్ధిఁ బొందఁగూడును. ఇవియు స్త్రీసంగములేనివిగాను, దేహయాత్రకు వలయువస్తువొక్కటియులేనివిగాను, ఉపద్రవము మాలినవిగాను నిత్యసన్న్యాసులుగాను గనఁబడుచున్నవే? కాఁబట్టి ప్రాణులు తమభాగ్యములవలన సిద్ధినిబొందవలయును. పరులకర్మములచే సిద్ధినిబొంద శక్యముగాదు. కావున, కర్మమే యాచరింపవలయును. కర్మము లేనివానికి సిద్ధిలేదు. కర్మము లేనివానికిని సిద్ధిగలుగునేని, జలమందున్న చేఁపలు మొదలయినవియు, స్థావరములయిన జంతువులును సిద్ధిని బొందవచ్చును. వానికి నాత్మయొక్కటియే రక్షింపవలయునది; కాని వేఱొక్కటి లేదేని లోకమెట్లున్నదో చూడుము. ప్రాణులు తమ తమ కర్మములవలననే నాయావ్యాపారములు చేయింపఁబడుచున్నవి. కాఁబట్టి కర్మమే కర్తవ్యము. కర్మమును విడిచినవానికి సిద్ధిగలుగదు ' అని చెప్పెను. ఇది పదియవయధ్యాయము.



## రాజధర్మపర్వము.

### అర్జునుఁడు ధర్మరాజునకు గృహస్థధర్మము శ్రేష్ఠమని యుపపాదించుట.

అర్జునుఁడు ధర్మరాజునుజూచి 'భరతసింహమా! కర్మము మేలా? సన్న్యాసము మేలా? యనెడి విషయమునందే యింద్రునకును ఋషులకును సంవాదరూపముగా జరిగిన పురాతనమయిన యితిహాసము నుదాహరించెదను.మంచి కులమునఁబుట్టి సంపత్తి

పెంపుగలిగి, ధర్మ మాచరింపఁదగువారయిన కొందఱు బ్రాహ్మణులు మతి తక్కువయగుటచే మీసలు మొలవని ప్రాయమందే సన్న్యాసము మంచి ధర్మమనియు, దానివలన నడవులందు సుఖముగా జీవింపఁగూడుననియుఁ దలంచి తోఁబుట్టువులను దలిదండ్రులను గృహములను దిగవిడిచి యడవికిఁబోయిరి. వారియెడ నింద్రునకుఁ గనికరము కలిగెను. అతఁడు బంగారుమయమయిన యొకపిట్టయై యాబ్రాహ్మణులనుజూచి 'హోమముచేయఁగా మిగిలిన విఘసమును భుజించు మనుష్యులు చేయునట్టి పుణ్యమును మఱియెవ్వరికిని జేయ శక్యముగాదు. వారల కర్మము పుణ్యమయినను జీవితమును బ్రశస్తమయినది. వారలు కోరినవి సిద్ధి నొందువారు. కర్మమును ముఖ్యముగా నూఁదినవారే యుత్తమమయిన గతినిబొందుదురు' అనెను. అందులకు (విఘసమనఁగా నెండిరాలిన తృణపర్ణ ఫలాదులు గాన దానిని భుజించు తామే విఘసాశనులని యర్థము గ్రహించికొని) 'ఆహా! సంతోషము! ఈ పక్షి విఘసమును భుజించువారిని బొగడుచున్నది. కాన యిది మనలనే తెలుపుచున్నది. సందేహము లేదు. మనము విఘసమును భుజించువారము' అని మాటలాడుకొనిరి. అందులకాపక్షి 'నేను ఱొంపిపూఁతగలిగి దుమ్ములబ్రుంగుచు నెంగిలిని దిను మను బుద్ధిహీనులై యున్న మిమ్ముఁ బొగడలేదు. విఘసమును భుజించువారు వేఱు' అనెను. ఋషులు 'మేమిది మేలయిన దారియని తలంచియుంటిమి. పక్షీ! నిన్ను నమ్మెదము. మాకెద్ది మేలయినదో చెప్పుము' అని యడిగిరి. పక్షి 'మీరు లోపల నొకటిగాను వెలుపల నొకటిగాను నున్నట్లు మిమ్ము రెండువిధములుగా వేఱుపఱుచుకొని నన్నుగుఱించి సందేహింపక యుండురేని

మీకు యథార్థమును హితమునయినమాట చెప్పెదను' అనెను. అందులకు ఋషులు 'ఓధర్మాత్మా! నీకు శ్రేయస్సుమార్గములు తెలిసియున్నవి. కాన నీమాటను వినెదము. నీకట్టడయందే నిలిచియుండఁ గోరుచున్నారము. మమ్ముఁ గఱపుము' అనిరి.

పక్షి వారలతో 'నలుకాలివానియందు గోవుహెచ్చు. లోహములందు బంగారుమేలు. శబ్దములందు మంత్రము (వేదము)మేలు. రెండుకాళ్లవానియందు బ్రాహ్మణుఁడు మిన్న. బ్రాహ్మణునకు జన్మము మొదలుకొని మరణమువఱకు, నయ్యైకాలముల కనుగుణముగా, జాతకర్మము మొదలుకొని శ్మశానమునందుఁ గావింపఁబడు నంతకార్యము వఱకుఁగల యన్ని మంత్రోక్త సంస్కారములు విధింపఁబడియున్నవి. బ్రాహ్మణునకు వేదమునందు విధింపఁబడిన కర్మములు, స్వర్గమునకుఁ బడయుటకయిన మార్గము లన్నింటియందును మేలయినమార్గము. కర్మములన్నియు మంత్రసిద్ధములని వేదవాక్యములు దృఢముగాఁ జెప్పుచున్నవి. అట్లె యీ కర్మమార్గమందుఁ బక్ష(దైవత)ములు మాస(దైవత)ములు, ఋతుదైవతములు మొదలయినదేవతలను బురస్కరించుకొని చంద్రమండలమనెడు పితృలోకపదవి, సూర్యమండలమనెడు దేవలోకపదవి, సంసారము నుత్తరింపఁజేయు పరమాత్మపదవి యనెడు మూఁడువిధములయిన సిద్ధులు పడయంబడుచున్నవి. ప్రాణులు కర్మమునే యనుభవించుచున్నవి. కర్మపద్ధతినె కొనియాడువారికి నీకర్మము సమస్తసిద్ధులను బడయఁగూడినపుణ్యక్షేత్ర మగును. ఈ కర్మపద్ధతియే పెద్దయాశ్రమము. ఈ వెనుకర్మపద్ధతిని నిందించి వేఱొకచెడుతెరువును బొందినట్టి మూఢులను నర్థహీనులు నయినయట్టిమనుష్యు

లకుఁ బాపమేకలుగును. పూర్వోక్త మయినకర్మపద్ధతిని వదలి శాశ్వతములయిన దేవపదవి పితృపదవి బ్రహ్మపదవి యనెడుస్థితులను దిగవిడిచి యుండువారు మూఢులగుదురు. వార లా కారణముంబట్టి కుక్క నక్క పులు మొదలయినవాని పుట్టుకకుఁదగిన యశుద్ధములగు మార్గములను బొందుదురు. 'ఇచ్ఛేదను' అని వేదవాక్యముచే విధింపఁబడిన యీకర్మగతి యుపాసనముతోఁ గూడి మీరుండవలయును. కాఁబట్టి యీకర్మపద్ధతియం దుండువారే తపస్వులని వేదమునందుఁ జెప్పఁబడుచున్నది. శాశ్వతములయిన దేవకార్య పితృకార్య బ్రహ్మకార్యములను గురుకార్యమును విభజించి, చేయునట్టికర్మమే దుష్కరమయిన తపమని చెప్పఁబడుచున్నది. దుష్కరమయిన కర్మమును జేసియే దేవతలు మేలయిన విభవమును బొందిరి. కాఁబట్టి దుష్కరమయిన గృహస్థాశ్రమమును మీరు దాల్పవలయునని మీ కుపదేశించుచున్నాను. ప్రజలకు (సంతానములకు) నీకర్మమే మూలము. కాఁబట్టి యిదిగొప్పది. ఇందులకు సందేహము లేదు. కుటుంబవిధిచొప్పున నీకర్మమం దన్నియు నెలకొనియున్నవి. ద్వంద్వములను దిగవిడిచి మాత్సర్యము లేకయుండు బ్రాహ్మణులు, ఈ గృహస్థాశ్రమమును దపస్సని తెలియుదురు. లోకములందు వనమధ్యమునందుఁ జేయునట్టి తపము దీనికిఁ బిమ్మటిదేయని చెప్పఁబడుచున్నది. విఘసాశులగువారు పరులకుఁబొంద నలవిగానిపదమును బొందెదరు. తమకుటుంబమందు రేపుమాపును రెండుపూఁటలును విధ్యుక్తముగా నన్నమును విభజించి, అతిథులు, దేవతలు, పితరులు, స్వజనులను వీరికినిడి మిగిలినదానిని భుజించువారు విఘసాశు లని చెప్పఁబడుదురు. కాఁబట్టి తమకు స్వధర్మ

మయిన కర్మమార్గమందుండి సువ్రతులును, సత్యవాదులును, లోకమునకు గురువులునయి సంశయమునూలియుందురు. దుష్కర మయినకర్మమార్గమును గావించుజనులు మూఁడవది యగు నింద్రలోకమునుబొంది స్వర్గలోకమందు మచ్చరముపీడి పెక్కుకాలము వాసముచేయుదురు' అనెను. ధర్మార్థసహితము ను హితమునయిన యామాటలనువిని వారు నాస్తికబుద్ధిని విడిచి గృహస్థధర్మమును గయికొనిరి. కాఁబట్టి నీవు సర్వజ్ఞుఁడవు; పురు షతిలకుండవు. నీకుఁదెలియని దేమున్నది. నీవు సయితము దృఢధైర్యము నవలంబించి శత్రువులందఱును హతులయి య కంటకముగానున్న యీ భూమినంతయుఁ బరిపాలింపుము' అనె ను. ఇది పదునొకండవయధ్యాయము.



## రాజధర్మపర్వము.

### ధర్మరాజునకు నకులుఁడు చెప్పుట.

అర్జునుఁడు చెప్పినది విని యంత సమస్తధార్మికులయందును మిన్న యగుధర్మరాజును జూచి, మిక్కిలిప్రాజ్ఞుఁడును విశాలవ క్షుండును మహాభుజుండును మితభాషియు నగునకులుండు దుః ఖమున మొగ మెఱ్ఱఁబాఱ, నన్నయగు నర్జునుని చిత్తము నొప్పు ననుసరించి 'మహారాజా! విశాఖయూపమను క్షేత్రమందు సమస్తదేవతలును గట్టిన యాగాగ్నిస్థలము లిటికలతోఁగట్టంబ డినవి యిప్పటికిని జూపట్టుచున్నవి. కాఁబట్టి దేవతలు కర్మఫల మునందు నెలకొన్నవారని తెలియుము. (దేవత్వమును గర్మఫల మేచుమీ.) ఆస్తికులుకాని ప్రాణులకును సయితము (వర్షమూల

మున) నన్నమునిచ్చు తండ్రులయిన దేవతలును గర్మమునే చేసి దరు. రాజా! విధియెట్టిదో చూడుము. అర్జునుఁడుదాహరించిన వేదమును దిగవిడిచిన యాబ్రాహ్మణులను మిక్కిలియు నాస్తి కులని యెఱుంగుము. బ్రాహ్మణుఁడు వేదమందుఁ జెప్పఁబడినది దిగవిడిచి తక్కిన సమస్తకర్మములచేతను దేవయానమను మార్గ మున స్వర్గమునుదాఁదిమేరయగు బ్రహ్మలోకమును బొందఁజాలఁ డు. వేదముల నిశ్చయము తెలిసినవారును శాస్త్రములను జక్కఁ గాఁ గఱచినవారు నయినబ్రాహ్మణు లీ గృహస్థాశ్రమము సమస్తములయిన యాశ్రమములకంటె శ్రేష్ఠమయినదని చెప్పి దరు. వారివలన నీ విది తెలియుము. ధర్మముచేతఁ బొందఁబడు ధనముల నుత్తమములయిన యాగములందుఁ దానముచేయుమ నుష్యుఁడే మనస్సును జయించినవాఁడు. ఆ మనుష్యుఁడే యన్ని విధములైనత్యాగము గలవాఁడు. మహారాజా! గృహస్థ ధర్మమందు సుఖభోగమును బాటింపక యడ్లే యడవియందు గో ప్పనిష్ఠను బొందినవాఁడై శరీరమును విడుచువాఁడు * తామస త్యాగియగును. ఇల్లుమాలి, బిచ్చమునకుఁ దిరుగాడుచు వృక్ష మునీడయే పట్టుగాఁగొని మననముచేయువాఁడును, ఎప్పుడును యోగముగలవాఁడును, పరులను యాచింపనివాఁడును, నగు వాఁడు, సన్న్యాసమునకుఁ దగిన (భిక్షుకున కగు) త్యాగముగల వాఁడు. కోపమును సంతోషమును విడిచి, విశేషించి పరులదూ షించుటయుమాని, బ్రాహ్మణుఁడెవఁడు వేదము నధ్యయనముచే యునో, వాఁడు గురుపూజకుఁ డయినత్యాగియగును. రాజా!

* 'స త్యాగీ తాపసో మతః' అని పాఠాంతరము. 'తామసోమతః' అని యిట పాఠము కయికొనఁబడినది.

ఎఱుకగలవారు సమస్తము లయినయాశ్రమములను ద్రాసునం దుఁ దూఁచి మూఁడాశ్రమము లొకప్రక్కను గృహస్థాశ్రమ మొకప్రక్కను దూఁగునని చెప్పుదురు. కామమును స్వర్గమును సమముగానుండుటనుజూచి, లోకవృత్తము నెఱింగిన మహర్షులకు నీగృహస్థాశ్రమమే మంచిమార్గమనియును మంచిగతియనియు నెవఁడుభావించునో వాఁడు త్యాగియగును. భరతసత్తమా! ఒకఁడు గృహములను దిగవిడిచి యడవికిఁ బోయినపిదప మూఢునివలె నొకసమయమున భోగములను దలంచుకొనునేని, వాఁడు ధర్మవేషమును బూనినవాఁడగును. వీనిని మృత్యువు తనపాశముచే గంఠమునఁ గట్టి యీడ్చును. మహారాజా! ఆశను మున్నిడుకొని చేయు కర్మము ఫలములేనిదని చెప్పఁబడును. ఆశను ద్యజించి చేయుకర్మమంతయు మహాఫలము గలదగును. శమము, దమము, ధైర్యము, సత్యము, శౌచము, ఆర్జవము, యజ్ఞము, ధృతి, (ఉత్సాహము) ధర్మము ననెడియివి ఋషులకు వలయు నిత్యవిధి యని చెప్పఁబడుచున్నది. ఈ గృహస్థాశ్రమమందు పితరులు, దేవతలు, అతిథులు ననెడి వీరికొఱకనుతలంపునఁ జేయు ప్రయత్నము శ్లాఘింపఁబడుచున్నది. మహారాజా! గృహస్థధర్మమనెడి యీ మార్గమందే ధర్మార్థకామములు మూఁడింటిఫలమునుఁ దప్పక కలదు. అభిమానమును విడిచి బ్రాహ్మణులను పూజించెడి యీ విధిచొప్పునఁ బ్రవర్తించువానికి నెయ్యెడను నాశముగలుగదు. ధర్మాత్ముఁడును గల్మషరహితుండును నగుబ్రహ్మ పలువిధములయిన దక్షిణలు గలయాగములచే మనల నారాధింతురని కదా ప్రాణులను సృజించెను. యాగముకొఱకే చెట్లను జేమలను నోషధులను నట్లే పరిశుద్ధములయిన పశువులను, హవిస్సులను

సృజించెను. యాగమనెడి యాకర్మము గృహస్థాశ్రమముగలవా
నికే చేయఁదగినది. కాఁబట్టి గృహస్థాశ్రమ మొక్కటియే పొం
దుటకును జేయుటకు నరిదియైనది. అటువంటి గృహస్థాశ్రమము
నుబొంది పశువులను ధాన్యములను ధనములను బడసి యెవరు
యాగము చేయరో వారలయందుఁ బాపము నెలకొనియుండును.
కొందఱు ఋషులు వేదాధ్యయన మను యజ్ఞమే చేయుదురు.
మఱికొందఱు జ్ఞాన మనుయజ్ఞముచేయుదురు. వేఱుకొందఱు
మనస్సనందే యోగమనెడి పెనుయజ్ఞమును జేయుదురు.
మహారాజా! విద్వాంసులు నాకు మఱియొకటిని జెప్పియున్నా
రు.అదియేదనఁగా—ఈజగము కలుగుటకుఁ బూర్వము, భూమి,
అప్పు, తేజస్సు, వాయువు,సూర్యుఁడు చంద్రుఁడు,నక్షత్రములు
దిక్కులు, కాలము, శబ్దము,స్పర్శము, రూపము,రసము గంధమ
నునివి యొక్కటియుఁ గలుగవు. వీనిని దెలుపునట్టి ప్రత్యక్షము
అనుమానము, ఉపమానము, ఆగమము, అర్థాపత్తి, ఐతిహ్య
ము, అను ప్రమాణములును దృష్టాంతమును లేవు. ఎందును
సందేహమును నిశ్చయమును లేవు.ధర్మమును నధర్మమును గలు
గవు. దేవతలు, మనుష్యులు, స్థావరము, జంగమము, జాతి
విభాగములును, ఆశ్రమ విభాగములును, చేయువాఁడును,
కోరువాఁడును, ధనమును, సంపత్తియు, వానిఫలము నొక్కటి
యుఁగలుగదు. ఈలోకమంతయుఁ బ్రకాశముమాలి చీఁకటిగా
నేయుండెను. ఆత్మయుండియు మనస్సుతోడి కూడికను గోరిన
దిగాదు. మనస్సు జ్ఞానములేనిది. ఆత్మయొక్కటియే జ్ఞానముగ
లది. ఈ ప్రపంచమంతయు వ్యాపించియుండు నొక్కఁడగు నీశ్వ
రుండు ప్రాణులకును మంత్రములకును దగిన రూపమును గలి

గింపలేదు. మంత్రములకు దేవతలయి వెలుంగు సృష్టికర్తలని పేరొందిన కొందఱు ఋషులక్కాలమం దీశ్వరునిచేఁ గల్పింపఁ బడిరి. వా రీశ్వరునివలననుండి తగిన జ్ఞానమునుబడసి యీబ్రహ్మాండమును గల్పించి విశ్వసృజమనెడి యాగమును గావించి పితామహుండను నొకనిని బుట్టించిరి. ఆ పితామహుఁ డీశ్వరునియనుగ్రహమువలన నీలోకసృష్టికిఁ దొడంగెను. ఈలోకపు జ్ఞానమంతయు నీశ్వరుని జ్ఞానమే. ఈశ్వరుండయిన యీశంభుఁడు తనశక్తిచే నీజగమునంతయు వ్యాపించియున్నాఁడు. ఆ యీశ్వరునిచేఁ బ్రలయకాలమందు బ్రహ్మకు ధర్మార్థ కామ మోక్షములు పదేశింపఁబడి యున్నవి. జ్ఞానము మాలినవియు, శక్తిలేనివియు సుఖదుఃఖములకుఁ బట్టయినవియు నగుటచే జంతువు లీశ్వరునిచేఁ బ్రేరితములయి స్వర్గమును నరకమును బొందుచున్నవి. ప్రాణు లీశ్వరునిచేతను మనస్సుచేతను విషయములచేతను గర్మములచేతను బ్రేరితములై ప్రకృతిని బురుషునిని సుఖదుఃఖములను నొందుచున్నవి. దేవతలు, అసురులు, గంధర్వులను వీరితోఁడం గూడిన యీలోకమును సృజించిన యీశ్వరుఁడే జాతిని, ఆశ్రమములను వీని యంతర్భేదములు నేర్పఱచియున్నాఁడు. మహారాజా! నీవును దక్కినవారును నేవిధమునఁ జూచినను గాని యీశ్వరుని వశమందున్నవారలే కాని వేఱు గారు. ప్రాణులన్నియు నా యీశ్వరునివశమందుండియే జీవమును మరణమును బొందుచున్నవి. దేవతలు ప్రాణులను నీలోకమును జంపి యాగముచేసెదరు. వారు పాపమునెంతమాత్రమును బొందరు. దేవతలకయినను, ఋషులకయినను, గృహస్థాశ్రమమును బొందినవారెవరికిఁగాని కర్మములు హింస

గలవిగానే యున్నవి. ఆకర్మమును జేయు గృహస్థు లుత్తమ మయినగతిని బొందెదరు. తొల్లిరాజులు ప్రజలకును దమకును హితముగోరి పెక్కుచోట్ల శత్రువులను గూల్చియున్నారు. రాజా! అందుఁ బాపముగలదేని వారెట్లు స్వర్గమునుబొందిరి? అట్టి పాపములచేతఁ జుట్టంబడియే నరకమును బొందరయిరి? కాఁబట్టి గృహస్థాశ్రమములందుదోష మొకటియుఁ గలుగదు.అది గొప్పది! యని యిట్లు మనస్సునకు సమాధానము చేసి కొని యీ కర్మమార్గమం దుండి బ్రహ్మను బొందువారగు బ్రాహ్మణులు మొద లయినవారినిఁ జూచి దేవతలు నట్టి వారిస్థితికి నాశపడుదురు. అంతయు నీవెఱుంగుదువు. అందందు సంపాదించి తెచ్చిన విచిత్రములగు రత్నములను యజ్ఞములందు దానముసేయుటకుఁ బ్రయత్నింపక నాస్తికవాదములు పలుకు చున్నావే! రాజా! కుటుంబమును జెందినవానికి త్యాగము కలుగుట యరిది. కాబట్టి బ్రాహ్మణులు మిక్కిలి పూజించునట్టి రాజసూయము, అశ్వమేధము, సర్వమేధము మొదలుగాఁగల తక్కిన యజ్ఞములను దేవరాజగు నింద్రునివలె యజింపుము. ప్రాలుమాలిక యనెడు తనదోషముచేత, దొంగలు దోఁచు కొని బాధించుచున్న ప్రజలను రక్షింపకుండు రా జెవఁడో యతఁడె కలి యనఁబడును. మనమో దాయాదుల పట్లమనసున మచ్చరముగొని యింతలు సేసిన వారము.ఇందులకుఁగాను అలం కరింపఁబడిన గుఱ్ఱమును, ఏనుఁగును, గోవులను, దాసీలను, గ్రా మములను, పల్లెలను, క్షేత్రములను, గృహములను, బ్రాహ్మణు లకు దానముసేయక యుందుమేని రాజులని చెప్పఁబడు కలులు కాఁగలము. ఇట్లు మన మొకరికిని బెట్టక యెవరిని గావక వట్టి

రాజపాపములకుఁ బాలయి యుందుము గాన దుఃఖమునే కుడువఁగలము! కాని సుఖమును బడయుట గలుగదు. ప్రభూ ! మహాయజ్ఞములును బితృశ్రాద్ధములును జేయక, బుణ్యతీర్థములందుఁ గ్రుంకులిడక, యూరువిడిచి సన్న్యాసివై పోవుదువేని, యిహమునకును బరమునకును రెంటికిని దొలఁగి పిశాచమవై గాలిచిమ్మఁగా చెల్లాచెదరయిన మేఘమువలె నాశమును బొందఁగలవు. లోపలఁగాని వెలుపలఁగాని మనసునకుఁ జింతగలిగించు వస్తువును దేనిని గాని మనస్సుచేతఁ దిగవిడిచినవాఁడు త్యాగి (సన్న్యాసి) యగును. ఇల్లువిడిచి వెలువడినవాఁడు సన్న్యాసికాఁడు. మహారాజా ! బ్రాహ్మణులును నుపాసించునట్టి యీ కర్మమార్గమందు వర్తించువానికి నెచ్చటను జెఱుపుగలుగదు. యుద్ధమం దింద్రుఁడసురసైన్యమును హతముగావించునట్లు పెంపుసొంపారు శత్రువులను బలిమిమెయిం దునుమాడి, పూర్వులచేఁ బ్రోక్తమయినదియు శిష్టులయిన రాజులచేత ననుష్ఠింపఁబడినదియు నయిన స్వధర్మమం దాసక్తుఁడయి యుండువాఁ డెవఁ డిట్టిశోకమును బొందును ? క్షత్రియధర్మముచొప్పునఁ బరాక్రమము మెఱసి యీ భూమిని గెలిచి, వేదవిదులకు దానములొసంగి యాసుకృతమువలన నాకపృష్ఠమును బొందఁగలవు ఇట్టి సమయమున నీవు శోకించుట యెంతమాత్రముతగదు !' అనెను. ఇది పంద్రెండవయధ్యాయము.



## రాజధర్మపర్వము.


సహదేవుఁడు ధర్మరాజునకుఁ జెప్పినది.

సహదేవుఁడు ధర్మరాజునుజూచి 'రాజా ! (దారపుత్త్రాదుల

యిన) బాహ్యవస్తువులను దిగవిడుచుటవలన సిద్ధిగలుగదు. శరీరమందుఁగల (కామక్రోధాదులగు) వస్తువులను విడుచుటచే సిద్ధి కలిగినను గలుగవచ్చును. బాహ్యవస్తువులనుండి విడివడినను, శరీరమందలి వస్తువులందు సక్తిగలవానికి నేధర్మమును సుఖమును గలుగునో యాధర్మమును సుఖమును, నట్లె మనవిరోధులకుఁ గలుగుఁగాత. శరీరమందలి వస్తువులను విడిచి భూమిని బాలించువానికిఁ గల ధర్మమును సుఖమును నట్లె మనసుహృదులకుఁ గలుగుఁగాత. * రెండక్షరములుగలది. మృత్యువు (మార్గము) అగును. మూఁడక్షరములుగలది శాశ్వతమయిన బ్రహ్మమార్గమగును. 'మమ' (నాది) అను రెండక్షరములు గలది మృత్యువు. 'న మమ' (నాదికాదు) అను మూఁడక్షరములుగలది శాశ్వతమయిన బ్రహ్మము. కాఁబట్టి రాజా ! బ్రహ్మము మృత్యువుననెడి యీరెండును గానంబడకయే మఱేఁగి బుద్ధియందు నెలకొనియుండి ప్రాణులను దమవశము చేసికొనుచున్నవి. సందేహము లేదు. శరీరమునకు నాశముకలిగినను గాని శరీరమునందుఁగల (యాకర్తృత్వధర్మముగల) బుద్ధికి నాశములేదనుట నియతమేని శరీరమును విడుచుటవలనఁ బ్రాణులకు నేహింసయుఁ గలుగరాదు. ఈశరీరముతోఁ గూడనే బుద్ధికిని నుత్పత్తివినాశములు గలుగునేని యీశరీరము పోయినతోడనే బుద్ధియుఁ బోయినదగును. అట్లగునేని, యీకర్మపథము వ్యర్థమేయగును. కాఁబట్టి తెలివిగలవాఁడిందొక నిశ్చయమును గయికొనక పూ

---

*ఇందులకుమూలము 'ద్వ్యక్షరస్తు భవేన్మృత్యు స్త్ర్యక్షరం బ్రహ్మ శాశ్వతమ్ । మమేతి ద్వ్యక్షరో మృత్యుర్న మమేతిచ శాశ్వతమ్' అని తెలియు. నది 'మమ' అని స్వీకారము. 'నమమ' అని పరిత్యాగము.

ర్వాలును వారికిఁ బూర్వాలును నయిన సత్పురుషు లనుష్ఠించు మార్గమునే సేవింపవలయును, ఈకర్మమార్గ మథమముగా నుండినదేని స్వాయంభువమనువును నట్టి తక్కిన పెక్కండు చక్రవర్తులును నేల దీనిని ననుష్ఠించిరి? కృతయుగము త్రేతాయుగము మొదలయిన కాలము బహుతరముగా మంచిగుణములు గలవి. ఆకాలములందుఁ గలరాజులు విశేషముగా నీ భూమిని బాలించిరి. స్థావరజంగమములతోఁగూడ నీ భూమిని బడసియు దీనిని లెస్సగా ననుభవింపనిరాజు బ్రతికియుండి ఫలమేమి? లేక యడవికిఁబోయి యందలి వస్తువులచే బ్రతుకు మనుష్యునికి ద్రవ్యములందు మమతగలుగునేని వాఁడు మృత్యువు నోరఁ జిక్కినవాఁడగును. లోపలను వెలుపలను గలవస్తువుల స్వభావమును జూడుము. ఎవరు దాని కలరూపును గనుదురో వారు మహాభయమునుండి విడివడుదురు. నాకుఁ దండ్రియుఁ దల్లియుఁ దోఁబుట్టువును గురువు నన్నియు నీవే. దుఃఖముచేఁ బ్రేలిన నాపలుకులను నీవు సయింపవలయును. భరతసత్తమా! నే నాడిన దంతయు తథ్యముకానీ, యతథ్యముకానీ, యవి,భక్తిచేతఁ జెప్పఁబడినవని మాత్రము తెలియుము' అనెను. ఇది పదుమూఁడవయధ్యాయము.



## రాజధర్మపర్వము.

### ద్రౌపది ధర్మరాజునకుఁ జెప్పినది.

ధర్మరాజు తనతోఁబుట్టువులు నానావిధములయిన యాయా వేదసిద్ధాంతములను జెప్పుచుండఁగాఁ దానేమియుఁ బలుకకయుం

డెను. అదిచూచి గొప్పకులమునఁ బెంపారఁబుట్టిననారీరత్నము, వాలుఁగన్నులు గలశ్రీమంతురాలు ద్రౌపది యతనితోఁ బలుకఁ దొడంగినదయ్యె. సింహములును బెబ్బులులుంబోని తమ్ములు తన్నుబలసి యుండఁగా నేనుంగులు బలసియున్న యూథపతివలె వెలుంగుచు నారాజవృషభుం డుదాసీనుండై యుండెను. ఆబిడకు విశేషించి యతనియం దభిమానము గలిగియుండును. ఆ రాజు నా చెలువను నెప్పుడును లాలించుచుండును. మఱియు నాపడఁతి ధర్మాధర్మముల నెఱిఁగినది. ఆసుశ్రోణి భర్తనుజూచి మిక్కిలి చెలువయిన తిన్ననిపలుకుల నతనితో 'రాజా! వీరుగో నీతమ్ములు కంది కుందుచున్నారు చూడుము. చాతకములవలె మాటిమాటికి వాపిడుచుచు నిలుచున్నారు చూడుము. వీరిని బాటింపవు. మహారాజా! మదపుటేనుఁగులుంబోలె మత్తిల్లియున్నవీరు విడువక దుఃఖములపా లయియుండినవారు గాన యుక్తియుక్తం బగుమాటచెప్పి వీరిని సంతోషింపఁజేయుము. రాజా! మునుపు ద్వైతవనమునందు నీతమ్ములు వీరు చలికిని గాలికిని నెండకును గంది కుంది యుండఁగా నందఱనుజూచి 'మనము దుర్యోధనుని యుద్ధమునఁ జంపి సమస్తములయిన కామములచే నిండారియున్న యీ భూమండలము ననుభవింతము. అరిందములారా! మనము యుద్ధమున జయమునొందఁదివిరి వీరపురుషులను, రథములను, మహాగజములను, హతములు గావించి భూమిని రథములచేతను రాతులచేతను గలయఁగప్పి, యాప్తదక్షిణలచేఁ బెంపుసొంపారునానావిధయజ్ఞములును యజింతము. వనవాసమునం బడిన దుఃఖమంతయు మనసుఖమునకే యగును' అని యిట్లెల్ల చెప్పితివి. ?

వారి కిట్లు చెప్పియును నీవును ధార్మికులం దుత్తముఁడవై యుండియును మరల మామనంబులను నొప్పించెదవేల ? పండయుగువాఁడు భూమిని బాలింపఁజాలఁడు; ధనములను ననుభవింపఁజాలఁడు. పండయుంటఁ బుత్రులు, ఖాంపియందుఁ జేపలవలె బాగుగనుండఁజాలరు. దండనీతి యెఱుఁగని క్షత్రియుఁడు విలసిల్లఁడు. దండము లేనివాఁడు భూమిని బడయఁజాలఁడు. దండము లేనిరాజును నండగొన్న ప్రజలును సుఖమునొందఁజాలరు. దేవతలు, అసురులు, గంధర్వులు, అప్సరసలు, రాక్షసులు, గుహ్యకులు, నాగులు, మనుష్యులు ననెడి వీరిచేత భూషితమై ధర్మార్థకామములచే సంపూర్ణమై యున్నయీజగమంతయు దండముచేత నడంచి యనుభవింపఁదగినదిగా నున్నది. రాజా ! స్వయంభువువలన నుండివచ్చిన శాశ్వతం బగునీతిశాస్త్రమును వినుము. ఇది బ్రాహ్మణు లెల్లవారికిని మీకును దెలిసినవిషయమే. రాజు లేకయుండినచో, నీలోకము భయముగాని నలుగడలఁ బరుగిడిపోవునని దీనిని రక్షించుటకై యీశ్వరుఁడు తా నింద్రు, డగ్ని, యముఁడు, వాయువు, సూర్యుఁడు, వరుణుఁడు, చంద్రుఁడు, కుబేరుఁ డనువీరల శాశ్వతములయిన తేజస్సు నంశములనొకటిగాఁ జేర్చి మహాకాయుండును, మహావీర్యుండును, జగత్తును బరిపాలించుటకుఁ శక్తుండును నగురాజును సృజించెను. దేవేంద్రుఁడు మొదలయిన వీరల యంశములవలన రాజు పుట్టుచున్నాఁడు గావున నతఁడు తన తేజముచే సమస్తప్రాణులను నడంచుచున్నాఁడు. రాజు సూర్యుఁడుంబోలెఁ గన్నులను మనంబులను దపింపఁజేయును. భూమియం దెవరుగాని యతనిని దేఱిచూడఁజాలరు. ఆరాజు లోకమున నగ్నియు, వాయువును, సూర్యుఁడు

ను, జంద్రుఁడును, యముఁడును, వరుణుఁడును, గుబేరుఁడును, దేవేంద్రుఁడునుంగాఁ బ్రకాశించుచున్నాఁడు. రాజునందు సమస్తఋషుల తేజస్సును స్థాపింపఁబడియున్నది. రాజు బాలుఁడుగానున్నను, మనుష్యునిఁగాఁ దలఁచి యవమానింపరాదు. రాజొక పెద్దదేవతయనియు, మనుష్యరూపముగొని నిలుచున్నడనియుఁ దలంపవలయును. నిప్పు, తప్పి దగ్గటిన యొకమనుష్యునిఁగాల్చును. రాజనెడు నగ్గియో, గోవులు ధనములు మొదలగు వస్తువులతోఁడఁ గులమునే గాల్చివైచుననుటకు సందేహము లేదు. మీ కోపాగ్నివలన ధృతరాష్ట్రుని కులమే దహింపఁబడినది. ఇది లోకమంతయుఁ దెలిసినది. ఇందు సందేహమేకలుగదు. మంచికులమునఁ బుట్టి, మంచినడవడిగలిగి, ధర్మబుద్ధితోఁ గూడి, బ్రజలను రక్షించుటయందు నిరతుఁడై యొప్పురాజు, దేవతలచేతను బూజితుఁడగును. కార్యమును, శక్తినిని, జోటును, గాలమును గలరూపునఁ గనుఁగొని, ధర్మార్థ మెవఁడు మాటిమాటికిఁ బెక్కురూపము లెత్తికొనునో, యతనియనుగ్రహమందు లక్ష్మియుఁ, బరాక్రమమందు జయమును, గోపమందు మృత్యువును వసించుచుండును. ఏలన నతఁడు సర్వతేజోమయుఁడుగదా. అతని నెవఁడు తెలియక ద్వేషించునో వాఁడు నాశమునొందును. అట్లు ద్వేషించువానిని, రాజుగూడ శీఘ్రముగాఁ జంపఁదలఁచును. కాఁబట్టి రాజు తనకిష్టు లయినవారియందు ననిష్టులయినవారియందును మంచియో సెబ్బరయో దేనిని నిశ్చయించునో దానినిమార్పరాదు. ఈశ్వరుఁడు సమస్తజగత్తులను రక్షించు బ్రహ్మతేజోరూపమై తనవలనఁ బుట్టినదియు నగుదండనీతి యనుధర్మమును రాజులకొఱకై నిర్మించెను. స్థావరజంగమ

ములగు సమస్తప్రాణులును, దండనీతివలని భయమున భోగ
ము నొసంగుచున్నవి ; ధర్మమునుండి చలింపకయు నున్నవి.
రాజు న్యాయ్యమున వర్తించు మనుష్యులను, దేశకాలములను
శక్తినిఁ గార్యమును గలరూపునఁ గనుంగొని దగురీతి నడంపవల
యును. దండమే, లోకమునకు రాజు; దండమే,అడఁచువాఁడును,
జరుపువాఁడును, ఆజ్ఞసేయువాఁడును. అదియే వర్ణములకును
నాశ్రమములకును, నవ్యయంబగు ప్రభువు. దండమే ప్రజల
నెల్ల శాసించుచున్నది. దండమే ప్రజలనెల్ల రక్షించుచున్నది.
జగత్తులు నిదురించుచున్నను దండము మేలుకొని యుండును.
విద్వాంసులు దండమును ధర్మమని తెలియుదురు. చక్కఁగా
నాలోచించి ప్రయోగించినదండము ప్రజలనెల్ల రంజిల్లఁజేయు
ను. ఆలోచింపక చేయుదండము సమస్తమును నాశముసేయు
ను. రాజు ప్రాలుమాలిక లేక దండింపఁదగిన వారియందు దండ
మును జెల్లింపనియెడ, జలమందలి చేఁపలుంబోలె లోకమందు
బలవంతులు బలహీనులను భక్షించివైతురు. అప్పుడు కాకియుఁ
బురోడాశమును దినును. కుక్కయు హవిస్సును నాకును. స్వామి
త్వ మెందును గలుగదు. అంతయుఁ దలక్రిందగును. లోకము
నందుఁ బరిశుద్ధుండగుమనుష్యుండు మిక్కిలి యరుదగును. లో
కమంతయు దండముచేత నడంపఁబడి దానివలని భయమునుబ
ట్టి ప్రయోజన (భోగ) కారియగుచున్నది. దేవతలును, అసురులు
ను, గంధర్వులును, రాక్షసులును, ఉరగులును, పతగులును దండ
ముచేతఁ బీడితు లగుటంబట్టియే భోగమునకుఁ బాత్రులయ్యెద
రు. దండము పొరలెనా సకలవర్ణములు చెడును ; సకలమైన కట్టు
పాట్లును భేదల్లును. లోకమంతయుఁ బ్రకోపమునొందును. నల్లసి

దేహమును, నెత్తురువంటి కన్నులును, గలిగి పాపమును బరిమార్చునట్టి దండపురుషుఁ డెచ్చట సంచరించునో యచ్చటి ప్రజలు తప్పునడపు వాఁడు చక్కఁగా నరయువాఁడేని తెలివిమాలరు. అట్టిదండము నకుఁ, జక్కఁగా విచారించి చేయువాఁడును, బ్రాజ్ఞుండును, ధర్మ కామార్థములఁ జక్కఁగాఁ దెలిసినవాఁడును, సత్యవాదియు నగు రాజు కారణమగును. అట్లు దండమును జెల్లించురాజు స్వర్గమును గూర్చి పోవును. కామమందు మనస్సునుంచు నీచుం డగురాజు దండముచేతనే కొట్టువడును. దండము మిక్కిలియు గొప్ప తేజ ముగలది. అది, మంచిబుద్ధిమంతులు గానివారికి నెంతమాత్రము వహింప నలవిగానిదిచుమీ. కావుననే యది ధర్మమునుండి చలించినరాజునే యతనిబంధువులతోఁగూడఁ జంపివైచును. అది రాజును జంపి దుర్గమును రాజ్యమును స్థావర జంగమాత్మ కమయిన జగత్తును, ఆకాశమునం గల మునులను దేవతలను హింసించును. లోభియు, బుద్ధిలేనివాఁడును, విషయాసక్తుఁ డును, మూఢుఁడును, అసహాయుఁడు నయినవానికిఁ బాడివో ప్పున దండము, నడపశక్యముగాదు. పరిశుద్ధుండును, సత్యసం ధుఁడును, నీతిశాస్త్రము ననుసరించువాఁడును, మంచి సహాయ సంపత్తి గలవాఁడును, బుద్ధిమంతుండు నగువానికే చెల్లింప శక్యమగును. రాజు తనరాజ్యమందు న్యాయముతో వర్తించు వాఁడును, శత్రువులందు వేండ్రమయిన దండము గలవాఁడును, నెయ్యురగు సుహృదులందు ఋజువయినవాఁడును, (చక్కటిగల వాఁడును), బ్రాహ్మణులందు క్షమగలవాఁడునై యుండవలయును. ఇట్లుండురాజు పరిగయేఱి బ్రతుకువాఁడయినను నీటియందు నూనెబిందువు వ్యాపించునట్లు లోకమునందు వానికీర్తి వ్యాపిం

చును. ఇందులకు విపరీతముగా వర్తించుబుద్ధిమాలిన రాజునకుఁ గీర్తి, నీటియందలి నేతిబొట్టువలె, లోకమున సంకుచితమగును. రాజా! ధర్మమునుండి చలించుటవలననే ధృతరాష్ట్రునిపుత్రులను దేవదేవుం డగురుద్రుఁడును, బ్రహ్మయు, విష్ణుదేవుఁడును, మహాత్ముం డయినయింద్రుఁడును, దిక్పాలురును, పంచభూతములును, మహాత్ము లయినపాండవులును వధించిరి. అధార్మికులును దురాచారులు నయినయాధృతరాష్ట్రపుత్రులు సేనలతోఁడఁగూల్పంబడిరి. రాజా! నెపముననో, మాయచేతనో, క్షత్రధర్మముచేతనో వారిని వధించుటవలన నీకు సుంతేనియు దోషము లేదు. సర్వభూతములందలి మైత్రియు, దానమును, అధ్యయనమును, తపస్సును. బ్రాహ్మణులకే ధర్మమగును; రాజులకుఁ గాదు. రాజులకు దుష్టులను వారించుటయు (దండించుటయు) సజ్జనులను బరిపాలించుటయును, యుద్ధమందు వెనుదీసి పాఱకుండుటయు నను నివియే పరమ మయినధర్మము. ఎవనియందు క్షమయుఁ గోపమును, ఇచ్చుటయుఁ బుచ్చుకొనుటయును, భయమును అభయమును, నిగ్రహమును అనుగ్రహమును రెండునుగలవో వాఁడే ధర్మవిదుఁడని చెప్పుదురు. ఈభూమి, చదువుచేతను, దానముచేతను, మంచి మాటలచేతను, యాగముచేతను, యాచనచేతను నీకు లబ్ధమయినదిగాదు. లోకంబునఁ బ్రసిద్ధమై, పెక్కండ్రు వీరులచే నుద్యతమై, రథ గజ తురగ సంపన్నంబై, ప్రభూత్సాహ మంత్రము లనెడిమూఁడంగములచే నత్యుత్తమమై, ద్రోణకర్ణాశ్వత్థామ కృపులచే రక్షితమై యుండిన శత్రుసైన్యములును నీచేతహతములయినవి. కాఁబట్టి, వీరా! భూమిని నీవు భుజింపుము. పురుషసింహమా! పెక్కు జనపదములతోఁగూడిన

జంబూద్వీపమును నీవు దండముచేత నడంచితివి. ఈ ద్వీపమునకు సాటియై మేరువునకుఁ బడమటి ప్రక్కనున్న* క్రౌంచద్వీపమును నీవు దండముచేత నడంచితివి. నరపతీ ! మేరువునకుఁ దూర్పున నున్నదియుఁ క్రౌంచద్వీపమునకు సదృశమయినదియు నగుశాక ద్వీపమును దండముచేత నీ వడంచితివి. మేరువునకు నుత్తరము నందున్నదియు శాకద్వీపమునకు సమానమయినదియు నయిన భద్రాశ్వద్వీపమును దండముచేత నడంచితివి. వీరా ! నానా జనపదముల కాశ్రయమయిన ద్వీపములును, వానికి నడుమంగల చిన్నద్వీపములును సముద్రమునుజొచ్చి నీవు దండముచేత నడంచితివి. మహారాజా ! ఎనలేని యిట్టికార్యములను జేసితివి. ఇందులకు బ్రాహ్మణులచేతను బొగడొందుచున్నావు. ఇంతకు సంతోషింపకున్నావే ! భారతా! అంకెలువైచు వృషభములవలెను, మదించియున్న గజములవలెను నున్న యీ తమ్ములనుజూచి యుల్లసిలుమీ. వీరలు పగవారిని నవలీలనోర్చువారు; పరులను మగంటిమిచేఁ గ్రాఁచువారు. అందఱను దేవతలకుఁ బ్రతిములయినవారు. వీరియం దొక్కొక్కరును నాకు సుఖముగూర్పఁ జాలుదురని నాతలంపు. శరీరమును జరుపుటయందు నింద్రియములన్నియుఁ జేరియుండునట్లు, మనుష్యులందు మిన్నలై బెబ్బులులుంబోని శూరులయిన పతులందఱును నా విషయమందుఁ జేరియుండఁగా నీకుఁ జెప్పనేల ? నాయత్తగారు కుంతి యన్నియుఁదెలిసినది. ఆయమ యన్నియుఁజూచినది. ఆయమ నన్నుఁ జూచి 'పాంచాలీ ! యుధిష్ఠిరుఁడు తీవ్రమయిన పరాక్రమము

* క్రౌంచద్వీపాదులను వశీకరించుట రాజసూయమందు సిద్ధులమూలముగనని తెలియునది.

మెఱసి విరోధులగు వేలకొలఁది రాజులను వధించి నిన్ను మిక్కిలి యెక్కుడయిన సుఖమునందు నుంపఁగలఁడు' అని చెప్పినమాట పొల్లుగానేరదు. రాజా! నీ తెలివిలేమిచేత నది పొల్లగునని తలంచుచున్నాను. అన్నవగు నీవు, ఉన్మత్తుడవయియుండుట వలన నిన్ననుసరించు తక్కిన పాండవులందఱును, నీపై త్యము వలనఁ బైత్యముగలవారై యున్నారు. నీదు తమ్ములు పైత్యము గలవారు గాకుండిరేని, నిన్ను నాస్తికులతోఁగూడఁ గట్టివైచి భూమినేలుదురు. తనకయిన శ్రేయస్సును బొందకున్న మూఢుఁడే కదా యిట్లుచేయును. పొగలచేతను, గాటుకలచేతను, నస్యములచేతను నీపైత్యమును తొలంపవలయును. దారితప్పి నడచు మనుష్యునకు మందులచేతఁ జికిత్స గావింపవలయును. భరతసత్తమా! లోకమునంగల స్త్రీలయందు నేను మిక్కిలియుఁ గీడ్పడినదానను. ధృతరాష్ట్రుని కొడుకులచేత నట్లవమానింపఁబడియు, నే నునుఱుతోనుండఁ గోరుచున్నానే! రాజా! ధృతరాష్ట్రుని కొడుకు లెప్పుడును దుర్మార్గమున నడచువారు. అట్టివారిని వధించుటయం దొకప్పుడు నేవిధమయిన దోషమును గానంబడదు. శుక్రుఁడు చెప్పిన యీశ్లోకములను వినుము. వాని యర్థమేమన-'తన్నుఁ జంపుకొనువాఁడు, తన ధనమును బాడు చేయువాఁడు, బంధువులను జంపువాఁడు, విషము పెట్టువాఁడు, కారణములేక చంపువాఁడు, ఇల్లాలిని బరామర్శించు వాఁడనెడి యీయార్వురును ఆతతాయులనఁబడుదురు. వీరలను జంపుట యందు దోషమేకలుగదు.' మహాత్ముండయిన యీశుక్రునికొఱకు బ్రహ్మదేవుఁడు దీనిని వచించెను. సన్మార్గమందు వర్తించు బ్రాహ్మణుఁడు, క్షత్రియుఁడు, వైశ్యుఁడు, శూద్రుఁడునను వీరలయిండ్లకుఁ

బోయి బలవంతముగాఁ గొట్టువానిని, విషము పెట్టువానిని, భుజింపరానిదియుఁ ద్రావరానిదియు నగువస్తువు నిడువానిని, అగ్ని పెట్టువానిని జంపవలయును. గోవులను బ్రాహ్మణులను వధించునపుడును, పడఁతులను దలవెండ్రుకలు పట్టి యీడ్చునపుడును, బితామహుఁ డగు బ్రహ్మగా నుండినను గొట్టవలయుననఁగా నిఁకఁ దక్కిన పాపాత్ములవిషయమై చెప్పనేల? ఇది రాజులు నడవవలసిన మార్గము. గోవులకును బ్రాహ్మణులకును రాజులకును వ్యసనము కలుగు కాలమందును, రాజ్యమునకుఁ జెఱుపుగలుగు కాలమందును, తన దేహమును గాచుకొనుటకును, పడఁతుల యేడ్పుధ్వనిని విన్నను, మహాప్రభావుఁడగు బ్రాహ్మణుఁడయినను యుద్ధము సేయవలయును. ధర్మమునుండి చలించిన యాతతాయియగు బ్రాహ్మణునిఁ జంపవచ్చును. తెలిసినవాఁడు బ్రాహ్మణవధమును వేఁడుచ్చుటఁగాని మనస్సుచేతను దలంపరాదు. గోవును, బ్రాహ్మణునిఁజంపఁ దెగించిన బ్రాహ్మణుని క్షత్రియుఁడు చంపవచ్చును. మంత్రమును గాచుకొనుటకును, దన కుటుంబమును బొందుకొనుటకును క్షత్రియుఁడు బ్రాహ్మణునిఁ జంపవచ్చును. ధర్మమునుండి చలించినవాఁడై, క్రూరుఁడై, చోరుఁడగు బ్రాహ్మణుని క్షత్రియ జాతియందుఁ బుట్టినవాఁడు యుద్ధమున మిక్కిలిబలిమి మెయి మార్కొనవచ్చును. వేదాంత పారంగతుఁడయినను దన్నుఁ జంపవలయునని కోరి పయినెత్తి వచ్చు నాతతాయిని వధింపవచ్చును. దానివలన వేదము సాంగముగా నధ్యయనముచేసిన బ్రాహ్మణునిఁ జంపుట యను భ్రూణహత్యను జేసిన దోషమునొందఁడు. బ్రాహ్మణుఁడును క్షత్రియుఁడును, వైశ్యుఁడును, శూద్రుఁడును, చండాలుఁడును

మఱియుఁ దక్కినవాఁడెవఁడును, నే సమయమందును శాంతుఁడగు బ్రాహ్మణుని నొక గడ్డిపోఁచచేతను గొట్టరాదు. బ్రాహ్మణునిఁ బెద్దకఱ్ఱనుగొని కొట్టనెత్తినపాపి మున్నూఱుసంవత్సరములు మంచి నిలుకడనొందఁడు. కొట్టినవాఁడు వేయిసంవత్సరములు నరకమందుఁ బడును. కాఁబట్టి బ్రాహ్మణునిఁ గొట్టుటకై చేయెత్తుటయు, నాయుధముచేతఁ గొట్టుటయుఁదగదు. బ్రాహ్మణుని మేననుండివచ్చు నెత్తు రెన్ని ధూళియణువులను గ్రహింపఁగూడునో యన్నియేండ్లు కొట్టినపాపి నరకమందుఁ దిరుగుడువడుచుండును. బ్రాహ్మణునిలోలు నెమ్ములను భేదించినవాఁడును, భేదింపఁజేసినవాఁడును నగు మనుష్యాధముఁడు బ్రహ్మహత్యచేసిన వాఁడయి ప్రాయశ్చిత్తముచేసికొనఁ దగుచున్నాఁడు. శ్రోత్రియుండగు బ్రాహ్మణునిని, ఆత్రేయగోత్రమందుఁ బుట్టినబ్రాహ్మణస్త్రీనిని జంపినచో, అది బ్రహ్మహత్యకు రెండింతలు దోషముగలదని ఋషులు చెప్పుటచే నిరువది నాలుగేండ్లు దానికిఁ బ్రాయశ్చిత్తము చేసికొనవలయును. అట్లు ప్రాయశ్చిత్తము చేసికొననివానిని, మేనియందు గుఱుతుచేసి, దేశమునుండి వెడలఁగొట్టవలయును. బ్రాహ్మణునిఁ జంపినవాఁడును, దొంగతనము గలవాఁడును నయినయొకఁడు బ్రాహ్మణుఁడయినను, క్షత్రియుఁడయినను, వైశ్యుఁడయినను, శూద్రుఁడయినను వానిని రాజు దండింపవలయును. ఇట్టివానిని గాలుసేతులను, పెదవిని, ముక్కును ఛేదించి యిఁక నట్లుచేయకుండునట్లు కావింపవలయును. వీరు బ్రాహ్మణునిఁ జంపినవారేని వీరికన్నులను బెఱికివైవ వలయును. ఈ దండనము శూద్రునకును, వైశ్యునకును, క్షత్రియునకును జెల్లును. ఇట్టి పాపముచేసిన బ్రాహ్మణుఁడు ప్రాయశ్చిత్తము చేసి

కొనకుండెనేని యూరు వెడలఁ గొట్టవలయును. బ్రాహ్మణునిఁ జంపిన క్షత్రియునిని వైశ్యునిని శూద్రునిని రాజాయుధము చేతఁ జంపవలయును. బ్రాహ్మణునిఁ జంపిన బ్రాహ్మణులను రాజు మేనియందు గుఱుతుచేసి, యూరు వెడలఁ దఱుమవలయును. బ్రహ్మహత్యచేసినవారగు తక్కువ మూఁడు జాతులవారిని నింద్రియ వికలులను (అనఁగాఁ గన్నుచెవి మొదలగు వానిని లేనివారిని) జేసి చండాలురతోఁగూడి మనునట్లు చేయవలయును. వారలతోఁ గలసిభుజించువాఁడు నట్టిపాపము గలవాఁడగును. వారు మరణించినను వారి కెవ్వరును బిండము మొదలగువాని నిడరాదు. నల్లని చాయయును వికారరూపమును వ్రేలుచున్న తలవెండ్రుకలును గలిగి బ్రహ్మహత్య కనఁబడక యే వెంబడించి చేసినవానిని బీడించుచున్నవని పెద్దలు తెలియుదురు. బ్రహ్మహత్య చేసినవానితో భుజించుచుండినయెడల నట్లుండు బ్రాహ్మణులును వారువసించు నూరును దేశములును గఱవు చేతను దొంగలచేతను శీఘ్రముగానే పీడింపఁబడును. బ్రాహ్మణులను జంపువాఁడును బాపకర్ముండును నగువానిని క్షత్రియుఁడయినను వైశ్యుఁ డయినను శూద్రుఁ డయినను గన్నులు పెఱికివైవవలయును. సాధువులు బలవంతులయినను, బలహీనులయినను, వారికి రాజు బలమగును. బలవంతులయినను దుర్బలులయినను బాపులకు మృత్యువగును. రాజా! ఒకఁడు బలవంతుఁడుగానీ బలహీనుఁడుగానీ వాఁడు దోషముగలవాఁడై యుండునేని వానిని రాజునకుఁ దెలుపక కొట్టువాఁడు దండనమునకుఁ బాత్రుఁడగును. రాజునాజ్ఞను రాజేర్పరించిన న్యాయాధికారిని మీఱినవాఁడును, సాక్షిని సాధువాక్యమును విడిచి తొలఁగిన

వాఁడును నపరాధులగుదురు. చెఱసాలనుండి వెలి కుఱికినవాఁడును, అపరాధి నొప్పగింపని పూఁటకాఁపును, మంచికులమున బుట్టినను ధనసంపన్నుఁడయినను నపరాధులగుదురు. రాజాజ్ఞచేతఁ బిలువఁబడియు, బలవంతుఁడగు నొకనిని బ్రాపుగా నండగొని యాయుధమెత్తికొని రాజసభకు రాకుండునట్టివాఁ డపరాధియగును. అట్టి గొప్పయపరాధముగల మనుష్యుని వాని దేహమును, ధనమును బోఁగొట్టుకొనఁజేసి పరలోకమునకుఁ బుచ్చవలయును. అట్లు మృతుఁడయిన వానికెవ్వఁడును బిండాదు లిడరాదు. ఆజ్ఞనుమీఱి యిడువానికి * రెండవదోషమునకుఁ దగినదండుగును విధించుట దగును. కులస్త్రీలను బలవంతముగాఁ జెఱుపుటయు, రాజ్యమును జెఱుపుటయు, బ్రాహ్మణులను జంపుటయు, నుచ్ఛిలించుటయు, రాజును ద్వేషించుటయు, యుద్ధములేని కాలమందుఁ జంపుటయు, కలుద్రావుటయు, గురుపత్నిని గూడుటయు, మిత్రద్రోహము చేయుటయు ననెడి యిట్టి మహాపాతకమును జేయువాఁడు మహాసాహసికుఁడు (మహాపరాధి) అగును. వానిని గొంచెమేని యుపేక్షింపక, ధనమంతయుఁ దీసికొని తోడనే వర్జింపవలయును. ఇట్టి దండనము శూద్రుఁడు మొదలయిన మూఁడువర్ణముల వారికనియు, ఇట్టిమహాసాహసముచేసిన బ్రాహ్మణుని మేనియందు గుఱుతుచేసి వెలిఁ దఱుమగొట్టవలయుననియు బ్రహ్మ తొల్లి

---

* యాజ్ఞవల్క్యస్మృతి వ్యవహారకాండము సాహసప్రకరణమందు ప్రథమశ్లోకటీకను - అపరాధములు మూఁడువిధములు. మొదటిదానికి వేయి బంగారములను రెండవదానికి నేనూఱును, మూఁడవదానికి నూఱును దక్కువ దండుగుగా విధింపఁబడియున్నది.

విధించుచున్నాఁడు. బుద్ధిమంతుఁ డగుశుక్రుఁడు, నాలుగువర్ణ మున వారికిని స్త్రీలకును బాలురకును వృద్ధులకును గొల్ల వాండ్రకును వేయిబంగారములు దండుగు విధింపవచ్చునని చెప్పెను. బృహస్పతి దుర్నీతులయిన యిట్టి పాపులకును ఆత తాయుల కందఱకును మరణదండము విధించుచున్నాఁడు. కాఁ బట్టి పాపబుద్ధులును బాపకర్మములే చేయుచుండువారును నగు ధృతరాష్ట్రుని పుత్రుల కందఱకును మరణదండము గావించు టయం దెంతమాత్రమును దోషములేదు. రాజా! ఏకవస్త్రయు రజస్వలయు నగునన్ను, నీదోషమునుబట్టి, నీకన్నులయెదుట, పెక్కండ్రుశూరులు చూచుచుండ, నట్లు సభయందు జుట్టుబట్టి నన్ను ఈడ్చుకొని వచ్చునట్లుచేసిన దురాత్ములగు కర్ణ శకుని దుర్యో ధనాదులను జంపినదాన దోషమేకలుగదు. కోపాగ్నిచేతఁ బసు తోడ ధనసంచయములను గాల్చి ధృతరాష్ట్రునికులము నాశము సేసినందులకు నీకు ధర్మలోపముకలుగదు. నీ నిమిత్తమున నిట్టి దుఃఖమునుబొందినదాన నయితిని. ఆసమయమందు జగత్తునకుఁ గాలహేతువగు దేవదేవుండు సూర్యుఁ డనుగ్రహించి నన్ను వస్త్రహీననుగానీక రక్షించెను. ఆదిత్యుని ప్రసాదముచేత బ్రాణములకు నేనుబాయకున్నాను. నామాట పొల్లుకాదు. నీవ్రా యిట్లు పాటుపడుచున్న యీతమ్ములను బాటింపక, యీ భూమినంతయు దిగవిడిచి, నీయంతట నీవే యాపద కలిగించు కొనుచున్నావు. రాజసత్తమా! మాంధాతయు, అంబరీషుం డునుంబోలె నీ వీ భూతలమున రాజుల యెన్నికకెక్కి వెలుంగు చున్నావు. ధర్మముచొప్పునఁ బ్రజలను గాచుచు పర్వతవన ద్వీపములతోఁ గూడినయీ భూదేవిని లెస్సగాఁ బరిపాలిం

పుము. మనసునం దీపిన్న తనమువలదు. పలువిధములయిన యజ్ఞములను యజింపుము. పగవారిని మార్కొని యోర్వుము. ధనములను వస్త్రములను మఱియుంగల భోగ్యవస్తువులను బ్రాహ్మణులకు నొసంగుము' అనెను. ఇది పదునాలుగవయధ్యాయము.



## రాజధర్మపర్వము.

### అర్జునుఁడు ధర్మరాజునకు జెప్పినది.

అర్జునుఁడు ద్రౌపది చెప్పినదివిని రాజయిన తనయన్న ననుసరించి యతనితో 'ప్రజలనందఱను శిక్షించునది దండమే; రక్షించునదియు దండమే. లోకులు నిదురించుచుండినను దండము మేలుకొనియుండును. దండమును ధర్మముగాఁ బండితులు తెలియుదురు. ధర్మమును అర్థమును గామమును దండమే రక్షించుచున్నది. కాన త్రివర్గమును దండమని చెప్పఁబడుచున్నది. ధనమును ధాన్యమును దండముచేత రక్షింపఁబడుచున్నవి. దీనిని చక్కఁగా నెఱుంగుచు లోకము స్వభావమును జూడుము. కొందఱు మనుష్యులు రాజు దండించునని భయపడి పాపము చేయకుందురు. కొందఱు యమదండమువలని భయముచేతను, కొందఱు పరలోక భయమువలనను, బాపము చేయకుందురు. ఇట్లు లోకము దండార్హమయిన స్వభావము కలిగియుండుటను జూడఁగానన్నియు దండమందు నెలకొన్నవగును. కొందఱు దండమునకు భయపడియే యొకరినొకరు పట్టి కబళింపకున్నారు. దండము రక్షింపకపోయెనా యీలోకము జీకటిలో మునిఁగి

పోవును. అడఁగని వారిని (తాడనాదులచే) నడంచుట వలనను, అపరాధులను (విత్తాహరణాదులచే) దండించుటవలనను నిట్లు దమనమువలనను దండనమువలనను బండితులు దండమని చెప్పుదురు. బ్రాహ్మణులకు మాట దండము. *క్షత్రియులకుఁ గూలి యిచ్చుట దండము. వైశ్యులకు ధనము దండము. శూద్రునకు (నూడిగము తప్పవేఱు) దండము లేదని చెప్పుదురు. రాజా మనుష్యులకు నవివేచనము గలుగకుండుటకును, ధనములను రక్షించుటకును, లోకమందు దండమనెడి మర్యాద యేర్పఱుపఁ బడినది. ఏదేశమందు రాజు చక్కఁగాఁ బాటించునేని † నల్లని కాయమును, నెఱ్ఱని కన్నులును గలదండపురుషుఁడు మిక్కిలి యుద్యతుఁడై సంచరించునో యందుఁగల ప్రజలు మోహము నొందరు. బ్రహ్మచారి, గృహస్థుఁడు, వానప్రస్థుఁడు, సన్న్యాసి యనెడి యీమనుష్యులు దండమునకు భయపడియే తమ తమ మార్గములందు నెలకొని యున్నారు. భయములేనివాఁడు యాగము చేయఁడు; దానము సేయఁగోరఁడు; భయము లేని వాఁడె వఁడు దననియమమందు నిలువఁగలఁడు ?. ఎదిరిమర్మములను ఛేదింపకయు, దుష్కరమయిన కార్యము చేయకయు, చేపలఁ బట్టువానివలెఁ జంపకయు, గొప్ప సంపత్తిని బడయరాదు. చంపుటకుఁ దెగనివానికి నీలోకమందుఁ గీర్తియు, ధన

* క్షత్రియులకు స్వాతంత్ర్యములేక యొకరిప్రోపుచే బ్రదుకుటయే హీనత్వముగాన దండమగును.

† బిట్టుగాఁగొట్టినచో దండమువలన అంధత్వము గలుగునుగాన నల్లనిదనియు దండించువాని కన్నులు కోపాతిశయమున నెఱ్ఱగానుండును గాన యెఱ్ఱని కన్నులుగలదనియుఁ జెప్పఁబడినది.

మును, బ్రజలును గలుగవు. ఇంద్రుఁడు వృత్రుఁ డనునసురను జంపియే మహేంద్రుఁ డనుపేరిని నందులకుఁ దగినగృహామును బడసి, లోకములకు నీశ్వరుండునయ్యెను. కొట్టునట్టి దేవత లెవరో వారినే లోకము మిక్కిలియుఁ బూజించుచున్నది. రుద్రుఁడు, కుమారస్వామి, ఇంద్రుఁడు, అగ్ని, వరుణుఁడు, యముఁడు, కాలుఁడు, వాయువు, మృత్యువు, కుబేరుఁడు, సూర్యుఁడు, వసువులు, మరుత్తులు, సాధ్యులు, విశ్వేదేవతలును గొట్టునట్టి స్వభావముగలవారు. కాఁబట్టి వారల ప్రతాపమునకు లోఁగి జనులు వారలను బూజించుచున్నారు. బ్రహ్మను, ధాతను, పూషను, నొక్కరును బూజించుట లేదు. దాంతులును, శాంతిపరాయణులును, సర్వభూతములయందును (రాగముగాని ద్వేషముగాని లేక) మధ్యస్థులై యుండువారు నగు దేవతలను మనుష్యలోకకొందఱుమాత్రమే పూజించెదరు. లోకమునందు హింస సేయక జీవించువాని నెవనిని గానను. బలముగల ప్రాణులు బలము లేని ప్రాణులవలన జీవించుచున్నవి. ముంగిస యెలుకలను దినుచున్నది. ముంగిసను పిల్లి దినుచున్నది. పిల్లిని కుక్క దినుచున్నది. కుక్కను జిఱుతపులి తినుచున్నది.అట్టి పులులనెల్ల మనుష్యుఁడు చంపుచున్నాఁడు. ధర్మమెట్లు పోవుచున్నదో చూడుము. స్థావర జంగమములన్నియుఁ బ్రాణమున కన్నమని దైవము విధించియున్నది. తెలిసినవాఁ డీవిషయమై సందేహము నొందఁడు. రాజసత్తమా! ఎట్లు శౌర్యము, తేజము, ధైర్యము, సామర్థ్యము మొదలయిన క్షత్రియజాత్యుచిత గుణములతోడ బ్రహ్మచేత సృజింపఁబడియున్నావో, యావిధమునఁనే కాఁదగుదువు. మూఢులయినక్షత్రియులు కోపమును సంతోషమును విడిచి యడవికి

బోయి తపముచేయువారై యుండియు (కందమూలాదుల) వధ ములేక ప్రాణమును గడుపుచున్నారుగారు. జలమునందును, భూమియందును, పండ్లయందును, పెక్కులు ప్రాణులున్నవి. లోకమునందు వానిని జంపకుండువాఁ డెవఁడు ? ప్రాణిహింసలేని జీవనము మఱేదియున్నది ? మిక్కిలి సూక్ష్మము లయినరూపులుగలవియు, అనుమానముచేతఁ దెలియఁదగినవియును, కన్నుఱెప్పలల్లార్చినంత నునుఱు దొఱంగునవియు నగుప్రాణులు గొన్ని కలవు. కోపమును నసూయను దిగవిడిచి గ్రామమునుండి బయలువెడలియుఁ గొందఱుమునులు తెలివిమాలి వనమునందును గుటుంబధర్మము గలవారయి చూపట్టుచున్నారు. భూమిని భేదించి ఓషధులు వృక్షములు మొదలయినవానిని, బక్షులను బశువులను, ఛేదించి మనుష్యులు యాగముచేయుచున్నారు.వారును స్వర్గమును బొందుచున్నారు. దండనీతి లెస్సగాఁ జెల్లింపఁబడునేని సమస్తప్రాణులకును సకలమయిన ప్రయత్నములును సిద్ధించుచున్నవి. అందు నాకు సందేహములేదు. లోకమున దండములేనిచో నీప్రజలు నాశమునొందును. నీటియందలిచేఁపలవలె బలవంతులయినవారు దుర్బలులను గబళించివైతురు. 'చక్కఁగాఁ జెల్లింపఁబడినదండము ప్రజలను రక్షించుచున్న'దని తొల్లి బ్రహ్మచెప్పినమాట నిజమే. అగ్నులు చెడు కంపు గలయీ మాంసమునకు జంకియు (ఘూత్కారముచేత) నదల్పఁగా వెలుఁగుటయు దండమువలని భయముననే. మంచిసెబ్బరలను వేఱువేఱ నేర్పఱచి చూపెడియీ దండము లోకమునందు లేకపోయెనా యీ జగ మొక్కటే యంధకారమగును. ఏదియుఁ దెలియదు. మర్యాదల నదల్చి

వేదములనిందించుచు నాస్తికులయి యుండువారును, దండము చేత మిక్కిలి పీడితులయిరేని తోడనే మర్యాదనుగావ సర్హులగుచున్నారు. లోకమంతయు దండముచేత జయింపఁబడినది. పరిశుద్ధుఁడగువాఁడు దుర్లభుఁడుచుమీ. దండమునందు భయముండుటవలననేచుమీ లోకము మరియాదతోడ ననుభవించుటకు నర్హమగుచున్నది. నాలుగువర్ణములవారి సంతోషమునకును, చక్కని నీతిగావించుటకును, ధర్మార్థములను రక్షించుటకును బ్రహ్మ యీదండమును విధించియున్నాఁడు. దండభయము లేనిచో, పక్షులును దుష్టమృగములును, పశువులను మనుష్యులను యజ్ఞమున కగుహవిస్సులను దినివైచును. బ్రహ్మచారి యధ్యయనముచేయఁడు. ఆవుసమయమునఁ బిదుకదు. కన్య పెండ్లియాడదు. ఈదండము పాలింపకుండునేని సకలమయిన మర్యాదలును లోపించును. సకలమయిన గరుసులును నుడివ్రాపును. మమత్వమును జనులు కొలదిపాటిగాఁ దలంపరు. అనఁగా నన్నియుఁ దమదేయని జంకక సులువుగా నెంతురు. విధ్యుక్తముల యినదక్షిణలు గలిగి పెక్కు సంవత్సరములు చేయఁదగు సత్రమను యాగములను నిర్భయముగా ననుష్ఠింపఁజాలరు. ఆశ్రమమునొందినవారు తమతమ యాశ్రమములకు విహితమయిన ధర్మమును చెప్పఁబడినట్లు చేయరు. ఒకఁడును విద్యను గఱవఁడు. దండములేనిచో బండియందుఁ గట్టినలొట్టియలు, ఎద్దులు, గుఱ్ఱములు, గాడిదలు, కంచరగాడిదలును వాహములను లాగవు. పనివాండ్రు నొడయనిమాట వినరు. తండ్రిబోధించు ధర్మమందు పిన్నవాఁడెన్నఁడును నిలువఁడు. ప్రజలందఱును దండమున నెలకొనియున్నారు. పండితులు దండమున

భయమున్నదని చెప్పుచున్నారు. మనుష్యులకు నిహామును బరమును దండమందు నెలకొనియున్నవి. చక్కఁగా జరుపఁబడునదై విరోధులను నాశముసేయునట్టి దండ మేదేశమునందు వర్తించుచున్నదో యచటఁగపటమును, పాపమును, వంచనయుఁ గానంబడవు. దండ ముద్యతమై యుండదేని కుక్క హావిస్సును జూచి నాకును; కాకి పురోడాశమును గొంపోవును. ఈరాజ్యము ధర్మముగనో యధర్మముగనో రాజునకు విధింపఁబడియుండుటచే దీనినిగూర్చిశోకింపరాదు. భుజింపఁదగువానిని భుజింపుము. యాగములు యజింపుము. శ్రీమంతులగువారు నిర్మలము లయినవస్త్రములు గట్టుచు గాదిలి యిల్లాండ్రతోఁ గూడిమాడి మేలయిన యన్నములనుదినుచును సుఖముగా ధర్మమాచరించుచున్నారు. సకలప్రయత్నములను ధనమునకు లోనయియున్నవి. ఇందులకు సందియము లేదు. ఆధనమో దండమునకు లోపడియున్నది. దండంపు గౌరవమును జూడు. (పసులను జంపుటకుఁ గొట్టమును దూఱినపులిని) చంపకుండుట (యాపసులకయిన) తగని పెను హింసగా పర్యవసించును. కాఁబట్టి ధర్మమును గయికొనుటయే మంచిది. ఇట్టి ధర్మప్రవచనము లోకయాత్ర జరుగుటకే యిందుఁ గావింపఁబడినది. తుదముట్ట గుణమేగలది గాని, తుదముట్ట గుణము లేనిదిగాని యగువస్తువొకటియు లేదు. మంచిదియుఁ జెడ్డదియు నీరెండును నన్నికార్యములందును గనఁబడుచున్నవి. పెక్కండ్రుజను లెద్దులవృషణముల నలిపి పిదప వానిముక్కులను దూటువొడిచి పెక్కులు బరువులు దానిపయి మోయించి గట్టుచును గొట్టుచు నుండెదరు. మహారాజా ! ఇట్లు లోక మాయానెఱితెఱంగులచేతఁ దోడనే యాకులమై భయముగొని

యున్నది. అవిలేనిచో (బరువుమోయుట మొదలయిన కార్యములులేక పసదూలును) కాన పురాతనమైనధర్మమునే యాచరింపుము. (క్రొత్తగానొకటి తలపెట్టవలదు). యాగముచేయుము. దానములుచేయుము. ప్రజలను రక్షింపుము. ధర్మమును జక్కఁ బరిపాలింపుము. శత్రులను జంపుము. మిత్రులను బెంపుము. రాజా! పగవారిని జంపినందులకు శోకింపకుము. పగవారిని జంపురాజున కించుకయును బాపములేదు. ఆయుధమెత్తికొని కొట్టవచ్చు వానిని ఆయుధముగొని యెవఁడుగొట్టునో వాఁడు భ్రూణహత్యచేసినవాఁడుగాఁడు. *కోపము కోపమును జేరుచున్నది. సమస్తప్రాణులయం దుండునాత్మ వధింప నలవిగానిది. సందేహములేదు. వధింప నలవికానియాత్మను వధించుట కెవనికిఁగాని యెట్లుశక్యము? ఒకఁడు ప్రాఁతగృహమును విడిచి క్రొత్తగాఁ గట్టినయింటఁ బ్రవేశించినట్లు, ఆత్మ ప్రాతదేహములను దిగవిడిచి క్రొత్తవియగు నానాశరీరములను బొందుచున్నవి. ఇదియే మృత్యువని తత్త్వమునుగాంచిన జనులు చెప్పుదురు' అనెను. ఇది పదియేనవయధ్యాయము.

---

## రాజధర్మపర్వము.

### భీముఁడు ధర్మరాజునకుఁ జెప్పినది.

భీముఁడు అర్జునుఁడు చెప్పినది విని, యెంతమాత్రము ధర్మరాజు పూనికకు సయింపనేరక ధైర్యమునుగొని యతనితో

---

* 'మన్యుస్తం మన్యుమార్చ్ఛతి' అని మూలము. కోపము కోపమును జేరుచున్నదని యర్థము. ఇందులకు 'మన్యుఃకర్తానాహంకర్తా' అని శ్రుతి. దీనివలన కర్తకోపమే కాన భ్రూణహత్యాదిదోషము లేదనుట.

'రాజా! నీవు ధర్మముల నెఱింగినవాఁడవు. నీకుఁ దెలియనిది పుడమియం దొకటియు లేదు. నీనడవడి నెప్పుడును మేము నేర్చుకొనుచున్నారముగాని యట్లు నడువ మాకెంతయు శక్యముగాకున్నది. 'చెప్పను చెప్పను' అను తలంపుమాత్రము నామనస్సున నుండెను. అయినను దుఃఖము మితిమీఱుటచే నాఁగఁజాలక చెప్పెదను. చెవియొగ్గి తెలియుము. నీకుఁగల మిక్కుటమయిన తెలివిలేమిచేత నన్నిటిని సందేహింపవలసివచ్చినది. మాకుఁ దెంపులేమియు, నట్లె దుర్బలత్వమును, గలిగినవి. లోకమునకు రాజును సర్వశాస్త్రములందుఁ బండితుఁడునగుదువు. ఇట్టి నీకుఁ గేవలుఁ డయినవానివలె లోకమునకుం గలయగతియు (ఆపదను) గతియు(సంపదను) దెలిసియున్నవి. జరుగుచున్న కాలమందు నిఁక జరుగఁ గలకాలమందును నొకటియు నీకుఁ దెలియనిది లేదు. మహారాజా! జనాధిపా! ఇట్లుండఁగా రాజ్యముచేయవలయు నన్నవిషయమందు కొంతకారణమును మాత్రము చెప్పెదను; ఒక్కటే మనస్సుతో వినుము. లోకమందు శారీరము మానసము నని రెండువిధముల వ్యాధు లున్నవి. వానిలో నొకటినుండి మఱొకటి పుట్టుచున్నది. ఒకటినివిడిచి మఱొకటి కలుగుట కానరాదు. శారీరవ్యాధివలన మనోవ్యాధియు మనోవ్యాధివలన శారీరవ్యాధియుఁ గలుగుట నిశ్చయము. శారీరము మానసము ననెడియీవ్యాధులను గుఱించి ముందుగడచిపోయినవానికి నెవఁడుశోకించునో వాఁ డాశోకమువలన దుఃఖమును నారెండువిధముల వ్యాధులను మరలఁ బడయుచున్నాఁడు. శీతము (కఫము) ఉష్ణము (పిత్తము) వాయువు (వాతము) ననెడి యీ మూఁడుగుణములును శరీరమునందుఁ గలిగినవి.

ఈమూఁడుగుణములును సమముగా నుండుటయే స్వస్థత (నొప్పి లేమి) లక్షణము. వానియందొకటి యధికమయ్యెనేని చికిత్స విధింపఁబడుచున్నది. అనఁగా ఉష్ణముచేత శీతమును శీతముచేత నుష్ణమును నీరెంటిచేత వాయువును గ్రమముగా బాధింపఁబడి తొలఁగిపోవునని చెప్పఁబడుచున్నది. సత్త్వము, రజస్సు, తమస్సు అని యీమూడు మానసము లయినగుణములు. ఈ మూఁడుగుణములును సమముగానుండుట స్వస్థత (మనోవ్యాధిలేమి) లక్షణమని చెప్పఁబడుచున్నది. మూఁడుగుణములందొకటి యధికమగునేని దాని పరిహారమునకు విధి చెప్పఁబడి యున్నది. సంతోషముచేత దుఃఖమును దుఃఖముచేత సంతోషమును నీరెంటివలన మోహమును గ్రమముగా నివర్తించునని విధిచెప్పఁబడుచున్నది. సుఖమునందుండు కొందఱు మనుష్యులు, తెలివిలేమివలన, నాసుఖమును బుచ్చుటకు దుఃఖమును దలంచుకొనఁగోరుచున్నారు. దుఃఖమునందుండు కొందఱు మనుష్యులు దానినిబుచ్చుటకు సుఖమును దలంపఁగోరుచున్నారు. నీవు దుఃఖముగలవాఁడుగను లేదు. దుఃఖములేనివాఁడుగను లేదు; సుఖముగలవాఁడుగను లేదు;. సుఖములేనివాఁడుగను లేదు; దుఃఖమును దలంపఁదగినవాఁడుగను లేదు; సుఖమును దలంపఁ దగినవాఁడుగను లేదు. ఏమి చేయవచ్చును. దైవము బలీయముగానున్నది. లేక యీతీరున సంతోషపడుట నీదుస్వభావమో ! పాండవుల కనులయెదుట రజస్వలయు నేకవస్త్రయునగు ద్రౌపదిని సభలో నీడ్చుటనుజూచియు దానిని దలంచుకొనకున్నావే ! పట్టణమునుండి వెడల నడిచినదియు, తోళ్లు గట్టికొనుటయు, పెద్ద వనమునందు వసించుటయు నీవు

దలంపవేమి ? జటాసురునికడఁ బడినపాట్లును, చిత్రసేనుని తోడఁ జరిగినయుద్ధమును, సైంధవునివలనఁ గలిగినకష్టమును నెట్లు మఱచిపోయితివి ? మరల నజ్ఞాతవాసమందు రాజ కుమారి యగుద్రౌపదిని గీచకుఁడు కాలం దాచినకష్టము నెట్లుమఱచితివి ? పగవారినడంచు దిట్టవుగదే! ద్రోణభీష్ముల తోడ మునుపు నీకుఁ గలిగినయుద్ధమువలెనే నిపుడు మన స్సనెడు శత్రువుతోడ యుద్ధముసేయవలసి వచ్చియున్నది. ఈ యుద్ధమందు బాణములతోఁ బనిలేదు. మిత్రులును బంధులు నక్కఱలేదు. నీవు నీ యొక్కనితోడనే పోరాడ వలయును. అట్టి యుద్ధము తటస్థించియున్నది. ఈ యుద్ధమందు మనస్సును జయింపక ప్రాణమును విడుతువేని వే ఱొకదేహ మెత్తినపిదపఁగూడ నీ యుద్ధము చేయవలసివచ్చును. ప్రభువు గానివాఁడు (ధనాఢ్యుఁడు గానివాఁడు) పతితుఁడు. వాఁ డొంగి లికి సాటి; వాఁ డల్పుఁడు. బలముగలవానికి సైతము మిక్కిలి యపథ్యముచేసినయెడల వానిబలము వానిని గొంచెమైనను గాపాడదు. కాఁబట్టి భరతసత్తమా! వ్యక్తముగాఁ దెలియు చున్న యీ స్థూలశరీరమును విడిచి యవ్యక్తరూపముగా నున్నట్టి మనస్సునకు నవ్వలనుండు దానిని (ముక్తిని) బొందు కొఱకు, (యమాది యోగానుష్ఠానరూపము లయిన) స్వక ర్మములచేత నిపుడే మనస్సుతోడ యుద్ధము సేయుము. యుద్ధ మం దా మనస్సును జయింపకపోయితివా యేమిగతి నొందు దువు? మహారాజా ! మనస్సును జయించినచోఁ గృతార్థుఁడగు దువు. ఇట్టి తలంపును గట్టిగాఁ గయికొని ప్రాణులగతిని నీగతిని దెలిసి తాతముత్తాతల నడవడియందు నిలిచి పాడిచొప్పున

రాజ్యమును బాలింపుము. పాపాత్ముఁడు దుర్యోధనుఁడు తన యనుచరవర్గముతోఁగూడ దైవబలముచేతను ద్రౌపది వెన్నెటి వేణి యదృష్టముచేతను యుద్ధమున నిహతుఁ డయ్యెను. పార్థా! విధ్యుక్తముగా దక్షిణలతో నశ్వమేధమను యాగము ను జేయుము. మేము నీకుఁ గింకరులము. వీర్యశాలి యగువాసు దేవుఁడును నీకు వలయునదిచేయును' అనెను. ఇది పదియా ఱవయధ్యాయము.

---

## రాజధర్మపర్వము.

### {ధర్మరాజు వైరాగ్యమే గొప్పదియని భీమునకుఁ జెప్పుట.}

ధర్మరాజు భీమునితో "సంతోషములేమి, పరాకు, మదము, రాగము, శాంతిలేమి, బలము, మోహము, అభిమానము, పద టము, ననెడి యిట్టిపాపము లావేశింపఁగా నీవు రాజ్యమునకుఁ బేరాస పడుచున్నావు. వీనినుండి చక్కఁగా విడివడి భోగ్యవస్తు వులను మాని మిక్కిలి శాంతిగయికొని యెంతయు సుఖం బుండుము. ఈ భూమండలమునంతయుఁ దా నొక్కఁడే రా జయి యేలునట్టివానికిని గడు పొక్కటియే కదా. రాజ్యమును నీ వేమని యిట్లు కొనియాడెదవు? భరతసింహమా! ఒక్కదివ మునఁగాని బెక్కుమాసముల చేతఁగాని పూరింపఁ దరముగాని యీపేరాసను నాయువంతటిచేతను బూరింప శక్యముగాదు. అగ్ని (కట్టెయలచేత) దరికొలుపఁగా మిక్కిలి మంటలుగలద గును; దరికొలుపనిచో దానే యడఁగిపోవును. అట్లె రేఁగినయుద రాగ్నిని నాహారమును మట్టుపఱచి నీ వడఁగింపుము. తెలివిలేని

వాఁడు తనపొట్ట ప్రోచుకొనుకొఱకుఁ బెక్కు హింసలు చేయును. ఉదరమును గెలువుము. దానివలన మేలొంది నీభూమి యంతయు నీవు జయించిన వాఁడవగుదువు. మనుష్యులకుఁ గల పెక్కు కామభోగములను నైశ్వర్యమును నీవు గొనియాడుచున్నావు. భోగమును దిగవిడిచినవారును దపముచేఁ గృశించినవారునగు పెక్కండ్రు మిక్కిలి యుత్తమ మయినపదవిని బొందుచున్నారు. *యోగక్షేమములును, ధర్మాధర్మములును నీయందు నిలిచియున్నవి. ఇట్టి పెనుభారమునుండి విడివడి త్యాగము (సన్న్యాసము)నే యాశ్రయింపుము. పులి తనకడుపునకుఁ గాను పెక్కుహింసలు చేయుచున్నది. ఆమృగమునుబోలి మతిమాలిన మనుష్యులు కొందఱును నామార్గమునే యనుగమించెదరు. రాజులయియుండియు సంతోషము నొందకుండువారు పెక్కురు. కలిగిన విషయసుఖములను ద్రోసిపుచ్చి సన్న్యాసమందు మనస్సుపెట్టి సంతోషించు వాఁడొక్కఁడే. బుద్ధుల వేఱుపాటెట్లున్నదో చూడుడు. ఆకు లాహారముగాఁ గలవారును, దొరికినదానిని ఱాతిచే దంచి తినువారును, పల్లె ఱోలుగాఁగలవారును,జలభక్షులును, వాయుభక్షులును నగు సన్న్యాసులచే నరకమిది జయింపఁబడినది. ఈ భూమండలమునంతయు నిండారఁ బరిపాలించునట్టి రాజును, రాతిని బంగారమును సమముగాఁగొను సన్న్యాసియు ననెడి యిరువురలో నాసన్న్యాసియే కృతార్థుఁడుకాని రాజుగాఁడు. ఏకార్యములయందును బూనిక లేకయు నాశలన్నియు వీడియు మమకారము మానియు నుండుము. ఇహ

---

* యోగమనఁగా నింతకు లభింపనిధనమును లభించుట ; క్షేమమనఁగా లభించినదానిని రక్షించుటయని తెలియునది.

మందును బరమందును నాశములేనిదియు శోకరహితమయినది యునగు పదమును బొందుము. భోగమున కాసపడువాఁడు శోకమునొందును. భోగాసక్తి దిగవిడిచినవా రెంతమాత్రము శోకమొందరు. కాఁబట్టి యీభోగమునంతయు దిగవిడిచి రాజ్యసుఁడును ద్యాగియేయనెడు కల్లవాదమునుండి విడివడుము. పితృయానము దేవయానమనెడు రెండు మార్గములును బ్రసిద్ధములు. వీనియందు యాగాదికర్మములను యజించువారు పితృయానముచేతను, ఆశలను దిగవిడిచిన సన్న్యాసులు దేవయానముచేతను బోవుదురు. మహర్షులు తపస్సుచేతను బ్రహ్మచర్యముచేతను వేదాధ్యయనముచేతను దేహయాత్రగడపి దేహములను విడిచి మృత్యువునకు గోచరముకాని పదమునకుఁ బోయెదరు. ఈ లోకమందు, బంధనమును (ఆశయును), అల్లి కర్మమును, ఆమిషములని (భోగయుక్తములగు పాపములని) చెప్పఁబడుచున్నవి. ఈ రెండుపాపములనుండియు విడివడినవాఁ డాపరమపదమును బొందుచున్నాఁడు. ద్వంద్వములు లేనివాఁడును సంగములనుండి విముక్తుఁడును, మోక్షదర్శియు నగు జనకుఁడు మున్నొకప్పుడు చెప్పినది. 'నా విత్త మనంతము; అట్టి నాకు నొక్కటియు లేదు; మిథిల దహింపఁబడినపుడు నాకు నొక్కటియుదహింపఁబడినదికాదు' అనియె. ప్రజ్ఞయను నుప్పరిగపయి నెక్కినవాఁడు శోకించుచున్న జనులనుజూచి తాను శోకింపఁడు; మందబుద్ధి యగువాఁడు భూమిపయినున్నను గొండపయినున్నను నిజముకనుఁగొనఁజాలఁడు. తెలిసికొనవలసినవియగు కర్తవ్యాకర్తవ్యములను దెలిసికొనువాఁడే కన్నుగలవాఁడును బుద్ధిగలవాఁడునగును. తెలియనివానిని తెలుపుటవలనను, సందేహములను

(చక్కఁగా తీర్చి చెప్పుటవలనను) బుద్ధియని చెప్పఁబడుచున్నది. బ్రహ్మనిష్ఠాపరులును జ్ఞానసంపన్నులును ఆత్మయాథాత్మ్యప్రాప్తులును నగు పెద్దలఁ గలకొలఁది నెవఁడు తెలియుచున్నాఁడో వాఁడు మిక్కిలి పేరిమినొందును. ఎప్పుడు నానావిధముల వేఱువేఱువస్తువు లయియున్న యీయాకాశాది భూతములన్నియు (ప్రళయమందు) నొక్క బ్రహ్మమను వస్తువయియుండు ననియు నట్లె యాయొక్కటినుండి (నానాభూతరూపముల) ప్రపంచరూపమున విస్తారము నొందుననియుఁ దెలిసి యనుభవించునో యపుడు బ్రహ్మమును బొందుచున్నాఁడు. అట్టి బుద్ధి గలజను లాగతిని బొందుదురు; కాని తపస్సులేనివారును, బుద్ధిహీనులును, తెలివిలేనివారును, నల్పసత్త్వులును దానిని బడయనేరరు. అన్నియు బుద్ధియందు నెలకొని యున్నవి' అనెను. ఇది పదునేడవయధ్యాయము.



## రాజధర్మపర్వము.

అర్జునుఁడు ధర్మరాజునకు జనకునకును నతని భార్యకును జరిగినసంవాదమును జెప్పి కర్తవ్యము నుపదేశించుట.

ధర్మరా జిట్లు చెప్పి మిన్నకుండఁగా నర్జునుఁ డతనివాక్యములు శల్యములవలెఁ దన్నుఁబీడింపఁగా శోకమునను దుఃఖమునను దపించుచు నతనితో "రాజా! విదేహరా జగుజనకునకు నతని భార్యతోడఁ గలిగిన సంవాద మనెడియీ యితిహాసమును జనులు చెప్పుదురు. జనకుఁడు రాజ్యమును దిగవిడిచి బిచ్చమెత్తు

టకు మనస్సున నిశ్చయించియుండఁగాఁ జూచి యతనిభార్య దుఃఖితయయ్యెను. 'ధనములను బలువిధము లయినరత్నము లను బిడ్డలను జెలికాండ్రను విడిచి యిట్లు పవిత్రమయిన మార్గమును వదలి జనకుఁడు మూఢత్వము నొందెను. ఆశ యును మచ్చరమునుమాని యకించనుఁడై (ఏమియు లేని వాఁడై) భైక్షవృత్తిని గయికొని యొకపిడికెఁడు యవలనో లేక బియ్యమునో యెప్పుడు వచ్చునాయని యాజనకుఁ డెదురుచూ చుచుండుటను నతని ప్రియభార్యగాంచెను. ఆయమ మన స్విని గావున దేనివలనను భయమువిడిచియున్న తనభర్తను దగ్గఱి కుపితయై యేకాంతముగ సహేతుకము లయినమాట లతో 'ధనధాన్యసమన్వితుండ వగునీవు సొంతమగురాజ్యమును దిగనాడి పునుకబిచ్చమును గయికొని యొకపిడికెఁడు ధాన్య మెప్పుడు దొరకునాయని యెదురుచూచెదవేల? రాజా! నీ పట్టువేఱు; నీచేష్టవేఱు; గొప్పరాజ్యమును ద్రోసిపుచ్చి స్వల్ప మునకుఁ బేరాసపడెదవు. రాజా! ఈపిడికెఁడుబియ్యమును గొని యతిథుల నారాధింపవచ్చునా? లేక దేవతలను ఋషు లను బితరులను నారాధింపఁగూడునా? నీవుపడెడియాశ్రమము వ్యర్థమేచుమీ! రాజా! కర్మమునువిడిచితివి గాన దేవతలు నతిథులును బితరులును మొదలయిన వారందఱుచేత దిగవిడు వంబడి పోవుచున్నావు. మూఁడువేదములు దెలిసినవారును పెద్ద లు నయిన పెక్కువేలబ్రాహ్మణులను రక్షించువాఁడవై యుండి యిట్లు నీవిపుడు పరులవలననుండి పొట్టపోసికొనుటకు ధన మును గోరెదవా! వెలుఁగుచున్నలక్ష్మిని దిగవిడిచి కుక్కవలె నిపుడు కనఁబడుచున్నావు. ఇపుడు మీతల్లి బిడ్డలేనిదగుచున్నది.

కౌసల్యయు నీవలనఁ బతిలేనిదగుచున్నది. ధర్మమునుదక్కఁగల ప్రయోజనములను గోరెడి పెక్కురాజులు దీనులయి నీప్రియ మునుగోరుచు నిన్నేయాశ్రయించి యుపాసించుచున్నారే! వారినిసైతము పసమాలినవారినిగాఁ జేసి నీవేలోకమును బడయఁబోయెదవు? రాజా! పరాధీను లయినమనుష్యులకు మోక్షము సందేహపడఁదగినది. కాబట్టి యిటువంటి పాపము సేయునట్టి మీకు నూర్ధ్వలోకమును గలుగదు; అధోలోకమును గలుగదు. ధర్మముదప్పని యిల్లాండ్రను దిగవిడిచి జీవింపఁగోరు నీకు మంచిలోక మెక్కడిది ? విలువగల వస్త్రములను ఆభరణములను, మాలెలను, వాసనద్రవ్యములను విడిచిపుచ్చి పనిమాలి యెందులకయి పోయెదవు? నీటితోట్టివలెను పండ్లునిండిన పెద్దమ్రానివలెను బ్రాణు లన్నిటికిని గొప్ప పవిత్రపోషకుఁడవుగానుండిన నీవు పరులను యాచింప బయలువెడలెదవే! పనిని విడిచి సన్న్యాసిగా నుండినచో నేనుఁగునుగూడ మాంసాహారములగు పెక్కుమృగములును పెక్కుపురువులును దినివైచును. ఒక్క ప్రయోజనమును లేని నిన్నుఁదినుట నడుగవలెనా? ఒకఁడు నీదయిన యీకుండికను బగిల్చినను, మూఁడుగాచేర్చిన యీదండమును నీదుకాషాయమును లాగికొన్నను, నీమనస్సు వానిమీఁదనెట్లుండును? అన్నియుదిగవిడిచిన నీకు నీపిడికెఁడు బియ్యమందేమి యాసకావలసియున్నది. ఈ బియ్యమునకుఁ జేయుపనియు రాజ్యమంతటికిని జేయుపనియు నొక్కటియో? అట్లుండఁగా దీనిని నెందులకుఁగా నిశ్చయించితివి. శరీరమును గాపాడఁగోరి యీపిడికెఁడి బియ్యమునకుఁ బాటుపడితివేని, నీతలఁపు వ్యర్థమా ? ఇంతకు రాజ్యమువహించుట మంచిది. నీకు నే

నెవ్వరు? నాకు నీవెవ్వరు? నాయందు నీకేమి జాలి? దిగవిడువ వలసిన వివి. లేనిచో నీమనస్సు కోర్కెకిఁదగినట్టు లుప్పరిగయు శయనమును వాహనములును వస్త్రములు నాభరణములును గల రాజ్యము బాలింపుము. ధనమం దాశవిడిచినవారును ధనహీను లును మిత్రులను విడిచినవారును నేమియు లేనివారును నగు సన్న్యాసులుగానుండియు సుఖమునుగోరి కుండిక దండము మొ దలగువానిని సేకరించి యుంచుకొనియుండువారిని జూచి యాశ పడువాఁడు రాజ్యమును ద్యజించునా యేమి? ఎప్పుడును బుచ్చు కొనుచుండువానికిని, ఎప్పుడును నిచ్చుచుండువానికిని గలభేద మును దెలిసికొనుము. వీరిలో నెవఁడుమే లనఁబడును? ఎప్పు డును యాచించువారును నెప్పుడును దాంభికు లయియుండువా రును నగు జనులవిషయమై యొసంగిన దక్షిణ, కారుచిచ్చులో వేల్చిన యాహుతివలె నగును. రాజా! అగ్ని, కట్టెయలను దహింపనడఁగని యట్లు, ఎప్పుడును యాచించువృత్తిగల బ్రాహ్మ ణుఁడు శాంతిగలవాఁడు కానేరఁడు. సజ్జనులకు (సన్న్యాసులకు) నన్నము పెట్టు మనుజుని జీవనమే యిహమందు నిలుకడగలది. అన్నమునోసంగురాజు లేనియెడల మోక్షమునుగోరు సన్న్యాసు లెక్కడనుండఁగలరు? ఈలోకమందు గృహస్థు లన్నము నాశ్ర యించియే జీవింపవలయును. ఆయన్నమును గొనియే సన్న్యా సులును జీవింపవలయును. అన్నమువలనఁ బ్రాణము నెలకొనఁ జాలుచున్నది. అన్నము నిచ్చువాఁడు ప్రాణము నిచ్చువాఁ డగును. గృహస్థులనుండి విడివడి, సన్న్యాసిగా నుండువారును, ఆగృహస్థులనే యాశ్రయించి సత్తువయుఁ బ్రతిష్ఠయు దాంతి యుఁ బడసికొనుచునున్నారు. యాచనవలనను, త్యాగమువల

నను, మూఢ్యము (మోహము) వలనను సన్న్యాసికానేరఁడు. ఎవఁడు చక్కఁ ద్రవ్యములను దిగవిడుచునో వాఁడు ముక్తుఁడనియు సన్న్యాసియనియు నెఱుంగుము. సంగముగలవానివలె నాచరించెడి యసక్తుఁడును బంధముక్తుఁడును శత్రువునందును మిత్రునందును సమబుద్ధి గలవాఁడు నగుపురుషుఁడే ముక్తుఁడగును. మఠము, భిక్ష పుస్తకము మొదలగు పలువిధములయిన పాశములచే బద్ధులయినవారును, వ్యర్థముగా పెక్కుభోగములను వెదకువారునై, ముండనము గావించుకొని కాషాయవస్త్రములుగట్టి తమకు దానముదొరకుటకై సన్న్యాసము నొందుచున్నారు. వేదమును దమ పేరువాసిని పుత్రులను దిగనాడి బుద్ధిమాలినవారు ముమ్మడికోలయుఁ గావివస్త్రమును గయికొనుచున్నారు. మనస్సునందలి రాగాదిరూప మయినకషాయము (దోషము) పోకుండఁగా పైనిగట్టికొను కాషాయమేదో యొక విషయవాంఛనుబట్టి యనియె తెలియుము. ధర్మవేషధారులగు ముండులకది పొట్టప్రోచికొనుకొఱకని నామతము. మహారాజా! నీవు జితేంద్రియుఁడవై కాషాయము కడవసము నారచీరలను ధరించినవారును, నగ్నులును (అవధూతులును), జటలఁదాల్చినవారును ముండులు నగుసాధువులను భరించుచు లోకములను జయింపుము. అగ్న్యాధానకర్మమును, గురువుకొఱకు మంచి దక్షిణలతోఁ గూడినయజ్ఞములను నహరహము చేయువానికంటెను ధర్మపరాయణుఁ డెవఁడు? ” అని చెప్పినదయ్యెను. రాజా! ఈ లోకమందు జనకుం డనురాజు తత్త్వజ్ఞుండని చెప్పుదురు. అతఁడుసయితమిట్టిమోహము నొందెను. కాఁబట్టి నీవు మోహమునకు లోనుగాకుము. మనమెప్పుడు నిట్టిధర్మము

నాచరించుచు దానతపఃపరులమై యానృశంస్యగుణముకలిగి కామక్రోధములు మాని, యుత్తమముగ దాంతిని గయికొని ప్రజలను బాలించుచు పెద్దలను గురువులను బూజించుచు యాగములుచేసి మంచిలోకములను బొందెదము; బ్రాహ్మణులకు ననుకూలురమై సత్యముపలుకుచు దేవతలకును నతిథులకును దక్షిణ ప్రాణులకును విధిచొప్పునఁ దృప్తి గావించుచు నిష్టంబగు పదమును బడయుదము' అనెను. ఇది పదునెనిమిదవయధ్యాయము.

---

## రాజధర్మపర్వము.

{ ధర్మరాజు సన్న్యాసమే యుత్తమమని యర్జునునకుఁ జెప్పుట. }

ధర్మరాజర్జునునితో 'నాయనా! ధర్మశాస్త్రములను బ్రహ్మశాస్త్రములను, నే నెఱుంగుదును. 'కర్మమును జేయు' మనియు 'కర్మమును విడువు'మనియుఁ జెప్పు రెండువిధములగు వేదవచనమును నెఱుంగుదును. పెక్కులు హేతువులనుగొని విచారము చేసినను, శాస్త్రము లోండొంటికిఁ బొసంగక కలగూరగా నుండును. ఇట్టిశాస్త్రమం దేది సిద్ధాంతమో దానిని యథావిధి నేనెఱుంగుదును. నీవో శాస్త్రమును (పైపైని) మాత్రము చదివినవాఁడవు. * వీరవ్రతముతోఁ గూడినవాఁడవు. శాస్త్రములోని యర్థమును గలరూపునఁ దెలిసికొన నీ వేవిధమునను సమర్థుఁడవు గావు. ధర్మమును గనుఁగొన్నవాఁడవేని నీ విట్లు పలుకవు. శాస్త్రములోని యర్థము కలరూపును దెలిసినవాఁడును ధర్మనిశ్చయమును జక్కఁగా నెఱింగిన

---

* వీరవ్రతమనఁగా బీరంపుపట్టుదల.

వాఁడును నిట్లు చెప్పనేచెప్పఁడు. అయినను అర్జునా! తోడఁ బుట్టిన నెయ్యమునుదియ్యము నూఁది నీకు న్యాయమని తోఁచిన తెఱఁగున యుక్తముగ నీ వాడినమాటలకు నేను సంతసించితిని. బ్రహ్మకును మహేశ్వరునకును వాసుదేవునకును సమమయిన ప్రాణియొక్కటియు నింతవఱకుఁ గలిగినదిగాదు; ఇంకను గలుగనేరదు. అట్లే మేటియోధులందు నీవే మిన్న వనుట సర్వసమ్మతము. నీకు మించినయోధ నింతకును నిఁక మీఁదను గలుగఁడు. ఇంద్రునియందును వాయువునందును విష్ణుదేవునియందును నెట్టి బలముగలదో యట్టిబలము నీయం దును భీమునియందును నున్నది. అర్జునా! చిత్రయుద్ధముసేయు టయందును కడుదూరమునుండి కూల్చుటయందును దివ్యాస్త్ర బల సంపత్తియందును నీకు సముఁ డయినవాఁడు వేఱెవ్వఁడు గలఁడు? యుద్ధధర్మము లన్నిటియందును, పెక్కు క్రియా నైపుణములందును నీకు సాటియైనవాఁడు మూఁడులోకములం దును గలుగఁడు! ధర్మమును ధర్మమును సంబంధించినదియు నిశ్శేషముగా నాకుఁ దెలియును. ధర్మసూక్ష్మమును జెప్పు విష యమున నన్నుఁగడచుట నీ కలవిగాదు. అర్జునా! నాబుద్ధికిఁ దోఁచువిషయమునందు నీవుసందేహపడవలదు. నీవు యుద్ధశా స్త్రమును దెలిసితివేకాని వృద్ధులను సేవించినాఁడవుగావు. ధర్మం పు సంగ్రహమును విస్తరమును దెలిసిన యా పెద్దలనిశ్చయ మును నీవు దెలిసినవాఁడవుగావు. నాయనా! తపము, త్యాగ ము, అవిధి యనెడియీ మూఁడును బుద్ధిమంతులచే నిశ్చయింపఁ బడినవి. వీనిలో నొకటికంటెను మఱొకటి యెక్కుడని మా మతము. ధనమునకు నెక్కుడయినది లేదని నీవు తలంచు

చున్నావు. ఈ ధనము ప్రధానముకానిదని నీకుఁ దెలిపెదను. లోకమందుఁదపస్సును వేదాధ్యయనమును సహజముగాఁ జేయుచుండుధార్మికులు పెక్కండ్రు చూపట్టుచున్నారు. అట్లు తపము సేయుఋషులకు శాశ్వతము లయినలోకములు కలుగుచున్నవి. అరుణులు, కేతవులు ననెడి కొందఱు ఋషులు మీసలు దలసూపు పసిప్రాయముననే ధీరులయి వనములకుఁబోయి వేదాధ్యయనముచేసి దివ్యలోకమును బొందియున్నారు. (తపము పెంపిట్లున్నది) విషయముల నిగ్రహించి యజ్ఞానమువలనిచీఁకటిని దిగవిడిచి యార్యులుకొందఱు దేవయానమనెడియుత్తమమార్గమునఁ ద్యాగవంతులు (సన్న్యాసులు) పొందు లోకములను బొందియున్నారు. (త్యాగము పేర్మి యిట్టిది). పితృయానమనెడి దక్షిణపుమార్గమునఁ బోయి చంద్రలోకమును బొందువారు కర్మమునం దుండువారలే. వారు శ్మశానములకుఁ బోవువారు. మోక్షమునొందువారు దేనిని గాంతురో యిట్టిదట్టి దని నిర్దేశింపరాని యాబ్రహ్మపదమే పూర్వోక్తమయిన 'అవిధి' యను మూఁడవదిగాఁ జెప్పఁబడుచున్నది. ఇట్లుత్తమపదమునకుఁ గారణమగుటచేఁ ద్యాగము స్థానములందు ముఖ్యమయినదని నామతము. అది నినుబోఁటివారలకుఁ దెలుపుట మిక్కిలియుఁ గష్టమైనది. సారాసారములను దెలిసికొనఁగోరు కవులు 'ఇక్కడనుండునా ?. ఇక్కడనుండునా ?' అని పెక్కుశాస్త్రములను విమర్శించి యిట్టినిశ్చయమును బొందియున్నారు. దీనికలరూపు దెలియని జనులు వేదములను శాస్త్రములను నుపనిషత్తులను గడచి యరఁటిచెట్లను జీల్చి సారమును గాననియట్లు కనుంగొనరయిరి. అట్టివారేకాంతముగా నుండుట యనుత్యాగమార్గమును

ద్రోసిపుచ్చి పంచభూతాత్మక మయినయీ శరీరమందుఁ గల యాత్మను పెక్కులింగితములచేత నిచ్ఛాద్వేషములతోఁ గూడినదిగాఁ జెప్పెదరు. అది యిట్టిదిగాదు. అది కన్ను (మొదల యిన యింద్రియముల)కు నందరానిది; వాక్కుచే నిట్టిదనిపలుక నలవిగానిది. అట్టియాత్మ కర్మకారణ మయినయజ్ఞానమును బు రస్కరించుకొని భూతశరీరములందుఁ బుట్టివచ్చుచున్నది. మను ష్యుఁడు తృష్ణను నిగ్రహించి కర్మపరంపరనువిడిచి యహంకార మునొందక శుభంబగు మోక్షమార్గంబునఁ జని సుఖమొందవ లయును. అర్జునా! సత్పురుషులు సేవించునదియు సూక్ష్మంబునఁ దెలియఁ దగినదియునయిన యీమోక్షమార్గముండఁగాఁ, బెక్కు లనర్థములు నిండియున్నవస్తువును నీ వెట్లు కొనియాడెదవు? కర్మవిదులయిన వారును, ఎప్పుడును దానము యాగము మొద లయిన కర్మములందు నిరతు లయినవారును, నగుజనులుగూడ నీధనమును నిట్లే యనర్థములు నిండినదనియు, మోక్షమార్గమే మేలయినదనియుఁ గాంచుచున్నారు. హేతువులను జక్కఁగా నెఱింగిన పండితులును దృఢమయిన పూర్వకర్మవాసనవలన మోక్షము లేదనియే వాదించుచు మూఢులై యున్నారు. వారిని మంచిదారికిఁ ద్రిప్పుట మిక్కిలియుఁ గష్టము. పెక్కుశాస్త్ర ములను జదివి పలువిధములుగా మాటాడఁజాలువారు కొందఱు జనసమూహములందు నసృతములాడుచుఁ బరుల నవమానించు చును భూమియంతయు సంచరించుచున్నారు. పార్థా! ఏ విష యములను మనము చక్కఁగాఁ దెలిసికొనమో వానిని దక్కిన వాఁడెట్లు దెలియ నర్హుఁడగును? శాస్త్రవిత్తములును ప్రాజ్ఞులు నైనగొప్ప పండితులును నిట్లు చక్కఁగాఁ దెలియకున్నవారే

యగుదురు. ధర్మము దెలిసినవాఁడు తపస్సుచేత గొప్పవైరాగ్యమునొందుచున్నాఁడు. దానివలని బుద్ధి (జ్ఞానము)చేత బ్రహ్మమునొందుచున్నాఁడు త్యాగముచేత నెప్పుడును సుఖమునొందుచున్నాఁడు'' అనెను. ఇది పందొమ్మిదవయధ్యాయము.



## రాజధర్మపర్వము.

దేవస్థానుఁడు ధర్మరాజునకు యాగము చేయుమని చెప్పుట.

ఇట్లు మాటలాడికొనుచుండఁగా, మాటకారియు మహాతపస్వియు నగు దేవస్థానుఁడు మిక్కిలి యుక్తియుక్తమగు వాక్యమున ధర్మరాజుతో 'ధనమునకంటె నెక్కుడయినది లే'దనియర్జునుఁడు చెప్పిన విషయమున నీకుఁ గొంచెము తెలిపెదను. మనస్సు నిలుకడగా నిలిపి వినుము. అజాతశత్రూ! నీ వీ భూమినంతయు రాజధర్మముచొప్పున జయించితివి. అట్లు జయించిన దానిని వ్యర్థముగా దిగవిడుచుట నీకు న్యాయముగాదు. బ్రహ్మమును బొందుటకు బ్రహ్మచర్యము మొదలయిన నాలుగాశ్రమములును నాలుగు మెట్లుగల నిచ్చెనగా నేర్పడియున్నది. రాజా! ఆనాలుగు మెట్లను వరుసగా విధిచొప్పున జయింపవలయును. కాఁబట్టి, పెక్కు దక్షిణలతోఁగూడిన మహాయజ్ఞములను యజింపుము. వేదాధ్యయనమే యజ్ఞముగాఁ గలబ్రహ్మచారులును, బుద్ధ్యర్థము కర్మనిష్ఠులయిన గృహస్థులును, అడవికిఁ బోయి తపోనిష్ఠులగు వానప్రస్థులును, బ్రహ్మజ్ఞానమే యాగముగాఁ గల సన్న్యాసులునని నాలుగాశ్రమములవారిని దెలియుము.

కుంతీపుత్రా! వైఖానసులు (వానప్రస్థులు) 'ఆశపడి ధనముసంపాదించి కర్మముచేయుటకంటెను నాశనువిడుచుటయే గొప్ప.' యనిచెప్పినట్లు వినికి. క్షత్రియుఁ డాకర్మమును జేయఁ గైకొన్నచో మిక్కిలియు దోషమునొందును. విద్వాంసులు కర్మశాస్త్రము విధిచొప్పున ద్రవ్యములనెల్ల నొక్కటిగా సమకట్టికొనుచున్నారు. మనసునందుఁ దృషగలిగి యర్థానర్థములను వివేచించి తెలియనివారు (తమ దేహము ధనము మొదలయినవానిని) నర్థంబగుయాగాదికర్మములకు వినియోగింపక యనర్థంబగువానియందుపయోగించెదరు. వారు తమకుఁ గలిగెడియట్టిపెనుదోషమును దెలియరు. వారలకు ధర్మము (చిత్తశుద్ధి) గలుగుటయు దుష్కరము. బ్రహ్మ, యాగములకొఱకు ధనములనుసృజించెను; వానిని రక్షించుమనుష్యునిని యాగము చేయఁగోరియే సృజించెను. కాఁబట్టి ధనములనెల్ల యాగమునందే యుపయోగింపవలయును. యాగము చేసినచోఁ దోడనే వలయుసిద్ధిని బడయవచ్చును. మహాతేజుండయినయింద్రుఁడు రత్నములను దక్షిణగాఁగొని పెక్కులు యాగములుచేసి సమస్తదేవతలకు నెక్కుడయినయింద్రపదివిని బొంది వెలుంగుచున్నాఁడు. కాఁబట్టి యజ్ఞమందు ధనములనెల్ల నుపయోగింపవలయును. కృత్తివాసుండును మహాత్ముండును దేవదేవుండు నగుశివుఁడు సర్వమేధమనెడి యజ్ఞమందుఁ దన్నే హోమముచేసి యీ లోకములనంతయుఁ దనకీర్తిచే నించి తేజంబున విరాజిల్లుచున్నాఁడు. మరుత్తుఁడను రాజు తనపుణ్యంపుఁబెంపువలన దేవరాజయినయింద్రుని సయితము జయించెను. వాఁడు చేసినయాగమందు పాత్రము లన్నియు బంగారుతోఁ జేయంబడినవై యుండెను. లక్ష్మీదేవి తానే

చక్రయాగమునకు వచ్చెను. హరిశ్చంద్రుఁ డనురాజు, పెక్కుయాగములుచేసి పుణ్యమునొంది శోకమువీడి తాను మనుష్యుఁడై యుండియుఁ దన పెంపుచే దేవేంద్రునిఁగూడ జయించెనని వినలేదా ? కాఁబట్టి సమస్తధనములను యాగమునందు వినియోగింపవలయును ' అని చెప్పెను. ఇది యిరువదియవ యధ్యాయము.



## రాజధర్మపర్వము.

{ దేవస్థానుఁడు ధర్మరాజునకు స్వధర్మము ననుష్ఠించుటయే యుత్తమమని చెప్పుట. }

దేవస్థానుఁడు "క్షత్రియునకు యాగాదికర్మమేన్యాయమా?" యను విషయము నొకసమయమున నింద్రుఁ డడుగఁగా బృహస్పతి చెప్పిన యీపురాతన మయినయితిహాసమును జెప్పెదరు. సంతోషము స్వర్గమునకు సమము; సంతోషము పరమసుఖము. సంతుష్టికి మించిన దొకటియు లేదు. తాఁబేలు తనయవయవములు ముడుఁచుకొనునట్లు కామముల నన్నిటినుండియు నొకఁ డెప్పు డింద్రియములనుదీసి లోపలనడంచుచున్నాడో యపుడుజ్యోతిరూపమయినయాత్మ తనయందే తోడనే ప్రసన్నమగుచున్నది. అప్పుడు సంతోషము నెలకొనుచున్నది. ఎప్పు డొకఁడు తాను బరులవలనను బరులు తనవలనను భయపడుటలేదో, ఎప్పుడు కామద్వేషములను గెలుచుచున్నాఁడో, యప్పుడాత్మను దర్శించుచున్నాఁడు. ఎప్పుడు కర్మముచేతను, మనస్సుచేతను, వాక్కుచేతను, నేప్రాణినిగుఱించియు, నపకారమును నుపకారమును జేయఁబూ

కుఁడో యప్పుడు మనుష్యుఁడు బ్రహ్మము నొందుచున్నాఁడు. ఇట్లు ప్రాణు లాయావిధములఁ గావించు నాయాధర్మముల నప్పుడప్పుడు తామే యనుభవించుచున్నవి. కాఁబట్టి నీవును నీకుఁ దగినధర్మమును దెలియుము. కొందఱు సామవచనములను గొనియాడెదరు. కొందఱు యాగాదికర్మములను గొనియాడె దరు. మఱికొందఱు సన్న్యాసమును గొనియాడెదరు. వీని యం దొకటిని గొందఱును మఱొక్కటిని గొందఱును గొని యాడుటలేదు. కొంద ఱీరెంటిని గ్రమంబుగఁ గొనియాడెదరు. కొందఱు యజ్ఞమునుగొనియాడెదరు. కొందఱు సన్న్యాసమును గొండాడెదరు. కొందఱు దానమును గొందఱు ప్రతిగ్రహమును (పుచ్చుకొనుటను)గొనియాడెదరు. కొంద ఱన్నిటినివిడిచి మిన్నక ధ్యానము చేయుచుండెదరు. చంపియుఁ గోసియుఁ జీల్చియుఁ బ్రాణులను బరిపాలించురాజ్యమును గొందఱుపొగడెదరు. కొంద ఱేకాంతమున ధ్యానముచేయుచుండెదరు. వీనినంతయుఁ జక్కఁ గా విమర్శించి పండితులు నిశ్చయించినది. 'ప్రాణులకు ద్రోహ ముచేయకయ చేయుధర్మమే సజ్జనులకు సమ్మతమైనది' యనుట యే. ద్రోహములేమి, సత్యమాడుట, దానము, దయ, దమము, స్వభార్యయందుఁ బుత్రోత్పత్తిచేయుట, మృదుత్వము, లజ్జ, చప లములేమి, యనెడు నివి ముఖ్య మయినధర్మమని స్వాయంభువ మనువుచెప్పెను. కాబట్టి దీనిని బ్రయత్నమునఁ బ్రతిపాలింపు ము. రాజ్యమునందుండు రాజెవఁ డెప్పుడును వశియై, ప్రియా ప్రియముల సమముగాఁ దలఁచి యాగముచేసి మిగిలినదానిని భుజించుచు, శాస్త్రార్థము కలరూపునెఱింగి, సాధురక్షణమందును నసాధుశిక్షణమందు నాసక్తుఁడై, నీతిదప్పక ప్రజలను ధర్మమా

ర్గమందు నెలకొలిపి, యట్లే కడపట రాజ్యమును బుత్రునియం దుంచి వనమునకుఁబోయి వన్యములయినవానిచే జీవించుచు ధర్మము గట్టిగానూఁది ప్రాలుమాలిక లేక తనయాశ్రమమునకుఁ దగు కర్మములనుచేయువాఁడగునో యట్టిరాజునకే యిహమునుబరమును సార్థకములగును. మోక్షము పెక్కువిఘ్నముల కలదనియుఁ బడయుటకు మిక్కిలికష్టమయినదనియు నామతము. పూర్వోక్తమయినధర్మము నాచరించినరాజు లనేకులు, సత్యమును దానము తపస్సునుగలవారును, ఆనృశంస్యగుణముతోఁ గూడినవారును, కామక్రోధరహితులును, ప్రజాపరిపాలనయుక్తులును, గోవుల కొఱకును బ్రాహ్మణులకొఱకును యుద్ధము సేయువారునునై యుండి యత్యుత్తమయినగతిని బొందియున్నారు. ఇట్లే వసువులును, రుద్రులును, ఆదిత్యులును, సాధ్యులును పెక్కండ్రు రాజర్షులును నీధర్మము నాశ్రయించి పుణ్యములయిన తమకర్మములచేతఁ దప్పక స్వర్గలోకమును బొందియున్నారు' అనెను. ఇది యిరువదియొకండవయధ్యాయము.

---

## రాజధర్మపర్వము.

### అర్జునుఁడు క్షత్రియధర్మము మేలయినదని ధర్మరాజునకుఁ జెప్పుట.

ఇట్టిసమయమునందే, యర్జునుఁడు మనంబున నేమియుఁ దోఁపక వగచుచున్న తనయన్నను ధర్మరాజునుజూచి మరల "పురుషసత్తమా! నీవు ధర్మజ్ఞుండవు. నీకుఁ దెలియనిదేమున్నది? క్షత్రియులధర్మముచేతఁ బగవారిని జయించి మిక్కిలి దుర్లభ

మఱియీన యీరాజ్యమును బడసినపిదప నీవేల మిక్కుటముగాఁ దపించెదవు ? మహారాజా! రాజులకు యుద్ధమందు మృతినొందుట సమ్మతమయినది. క్షత్రధర్మమును బహుయజ్ఞములతోఁ గూడినదానిని దలంచిచూడుము. బ్రాహ్మణులకు త్యాగము(సన్న్యసము) చే మరణమొందుట ధర్మమని విధింపఁబడి యున్నది. క్షత్రియులకో యుద్ధమందు మరణము విధింపఁబడియున్నది. ఒకప్పుడు నాయుధము నెడఁబాయకుండుటక్షత్రియధర్మము మిక్కిలి భయంకర మయిన దందురు. భరతసత్తమా! క్షత్రియధర్మమును జేకొన్నవాఁడు బ్రాహ్మణుఁడుగా నుండినను వాఁ డాయుధముచేత యుద్ధమున వధింపఁబడుట న్యాయముగా నున్నది. క్షత్రియజాతియందుఁ బుట్టుట ప్రశస్తమయినది. క్షత్రియజాతి వేదమునుండి పుట్టినది. త్యాగము (సన్న్యసము) ను యాగమును తపస్సును పరులసొమ్ముచే బ్రతుకుటయు క్షత్రియునకు విహితములుగావు. అట్టిక్షత్రియజాతియందుఁ బుట్టి ధర్మములన్నియుఁదెలిసి ధర్మబుద్ధిగలిగినట్టి రాజవు; సమర్థుండవు; లోకమునందు నెక్కువతక్కువలును ముందువెనుకలును గనుఁగొని యున్నవాఁడవు. నీ విట్టిసంతాపమువలని శోకమును ద్రోసిపుచ్చి స్వధర్మమందు బద్ధుఁడవగుము. క్షత్రియుని హృదయము విశేషించి వజ్రసమానమై యుండవలయును. క్షత్రధర్మము చొప్పున శత్రువులనుజయించి యేయడ్డిలేక రాజ్యమును బడసినపిదప నింద్రియముల జయించినవాఁడవై యజ్ఞదానతత్పరుండవై యుండుము. కశ్యపప్రజాపతి పుత్త్రుఁడైనయింద్రుఁడు క్షత్రియధర్మము గయికొని పాపవృత్తులయిన జ్ఞాతులను నెనమన్నూటపదుంద్రనుజం పెను. రాజా! అతఁడు చేసినయాపని పూజ్యమును

ప్రశంసింపఁదగినదియు నయ్యెను. ఆకారణముచేత నతఁడు దేవతలకు రాజు నయ్యె నని మాకు వినికి. మహారాజా! మనుష్యుల కింద్రుఁడ వయినసీవు నింద్రునివలెనే యేతుందుడుకును లేక చిరకాలము బహుదక్షిణలతోఁ బెక్కులు యాగములుచేయుచుండుము. క్షత్రియధర్మము చొప్పున శస్త్రముచేతఁ బరిశుద్ధులై పరలోకమందు మంచిగతిని బొందినజ్ఞాతులను గుఱించి యిట్లు కొంచెమయినను దుఃఖింపకుము. భరతసత్తమా! ఏది జరిగినదో యది యట్లే జరుగవలయును జుమీ. దైవమును గడవఁదరముగాదుగదే" యనెను. ఇది యిరువది రెండవయధ్యాయము.



## రాజధర్మపర్వము.

(వ్యాసుఁడు ధర్మరాజునకు శంఖలిఖితోపాఖ్యానమునుజెప్పి క్షాత్రధర్మమును గయికొనుమని బోధించుట.)

వైశంపాయనుఁడు జనమేజయునితో 'రాజా! అర్జునుఁడిట్లుచెప్పఁగా ధర్మరాజేమియుఁ బలుకఁడయ్యె. తోడనే వ్యాసుఁ డతనిని జూచి 'ధర్మపుత్రా! నీవు సౌమ్యుఁడవుగదే. అర్జునుఁడు చెప్పినది సత్యమే. శాస్త్రమందు గృహస్థాశ్రమ ముత్తమధర్మమని చూపట్టుచున్నది. నీవును ధర్మము తెలిసినవాఁడవు. శాస్త్రముచొప్పున, విధ్యుక్తరీతిని, నీ సొంతధర్మమును నీవు చేయుము. గృహస్థాశ్రమమునువిడిచి వనమునకుఁ బోవుట నీకు విహితముగాదు. దేవతలును పితృదేవతలను అతిథులును భృత్యులును నెప్పుడు గృహస్థు నండగొనియే జీవించెదరు.

రాజా ! వారిని భరింపుము. పక్షులును బశువులును మఱియుఁ దక్కిన ప్రాణులును గృహస్థులచేతనే రక్షింపఁబడుచున్నవి. కాఁబట్టి గృహస్థాశ్రమమునందలివాఁడే శ్రేష్ఠుఁడు. ఈ నాలుగాశ్రమములలో నాగృహస్థాశ్రమము నాచరించుట కష్టము. ఇంద్రియపటిమ లేనివారలకు ననుష్ఠింపఁ గష్టమయిన యీవిధిని నీవు చక్కఁనడపుము. నీకు వేదములందు జ్ఞానము పూర్ణముగ నున్నది. పెనుతపమును జేసియున్నావు. కాఁబట్టి పితృపైతామహమైన రాజ్యమును బరువును వహించినట్లు నీవుభరింపవలయును. మహారాజా! తపస్సు యజ్ఞము, అధ్యాత్మవిద్య, భిక్ష, యింద్రియ నిగ్రహము, ధ్యానము, చదువునందలి పూనిక, సంపదయందుఁ దృప్తి, ఏకతముండుట, సంతోషము, తనశక్తికొలఁది దానము ననెడి యిట్టి ధర్మములన్నియు బ్రాహ్మణులకు సిద్ధికరములుగా విధింపఁబడినవి. క్షత్రియులకయినధర్మములు నీకుఁ దెలిసియుండినను, మరలఁ జెప్పెదను. యాగమును విద్యయు పూనికయు ధన మందుఁ దృప్తిలేమియు దండమును దాల్చియుండుటయు వేంద్రపుఁదనమును ప్రజాపరిపాలనమును వేదమునంతయు దెలియుటయుఁ దపమును మంచినడవడియు, నవ్యాజిగా ధనమార్జించుటయు సత్పాత్రమునకు దానము ననెడి యీ సత్కర్మములు రాజులకు నిహమును బరమును సాధించి యిచ్చునని మనకు వినికి. రాజా ! వీనియందెల్ల దండమును దాల్చుటయే యెక్కుడయినదని చెప్పుదురు. క్షత్రియునియందు బలమును, బలమునందు దండమును, నెప్పుడు నెలకొనియున్నది. ఇట్టికార్యములే రాజులకు రాజ్యసిద్ధిని గలిగించునవి. బృహస్పతి 'యుద్ధము చేయని క్షత్రియునిని దేశసంచారము చేయని బ్రాహ్మణునిని

సర్ప మెలుకలను మ్రింగునట్లు భూమి మ్రింగుచున్నది'! యని యీగీతమునుబాడెను. సుద్యుమ్నుఁడను రాజఋషియుఁ బ్రచే తసపుత్త్రుఁడయిన దక్షునివలె దండమును ధరించుటవలనఁ బర మంబయిన సిద్ధిని బొందెనని వినఁబడుచున్నది ' యనెను. అందు లకు ధర్మరాజు వ్యాసునితో 'మహాత్మా! సుద్యుమ్నుండను రా జే కర్మమువలన నుత్తమసిద్ధిని బొందెనో వినఁగోరుచున్నాను ' అనెను. వ్యాసుఁడతనితో ' ఈవిషయమందుఁ బురాతనమయిన యితిహాసమును జెప్పెదను. వాఁడి నియమములుగల శంఖుఁడు లిఖితుఁడను నిద్దఱు సహోదరులుండిరి. వారికి బాహుదయనెడి నదితీరమున రెండాశ్రమములు వేఱువేఱ నుండెను. అవి నిత్య పుష్పఫలములుగల వృక్షములుగలిగి రమణీయములై యుండెను. అట్లుండఁగా నొకకాలమున లిఖితుఁడు శంఖుని యాశ్రమమునకు వచ్చెను. అప్పుడు శంఖుఁడు దైవికముగా నాశ్రమమువిడిచి బయ టఁబోయి యుండెను. సహోదరుని యాశ్రమమునకుఁ బోయిన యాలిఖితుఁడును నపు డందు విహరించుచు నచటఁ జక్కఁగాఁ గమియఁబండి యున్నకొన్ని పండ్లనుగోసెను. ఆపండ్లనెత్తి యా బ్రాహ్మణుఁడు జంకుగొంకులేక భుజింపఁదొడంగెను. అతఁడు దినుచుండు సమయమందే శంఖుఁడు నాశ్రమమువచ్చి చేరెను. అట్లు తన తమ్ముఁడు లిఖితుఁడు పండ్లను దినుచుండుటను జూచి యతఁడు " ఈపండ్లు ఎక్కడదొరికినవి ? ఏలతినుచున్నావు ?' అని యడిగెను. తోడనే యాలిఖితుఁడు తనయన్నయగు శంఖుని దగ్గఱకుఁబోయి నమస్కరించి ' ఇక్కడనుండియే యీపండ్లను నేనెత్తికొంటిని' యని వేడుకగా నవ్వుచుఁ జెప్పెను. తోడనే శంఖుఁడు తీవ్రమయిన కోపమునొంది " నీయంతట నీవు పండ్ల

నె_త్తికొంటివి గావున నిది దొంగలించుట యగును. కాఁబట్టి రాజునొద్దకుఁబోయి 'రాజస_త్తమా! ఇయ్యానిదానిని నేనె_త్తి కొంటిని. కాఁబట్టి దొంగనయితిని. నన్ను దొంగగాఁ దెలిసి దొంగకుఁ దగుదండమును విధించి నీస్వధర్మము (దండధారణము)ను గాచుకొనుము' అని తెలిసికొనుము'' అనెను. అతఁడు చెప్పినచొప్పున లిఖితుఁడు వాఁడి నియమముగలవాఁడు గావున రాజగు సుద్యుమ్నునికడకుఁ బోయెను. ఆరాజును ద్వారపాలకుల వలన లిఖితునిరాక విని మంత్రులంగూడి కాలినడకనే వచ్చెను. అట్లు వచ్చిచేరి యారాజు ధర్మవిదులందు మిన్నయైన యా లిఖితునితో 'మహాత్మా! ఎందులకురాక! వలసినదిచెప్పుము; అది చేసినట్టేచుమీ' అనెను. అందుల కాబ్రహ్మర్షి సుద్యుమ్నునితో 'నేను జెప్పినదివిని చేసెద'నని ప్రతిజ్ఞచేసితివి గావునఁ జేయవలయును. నాకువలయునది మఱేమిగాదు. మాయన్న యియ్యానిపండ్లు నేనైయె_త్తికొని భక్షించితిని. ఆ విషయమై నన్నుదండింపుము. జాగువలదు' అనెను. సుద్యుమ్నుఁడు 'బ్రాహ్మణో_త్తమా! దండమును విధించుటయందు రాజుప్రమాణ మనుట మీమతమేని దండమునువిధించుట రాజును సంబంధించినదనుట మీకుఁ బ్రమాణమేని అనుజ్ఞయిచ్చుటయందు నతఁడే ప్రమాణము కావలయును. కాఁబట్టి నేననుజ్ఞయిచ్చితిని. దానిచేతనే దోషముపీడి శుద్ధుండవైతివి. ఇదిగాక మఱియు నేవేని కోరికలడుగుము. నీవడిగినట్లు చేసెదను' అనెను. మహాత్ముఁ డారాజు కోరినది యడుగు మనివేఁడుచుండఁగా నాబ్రాహ్మణుఁడు దండముతప్ప మఱేవరమును గోరఁడయ్యె. అంత రాజ మ్మహాత్మునిచేతులను రెంటిని ద్రుంచెను. అతఁడును దండముఁ

బొంది యన్నయగు శంఖునియొద్దకుఁ బోయి 'నా యపరాధమునకు దండనము పొందితిని; నాదుర్బుద్ధికి నీవు క్షమింపవలయును' అని యార్తితోడఁ జెప్పెను. శంఖుఁడు 'ధర్మజ్ఞా! నీయెడ నాకుఁ గోపములేదు. నీవు నాకేమియుఁ జెఱుపుచేయవు. మనకులము మిక్కిలి నిర్మలమయినదని యీలోకమందుఁ బ్రసిద్ధికెక్కినది. అందుఁబట్టి నీవు ధర్మమును నతిక్రమించితివి గాన యాదోషమునకై నీకుఁ బ్రాయశ్చిత్తముచేయఁబడినది. నీవు శీఘ్రముగా బాహుదానదికిఁబోయి విధ్యుక్తముగా దేవతలకును ఋషులకును పితరులకును దర్పణములు చేయుము. ఇఁకనధర్మమందు మనస్సుచెల్లింపకుము. తెలిసినవారు బ్రహ్మహత్యను సురాపానమును దొంగతనమును గురుతల్పగమనమును, నివిచేయువారితోడి కూటమియు, ననువీనిని మహాపాతకములని చెప్పెదరు. వీనియందును దొంగతనమునకు సాటియైన మహాపాతకము లేదు. దొంగతన మీలోకమునందు బ్రహ్మహత్యకు సమానమగును. సకలపాతకులకును శరీరదండము ప్రాయికముగా చెప్పఁబడుచున్నది. దొంగకో విశేషించి శరీరదండమే కాని యదితప్ప వేఱుదండము విధింపఁబడకున్నది. బ్రాహ్మణుఁడును క్షత్రియుఁడును వైశ్యుఁడును శూద్రుఁడు నందఱును గోరిచేసినపాపమునకు దండింపఁదగినవారే యగుదురు. ఇందు విచారింపవలసినది లేదు. మనుష్యులు పాపములుచేసి రాజులచే దండమునుబొంది యాపాపమువీడి పుణ్యాత్ము లగుసత్పురుషులవలె స్వర్గమును బొందుదురు. నీవు రాజుచేత దండమునుబొందితివిగావున మనకుల మున్నతికెక్కును' అనెను. అదివిని లిఖితుఁడు పుణ్యంబయిన యానదికిఁబోయి స్నానముచేసి తర్పణము

చేయఁ దొడంగెను. అంత నతనికిఁ దామరపువ్వులవలె రెండు చేతులును మొలిచెను. లిఖితుఁ డదిచూచి యాశ్చర్యపడి యా చేతుల నన్న యగుశంఖునకుఁ జూపెను. అంత శంఖుఁడు 'నేను నా తపోమహిమచేతఁ గావించితిని. ఇందు సందేహమువలదు. అదృష్టమిట్లున్నది' యనెను. అందులకు లిఖితుఁడు 'మహాతేజా! నీతపస్సునకు నిట్టిశక్తిగలదేని నన్ను మునుపే నీవేల పరిశుద్ధునిఁ జేయవైతివి'? అని యడిగెను. శంఖుఁడు 'ఇట్లుచేయుట శక్యమే; కాని నీకు దండము విధించు నధికారమునాకు లేదు. ఆరాజును బరిశుద్ధుఁడయ్యెను; నీవును నీపూర్వులతోడఁ బరిశుద్ధుఁ డయితివి' అనెను. పాండవశ్రేష్ఠా! ఆరాజు సుద్యుమ్నుఁ డాదండ కర్మముచేతఁ బ్రచేతసకుమారుఁ డగుదక్షునివలె పరమంబయిన సిద్ధిని బొందెను. రాజులకుఁ బ్రజలను మార్గముతప్పిపోకుండు నట్లు పాలించుట ధర్మము. కాఁబట్టి యిట్లుచేసినందులకు మన స్సున శోకముంపకుము. నీవుధర్మజ్ఞులయందు త్తముఁడవు. కను క సహోదరుఁడాడిన హితవచనమును వినుము. రాజేంద్రా! క్షత్రియులకు దండమేధర్మముగాని ముండనము (చేసికొనుట) గాదు" అనెను. ఇది యిరువదిమూఁడవయధ్యాయము.



## రాజధర్మపర్వము.

{ వ్యాసుఁడు ధర్మరాజునకు రాజధర్మమును జెప్పి రాజ్యపాలనము చేయ నియోగించుట. }

వ్యాసుఁడు ధర్మరాజుతో నర్థవంతమగు వాక్యమున 'నాయనా! ధర్మపుత్రా! నీతమ్ములు గొప్పమనస్సుగలిగి యడవియందు

వసించుచుండునపుడు వారికం దేమేమి మనోరథములు గలిగి యుండెనో వానినెల్ల నామహారథులు పడయుదురుగాక. నహుషపుత్త్రుఁ డయినయయాతివలె నీభూతలము నేలుము. పురుషసింహమా! నీతమ్ములు తపస్వులై యడవియందు మిక్కిలిదుఃఖముతోడి వాస మనుభవించిరి. ఆ దుఃఖముతీరిన యిప్పుడు, వారలు సుఖము లనుభవింపనిమ్ము. నీవు నీతమ్ములతోడ ధర్మము నర్థమును గామము ననుభవించి పిదప వనమునకు బయలుదేఱుదువు. దేవతలయుఁ బితరులయు నతిథులయు ఋణములు తీర్చిపుచ్చి పిదప స్వర్గమును బొందవచ్చును. సర్వమేధము నశ్వమేధము ననెడియాగములు యజింపుము. పిదపఁ బరమం బయినగతిఁ బొందెదవు. నీతమ్ములచే బహుదక్షిణలతోడ యజ్ఞమును జేయించి లోకమునందుఁ దులలేనికీర్తినిబొంది పిదప నిచ్చలు పోవచ్చును. కురుసత్తమా! నీవు చెప్పినదానిభావమును మేమెఱుఁగుదుము; అయినను ధర్మమునుండి జాఱకుండునట్లుగాఁ జెప్పెదను; వినుము. యుద్ధముచేసి గెలుపునొంది రాజ్యమును బొందినవానికి వలయు ధర్మమును, వారివారికిఁ దగినధర్మముల నెఱింగిననిపుణు లిట్లు స్థాపించుచున్నారు. ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, ఆగమము, అర్థాపత్తి, ఐతిహ్యము, సందేహము, నిర్ణయము, ఆకారము, ఇంగితము, నడక, చేష్ట, ప్రతిజ్ఞ, హేతువు, దృష్టాంతము, ఉపనయము, ఉక్తి, నిగమనము ననెడివిషయములును, వీనివలని ప్రయోజనములును, పెక్కులు ప్రయోజనముల నొడఁగూర్చునట్టి సాధనములుగాఁ జెప్పుదురు. వీనియందుఁ బ్రత్యక్షమును అనుమానమును దక్కనవాని కన్నిటికిని గారణమని చెప్పఁబడుచున్నవి. ప్రమాణమును దెలిసినవాఁడే

దండమును జెల్లింప వలంతియగును. ప్రమాణమును దెలియక ప్రయోగించునట్టి దండము రాజును జంపును. శాస్త్రజన్యమగు బుద్ధితోడ (శాస్త్రమునందలి యభిప్రాయమును దెలిసి) రాజు, దేశకాలములను గనుఁగొని యపరాధకులను క్షమించునేని యతనికిఁ బాపముగలుగదు. ఏరాజు, ఆఱింటనొకపాలు పన్ను పుచ్చుకొని రాజ్యమును రక్షింపఁడో వాఁడా ప్రజలపాపము నందునాలుగింట నొకపాలును బొందును. రాజు, ధర్మమును దప్పక నడవవలసినవిధిని జెప్పెదను తెలిసికొనుము. ధర్మశాస్త్రముల ననుసరించి యాత్మనిగ్రహము గలిగియుండుటవలన భయము నువీడి కామక్రోధములను బాటింపక ప్రాణులయందుఁ దండ్రి వలె సమదృష్టి గలిగియుండవలయును. రాజు న్యాయ్యమయిన యొకకార్యమును దొడంగి దైవముచేత నది కొట్టువడుటచే సాధింపకపోయినను నతఁడా విషయమందు మీఱినడిచినవాఁడు (పొరఁబడినవాఁడు) గానేరఁడు. రాజు తనబలిమిచేతను, బుద్ధి నుపయోగించియుఁ, బగవారిని నడంచియే తీఱవలయును. పాపులతోడ సంధిసేయరాదు. రాజ్యమును ధర్మముగా నడపవలయును. శూరులను పెద్దలను విద్వాంసులను గౌరవింపవలయును. గోవులుగలవారును ధనవంతులునయిన ప్రభువులను విశేషించి రక్షింపవలయును. విశేషించి మిక్కిలి చదువరులయిన వారిని వ్యవహారములందును ధర్మకార్యములందును నధికారులుగా నియోగింపవలయును. న్యాయశాస్త్రమందును ధర్మశాస్త్రమందును మిక్కిలి యాఱితేఱినవారును ప్రమాణములను జక్కఁగా దెలిసినవారును నగువిద్వాంసులను తెలివిగలవాఁడు మంత్రాలోచన సభయందును వ్యవహారసభయందును నధికారులుగా నియ

మింపవలయును. తర్కశాస్త్రమందును ధర్మశాస్త్రమందును నాఱితేఱినబుద్ధితో దండనీతిని జక్కఁగాఁదెలిసి చెల్లించినచో నది యీమూఁడులోకములను జయించును. రాజా! వేదతత్త్వ మెఱింగినవారిని యాగకార్యములందు నియోగింపవలయును. వేదములను శాస్త్రములను దెలిసినవారు మంచిబుద్ధిమంతులు. తర్కశాస్త్రమందును వేదములందును వార్తయందును దండనీతియందును పారంగతులయిన పండితులను సకల కార్యములందును నియోగింపవలయును. వారలు బుద్ధి (జ్ఞానము) తుదిని బొందినవారు. ఎంతటిగుణవంతుఁడయినను నొక్కనియందె నమ్మియుండుట తెలివిగాదు. ప్రజలను రక్షింపక, పెద్దలను బూజింపక, యడంకువయు లేక యహంకారమును నసూయయుఁగలరాజు పాపమునొందుటకాక దుర్దాంతుఁడనియు జెప్పఁబడును. ఎవరు రక్షణము నొందక కఱవు మొదలయినదైవకృత్యములవలనను దొంగలవలనను గుందుదురో వారికష్టమంతయు రాజును జేరిన పాపమగును. చక్కఁగా నాలోచించి లెస్సయగు ప్రయోగముతో మనుష్యప్రయత్నము నంతట నుపయోగించినచో రాజునకు నధర్మముగలుగదు. ప్రయత్నములు దైవముచేత విచ్ఛిన్నములగుటయుఁగలదు; సిద్ధించుటయుఁగలదు. తనచేయువలసిన ప్రయత్నముచేసి వైచునేని రాజును బాప మంటదు. రాజసింహామా! ఈ విషయమై యీకథను నీకుఁ దెలిపెదను. అది పూర్వము రాజర్షిగా నుండినహాయగ్రీవుఁ డనువాని చరిత్రము. అతఁడు శూరుఁడు; అక్లిష్టకర్ముఁడు. అతఁ డసహాయుఁడై యుద్ధమందుఁ బగవారిని జంపి పిదపఁ దానును హతుఁడయ్యెను. ఆకథ యేమనఁగా-హాయగ్రీవుఁడు మనుష్యులను రక్షించుటయందును శత్రు

వులను నడంచుటయందుఁ దగినయత్నము చేసి యీలోకమందుఁ బ్రఖ్యాతిగాంచి యుద్ధంబువలన స్వర్గలోకమునొంది సుఖించుచున్నాఁడు. అహంకారమును దిగవిడిచి, బగవారిఁ దున్మితూటాడు మహాత్ముఁ డాహయగ్రీవుఁడు శస్త్రములచే ఛేదింపఁబడియుఁ దొంగలచేఁ గొట్టువడియుఁ దనధర్మము తప్పక యుద్ధమున ముందునిలిచి సిద్ధినొంది దేవలోకమున సంతోషించుచున్నాఁడు. రాజులకు యుద్ధమొక యజ్ఞము. అందు విల్లు యూపము ; నారి యందలిత్రాఁడు; బాణము *స్రుక్కు; కత్తి స్రువము; నెత్తురు నేయి; తేరు వేదిక; కోపము అగ్ని ; నాలుగుగుఱ్ఱములును నలువురు ఋత్విజులు గానుండును. రాజసింహుండును బలవంతుఁడు నగు హయగ్రీవుఁడు యుద్ధయజ్ఞమందు శత్రువులను వేల్చి పిదపఁ దుదియందుఁ దనప్రాణములను వేల్చి పాపవిముక్తుఁడై దేవలోకమున సంతోషించుచున్నాఁడు. మంచి తెలివిగలిగి నీతి తప్పక రాజ్యమును రక్షించి యాగములు చేసి లోకమంతయు వ్యాపించిన కీర్తి గాంచి యహంకారము లేకుండిన హయగ్రీవుఁడు దేవలోకమందు ముదంబునఁ దేలుచున్నాఁడు. మంచి యుత్సాహముగలిగియు నభిమానమును విడిచియు యాగాదులయిన దైవకార్యములను మనుష్యులు చేయఁదగినకార్యములను దండనీతినిని భూమినిని బాలించి తాను బెక్కుధర్మములుగావించి మహాత్ముండు హయగ్రీవరాజు దేవలోకమునందు సుఖించుచున్నాఁడు. విద్వాంసుఁడును దాతయు శ్రద్ధాళువును గృతజ్ఞుండునై, వేదములను జక్కఁగా నధ్యయనము చేసి శాస్త్రములను లెస్సగాఁగఱచి, కర్మముల నాచరించి, రాజ్యమును బాగుగఁ బరిపాలించి, నాలుగువర్ణము

* స్రుక్కును స్రువమును హోమము వేల్చుట కెత్తు నపకలు అని తెలియునది.

లను వారివారి ధర్మములందు నెలకొలిపి, మనుష్యలోకమును విడిచి హయగ్రీవుఁడు పూజ్యులయిన మేధావులగు విద్వాంసులు ప్రయాగాదులందు దేహము విడిచిపొందు లోకమును బొంది సంతోషించుచున్నాఁడు. ప్రజలను బరిపాలించి, యుద్ధముల జయమునొంది, సోమరసమును బానముచేసి, బ్రాహ్మణోత్తములను దృప్తినొందించి, నెఱిచొప్పునఁ బ్రజలకు దండము విధించి, యుద్ధము తీఱఁగానే హయగ్రీవుఁడు దేవలోకమునందు ముదమందుచున్నాఁడు. విద్వాంసులగు సత్పురుషులు శ్లాఘనీయంబును నర్హాతమంబు నయిన చరిత్రమును మిక్కిలి కొనియాడుచున్నాడు. పుణ్యకీర్తి యగు నమ్మహాత్ముఁడు హయగ్రీవుఁడు వీరులకుఁ దగులోకములనుబడసి స్వర్గమును జయించి సిద్ధినిబొందినవాఁ డయ్యెను' అనెను. ఇది యిరువదినాలుగవయధ్యాయము.



## రాజధర్మపర్వము.

### (వ్యాసుఁడు ధర్మరాజునకు సేనజిత్తు చెప్పినది చెప్పి రాజధర్మములు నుపదేశించుట.)

ధర్మరాజు వ్యాసుఁడు చెప్పినది విని, యర్జునుఁడు కుపితుఁడై యుండఁగా, నమ్మునితో 'ఈభూతలరాజ్యమును నిందుఁగల పలువిధము లగుభోగములును నిపుడు నామనసునకుఁ బ్రీతిగొలుపకున్నవి. పతులను బాసి పుత్త్రులనుమాలి పలవించుచున్న పడఁతుల యేడ్పుటెలుంగుల వినఁగా శోకము నన్నుఁ జీల్చుచున్నది. నామనస్సున కెంతమాత్ర మూఱటగలుఁగకున్నది' యని బదులుచెప్పెను. అందులకు యోగవిదులయందు మిన్నయు మహా

ప్రాజ్ఞుండును ధర్మజ్ఞుండును వేదపారంగతుండు నగువ్యాసుం డత నితో 'స్త్రీలు,గతించిన పురుషునిఁ గర్మముచేతఁగాని యోగము చేతఁగాని పడయఁజాలరు.పురుషునిచ్చుటకును నెవఁడును లేఁడు. ఇది కాలంపుఁ గ్రమముచొప్పున దైవముచేత విధింపఁబడినది. మనుష్యుఁడు కాలముచేత సర్వమును బడయుచున్నాఁడు. మను ష్యుఁడు తనబుద్ధి శక్తిచేతను జదువుచేతను నకాలమందు నొక విశేషమును బడయశక్తుఁడుగాఁడు; మూర్ఖుఁడును నొకప్పుడు పె క్కుటర్థములను బొందుచున్నాఁడు. మనుష్యునకు సకలము నిచ్చు నట్టిది కాలమే. భూమియు మందులును మంత్రములును దక్కిన శిల్పికర్మములును నకాలమందు ఫలమొసంగవు. అవియే కాల ముచేఁ బొదలి మంచికాలమందు వృద్ధియు సిద్ధియుఁ బొందు చున్నవి. వాయువులు వేగముగా వీచుటయుఁ గాలముచేతనే. కొలంకులు మొదలయినవాని నీటియందుఁ దామరలు కలువలు మొదలయినవి మొలచుటయుఁ గాలముచేతనే. వనములందు వృక్షములు పూచుటయుఁ గాలముచేతనే. రాత్రులు క్రమము గా నల్లగను దెల్లగను నుండుట కాలముచేతనే. చంద్రుఁడు నిండారుబింబము గలిగియుండుటయుఁ గాలముచేతనే. అకాల మందు వృక్షమునఁ బుష్పములును బండ్లును గలుగవు.. అకాల మందు నదులు వేగముగా వెల్లిపొడువవు. అకాలమందుఁ గొం డలయందును గ్రామములందును గలపక్షులును బాములును మృగములును నేనుఁగులు మదమునొందవు. అకాలమందు స్త్రీలకు గర్భముగలుగదు. అకాలమందు సీతు నెండయు వాన యురావు.అకాలమందుమనుష్యుఁడు పుట్టుటయుగిట్టుటయు లేదు. అకాలమందు బిడ్డఁడుమాటాడుట లేదు. అకాలమందు జవ్వనము

నొందుటలేదు. అకాలమందు విత్తిన విత్తులు మొలచుటలేదు అకాలమందు సూర్యుఁ డుదయించుటయు నస్తమించుటయు లేదు. అకాలమందుఁ జంద్రుఁడును, పెనుకరడులపరంపరలతోఁ గూడిన సముద్రమును బెరుఁగుటయుఁ దఱుఁగుటయు లేదు. ధర్మరాజా! ఈవిషయమున దుఃఖార్తుఁ డయినసేనజిత్తు పాడిన యీపురాతనపు టితిహాసమును జెప్పెదరు.—దుస్సహమైన యీ కాలగతి మనుష్యుల నెల్లవారిని బట్టుచున్నది. భూమియం దెల్ల వారును గాలముచేత ముదిరియే మృతినొందుచున్నారు. రాజా! లోకమందుఁ గొందఱు మఱికొందఱను గొట్టుచున్నారనుటయు, నట్టే వారిని వేఱుకొందఱు గొట్టుచున్నారనుటయు లోకమునం దు వాడునట్టి వట్టిపేరే; కాని వాస్తవముగాదు. రాజా! కొట్టు వాఁడును లేదు. (కొట్టుటయు లేదు, కొట్టఁబడుటయు లేదు.) ఒకఁ డు కొట్టుచున్నాఁడని తలఁచుచున్నాఁడు. మఱియొకఁడు కొట్ట లేదని తలఁచుచున్నాఁడు. ప్రాణుల పుట్టుకయును జావును స్వభా వముచేత నియతమైయున్నవి. ధనము నష్టమైనను, పెండ్లామేని బిడ్డఁడుగాని తండ్రిగాని మృతినొందినను,అప్పు 'డక్కటా! అక్క టా! ఏమిదుఃఖము!' అని యాక్రోశించి దానినే చింతించుచుండు టచే దుఃఖమును బయింబయి పెంచుకొనుచున్నాఁడు. నీ వేల మూఢునివలె శోకించెదవు? శోకింపఁదగనివారినిగూర్చి శోకించె దవే. (అదిదగదు). దుఃఖములందుఁ దగులుటచే దుఃఖములును, భయమునొందుటచేత మఱిమఱిభయములును బెరుఁగుచున్నవి. ఇంతేకాని మఱేమిలేదు.'ఈదేహముగూడ నాదికాదు. ఈభూమి యం దేదియు నాదిగాదు. ఇందలివస్తువులు నాకెట్లో యట్లె తక్కినవారికిని సొంతము' అని కనుఁగొనువాఁడు మోహము

నొందఁడు. శోకమునకు వేలకొలఁది కారణములుగలవు. సంతోష మునకును వేనవేలు కారణములున్నవి. ఇవి ప్రతిదినమును మూ ఢులనే పయికొనునుగాని పండితులనుగాదు. ఇవి యిట్లు కాలక్ర మమునఁ బ్రియములును ద్వేషింపఁదగినవియునై సుఖములుగను దుఃఖములుగను జూపట్టుచుఁ జక్రమువలె ప్రాణులయందుఁ జుట్టి వచ్చుచున్నవి. ఈలోకమందు దుఃఖమే కలదుగాని సుఖము లేదు; కాఁబట్టి దుఃఖమేయనుభవింపఁబడుచున్నది. దుఃఖము తృష్ణ యనుపీడవలనఁ బుట్టుచున్నది. సుఖము దుఃఖమనెడి పీడవలనఁ బుట్టుచున్నది. సుఖమునకు వెంట దుఃఖమును, దుఃఖమునకు వెం బడిని సుఖమును వచ్చుచున్నది. ఎప్పుడును దుఃఖమే కలుగదు. ఎప్పుడును సుఖమేకలుగదు. సుఖమెప్పుడును దుఃఖమునందు ము గియును; ఒకప్పుడు దుఃఖమువలననే పుట్టును. కాఁబట్టి శాశ్వత సుఖమునుగోరువాఁడీరెంటిని దిగవిడువవలయును. సుఖము, ము గియుటనుండియే దుఃఖముపుట్టవలయును. దుఃఖముముగియుట నుండియే సుఖము పుట్టవలయును. కాఁబట్టి దేని నిమిత్తము శోకముగాని, దుఃఖముచేత నతిశయించిన తాపముగాని, యాయాసముగాని కలుగుచున్నదో దానిని దేహమునందలి యొక యంగమైనను (పాముకఱచిన యంగమునుం బోలె) దిగవిడువవలయును. సుఖముగాని దుఃఖముగాని, ప్రియము గాని యప్రియముగాని, యేది ప్రాప్తించుచున్నదో దానిని వెనుదీయని మనసుతో భరించియే తీఱవలయును. నాయనా! ఇంతేల! నీ భార్యలకును బుత్రులకును నప్రియము నించుకంత యేనియుఁ గావింపుము; అప్పు డెవ్వ రెవ్వనివారో, యది యే హే తువుచేతనో, మఱి యేప్రకారముననో నీకుఁ దెలియఁగలదు.

ఎవరు మిక్కిలియు మూఢులో, ఎవరు బుద్ధి తుదను బొందినవా రో, వారే యీలోకమునందు సుఖము వెంపారుచున్నారు. ఈ యిరుతెగలకు నడిమివారు కస్తియే పడుచున్నా' రని యిట్లు ప్రాజ్ఞుఁడా సేనజిత్తు చెప్పెను. అతఁడు లోకమందుఁ గలమంచి సెబ్బరలను జక్కఁగాఁ దెలిసినవాఁడు; ధర్మములను సుఖదుఃఖము లను నెఱింగినవాఁడు పరుల దుఃఖమునకు దుఃఖించువాఁ డొక ప్పుడు సుఖమునొందఁడు. ఏలన దుఃఖములకుఁ దుదిలేదు. ఒక దుఃఖమునుండి మఱొక దుఃఖము పుట్టుచున్నదే! (దానికిఁ దుది యెక్కడిది? కాన యది తీఱినదిచూచి సుఖమందుటయు నెక్క డిది?) సుఖమునుండియు దుఃఖముపుట్టుచున్నది. లోకమందు సుఖమును దుఃఖమును సంపత్తియు విపత్తియు లాభమును నష్టియును చావును బ్రతుకును కాలగతిచే మాఱిమాఱి య న్నియుఁ గలుగుచున్నవి. కాఁబట్టి వానింబట్టి దుఃఖముచేఁ గలం గరాదు. సంతోషముచే నుబ్బరాదు. రాజులకు యుద్ధమందు దీక్షఁబూనుటయు రాజ్యమును బాలించుటయు దండనీతి చక్కఁ గాఁ జెల్లించుటయు యజ్ఞములందు దక్షిణలుగా ధనమొసంగు టయుఁ జక్కఁగా దానముసేయుటయు ధర్మమందురు. ఇవియ న్నియు రాజునకుఁ బావనము లయినవని తెలియునది. మంచి తెలివిగలిగి నీతితోడ రాజ్యమును బాలించుచు నహంకారము విడిచి యజ్ఞములుచేయుచు, ప్రాణులనెల్లను ధర్మదృష్టితో సమ ముగాఁ జూచుచు నుండుమహాత్ముఁడగురాజు దేహమును విడి చినపిదప దేవలోకమునందు సుఖించుచున్నాఁడు. యుద్ధములగె లిచి, రాజ్యమునుబాలించి, సోమరసమును బానముచేసి ప్రజల నుబెంచి జనులకు నీతిదప్పక దండమునెఱపుచు నాయువుముగి

సినపిదప దేవలోకమందు సంతోషించుచున్నాఁడు. రాజు యాగములుచేసి రాజ్యమునుజయించి, యందలిప్రజలను వారిప్రియములను రక్షించి, వేదములను శాస్త్రములను చక్కఁగా నధిగమించి, నాలుగువర్ణములను వారివారి ధర్మములందు నెలకొలిపి, యిట్లు రాజ్యమును జక్కం బాలించి పరిశుద్ధాత్ముండయి దేవలోకమందు మోద మొందుచున్నాఁడు. ఏరాజు స్వర్గమందుండిన నతని చరిత్రమును మంత్రులును బురజనులును దేశజనులును గొనియాడుచున్నారో యారాజే రాజులయం దుత్తముఁడు' అనెను. ఇది యిరువదియేనవయధ్యాయము.

*(అధికపాఠము)

---

## రాజధర్మపర్వము.

{ధర్మరాజు ధనము యాగదానాదులకే కాని భోగములకుఁ దగదని యర్జునునకుఁ జెప్పుట.}

ఈ యవసరమునందే ధర్మరాజు గొప్ప మతిగలవాఁడుగాన యర్జునినిజూచి యుక్తియుక్తమగు వాక్యమున "అర్జునా! 'ధనమునకంటె నెక్కుడయినది యొక్కటియు లేదు. ధనములేనివానికి స్వర్గములేదు; సుఖములేదు; ప్రయోజనములేదు' అని తలఁచుచున్నావుకాని యది నిజముగాదు. వేదాధ్యయన మనెడు

* ఇది దాక్షిణాత్యకోశములం దొకానొకటమాత్ర మున్నదని యధికపాఠముగా నధ్యాయసంఖ్యలేక ముద్రితమై యున్నది. ప్రతాపచంద్రరాయగారి ప్రతి యందు నధ్యాయములలోఁబడి గణితమై యున్నది. దాక్షిణాత్య ముద్రణానుపాఠముగా దీనిని దెనిఁగించుటంబట్టి యిట యధికపాఠముగా నంపఁబడియె.

యజ్ఞముచేత సిద్ధిని బొందినవారు పెక్కండ్రుజనులు చూపట్టుచున్నారు. తపస్సునందు నిరతులయి శాశ్వతములగు లోకములను బొందిన మునులును గనుపట్టుచున్నారు. ధనంజయా! వైఖానసులు 'బ్రహ్మచారులై సర్వధర్మములను దెలిసి ఋషులసమయమును రక్షించుచువచ్చు జనులను దేవతలు బ్రాహ్మణులనుగాఁ దెలియుచున్నారు. వేదాధ్యయనమందు నిష్ఠు లయినఋషులను జ్ఞానమందు నిష్ఠగలవా రగునితరఋషులను ధర్మమందు నిష్ఠగలవారినిఁగా నీ వెప్పుడును దెలియుచుండవలయును. కార్యములనెల్ల జ్ఞాననిష్ఠులగు వారియందే ప్రతిష్ఠింపవలయును. అనగా వారి యభిప్రాయముచొప్పున జరుపవలయును'. అని చెప్పినట్లు మనకుఁ దెలిసియున్నది. అజులు పృశ్నులు సికతులు అరుణులు కేతవులు ననుఋషులు వేదాధ్యయనముచేత దేవలోకమునొందిరి. వారు వేదోక్తములగు దానము అధ్యయనము యజ్ఞము భరింపఁ గష్టమగునిగ్రహము ననెడి యీ కర్మముల నాచరించి సూర్యునికి దక్షిణంబగుమార్గమున దేవలోకమునొందిరి. ఈలోకములు కర్మనిష్ఠులయినవారి లోకములని నేను బూర్వమును జెప్పియున్నాను. ఉత్తరంబగు మార్గముననో యోగనిష్ఠు లగువారు పయనముచేయుదురని తెలియఁగలవు. అది కొనిపోవునట్టివియు శాశ్వతములయి ప్రకాశించుచుండునట్టివియు యోగనిష్ఠులలోకములు. పురాణవిదు లయినవారీరెంటిలో నుత్తరమార్గమును బ్రశంసించెదరు. సంతుష్టియే మిక్కిలియుస్వర్గము. (సంతుష్టివలననే స్వర్గముఁ బొందఁగూడును) సంతుష్టియే పరమమైనసుఖము. (సంతుష్టివలననే పరమసుఖము కలుగఁగూడును.) సంతుష్టికంటె నెక్కుడయిన దొక్కటియు లేదు.

అది క్రోధము నుబ్బును నడఁచినవానియందుఁ జక్కఁగా నెలకొనుచున్నది; అది వానికి నుత్తమమయిన సిద్ధియగును. ఈ విషయమై తొల్లి యయాతి రాజుచెప్పినయీగాథ నుదాహరింతురు.- 'మనుష్యుఁడు తాఁబేలు తనయవయవములను ముడుఁచుకొనునట్లు వెలికి నిగుడు కామములనెల్ల నెప్పుడు లోపల నడఁచుచున్నాఁడో, ఎప్పుడు తానొకటికిని భయపడఁడో, తన వలనను నొకటియు భయమందదో, ఎప్పుడు తానేదియుఁ గోరకయు ద్వేషింపకయు నుండునో యప్పుడు బ్రహ్మమునొందుచున్నాఁడు. ఎప్పుడు మనుష్యుఁడు సమస్తప్రాణులందును మనసు వాక్కు కర్మ మనెడియీమూఁటిచేతను బాపభావము నెఱపఁడో, యప్పుడు బ్రహ్మము నొందుచున్నాఁడు. అభిమానమును మోహము నడఁచి పెక్కుసంగములను వీడి యాత్మస్వరూపము జ్యోతివలెఁ దెలియుచున్న సాధువు మోక్షమునకర్హుఁడగును. అర్జునా! నేను జెప్పు నీమాట, నింద్రియములు చిక్కఁబట్టి వినుము. కొందఱు ధర్మమును కొందఱు శీలమును మఱి కొందఱు ధనమును గోరుచున్నారు. (ధర్మమునకుఁ గారణమని) ఒకఁడు ధనము గోరవచ్చును; కానివానికి దానిని గోరకుండుటయే * మిక్కిలి గొప్పది. ధనమందును, ధనము మూలముగాఁ గలధర్మమందును బెక్కులుదోషములు గలవు. వానిని బ్రత్యక్షముగా నేను జూచుచున్నాను. నీవును దానిని జూడఁదగును. ధనమున కాశించువాఁడు తానవశ్యము వర్జింపవలసిన

* యజ్ఞాదులు చేయుటకుఁగాను సాధనముగా ధనమును గోరుటకంటె యజ్ఞాదులుచేయకయు నందులకై ధనమునుగోరకయు నుండుట మంచిదని యాశయము.

కర్మములను వర్జించుట మిక్కిలియుఁ గష్టము. ధనమును గడించుచుండువారికి నందు మంచికార్యములు చూపట్టుట మిక్కిలి యరిది. పరులకు ద్రోహముచేసినచో ధనముఁ బొందఁగూడునని చెప్పెదరు. ఏకారణమునఁ గలిగినను ధనము నానాభయము లనే కలిగించును. మంచినడవడి తప్పి శోకమును భయమును దలంపక యల్పమగువిత్తముకొఱకు మిక్కిలి యాశించువాఁడు పరులకు ద్రోహములుచేయును ; దానివలన భ్రూణహత్యగలిగినను గాని తెలియఁడు. పడయరానిధనమునుబడసి దాని నను కూలురయిన భృత్యుల కిచ్చినను దొంగలు దోఁచుకొనిపోయినట్లుంబోలె నిచ్చినపిదప మిక్కిలియుఁ బరితపించుచున్నాఁడు. కూలిపుచ్చుకొను భృత్యులును దోషముగలవారుగాఁ జూపట్టెదరు. ధనములేనివాని నెవఁ డేమన వచ్చును? వాఁడు సకలసంగములను వీడి తానుభిక్షించి * తెచ్చికొన్న యించుకంతదాని చేతను బొట్టఁబ్రోచికొనుచు సుఖముగానుండును. ధనముచేత నెవ్వఁడును సుఖమొందఁడు. ఈవిషయమై పురాణముల నెఱింగినవారు యజ్ఞసమూహములను గుఱించి వేదములందుఁ బ్రతిపాదితములయినది యగు యజ్ఞగీత మనుగాథను జెప్పెదరు— అదేమనఁగా 'బ్రహ్మ ధనములను యజ్ఞముకొఱకుఁ బడసెను.

---

* ఇట 'అధనః కస్యకింవాచ్యో విముక్తః సర్వశస్సుఖీ । దేవస్వ ముప గృహ్యైవ ధనేన నసుఖీభవేత్ 'అని మూలము. దేవస్వమనఁగా 'యద్ధనం యజ్ఞశీలానాం దేవస్వంతద్విదుర్బుధాః' అన్నట్లు యజ్ఞార్థమైనధనము. ధనము దేవతలసొమ్మగుటచేత నది పడసినవాఁడు సుఖమునొందఁడని యర్థాంతరము. భిక్షించితెచ్చుకొన్న యించుకంతయేనియు దేవస్వముగాఁ జెప్పుటయుఁ గలదు; కావ దానినిబట్టియు నర్థము చెప్పఁబడెను.

ఆధనమునురక్షించి యాగమును సేయుటకు మనుష్యునిని సృజించెను. కాఁబట్టి ధనమునంతయు యాగమునందే యుపయోగింపఁదగును. ధనమును దనయిచ్చ వచ్చినట్లు వినియోగించుట హితమును బ్రశస్తమునుగాదు' అనుటయే. అర్జునా ! నీవు ధనవంతులందు మేటివిగదే. బ్రహ్మ తనకార్యమగు యాగమునుద్దేశించి యాధనమును మనుష్యులకు నిచ్చుచున్నాఁడని తెలియుము. కావుననే యాధనమొక్కనికిని సొంతము గాదని ప్రాజ్ఞులు తెలియుదురు. కాబట్టి దొరకినధనము మనుష్యుఁడు శ్రద్ధతోడ దానమందును యాగమందును వినియోగింపవలయును. ఒకఁడు లభించినధనమును దానముచేయుట తగునేకాని భుజించుటయు నశింపఁజేయుటయుఁ దగవుకాదు. యాగము దానము నని చేయుటకు గొప్పకార్యము లుండఁగా ధనమును గూడఁబెట్టుటచేతఁ బసయేమి! ఎవరు బుద్ధిగొఱఁతవలనఁ దాము స్వధర్మమును దిగవిడిచినవారికి ధనమొసంగుదురో వారు దేహమువిడిచినపిదప నూఱేండ్లు పురీషమును భుజింతురు. తగనివానికిచ్చుటయుఁ దగినవానికి నీయకుండుటయు, అర్హుఁడు అనర్హుఁడని వివేచించి తెలిసికొనఁజాలమివలనఁ గలుగుచున్నది. కాఁబట్టి దానధర్మము సయితము దుష్కరము. లభించినట్టి ధనము నపాత్రమునకిచ్చుట, పాత్రమున కీయకుండుట యను రెండుదోషములును గలవని తెలియుము' అనెను.



## రాజధర్మపర్వము.

### ధర్మరాజు నిర్వేదించుటనుజూచి వ్యాసుఁడు రాజ్యపాలనము సేయ విధించుట.

ధర్మరాజు 'బిడ్డఁ డభిమన్యుఁడు హతుఁడయ్యెను ; ద్రౌపది కొడుకులును ధృష్టద్యుమ్నుఁడును విరాటుఁడును ద్రుపదుఁడును వృషసేనుఁడును ధృష్టకేతుఁడును మఱియు నానాదేశీయులగురాజవర్యులును యుద్ధమునందు హతులయిరి. ఇట్లింద ఱును హతులై యుండఁగా నిట్లు జ్ఞాతులను వధించిపుచ్చినరాజ్యాతురుని నన్ను శోకమెంతమాత్రము విడువకున్నది. నాకు రాజ్యమందుఁ గామము పెద్ద; నేను మిక్కిలి యుగ్రుఁడను; నావంశమును ద్రుంచివైచుటకు మూలభూతుఁడను. కాకేమి? నేనెవ్వని యొడియందుఁ బొరలి యాటలాడుచుంటినో యాభీష్ముని, నట్టి నేనే రాజ్యమునందుఁ బేరాసపట్టి యుద్ధమునఁ జంపితిని. అతఁడు శిఖండిని జూచుచుండఁగా వజ్రములంబోని యర్జునుని బాణములచే నానిమిత్తముకొట్టువడి సుడివడుచుండఁగాఁ జూచినప్పుడు, ముదిసిన సింహముంబోలెఁ బురుషసింహుఁ డగునాపితామహుఁడు మెఱయుచున్న బాణములు మేనంబర్వుచుండఁగాఁ జూచినపుడు, నామనసు కందికుందినది! ఎదిరిరథికులను గలంచినలంచునట్టి నాతాతయా భీష్ముఁడు పర్వతమువలె సుడివడుచుఁ గీడ్పడి తూర్పుమొగముగా రథమునుండి తూలిపడఁగా జూచినపుడు నామనసు కలంగఁబాఱెను. ఎవఁడు కేల ధనుర్బాణములు ధరించి కురుక్షేత్రమునఁ బరశురామునితోడఁ బెక్కుదినములు పోరుగావించెనో, ఎవ్వఁడు కాశియందుఁ గన్యాస్వయంవరమునఁ గూడియున్న భూమియందలి రాజులనెల్ల నేకరథుఁడై యుద్ధము

నకుఁబిలిచెనో, ఎవఁడెవ్వరికిని మార్కొనరాని యుగ్రాయుధుండను చక్రవర్తిని తనశస్త్రంపు వేఁడిమిచేఁ గాల్చిపుచ్చెనో, ఆకౌరవ్యుని, ఆగంగాపుత్రుని, భీష్ముని నేను యుద్ధమునఁ బడఁ గూల్చితినే! అతఁడు తనకు శిఖండిమృత్యువని తెలిసియు వానిని బాణములఁగూల్చినాఁడుకాఁడే ! అట్టి మహావీరుఁ డర్జునునిచేఁ గూలెనుగా ! మునీంద్రా ! అతండు పుడమిపయిఁ ద్రెళ్లి నెత్తుటం దోఁగుచుండఁగా నెప్పుడుచూచితినో యప్పుడే మిక్కిలి దెప్పరమయినజ్వరము నాలోనఁ జొచ్చినది! ఎవ్వఁడు మమ్ము బాల్యమునఁబెంచెనో, యెవఁడుమమ్ముఁ జక్కఁరక్షించెనో, యట్టియతనిని బాపియుఁ గురుఘాతుకుండును నగు నేను రాజ్యమునకు- నల్పకాలముండునట్టి రాజ్యమునకుఁ - బేరాసపడి తెలివిమాలి గూల్చితినే ! మఱిద్రోణుఁడో, ఆచార్యుఁడు; గొప్పవిలుకాఁడు; సకల రాజపూజితుఁడు; అట్టి యతనిని యుద్ధమునం దెదురుచని యతని కొడుకునుగుఱించి పాపినినేను వట్టిబొంకాడితిని. ఆయాచార్యుఁడు నన్ను 'రాజా ! నాకుమారుఁడు జీవముతో నుండు నేని నీవు నిజముచెప్పుము' అని యడిగినమాట నాయవయవములను దహించుచున్నదే ! నేను నిజమేపలుకుదు నని నెఱనమ్మకముచేత నాబ్రాహ్మణుడు నన్నడిగెను ; ఆగురునియెడ నేను, సత్య మనుకవచమునూడ్చి రాజ్యమందుఁ బేరాసగొన్న నేను, పెద్దలను జంపఁదెగినపాపుండ నగునేను, నేనుఁగు హతముకాఁగా నే యేనుఁగనుటను మఱుఁగుపఱిచి 'అశ్వత్థామహతుఁడయ్యెను' అని యబద్ధమాడితిని. మిక్కిలియుఁ జేయరాని యట్టికృత్యమును జేసిన నాకెట్టిలోకములు పొందఁగలుగునోకదా ! యుద్ధంబుల కెంతమాత్రము వెనుదీయని యన్నయగు కర్ణునిఁజంపితిని.

నాకంటె బెట్టిదుఁడగుపాపి యీలోకమం దెవఁడు? పర్వతము లందు సింహమువలె నుదయించినబిడ్డఁ డభిమన్యునిఁ బేరాసగొని ద్రోణపాలితం బగుసైన్యమునందుఁ జొరఁబడునట్లు చేసితిని. అదిమొదలు భ్రూణహత్యచేసినపాపివలె నర్జునుని గృష్ణునిని మొగమెత్తి చూడలేకున్నాను. దుఃఖమున కెంతమాత్రము దగని ద్రౌపది నైదుపర్వతములను బోఁగొట్టుకొన్న పుడమివలె నేపురుపుత్రులను దిగనాడుటదలంచి పొక్కుచున్నాను. ఇట్టిలోకమునకే నాశముపుట్టించిననేను మహాదోషిని; పాపిని. నేనిట్లే యుండి నాపాడుబొందిని శోషింపఁ జేసెద. పెద్దలనుజంపిన నేను, నిఁక జన్మాంతరములం దయినను కులఘాతుకుఁడు గాకుండుటకై యిట్లు ప్రాయోపవేశముఁ బూనియున్నానని తెలియుఁడు. మహర్షులారా! ఇఁక భుజింపను; ఏవిధమునను జలముపయోగింపను, ఇట్లేయుండి నేను బ్రియములయిన ప్రాణములను బోకార్చుకొనెదను. మహర్షులారా! మీరు నిచ్చలుపోవచ్చును. మిమ్ము మ్రొక్కి వేఁడుకొనుచున్నాను. ఈకళేబరము నిట్లే దిగవిడిచెదను; అందఱు నాకనుమతి యియ్యవలయును" అనెను. బంధుశోకమునకు విరవిరఁబోవుచు ధర్మరా జిట్లుచెప్పఁగా ఋషిసత్తముఁ డగువ్యాసుఁడు 'అట్లుకాదు' అని యడఁచి మరల నతనితో 'మహారాజా! నీవు మితిమీఱి శోకపడుట యెంతమాత్రము తగదు. ప్రభూ! ఇది యదృష్టమని మునుపు చెప్పియున్నాను. మరల దానినే చెప్పెదను. లోకమునందుఁ బుట్టినప్రాణులకు నీళ్లయందలి బుగ్గలవలె సంయోగ వియోగములు వచ్చుటయుఁ బోవుటయుఁ దప్పదు. ఒండొండకూడికలెల్ల నశింపకమానవు. పొడవు పెరిఁగినవెల్లఁ బడకతీఱదు. కూటమి తుది యెడఁబాటె.

బ్రతుకుతుది మరణమే. సుఖము ముగింపు దుఃఖమే. సోమరి తన మప్పటికి సుఖముగానుండినను దుదను దుఃఖమే యగును. పాటు అప్పటికి దుఃఖముగా నుండినను దుదిని సుఖము నిచ్చును. అణిమాదివిభూతులును, సంపత్తియు, లజ్జయు, ధైర్యమును గీర్తియుఁ బాటుపాడువానియం దుండునే కాని సోమరి యందుండవు. సుహృదు లెందఱుండినను సుఖమునకుఁ జాలరు. శత్రువు లెందఱయినను దుఃఖమునకుఁ జాలరు. ప్రజ్ఞయెంతయినను ధనములొందుటకుఁ జాలదు. ధనములవలన సుఖము గలుగఁజాలదు. కౌంతేయా! దైవము నిన్నెట్టికర్మములు చేయుటకు సృజించినదో యట్లె వానిని జేయుము. అందువలననే నీకు సిద్ధి కలుగును. రాజా! నీయంతకు నీ వొడయుఁడవుగావు' అనెను. ఇది యిరువదిమూఁడవయధ్యాయము.

---

## రాజధర్మపర్వము.

(వ్యాసుఁడు ధర్మరాజునకు నశ్మజనకసంవాదమును జెప్పి క్షాత్రధర్మమును విధించుట.)

ధర్మరాజు జ్ఞాతిశోకమునఁ బరితపించుచుఁ బ్రియములయిన ప్రాణములను విడువఁగోరుచుండఁగా వ్యాసుఁ డతని శోకమును బోకార్చి 'పురుషతిలకా! ఈ విషయమై పురాతనమయిన యితిహాసమొకటి నుదాహరించెదరు. దాని పేరు అశ్మగీత. దానిని జెప్పెదవినుము. విదేహరాజగుజనకుఁడు దుఃఖశోకములు తన్నుఁ బైకొనఁగాఁ బ్రాజ్ఞుం డయినయశ్మున డను బ్రాహ్మణునిఁ జూచి సందేహము నడుగువాఁడై 'బంధువులును ధనమును

వచ్చునపుడును బాసిపోవునపుడును తన శుభమునుగోరిన మను
ష్యుఁడెట్లుండవలయుననీ'' అనియడిగెను. అందుల కశ్వుఁడు 'ఈ
దేహ ముత్పత్తినొందినతోడనె యాయాదుఃఖములును సుఖము
లును దీనిని వెంబడించుచున్నవి. ఆ రెంటిలో నేదేనియొకటి కలుగ
వచ్చునుగాన యట్లు కలిగినప్పుడు దానియందే మనస్సు చెల్లించు
చుండినయెడల నది, గాలి మబ్బులనుంబోలె, వాని తెలివిని హరిం
చివైచును. (ఒకఁడు సుఖమందున్నపుడు) 'నేను గొప్పకులమునఁ
బుట్టినవాఁడను. సిద్ధిగలవాఁడను. (ఏదితలఁచినను చేయంగలవాఁ
డను) నేను సాధారణమనుష్యుఁడను గాను' అను నీ మూఁడు
తెఱఁగుల కారణములచే వానిమనసు మిక్కిలి క్లిన్నమగును. మన
స్సు భోగములందుఁ దగులువడఁగాఁ దండ్రికూడఁబెట్టిన ధనము
నంతయువెచ్చించి యన్నియు మిక్కిలి తఱిఁగి బీదవడఁగాఁ
బరుల సొమ్ములను గ్రహించుట మంచి దని తలంచుచున్నాఁడు.
రాజు లట్లుమేరమీఱి యయుక్తముగా నితరులసొమ్ము నపహరించు
వానిని, బోయవాఁ డమ్ములచేత జింకను గారించునట్లు, దండించు
చున్నారు. అట్టి మనుష్యు లిరువదియేండ్లో ముప్పదియేండ్లో
వయస్సుగలిగి యంతకే రాజదండనాదులచేఁ దీఱుదురుగాని నూ
ఱేండ్లవఱకు నుండుటగలుగదు. రాజు సమస్తప్రాణుల నడవడు
ల నప్పుడప్పుడు పరిశీలించుచు, నట్లు దొంగతనము మొదలగు
వానిచే మిక్కిలియు దుఃఖితు లయినవారికిఁ దనబుద్ధిచేత వలయు
మందు గావింపవలయును. మనస్సు తబ్బిబ్బో, అనిష్టములు వచ్చు
టయో, యీ రెండుమాత్రమే మానసదుఃఖములకుఁ గారణము
లు ; కాని, మూఁడవకారణము కలుగనేరదు. మఱియు నిటు
వంటివగు నాయాదుఃఖములును విషయస్పర్శమువలనఁ గలుగు

దుఃఖములును మనుష్యుని వెంబడించుచున్నవి. ఇట్లుండు నపుడే ముదిమియు మరణమును, రెండు తోఁడేళ్లవలె, ప్రాణులను బలముగలవానినో, దుర్బలములనో, పొట్టివానినో, పొడుగగువానినో, యన్నిటినిబట్టి మ్రింగుచున్నవి. ఏమనుష్యుఁడుగాని, సముద్రపర్యంత మయినయీ భూమండలమును జయించినవాఁడేని, యీజరామరణములను జయించువాఁడొకప్పుడును లేఁడు. ప్రాణులకు సంభవించునది సుఖమో దుఃఖమో యనుభవింపవలయును. ఇది యవశము. దీనిని దప్పించుకొనుటకు వీలులేదు. ఎలఁబ్రాయముననో, నడిమి వయస్సుననో, ముదిమియందో, దాను గోరినవిగాని గోరనట్టివిగాని యగువిషయములువచ్చినఁ ద్రోసిపుచ్చఁ దరముగాదు. అప్రియములతోడి కూడికయు, మిక్కిలిప్రియములతోడి యెడఁబాటును, సంపదలును, ఆపదలును, సుఖమును, దుఃఖమును, నదృష్టము ననుసరించుచున్నవి. ప్రాణుల పుట్టుకయుగిట్టుటయు, లాభములను నష్టములనుబొందుటయు, నన్నియు విధిచేత నేర్పడియున్నట్టివగును. వాసనయు, రూపును, రసమును, స్పర్శమును, స్వభావముచేతనే కలుగునట్లు, సుఖములును దుఃఖములును విధి ననుసరించియే కలుగుచున్నవి. కూర్చుండుటయుఁ బరుండుటయు, పోవుటయు లేచుటయు, త్రాగుటయుఁ దినుటయుఁ బ్రాణులకన్నిటికిని గాలముచేతనే కలుగుననుట నిశ్చయము. వైద్యులుగూడ రోగులయ్యెదరు. బలవంతులును బలహీనులయ్యెదరు. * నపుంసకులును బడఁతులు గలవారయ్యెదరు. దీనిని జూ

---

* 'స్త్రీమన్తశ్చాపరే షణ్ఢాః' అని మూలము. 'శ్రీమన్త శ్చాపరే షణ్ఢాః' అని పాఠాంతరము. ధనవంతులును దరిద్రు లగుదురని యర్థము.

డఁగాఁ గాలగతి విచిత్రముగానున్నది. గొప్పకులమునఁ బుట్టుటయు, తెవులులేకుండుటయు, చక్కఁదనమును, వీర్యమును, సంపత్తియు, ఉపభోగమును, విధిచేతనే దొరకొనును. దరిద్రులు కోరకున్నను పుత్రులు మిక్కిలియుఁ బెక్కండ్రు కలుగుచున్నారు. ధనసమృద్ధిగలవారికి నొక్కబిడ్డఁడును గలుగఁడు. విధిచెయ్యి విచిత్రమయినది. వ్యాధి, జలము, ఆయుధము, అగ్ని, ఆఁకలి, విషము, జ్వరము, మరణము, పయినుండిపడుట మొదలుగాఁగల యేయాపదయందే మనుష్యుఁడు పోవునట్లు విధియేర్పఱిచినదో వాఁడామేరనే పోవుచున్నాఁడు. *లోకమునఁ గొందఱు మేరతప్పి నడవకున్నను బెక్కుడునులు పడుటయు, మఱికొందఱు మేరతప్పి నడచుచున్నను నిడుమకుఁబట్టువడకుండుటయుఁ జూపట్టుచున్నది. మిక్కిలి ధనముగలవాఁడెల్లప్పాయమందే నాశమొందుటచూపట్టుచున్నది. మిక్కిలి కష్టపడుచున్న దరిద్రుఁడు ముదిమితోఁగూడ నూఱేండ్లు బ్రతుకుచున్నాఁడు. †చెడుకులమునఁబుట్టినమనుష్యులు చిరజీవులుగాఁ జూపట్టుచున్నారు. పెంపుసొంపుగల మంచికులమునఁబుట్టినవారు మిడుతవలె నశించెదరు. లోకమునందు బహుతరముగా సంపదగలవారికి భుజించుటకు శక్తియుండదు. బీదలకు

---

*ఇందులకు 'దృశ్యతే నాప్యతిక్రామ న్ననిష్కాన్తోఽథవాపునః। దృశ్యతేచాప్యతిక్రామన్నని గ్రాహ్యోఽథవాపునః' అని మూలము. విధిని గడచినవాఁడును, విధినుండి వెలుపడినవాఁడును ఒక్కఁడునులేఁడు. విధియందుఁ బట్టుపడనివాఁడును లేడని యర్థాంతరమొకటి చూపట్టుచున్నది.

†దీనికి 'అకులీనాశ్చపురుషాః' అనిమూలము. 'అకిఞ్చనాశ్చపురుషాః' అని దాక్షిణాత్యపాఠము. 'దరిద్రశ్చ పరిక్లిష్టః శతవర్షో జరాన్వితః' అని మున్ముందె చెప్పియుండుటంబట్టి మరల అకించనునిఁ జెప్పుట అసమంజసము.

మిక్కిలియు కట్టెలును తాలును జీర్ణమగును. ఒకఁడు కాలము చేతఁ బ్రేరితుఁడై తానొకటిచేసినను 'నేనే దీనిని చేయుచున్నా' నని తలంచుచున్నాఁడు. దురాత్ముఁడు తనకుఁగలవానితోఁ దనివి నొందక యేదేదియిష్టమో యట్టిపాపము నెల్లఁ జేయుచున్నాఁడు. వేఁట, జూదము, పడఁతి, పానము, వివాదములును, పండితులచే నిందితములయినవి; కాని మిక్కిలి చదువరు లయిన పురుషులును వీనియందుఁ దగిలియుండుట చూపట్టుచున్నది. ఇట్లు చూడఁగా సమస్తమయిన విషయములు నిష్టములయినవియు ననిష్టములయినవియును, కాలముచేతనే సమస్త ప్రాణులను బొందుచున్నవి. వేఱుకారణము కనుపట్టకున్నది. వాయువు, ఆకాశము, అగ్ని, చంద్రుఁడు, సూర్యుఁడు, పగలు, రాత్రి, నక్షత్రములు, నదులు, పర్వతములుననెడి వీనినెవఁడు చేయుచున్నాఁడు? ఎవఁడుభరించుచున్నాఁడు? శీతమును, ఉష్ణమును, వర్షమును గాలముచేతనే చుట్టివచ్చుచున్నవి. ఇట్లే మనుష్యులకు సుఖములు నుదుఃఖములును గాలముచేతనే కలుగుచున్నవి. మందులును, ఆయుధములును, హోమములును, జపములును, మనుష్యుని ముది మియు, మరణమును బోఁగొట్టి రక్షింపఁజాలవు. మహాసముద్రమందుఁ గట్టెయుఁగట్టెయు నెట్లుచేరునో, చేరినపిదప నెట్లుపాసిపోవునో, యట్లెప్రాణులకూడుటయుఁ బాయుటయునుండును. ఇంపయిన గీతములతోను వాద్యములతోను బూవుఁబోండ్లసంగడిని నుపచరింపఁబడు ధనికులయందును, ఏదిక్కును లేక యొకరిపిండమున నెప్పుడును గడుపుఁ బ్రోచికొనుచుండు బీదలయందును, గాలమొకటేవిధముగా నడచుకొనుచున్నది. ఈసంసారములందు నింతవఱకువేనవేలు తల్లులును, దండ్రులును, వందలకొలఁది పుత్రులును,

బెండ్లములును ననుభవించినదైనది. వాస్తవమునకు వారెవ్వరి వారు ? మన మెవ్వరివారము ? మనుష్యున కెవ్వరును సొంతము గారు. వాఁడు నెవ్వరికిని సొంతముగాఁడు. (మనుష్యున కెవ్వఁడును సతముగాఁడు. వాఁడు నెవ్వరికిని సతముగాఁడు) పెండ్లము బందుగులు చెలికాండ్రు నను వీరితోడి కూడిక, దారిలో (సత్రములు చలిపందిరి మొదలగువానియందుఁ) గూడు కూడికవంటిదే యగును. మనుష్యుఁడు 'ఎక్కడ నున్నాను ? ఎక్కడికిఁబోయెదను ? నే నెవ్వఁడు ? ఇక్కడి కేల వచ్చితిని ? దేనినిగూర్చి యెందులకుఁగాను శోకించెదను ' అని యాలోచించి మనసును గుదురుపఱచుకొనవలయును. సంసారము చక్రమువలెఁ దిరుగుచుండునది. అందుఁ బ్రియులయిన వారితోఁగూడి మాడియునికి సతముగాదు. కాఁబట్టితోఁబుట్టువు, తల్లి,తండ్రి చెలి,వీరందఱును దారిలోఁ గూడిన కూడికలే. కాన బంధులమరణమును గూర్చి దుఃఖింపరాదు. పరలోకమో కన్నులకెదుటఁ జూచునట్టిదిగాదు. అందు సుఖం బుండఁగోరు వారు శాస్త్రములను గడవక నమ్మికగలిగియుండవలయు నని తెలిసినవారు చెప్పెదరు. తెలిసినవాఁడు పితరులకును దేవతలకును వలయు కర్మములను జేయవలయును. మఱియుం గల ధర్మకార్యములను యాగములను ధర్మార్థకామములను విధ్యుక్తముగా నాచరింపవలయును. ఈ జగము ముదిమి జావు ననెడు పెనుమొసళ్లుగలిగి మిక్కిలి లోఁతయిన కాలసముద్రమందు మునుఁగుచున్నదని కట్టా ! యెవ్వఁడును దెలియకున్నాఁడు. ఆయుర్వేదము నభ్యసించుచున్నవారయ్యును వైద్యులు పెక్కండ్రు తామేకాక తమకుటుంబమువారితోఁ గూడ

రోగములందుఁ గష్టపడుచుఁ జూపట్టుచున్నారు. వారు పలువిధ ములయిన కషాయములను నేతులను ద్రాగియు, సముద్రము చెలియలికట్టను గడవలేనట్లు, మృత్యువును గడవలేకున్నారు. తెవులును ముదిమిని బోఁగొట్టి యాయువును నిలుపునట్టి రసాయనమును దెలిసి దానిని మోతాదుచొప్పున నుపయోగించి నను, నేనుఁగులు తమకంటె మేటియేనుఁగులచేతఁ గొట్టువడు నట్లు, ముదిమిచేఁ గొట్టువడుచున్నారు. అట్లే వేదాధ్యయన మందునిరతులయ్యుఁ, దపస్సుచేసియు, దానములను యజ్ఞములు నుం గావించియు, జరామరణములను దాఁటినారుగారు. పగళ్లును మాసములును సంవత్సరములు నెప్పుడు విరమింపవు. పుట్టుకనొందిన ప్రాణులకన్నిటికిని మరలఁ గూడిక కలుగునటుట లేదు. (పుట్టిన ప్రాణులకన్నిటికిని పోయిన సంవత్సరములును నెలలును పగళ్లును మరలిరావు. కూడికలును మరలఁగలుగవు.) ఇట్లునికి నిలుకడ లేనిమనుష్యుఁడు విరివియై తప్పక కలుగు నట్టి (సంసార) మార్గమును వెల్లువచేత నీడ్వఁబడినవాఁడుం బోలె నవశుండై కాలముచేతఁ బొందుచున్నాఁడు. ఆ మార్గమును సకలమయిన ప్రాణులును బొందునట్టిది. దేహము జీవునినుండి కలిగినదో, లేక జీవుఁడు దేహమునుండి కలిగెనో యేది యెట్లయినను బెండ్లములతోను బంధువులతోను గూడిక దారియందలి కూడికవంటిదే యగును. ఒకటి మఱిదేనితోఁ గాని యెన్నఁటికిని పీడనికూటమి నెప్పుడును బడయఁజాలదు. తన శరీరముతోనయిన నట్టికూడికఁ బడయనేరదనఁగా మఱొక్కదానితోఁ జెప్పనేల? రాజా! ఇపుడు నీ తండ్రియెక్కడ? నీ తాతలెక్కడని నీ విపుడు వారిని జూడవు. వారును నిన్నుఁ

జూడరు. స్వర్గమును, నరకమును, గన్నారఁజూచినవాఁడు లేఁడు. ఈవిషయమై యాస్తికులకు వేదమేకన్నుఁనీ వాకన్నుచూపిన ట్లాచరింపుము. ఒకఁడు పితరులయు దేవతలయు మనుష్యులయు ఋణములు దీర్చుకొనుటకు నసూయమాలి బ్రహ్మచర్యవ్రతము నాచరించి పుత్రులంగని యాగములను జేయవలయును. మొదట బ్రహ్మచారిగానుండి భిక్ష మొదలగు ధర్మములనడపి పిదప మనస్సునందలి కష్టములనుదొలఁగించి యాగములును జరిపి పుత్రులనుగని యిహమును బరలోకమును ననుభవించుటకై బరమాత్మను నారాధింపవలయును. తనకు విహితములయిన ద్రవ్యములను మాత్రముగయికొనుచు,స్వధర్మమును జక్కఁగా నాచరించి, రాజ్యమును వృద్ధినొందించు రాజుకీర్తి చరాచరములయిన సకలజగత్తులందును మీఁదు మిక్కిలిపెరుఁగును'అనెను. ఇట్లశ్మని హేతుసంపన్నము లయినవాక్యములను గడవలకు విని విదేహరాజగుజనకుండు బుద్ధితెలివొంద శోక ముడిగి యశ్మని వీడుకొని తనగృహమునకుఁ బోయెను. ధర్మరాజా! నీవింద్రునకు సాటియగువాఁడవు గదే! నీవు నిష్ఫ డాచొప్పననే శోకమును విడిచి లెమ్ము. సంతోషమునొందుము. క్షత్రియధర్మముచొప్పున నీవు జయించి యున్నయీభూమిని బరిపాలింపుము. దీని నవమానింపకుము" అనెను. ఇది యిరువదియేడవయధ్యాయము.

---

## రాజధర్మపర్వము.

(నారదుఁడు సృంజయునకుఁ జెప్పిన షోడశరాజ చరిత్రమును గృష్ణుఁడు ధర్మరాజునకుఁ జెప్పుట.)

ధర్మరాజేమియుఁ బలుకకుండుటనుజూచి యర్జునుఁడు హృషీకేశుం డగుకృష్ణునిఁజూచి 'మాధవా! పరంతపుఁడగుధర్మపుత్త్రుఁడు, జ్ఞాతిశోకముచేఁ బరితపించుచు దుఃఖసముద్రమందు మునిఁగి యున్నాఁడు. ఇతని నూఱడింపుము. జనార్దనా! మరల మేమం దఱమును విపత్తును సంశయింపవలసినస్థితికి వచ్చితిమి. నీవు మహాప్రాజ్ఞుండవు. ఇతనిశోకమును దుదముట్టఁ బోకార్పఁదగుదువు' అనెను. ఇట్లర్జునుఁడు చెప్పినది విని పుండరీకాక్షుఁడు కృష్ణుఁడు రాజువంకఁ దిరిగెను. ధర్మరాజునకుఁ గృష్ణు నతిక్రమించి నడువరాదు గదా! ఏలనఁగా- బాల్యమునుండి కృష్ణుఁడు ధర్మరాజునకు నర్జునునికంటె నెక్కుడుప్రియుఁడై యుండెను. కృష్ణుఁడు చందనపుఁబూఁతగలిగి జాతికంబమువలె డంబుగులుకు ధర్మరాజుచేతిని దననిడుదచేతఁ బట్టుకొని వినువారలకెల్ల వేడుకపుట్ట నిట్లనియె. అపుడు మురువయినపలువరుసయు సొగసయిన కన్నుఁగవయుఁ జెన్నారు నతనినెమ్మొగము సూర్యుఁ డుదయింపఁగా విరిసిన తామరపూవువలె మిక్కిలియుఁ దేటగాఁ బ్రకాశించెను. అతఁడు ధర్మరాజుతో 'పురుషసింహమా! శోకము వలదు; దీనివలన నీయవయవములు వాడుచున్నవి. ఈయుద్ధమునను హతు లయినవారు మరల నీకెంతమాత్రము దొరకుట యరిదిసుమీ! కలయందుఁ గన్నలాభములు మేలుకొనఁగాఁ బొల్లయినట్లె మహాయుద్ధమందు గతించినరాజులు మరలవచ్చుట

వట్టిదిసుమీ ! యుద్ధమందుఁ జెలువుగులుకు చుండినయాశూరు లందఱును నెదుర్కొని నిలిచి నిహతులయి రేకాని వారియం దొక్కఁడేనియు వెనుక ప్రక్కఁగానిపరుగెత్తిపోవుచుండఁగఁగాని కూల్పఁబడినవాఁడుగాఁడు. ఇట్లు వీరలందఱును మహాయుద్ధమందు వీరులవలెఁ బోరాడి ప్రాణములువిడిచి యాయుధముల దెబ్బలచేఁ బవిత్రులై దేవలోకమునొందిరి. అట్టివారినిగుఱించి నీవు శోకించుట న్యాయముగాదు.క్షత్రధర్మపరాయణులై వేదవేదాంగపారంగతులైనయాశూరులు వీరులు పొందుపుణ్యగతిని బొందిరి.మహానుభావులయినరాజు లిట్లు మృతులయినది విని నీవు శోకించుట యెంతమాత్రము దగదు. ఈ విషయమై పుత్రశోకమున నాఱటపడుచున్న సృంజయునకు నారదుఁడు చెప్పిన యీ పురాతనమయిన యితిహాసము నుదాహరించుచున్నారు.

నారదుఁడు'సృంజయా! నేనును నీవును మఱితక్కిన ప్రజలును సుఖదుఃఖములనుండి విడివడకయే మృతినొందఁగలరు. అందులకు వగవనేల. తొల్లి యుండినరాజులమహత్త్వమును జెప్పెదను. కొంచె మాలించి వినుము. రాజా ! మృతులయిన మహానుభావు లగు రాజులను విన్నమాత్రమున నీదుఃఖము వీడిపోవును. తాపము నుడుపుము. నేను జెప్పునది విస్తరించి వినుము. పూర్వు లయిన రాజులచరిత్ర ముదారమును మనోహరమునై గ్రహములక్రూరత నుడిపి యాయువును వర్ధిల్లఁజేయునది; ఉత్తమమయినది. సృంజయా! అవిక్షిత్తుకుమారుఁడయిన మరుత్తుఁడు మృతుఁడగుట వినుచున్నారము. మహాత్ముండయినయతని యాగమందు నింద్రుఁడు వరుణుఁడు బృహస్పతి మొదలయిన దేవతలును సృష్టికర్తలును బ్రత్యక్షముగా వచ్చిరి. అతఁడు

తాను జేసినయాగములచేత దేవరా జయినయింద్రుని నసూయపడునట్లు గావించెను. ఇంద్రుని ప్రియమునుగోరి విద్వాంసుఁడగు బృహస్పతి యతనియొద్దకుఁబోయి 'ఇఁక యాగముచేయవల' దని యాక్షేపించెను. అట్లయ్యును, నతనితమ్ముఁడయిన సంవర్తుఁ డనుఋషి యాదేవగురుని యిష్టమొనఁగూడకుండునట్లు లా రాజునకు యాగముచేయించెను. మరుత్తుఁడు రాజయి భూమిని బాలించుచున్న కాలమందు, నేల దున్నుట మొదలగు పనులులేకయే పంట లవ్వారిగా నెల్లయెడలఁబండి వెలుంగుచుండెను. ఆమహాత్ముఁడు చేసినసత్త్రయాగమందు విశ్వేదేవతలు సదస్యులుగాను,మరుత్తులు సోమపానముచేయుఋత్విజులుగాను, సాధ్యులును దక్కిన దేవతలును బరిచారకులుగాను, నుండిరి. అతఁ డొసంగిన దక్షిణలు దేవతలకును మనుష్యులకును గంధర్వులకును మిక్కుటముగా నుండెను. సృంజయా! నీకంటెను నీపుత్రునికంటెను, ధర్మము, జ్ఞానము, ఐశ్వర్యము, వైరాగ్యము ననెడియీనాలుగింట మిక్కిలి యతిశయించిన యాపుణ్యాత్ముఁడు మరుత్తుఁడే మృతుఁడయ్యెనేని నీపుత్త్రుఁడట్లయినందులకుఁ బరితపింపకుము. వితిథుని పుత్త్రుఁడయిన సుహోత్త్రుఁడును గాలగతినొందెనని వినుచున్నారము. అతఁడు రాజుగానుండు కాలమున నింద్రుఁ డాతని ప్రియమునకుఁగాను నొక సంవత్సరము బంగారువాన గురియించెను. భూమి యతనికాలమున వసుమతి యనుపేరు సార్థకముగాఁ గలదియాయెను. నదులందు బంగారు నీరు ప్రవహించెను. లోకపూజితుఁడయిన యింద్రుఁడు నదులందు చేఁప, ఎండ్రి, తాఁబేలు,మొసలి, తిమింగిలములను వీనిని బంగారుమయము లయినవానిని గావించెను. బంగారుమయము

లయి వేలకొలఁదిగా నున్నవానినిజూచి సుహోత్రుఁడు విస్మయ మొందెను. ఇట్లువ్వారిగా నిండినబంగారము నతఁడు కురుక్షేత్రమున విస్తరించి గావించిన యాగమందు బ్రాహ్మణుల కొసంగెను. సృంజయా! నీకంటెను నీపుత్రునకంటెను ధర్మాదులు నాలుగింట మిక్కిలి యతిశయించిన మహాపుణ్యుండగు సుహోత్రుఁడు మరణమొందెను. శ్వైతపుత్రా! ఏయొక యాగమును దక్షిణయులేని నీదుపుత్రుఁడు మృతుఁడయినందులకుఁ గుందకుము. శోకమువలదు; సయింపుము. సృంజయా! అంగదేశపురాజు బృహద్రథుండనెడివాఁడు మృతుఁడయినట్లు వినుచున్నారము. అతఁడు తెల్లనివన్నెగల పదిలక్షలగుఱ్ఱములను, బంగారుభూషణములచే నలంకృత లయినపదిలక్షలకన్యలను దానముచేసెను. విస్తరించి దానముచేసిన యాగమందు పద్మమాలికలు దాల్చిన పదిలక్షలయేనుంగులను, బంగారుసొమ్ములుగలవై వేయియూవుల ననుచరించు కోటియెద్దులను, నతఁడు దక్షిణగానొసంగెను. విష్ణుపద మనుపర్వతమందు నతఁడుచేసిన యాగమున సోమపానముచేసి యింద్రుఁడు మత్తునొందెను. దక్షిణలచేత బ్రాహ్మణులు నలరిరి. వందలకొలఁది నతఁడు చేసిన యాగములందు దేవతలకును గంధర్వులకును మనుష్యులకును దక్షిణలు మిక్కిలి యెక్కుడయ్యెను. * సోమసంస్థలను నేడుయాగములందు నా యంగరాజొసంగిన దక్షిణవలె దక్షిణ నిచ్చు మనుష్యుఁడు నింతకుముందును లేఁడు, ఇఁకమీఁదను గలుగఁడు. ధర్మాదులు నాలుగింట నిన్నును నీపుత్రుని మిక్కిలి

* అగ్నిష్టోమము, అత్యగ్నిష్టోమము, ఉక్థ్యము, షోడశి, అతిరాత్రము, వాజపేయము, అప్తోర్యామమని యాగములేడు.

యతిశయించిన పుణ్యాత్ముఁ డాయంగరాజే మృతినొందెను. నీ పుత్త్రుఁడు పోయినందులకు వగవవలదు. సృంజయా! ఉశీనరుని పుత్త్రుఁడయిన శిబియను రాజు మరణించుటను వినుచున్నారము. అతఁ డీభూమినంతయుఁ దోలువలెఁ జుట్టగాఁ జుట్టెను; గంభీర మయిన తన రథధ్వనిచేత భూమి ధ్వనించునట్లు చేసెను. జయ ప్రదం బగునొకరథమునం దారూఢుఁడై భూమిని దనయేక చ్ఛత్త్రమునకు లోనుగావించెను. ఆశిబి, యడవియందున్న గోవు లతోఁగూడఁ దనకుఁ గలగోవులు గుఱ్ఱములు నన్నిటిని యాగ మందు దానముచేసెను. 'సమస్త రాజులందును, నింద్రసమాన పరాక్రముం డయిన యాయుశీనరుపుత్త్రుఁడగు శిబియను రాజర్షి కంటె వేఱొకరాజు నతని భారము వహింపఁ గలిగినది లేదు; ఇఁకఁ గలుగఁబోవుటయు లేదు' అని బ్రహ్మదేవుఁడును బలం చెను. నీకంటెను నీదు పుత్త్రునకంటెను ధర్మాదులు నాలుగింట మిక్కిలియు నతిశయించిన యామహాపుణ్యుఁడు శిబిరాజే మర ణించెను. ఒకదక్షిణయు నొకయాగమును లేని నీదుపుత్త్రుఁడు మృతినొందినది తలఁచి నీవు శోకముపడవలదు; తపింపనువలదు. సృంజయా! దుష్యంతునకు శకుంతలయందుఁ బుట్టినవాఁడును మహాత్ముండును ధనసంచయముల మిక్కిలియుఁ గలవాఁడును నగుభరతుఁడును గాలమునొందెనని వినుచున్నారము. అధిక పరాక్రమశాలియైన యాభరతుఁడు మున్ను దేవతలను గుఱించి యమునా నదితీరమందు మున్నూఱును సరస్వతితీరమందు నిరు వదియు, గంగగట్టునందుఁ బదునాలుగును, దక్కిన చోట్లయందుఁ బెక్కులునుగా వేయి యశ్వమేధములును నూఱు రాజసూయ ములును గావించెను. మనుష్యు లాకసమును జేతులచేతఁ బిడికి

లింపఁజాలనట్లు, సకలరాజులు నాశ్చర్యంబగు భరతునికార్యమును ననుసరింప శక్తులుగారు. అతఁడు యాగవేదికలను విస్తరించి వైచి వేయింటికి నెక్కుడు గుల్మములను గట్టెను. ఆ యాగ శాలయందు భరతుఁడు కణ్వునికిఁగాను వేయి పద్మముల (నూఱుకోట్ల) సంఖ్య గలగోవుల నొసంగెను. నీకంటెను నీ పుత్రునకంటెను ధర్మాదులు నాలుగింట నెంతయో యతిశ యించిన యామహాపుణ్యుఁడు భరతుఁడే మృతినొందెను. నీ పుత్రుఁడు మరణించినందులకుఁ దాపము నొందకుము. సృంజ యా! దశరథకుమారుఁ డయినరాముఁడు మరణించెనని విను చున్నారము. అతఁ డెప్పుడును బ్రాణులయం దౌరసపుత్రుఁడుఁ బోలెఁ బ్రీతినెఱపుచు వచ్చెను. అతని దేశమందు ధనములేని వాఁడును, గష్టపడువాఁడును గలుగఁడు. రాముఁ డందఱకును దండ్రివలెనుండి రాజ్యము నేలుచువచ్చెను. అతఁ డేలుచుండు నపుడు కాలముతో వానగురిసి పంటలువర్ధిల్లి యెప్పుడును సుభి క్షముగానే యుండెను. రాముఁడు రాజ్యపాలనము చేయు కాలమందు, ప్రాణులకు జలమందు మునిఁగిపోవుట, అగ్నిచేతఁ గాలుట, దుష్టమృగములవలన నుపద్రవము గలుగుట మొద లయిన కీళ్లుగలుగవు. స్త్రీలును, బురుషులు నేవ్యాధియు లేక వలయుసిద్ధులం బడసి వేయేండ్లు సుఖం బుండిరి. ఒండొరులకు వివాదమనునది స్త్రీలయందును గలుగదనఁగా నికఁ బురుషుల యందెక్కడిది? ప్రజ లేభయమునులేక యిచ్చవొప్పన సంచ రించుచు వలయుసిద్ధుల నొంది సంతోషముఁబడసి యథార్థ మయిన నియమముతో నెప్పుడును ధర్మము లాచరించుచు నుండిరి. అతని రాజ్యమందు వృక్షములన్నియు నాటంకములేక

న్నేకాలమందును బూవులును బండ్లునునిండి పొదలుచుండెను. గోవులన్నియుఁ దూమెడుపాలుపిదుకుచుండెను. మహాతపస్వియగు నారాముఁడు పదునాలుగేండ్లు వనవాసముచేసి పిదప నేయడ్డియు లేక సందఱును గొనియాడునట్టి యశ్వమేధములు పదిగావించెను. సుందరమగు నెమ్మొగమును, నెఱ్ఱనిగన్నులును, సింగమువంటి వెడందఱొమ్మును, జానువులవఱకు వ్రేలుబలువయిన బాహువులును యూథపతియైన యేనుంగువలె నల్లనిరూపును, యౌవనప్రాయమును గలరాముఁడు పదునొకొండువేల సంవత్సరము లయోధ్యకు నధిపతిగానుండి రాజ్య మేలుచువచ్చెను. నిన్ను నీదుపుత్రుని ధర్మాదులు నాలుగింట మిక్కిలియు మించినట్టి యాబలువున్యుఁడు రాముఁడే మృతిఁ జెందెను. ఒక్కయాగమును దక్షిణయులేని నీపుత్రుఁడు మృతుఁడయినందులకుఁ బరితపింపవలదు. సృంజయా! భగీరథుండను రాజు మృతుఁడయ్యెనని వినుచున్నారము. విస్తరించి యతఁడు చేసినయాగమందు దేవతలకు రాజయిన యింద్రుఁడు సోమరసమును బానముచేసి మదమెచ్చి తనబాహుబలముచే పెక్కువేల యసురులను జయించెను. ఆ భగీరథుఁడు బంగారుసొమ్ములు దాల్చిన పదివేలకన్యలను దనయాగమందు దక్షిణగానొసంగెను. దానముచేసిన యొక్కొక్క కన్నియకును నాలుగేసి గుఱ్ఱములు పూన్చిన యొక్కొక్క రథమును, ఒక్కొక్కరథమునకు బంగారు సొమ్ములుదాల్చి వెంటవచ్చు నూఱేసి యేనుంగులును, ఒక్కొక్క యేనుఁగునకుఁ బిఱుఁద వేయేసి గుఱ్ఱములును, ఒక్కొక్క గుఱ్ఱమునకుఁ బిఱుఁద వేయిగోవులును, ఒక్కొక్కగోవునకుఁబిఱుఁద వేయిమేఁకలునుగాదానముచేసెను. వానియొడియందు మున్ను రహస్యముగావసించు భాగీరథియను

గంగ, బిడ్డవలెఁ, గూర్చుండియుండెను. అతనితొడమీఁదఁ గూర్చుండిన కారణమున గంగ యూర్వశియను పేరుగలదయ్యె. ముల్లోకములను పావనముచేయు గంగయు బహుదక్షిణలతో యాగములుచేయు భగీరథరాజునకుఁ గూఁతురయ్యెను. సృంజయా! నీకంటెను నీపుత్త్రునికంటెను ధర్మము మొదలయిన నాలుగింట మిక్కిలి యతిశయించిన మహాపుణ్యుఁడా భగీరథుండును మరణమునొందెను నీవు పుత్త్రునిగుఱించి పరితాప పడవలదు. సృంజయా! మహాత్ముండు దిలీపుండనురాజును మరణించెనని వినుచున్నారము. అతని కృత్యములను బ్రాహ్మణులు మిక్కిలి గొప్పవిగాఁ జెప్పెదరు. అతఁడు దానముచేసిన పెనుయాగమందు ధనముల నిండారియున్న యీపుడమిని సంతోషముతోడ బ్రాహ్మణులకు దానముచేసెను. అతఁడుచేసిన యాగములం దొక్కొక్కయుపాధ్యాయుఁడు బంగారముతోఁ జేయఁబడిన వేయియేనుంగులను దక్షిణగాఁబడసెను. అతఁడుచేసిన యాగమందుఁ గల పెద్దయూప మపరంజిచేత రచింపఁబడినదై యెంతయు జ్వలించుచుండెను. ఇంద్రుఁడు మొదలయినదేవత లతనికి వలయు కార్యములుచేయుచు నతనినారాధించిరి. బంగారుతోఁ జేయఁబడిన యాయూపము మీఁదనున్న చషాలమను నపరంజి స్థూపియందు నాఱువేల దేవతలును, గంధర్వులును నటనము చేసిరి. దానినడుమ విశ్వావసువను గంధర్వుఁడు తానే సప్తస్వరములతోడ వీణాగానముచేసెను. సకలప్రాణులు నతఁడు చేయు వీణాగానము 'నాకు' అని తలంచినవి. దిలీప మహారాజుగావించిన యీకార్యమును నడపంజాలు రాజులెవ్వఁడు నుండినదే లేదు. బంగారుకవచములుగల యతనిగజములు మద

ముగొని దారియందుఁ బండియుండెను.సత్యవాదియు గొప్పవిలు కాఁడును మహాత్ముండునయిన దిలీపమహారాజును దర్శనముచేసి నమనుష్యులును స్వర్గలోకమును జయించిరి. దిలీపుని నగరు నందు వేదశబ్దమును విలుశబ్దమును 'ఇమ్ము' అనుశబ్దమును తఱఁ గినకాలము లేదు. సృంజయా! నిన్నును నీపుత్త్రునిని ధర్మాదులు నాలుగింట నెంతయునెచ్చియుండిన యాపుణ్యాత్ముఁడు దిలీపుఁడే మృతుఁడయ్యెను. నీపుత్త్రుని దలంచుకొని తాపపడకుము. సృంజయా! యువనాశ్వునిపుత్త్రుఁడయిన మాంధాతయు మరణ మందెనని వినుచున్నారము. అతఁడు మహాత్ముఁడయిన యువనా శ్వుని యుదరమున పృషదాజ్యమునుండి యుదయించి వృద్ధినొంది నవాఁడు; కాంతిమంతుఁడు;ముల్లోకములను జయింపఁదగువాఁడు నగురాజు. గర్భరూపముననుండిన యుతనిని మరుత్తు లను దేవతలు తండ్రిపార్శ్వమునుండి వెలువరించిరి. దేవరూపుండయిన యాబి డ్డఁడు తండ్రియగు యువనాశ్వుని యొడియందుఁ బరుండఁగాఁ జూచి దేవతలీనిసు వెవరియొద్దఁ బాలుగుడుచునని యొకరితోనొ కరు మాటాడికొనుచుండఁగా నింద్రుఁడు 'నావలనఁగుడుచును' అను నర్థముగల 'మాంధాత' యనుమాట చెప్పుచువచ్చెను. అది కారణంబుగా నాబిడ్డనికి మాంధాతయనుపేరు కలిగెను. పిదప మహాత్ముండయినయాబాలకునిఁబోషింపఁగోరి యింద్రుఁడు వానినోరఁ దనచేయిడఁగా నదిపాలుచేఁపెను. అట్లింద్రుని చేతిని గుడుచుచుండఁగా నాబిడ్డనిమేను నాఁటికి నూఱుపలములచొ ప్పునఁ బెరిఁగి పండ్రెండుదినములకు పండ్రెండేండ్లు వయసుగల వాఁడయ్యెను. ధర్మాత్ముం డగుమహాత్ముండును శూరుండును నింద్రసమానుం డయిననామాంధాతకు భూమియంతయు

నొక్కనాఁటిలో వశమయ్యెను. అతఁడు యుద్ధమున నంగారుని మరుత్తుని అసితుని గయుని నంగరాజగు బృహద్రథుని జయించెను. మాంధాత యంగారరాజుతో మార్కొని పోరాడునపుడతనివింటిధ్వనిచే దేవలోకము పెటిలినదని దేవతలు తలఁచిరి. సూర్యుని యుదయాస్తమయములకు లోనయిన భూతలమంతయు మాంధాతక్షేత్రముగా చెప్పంబడుచున్నది. రాజా! మాంధాత వందలకొలఁది నశ్వమేధములను రాజసూయములను జేసి వానియందు బ్రాహ్మణులకు నొకయోజనముపొడవును బదియోజనముల నిడివియుఁగాఁ బ్రోగయిన బంగారుమయములగు రోహితమత్స్యములను దానముచేసెను. * ఆయాగమందు బ్రాహ్మణుల కిచ్చి యధికముగానుండిన ధనములనుఁ దక్కినజనులు తాము పంచుకొనిరి. సృంజయా! నీకంటెను నీపుత్రునికంటెను ధర్మాదులు నాలుగింటను మిక్కిలి యతిశయించిన మహాపుణ్యుఁడయినయామాంధాతయో మరణము నొందెను. నీపుత్రునికై పరితపింపవలదు. సృంజయా! నహుషునిపుత్రుఁడయిన యయాతి మరణించెనని వినుచున్నారము. అతఁడు సముద్రముతోఁ గూడ నీపుడమినంతయు జయించి శమ్య (బలుపయినదుడ్డుకఱ్ఱ) విసరివైవఁగాఁ బోయి పడునంతదూరమున కొక్కొక్కటిగా వేదికల భూమి నలంకరించి పెక్కులు మేటిజన్నములు చేసి యీభూమినంతయు విడిచి సముద్రతీరమునుబొందెను. నూఱు వాజపేయములును దక్కిన యాగ

* "అతిరిక్తాః ద్విజాతిభ్యో వ్యభజం స్త్వితరే జనాః" అని మూలము. ఇందులకు 'ఎక్కువగా మిగిలిన ధనములను దక్కినజనులు బ్రాహ్మణులకు నిచ్చిరి.' అని యర్థాంతరము. ఇది సమంజసముగాదు.

ములు వేయింటిని గావించి యయాతి మూఁడుబంగారుకొండల చేత బ్రాహ్మణోత్తములకుఁ దృప్తిగావించెను. ఆయయాతి భూమి యందుఁ గలదైత్యులను దానవులను ననురయుద్ధమునుబన్ని వధించి భూమినంతయుఁ గయికొని కొడుకులకుఁ బంచువాఁడై యదువు ద్రుహ్యుఁడు మొదలయిన కుమారులను రాజ్యము చివరలం దునిచి పూరుని రాజ్యమున కభిషిక్తునిఁజేసి భార్యా సహితముగా వనమును బ్రవేశించెను. సృంజయా! నిన్నును నీపుత్త్రునిని ధర్మాదులు నాలుగింట నతిశయించినయా మహాపు ణ్యుఁడు యయాతియే మరణమునొందెను. నీ పుత్త్రునిగుఱించి పరితపింపవలదు. సృంజయా! నాభాగునిపుత్త్రుఁ డయినయంబ రీషుఁడును మృతుఁ డయ్యెనని వినుచున్నారము. జనులు పుణ్యా త్ముఁ డయినయా రాజశ్రేష్ఠుని రక్షకునిఁగా వరించిరి. అతఁడు తాను విస్తరించి చేసినయాగమందు యాగముచేయించుబ్రాహ్మ ణులకు, వేయియాగముల నొక్కొక్కఁడును జేసినట్టి రాజులను బదిలక్షలమందిని బరిచర్యలుచేయ నియోగించెను. ప్రాజ్ఞులు 'ఇట్లుచేసినవా రింతకుమునుపును లేరు. ఇఁకమీఁదను లేరు' అని యంబరీషుని మిక్కిలి కొనియాడిరి. అతనియాగమందు బ్రాహ్మ ణులకూడిగముచేసిన రాజులందఱును నశ్వమేధయాగములుచేసిన వారుంబోలె (నంబరీషునిమహత్త్వముచేత) నుత్తరాయణమను దేవయానమార్గమునఁబోయి హిరణ్యగర్భలోకమును బొందిరి. సృంజయా! ధర్మాదులు నాలుగింట నీకంటెను నెక్కుడై నీపు త్త్రునికంటెఁ బుణ్యుఁ డయినయా యంబరీషుఁడే కాలగతిఁజెం దెను. నీపుత్త్రునిగుఱించి శోకింపకుము. సృంజయా! చిత్రరథుని పుత్త్రుఁ డయినశశిబిందుఁ డనురాజును మృతుఁ డయ్యెనని

వినుచున్నారము. అమ్మహాత్మునకు లక్షమంది భార్యలుండిరి. వారలయందతనికిఁ బదిలక్షలుకుమారులు గలిగిరి. ఆపుత్రులలో నొక్కొక్కరును బంగారుకవచములు దాల్చినమేటి విలుకాండ్రు రయియుండిరి. ఒక్కొక్కపుత్రునకును వేఱువేఱ నూఱేసికన్నియలును నొక్కొక్కకన్నియకు నూఱేసియేనుఁగులును, నొక్కొక్కయేనుఁగునకు నూఱేసి తేరులును, నొక్కొక్క తేరికిని బంగారుసొమ్ములు దాల్చినమేటిగుఱ్ఱములు నూఱేసియు, నొక్కొక్కగుఱ్ఱమునకును నూఱేసిపశువులును నొక్కొక్కపశువునకును నూఱేసిమేఁకలును గొఱియలునుండెను. ఇట్లు తుదిలేక సొంపారు చున్నయీమహాధనము నతఁ డశ్వమేధయాగమందు బ్రాహ్మణుల కొసంగెను. సృంజయా! నీకంటె ధర్మాదులు నాలుగింట నెక్కుఁడై నీ పుత్త్రునికంటెఁ బుణ్యాత్ముఁ డయిన యాశశిబిందుఁడే మృతినొందెను. నీపుత్రునిగుఱించి తాపపడకుము. సృంజయా! * అధూర్తరజసుని పుత్త్రుఁ డయినగయుఁడును మరణమునొందెనని వినుచున్నారము. ఆరాజు హోమము చేసి మిగిలినదానిని నూఱుసంవత్సరములు భుజించుచుండెను. అగ్ని తానే యతనికి వరమొసంగఁగోరి వచ్చెను. రాజయ్యగ్నిని 'నే నెంతదానము చేసినను నాధనము తఱుఁగకుండవలయును. నాకు ధర్మమందు శ్రద్ధ వర్ధిల్లవలయును. అగ్నిదేవా! నీప్రసాదమువలన నామనసు సత్యమందే రమింపవలయును.' అని యీవరములనడిగెను. అగ్నిదేవుఁడు నతనియిచ్ఛచొప్పున నావరములనెల్ల నిచ్చెనని మాకు వినికిగలదు. అతఁడు దర్శము పూర్ణమాసము, చాతుర్మాస్యము, అశ్వమేధము ననెడియాగము

---

* 'గయం చామూర్తరయసమ్' అని యామూత్తరాహపాఠము.

లు పెక్కువేల సంవత్సరములు చేయుచుండెను. లక్షగోవులను బదివేలగుఱ్ఱములను వేయేండ్లవఱకు మరలమరల నిచ్చుచుండెను. పురుషసత్తమా ! అతఁడు సోమయాగముచేత దేవతలను, ధనములచేత బ్రాహ్మణులను, శ్రాద్ధములచేతఁ బితరులను, కామములచేతఁ దన యిల్లాండ్రను దృప్తినొందించెను. అశ్వమేధ మహాయజ్ఞమందు నేఁబదిమూరల వెడలుపును నూఱుమూరల నిడివియుఁ గలబంగారునేలను గావించి దక్షిణగా నొసంగెను. గయుఁడు గంగాతీరమందలి యిసుకలెన్ని గలవో యన్నిగోవులను దానముచేసెను. సృంజయా ! నీకంటె ధర్మాదులు నాలుగింటనెక్కుడై నీపుత్రునికంటెను బుణ్యుఁ డయినయాగయుఁడే కాలగతినొందెను. నీపుత్రునికై పరితాపపడవలదు సృంజయా! సంకృతిపుత్త్రుఁ డయినరంతిదేవుఁడును మరణించెనని వినుచున్నారము. అతఁడు గొప్పతపస్సుచేసి యింద్రు నారాధించి యతనివలన 'మాకు నన్నము మిక్కిలియునుండవలెను; మాకతిథులును దొరకవలయును. మాకు శ్రద్ధ తొలంగకుండవలయును. మే మొక్కరినిని యాచింపకుండవలయు' నని వరములనుబడసెను. సంశితవ్రతుండును మహాత్ముండును యశస్వియు నగు రంతిదేవునికడకుఁ దమ్ము సద్వినియోగము చేయుఁగాక యని గ్రామములందును నడవులందును గలపశువులు తమంతటనే వచ్చెను. అతఁడు యాగమునం దుపయోగించిన పశువులతోలుప్రోవు నుండి స్రవించుజలము చర్మణ్వతి యనుపేరు గలమహానదిగఁ బ్రసిద్ధినొందియున్నది. ఆరాజు గొప్పసభయందు బ్రాహ్మణులకవ్వారిగా బంగారమును దానముచేసెను. *ఆకాలమందు

* 'మీకు నూఱునిష్కములిచ్చెద' నని రాజు చెప్పఁగా బ్రాహ్మణులందు

బ్రాహ్మణులు 'నీకు నూఱునిష్కములు లియ్యఁబోవుచున్నాఁడు.' నీకు నూఱియ్యఁబోవుచున్నాఁడు' అని చెప్పినప్పుడే యతఁడో 'మీకువేయి నిష్కము'లని చెప్పియిచ్చి బ్రాహ్మణులను సంతోష ముగా రాఁబట్టెను. ఆబుద్ధిమంతునిగృహమందు వంట కయిన పాత్రములు, తక్కినబండములకుఁ గలపాత్రములును, కుండలును, పాత్రలును, కొప్పెరలును, స్థాలులును, పిఠరములును నేవి యేనియు బంగారముగానివి కలుగవు. అతనియింట నొకరాత్రి వేయున్నాట యిరువదిగోవులు చంపఁబడుచుండెను. అందు మెఱుఁగిడ్డరతనాలకుండలములు గలపరిచారకులు భుజించువా రిని 'ఇప్పుడు తొంటివలె మాంసము లేదు. వలయునట్లు ప్రప్ప మొదలగువానిని భుజింపుఁడు' అని బిగ్గఱచెప్పిరి. సృంజయా! నీకంటెను ధర్మాదులనాలుగింట నెక్కుడై నీపుత్రునికంటెఁ బు ణ్యుఁడయిన యారంతిదేవుఁడే మృతినొందినాఁడు. నీదుపుత్రుని గుఱించి పరితాపపడవలదు. సృంజయా! మహాత్ముం డయిన సగరుండును గతించినట్లు వినుచున్నారము. ఇక్ష్వాకుకాలమునఁ బుట్టి యమానుషపరాక్రమమువడసి పురుషులకుఁ బులియుం బోలి వెలుంగు నా సగరుఁడు బయలువెడలునపుడతనియఱువది వేవురు పుత్రులు, శరత్కాలమందు మేఘములేని యాకసమునఁ జంద్రుని నక్షత్రసమూహములు వెంబడించునట్లు వెంబడించిరి. తొల్లి యతనిప్రతాపమువలన భూమియంతయు నతనియేక చ్ఛత్రముక్రింద వెలయుచుండెను. అతఁడు దేవతలను వేయి యశ్వమేధయాగములచేతఁ దృప్తినొందించెను. తామరసపత్ర

లకొల్లక బిగ్గఱఁగా 'నీకు నూఱునిష్కములు మేమిచ్చెద'మని కూపెట్టుట యు రాజువేయి నిష్కములిచ్చెనని యర్థాంతరము.

నేత్రలగు చెలువలచేతను శయనములచేతను నిండినవై బంగారు మయము లయిన స్తంభములుగలిగిన యుప్పరిగలును మఱియుఁ దక్కుఁగల భోగ్యవస్తువులును, పాత్రము లగుబ్రాహ్మణులకు దానముచేసెను. అతని యాజ్ఞచొప్పున బ్రాహ్మణు లావిత్తమును బంచుకొనిరి. సముద్రపరివృత మయినభూమి నతఁడు కోప మునఁ ద్రవ్వించుటచేత నతనిపేర సాగర మనుపేరు సము ద్రమునకుఁ గలిగినది. సృంజయా! నీకంటె ధర్మాదులు నాలు గింట నెక్కుడై నీపుత్రునకంటెఁ బుణ్యుఁ డయినయా సగ రుఁడే మృత్యుఁడయ్యెను. నీ పుత్రునకై పరితాపపడవలదు. సృంజయా! వేనునిపుత్రుఁ డయినపృథుఁడనురాజు మృతుఁడయ్యె నని వినుచున్నారము. మహర్షులు మహారణ్య(దండకారణ్య)మం దొక్కటిగాఁ జేరి లోకములనితఁడు ప్రథనొందింపఁ గలఁడని తలఁ చి పృథువని పేరిడి వానికిఁ బట్టాభిషేకముచేసిరి. అతఁడు లోకము లను క్షతము (ఆపత్తి)నుండి కాచుటచే క్షత్రియుఁ డనియును, నతనిని జూచిన ప్రజలు రక్తులమయితిమని చెప్పుటచే రాజ నియు పేరొందినవాఁడయ్యెను. అతఁడు లోకము నేలుకాల మందు భూమి దున్నకయ పండెను. చెట్లయం దొక్కొక్కయా కునందును దేనె దొరకెను. ఆవులన్నియుఁ దూమెఁడుపాలు పిది కెను. మనుష్యులు తెవులు లేకయు నేవిధమయిన భయమును లేకయు వలయుసిద్ధినిబడసి నింటను బయళ్లను విచ్చలవిడి వసిం చుచుండిరి. అతఁడు సముద్రమునఁ బోవుకాలమందు జలము గూడ ఱాయివలె స్తంభించియుండెను. అతనివింటిచేఁ గొండ లును జీల్పఁబడినవి. అతని ధ్వజమునకు భంగపాటు కలుగదయ్యె. అతఁ డొనర్చిన యశ్వమేధమహాయజ్ఞమందు మూఁడు మను

ష్యాల పొడవుగల బంగారు కొండల నిరువదియొకంటిని బ్రాహ్మణులకు దానముచేసెను. సృంజయా! నీకంటె ధర్మాదులు నాలుగింట నెక్కుడై నీపుత్రునికంటెఁ బుణ్యుఁడయినయా పృథుఁడును మృతినొందెను. నీపుత్రునిగుఱించి తాపమొందకుము. సృంజయా! నీవు పలుకక యేమో యాలోచించుచున్నావు; నే నిపుడు చెప్పినమాట వినవు కాఁబోలు. దాని వినవయితివేని నేనిపుడు మొఱయిడినయీమాటలు, చావనున్నవానికి నెంతచక్కగాఁ బథ్యము ప్రయోగించినను వ్యర్థమగునట్లు, నీయందు విఫలముగావలయును' అనెను. సృంజయుఁడు 'నారదా! నీవు చెప్పిన యీమాటల వినుచున్నాను. వీనియందలి యర్థము మిక్కిలి విచిత్రముగానున్నది; కాన కర్మతాపులు గుబులుకొను పూదండవలె నిది యింపుగులుకుచున్నది; మహాత్ములును బుణ్యకర్ములును మహాకీర్తిమంతులు నయినరాజర్షులనుగుఱించిన ముచ్చట గలదిగావున శోకమునంతయుఁ దూలించుచున్నది. మహర్షీ! నీమాటలు వ్యర్థములుగావు. నీదర్శనముననే నాకు శోకము వీడిపోయినది. అమృతమును నెంత ద్రావినను దనివిగలుగనట్లు నీమాటల వినఁగోరిక కలుగుచున్నదే కాని తృప్తికలుగకున్నది. నీదృష్టి యమోఘమైనదిగదా. నేనుసంతాపమునఁ బొక్కుచున్నవాఁడ. విభూ! ఇట్టినీవు నాయందనుగ్రహము చూపితివేని యిపుడు నా పుత్త్రుఁడు తప్పక బ్రతుకును. పుత్రునితోడి సంగమును నాకుఁ బడయఁగలుగును' అని వేఁడెను. నారదుఁడు 'నీకుఁ బర్వతుఁడొసంగిన స్వర్ణష్ఠీవి యనుపుత్త్రుఁడు మృతుఁడయి యిట్లుపరుండియున్నవాఁడుగదా. వీనిని మరల నీకు నిచ్చుచున్నాను. వీఁడు

బంగారు కాంతిగలిగి వేయేండ్లు బ్రతుకఁగలఁడు' అనెను. ఇది యిరువదియెనిమిదవయధ్యాయము.



## రాజధర్మపర్వము.

### కృష్ణుఁడు ధర్మరాజునకు నారదపర్వతోపాఖ్యానము చెప్పుట.

ధర్మరాజు 'అసృంజయుని కొడుకు సువర్ణష్ఠీవి గొట్లయ్యెను? పర్వతుఁ డేల యాపుత్రు నొసంగెను? వాఁడేల మరణించెను? ఆ కాలమున మనుష్యునియాయువు వేయేండ్లయి యుండఁగా సృంజయునికొడుకు బాల్యము నిండనిప్రాయముననే చచ్చుట యెట్లు? ఆతనికి సువర్ణష్ఠీవి యనునదివట్టిపేరా? లేక యందులకుఁ గారణమున్నదా? ఇది తెలియఁగోరుచున్నాను' అని యడిగెను. అందులకుఁ గృష్ణుఁడు 'రాజా! ఇది జరిగినట్లు నీకుఁ జెప్పెదను. నారదుఁడు పర్వతుఁడు ననుఋషు లిరువురుగలరు. వారు లోకమున నమేయులు. నారదుఁడు మేనమామ; పర్వతుఁడతని మేనల్లుఁడు. తొల్లి వారిరువురు నుల్ల ముపల్లవింప నిందలి వరిబియ్యపుటన్నమును నేతిని భుజించి విహరింపవలయునని కోరి దేవలోకమునుండి యీలోకమునకువచ్చిరి. తపస్వులయిన యామామయు నల్లుఁడు నిరువురును మనుష్యులు దినునన్నములను దినుచు భూమిపయి సంచరించుచుండిరి. వారిరువురు నొండొరులయెడఁ బ్రీతిగలవారుగాన నొకరికొకరు సంతోషమున 'మనలో నెవనికిఁగాని మనస్సునందు మంచిదో చెడ్డదో యేతలంపుగలిగినను నొకరి కొకరు తెలుపవలయును, లేదా,

అట్లు తెలుపనివానికి శాపముగలుగు'నని సమయముచేసికొనిరి. ఇట్లు లొడంబడిక చేసికొని యాలోకపూజితు లిరువురును శ్వేతుని కొడుకయిన సృంజయుఁ డనురాజుకడకుఁబోయి 'రాజా ! మే మిరువురును నీ మేలునకుఁగాను గొంతకాలము నీయొద్ద వసింపఁగోరుచున్నారము. మాకుఁగలరూపున ననుకూలుఁడవై యుండుము' అనిరి. రాజును 'వల్లె' యని వారిని సత్కరించి తానే యుపచరించెను. అంత నొకప్పుడు రాజు మహాత్ములయిన యా తపోధనులనుజూచి మిక్కిలియుఁ బ్రీతిగడలుకొన 'దేవతయుం బోలెఁ జూపట్టుచున్న యీచిన్నది నాకొక్కతే కూఁతురు. ఈబిడ తామరయకరువులవంటి పసిమిచాయఁ దళుకొత్తుచు నేకందును లేక చూడందగి యొప్పునవయవములపొందు గలది ; మంచి శీలమును వృత్తమునుగలది. ఈకుమారి పేరు సుకుమారి. ఇది మీ యిరువురకుఁ బరిచర్యచేయఁగలదు' అనెను. ఆఋషులు 'మిక్కిలి యుత్తమ' మనిరి. అంత నారాజు నాకన్నియను 'కూఁతురా ! ఈ బ్రాహ్మణులను దేవతలవలెను దండ్రులవలెను నుపచరించుచుండవలయును' అని కట్టడచేసెను. ఆకన్యయు ధర్మమాచరించునట్టిదిగాన 'వల్లె'యని తండ్రి యానతిచొప్పున నామునివరులకు మరియాదతోడ నుపచరించుచువచ్చెను. ఆబిడ యట్లుచేయుచున్న యుపచారముచేతను దాని యెనలేని చక్కందనముచేతను మన్మథుఁడుతోడనే నారదునాక్రమించినవాఁడయ్యె.అంతనమ్మహాత్ముని మనసునందలి మరుఁడు శుక్లపక్షారంభమందలి చంద్రునివలె నాఁడునాఁటికిఁ బెరుఁగుచుండెను. ఆనారదుఁడు ధర్మవిదుండయ్యును దీవ్రమయిన యామరులును సిగ్గువలనఁ దనమేనల్లుఁడగు పర్వతునకుఁ దెలుపకపోయెను. పిదపఁ బర్వతుఁడో యింగితముల

చేతను దపశ్శక్తిచేతను నా నారదుఁడు కామార్తుఁడై యుండు టను దెలిసికొని తోడనే మిక్కిలియుఁ గుపితుఁడై యతనిని శపించువాఁడై "ఓబ్రాహ్మణా! మనస్సునందు మంచిదో చెడ్డదో యేతలంపుగలిగినను దానినంతయు మన మొకరికొకరు చెప్పి కొనవలయును" అని నాతోడ నీవు మనఃపూర్వకముగాఁ బ్రతిజ్ఞ చేసి యిప్పుడు నీవే దానిని బొల్లుగావించితివి. సుకుమారియను కొమరాలియందు నీకుఁ గలమరులు నాకుఁ జెప్పవయితివి. నీవా పెద్దవాఁడవు; బ్రహ్మచారివి; తపస్వివి; మఱిబ్రాహ్మణుఁడవు. ఇట్టివాఁడవై యుండియు మన మొండొరులు చేసికొన్న ప్రతిజ్ఞనుండి జాఱినది నాకు సయింపరాకున్నది. అది కారణముగా మిక్కిలి కుపితుఁడనై నిన్నుశపించెదను. సుకుమారి నీకుఁ దప్పక భార్యకాఁగలదు; సందేహము లేదు. ఆపడఁతిని బెండిలియైనది మొదలుఁగా నీసొంతరూపునుబాసి వానరరూపమును బొంది జనులందఱకును జూపట్టుదువు' అని శపించెను. నారదుఁడా శాపవాక్యమునువిని 'ఓరీ! తపము బ్రహ్మచర్యము సత్యము దమము ననునివియుండియు నిత్యధర్ముఁడవయ్యు నీకు స్వర్గము లేక పోవుఁగాక' యని మాఱుశపించెను. ఇట్లామును లిరువురును బరస్పర మసూయవలనఁ గ్రుద్ధులై యొకరినొకరు శపించుట మేటిగజము లొండొంటిని దలపడినట్లుండెను. మహామతియగు పర్వతుఁడు నిజతేజంబుచేత న్యాయంబుచొప్పున నెల్లయెడలఁ బూజలందుచు, నీభూమియంతయు నంచరించుచుండెను. అంత నారదుఁడు సృంజయుని కూఁతురయిన సుకుమారిని, ఏకందును లేనిసుందరీమణిని, విధ్యుక్తముగాఁ బెండ్లాడెను. ఆకన్నియయుఁ బర్వతుని శాపముచొప్పున నారదుఁడు వివాహమంత్రములు

చెప్పితీఱగానే వానరమువంటి మొగము గలిగి యుండుటఁ గాంచెను. అయిన నాబిడ యతని నపు డింతమాత్ర మవమా నింపక మిక్కిలియుఁ బ్రీతియే చూపుచువచ్చెను. ఆచెలువ పతి యందు నెయ్యముదియ్యముగలదై యతని నుపచరించుచుండి నదేకాని మఱియొకదేవతను గాని ఋషినిఁగాని యక్షునిఁ గాని మనస్సునందుసయితము పతిగాఁ దలంపకుండెను. అంత నొకనాఁడు పర్వతుఁడెవ్వరును లేని యొకయడవియందుఁ బోవు చుండఁగా నట నారదునిఁగాంచెను. తోడనే యతఁడు నార దునికడకుఁబోయి మ్రొక్కి, "ప్రభూ! నేను స్వర్గలోకము నకుఁబోవునట్లు నీ వనుగ్రహింపవలయును' అని వేఁడెను. నారదుఁడట్లు పర్వతుఁడు దీనుండై చేతులుమోడ్చి నిలుచుండు టనుజూచి తానును మఱింత దుఃఖితుఁడై 'నాయనా! నన్ను నీవు మొదట వానరుఁ డగునట్లు శపించితివి. దానివలన నేనును గోపముగొని 'ఇది మొదలు నీకు స్వర్గమందు వాసముగలుగ' దని శపించితిని, నీవు నాకుఁ బుత్రునివంటివాఁడవగుదువు. ఇట్టి నీకిప్పనితగునే' యనెను. అంత నామునులిరువురు నొండొరుల కొసంగిన శాపములను నివర్తింపఁజేసిరి. అప్పుడు నారదుఁడు తన యెప్పటిరూపున దేవతయుంబోలెఁ గాంతిపెంపు సొంపా రుచుండఁగా సుకుమారిచూచి పరపురుషుఁడని శంకించి పరుగునఁ బోవఁదొడఁగెను. దానినిజూచి పర్వతుఁడు 'అమ్మా! ఇతఁడు నీ భర్తయగును. ఇందు సందేహమువలదు. పరమధర్మాత్ముం డయిన భగవంతుఁడు నారదమహర్షి నీయందు మనసెప్పుడును వీడని వాఁడు. ఇందు సంశయమువలదు.' అని పలువిధములను సమా ధానపెట్టెను. అమ్మహాత్ముఁడు పర్వతుఁడు చెప్పినదివిని సుకుమారి

తనపతికి నడుమవచ్చిన వానరరూపము శాపదోషమునఁ గలిగిన దని తెలిసికొని యెప్పటివలెనుండెను. అంతఁ బర్వతుఁడు స్వర్గమునకుఁబోయెను. నారదుఁడు తనగృహమునకు నరిగెను. రాజా! సమస్తమును దనంతనే కావించిన యమ్మహాత్ముఁడు నారదమహర్షి యిదిగోనున్నాఁడు. అడిగితివేని జరిగినది జరిగినట్టు చెప్పఁగలఁడు' అనెను. ఇది యిరువదితొమ్మిదవయధ్యాయము.



## రాజధర్మపర్వము.

### నారదుఁడు ధర్మరాజునకు సువర్ణష్ఠీవిచరిత్రము చెప్పుట.

అంత ధర్మరాజు నారదునిఁజూచి 'మహాత్మా! సువర్ణష్ఠీవి పుట్టినతెఱంగు వినఁగోరెద' ననెను. అందులకు నారదుఁడతనితో 'మహాబాహూ! శ్రీకృష్ణుఁడు చెప్పిన యిక్కథయిట్లే జరిగినది. ఇందు మిగిలినకథను నీకుఁ జెప్పెదను. నేనును నామేనల్లుఁడు పర్వతుఁడును సృంజయునియొద్ద వసించుటకుఁ బోయితిమి. అతఁడప్పుడు మమ్ము విధ్యుక్తముగాఁ బూజించి, వలయుకోర్కులనెంతయు నొడఁగూర్చుచుండఁగా నిచ్చలు నతనియింట వసించుచుంటిమి. అప్పుడు వర్షాకాలముగడచుటవలన మాకు వెడలి పోవలసివచ్చెను. ఆసమయమందుఁ బర్వతుఁడు నాతో 'మన మీరాజునింట మిక్కిలియుఁ బూజితులమై వసించుచున్నారము. కాబట్టి బదులేమిచేయవలయునో యాలోచింపుము' అనెను. నేను 'అల్లుఁడా! ఇదంతయుఁ జేయుట నీకేతగును. సృంజయుని కోరినవరమతఁడే యడుగనిమ్ము. అతఁ డేదేదికోరునో యది పడయుఁగాక. లేక నీకిష్టముండెనా మనతపశ్శక్తిచేత నతఁడు కోరిన

సిద్ధినొందుఁగాక'యంటిని. అంతఁ బర్వతుఁడు సృంజయునిఁబిలిచి 'రాజా! నీవు చక్కటితోఁ జేసిన సత్కారములకుఁ బ్రీతులమయితిమి. రాజా! మేమనుజ్ఞ యిచ్చితిమి. వలయువరము నాలోచించి చెప్పుము. అయిన నావరము దేవతలకుఁ గీడుగాని మనుష్యులకు నాశముగాని చేయునట్టిది గారాదు. రాజా! అట్టివరమును గయికొనుము, ఏలన నీ వట్టిపూజకుఁ దగుదువని మామతము' అనెను. సృంజయుఁడు 'మీకు నాయందుఁ సంతోషముగల దేని యంతే నాకునుజాలును. అదియే నాకుఁ బరమలాభము. నాకు మహాఫల మొదఁగూడినదే చుఁడీ' యనెను. అందులకుఁ బర్వతుఁడు 'రాజా! చిరకాలముగా నీ మనస్సునం దున్నతలంపును జెప్పెదవినుము. నీవు వీరుఁడును వీర్యవంతుఁడును దృఢవ్రతుండును దీర్ఘాయుష్మంతుండును మహాభాగ్యవంతుఁడును దేవేంద్రసమానకాంతియు నగు కొమరునిఁ బడయఁగోరుచున్నావు. నీకోరినట్లు కాఁగలదు. కాని పుట్టిన కొడుకాయుష్మంతుఁడు మాత్రము గానేరఁడు. ఏలన నింద్రునిఁ గ్రిందుపఱచుటకై కదా నీకిట్టితలంపు మనస్సుననాటియున్నది. ఆబిడ్డఁడు సువర్ణమును గ్రక్కుటచే సువర్ణష్ఠీవియని చెప్పఁబడును. దేవరాజుంబోలెఁ గాంతి దళుకొత్తు నాకుమారుని దేవరాజువలన రక్షింపవలయును' అని మరలఁ జెప్పెను. సృంజయుఁడు పర్వతునితో 'మహర్షి! ఇది యివ్విధముగాకుండవలయు' నని యతనిని వేఁడికొనుచు 'మఱియు మీ యిరువురతపశ్శక్తిచే నాబిడ్డఁ డాయుష్మంతుఁ డై యుండవలయును' అనెను. పర్వతుఁ డింద్రునివలని పక్షమున నాతని కేమియు బదులుచెప్పఁడయ్యె. అందులకు వగచుచున్న రాజును జూచి నేను 'మహారాజా! ఆసమయమున నన్నుఁ దలం

చుకొనుము. యమునిపాలుపడియున్నను నీ యల్లారుబిడ్డని నే కొంచెతయు లేకుండ నట్లారూపుననే మరల నీ కిచ్చెదను. నీవు దుఃఖపడకుము' అని మరలఁ జెప్పితిని. ఇట్లు చెప్పి మేమిరువురును నిచ్చలు పోయితిమి. సృంజయుఁడు తన మందిరమునకుఁ బోయెను. అంత నొకప్పుడు సృంజయునకుఁ దేజంబు మిక్కిలి గను రాజిలుచుండు నొకపుత్త్రుఁడు పుట్టెను. ఆబిడ్డఁడు పెద్ద కొలఁకునందుఁ దామరపూవు దద్దయుఁ బెరుఁగునట్లు, నానాఁటికిఁ దగునట్లు పెరుఁగుచుండెను. వాఁడు సువర్ణష్ఠీవి యనునామము సార్థకముగా సువర్ణమును విసర్జించుచుండెను. అది యీలోకమునందంతయు బెనువింతగానుండెను. ప్రాజ్ఞులయిన మూర్ఖులు సృంజయునకు నొసంగిన వరంబును దెలిసి దేవేంద్రుఁడు తనకుఁ దీర్చాటుకలుగునో యని భయపడి గురుఁడయిన బృహస్పతి మతముచొప్పున నిత్యము నాపుత్త్రకునకుఁ గీడు సేయ తెలిపి వెదకుచుండెను. అంత నొకప్పుడతఁడు తనయెదుట రూపొందియున్న తనదివ్యాస్త్రమగు వజ్రమునుజూచి 'వజ్రమా! పర్వత ఋషి చెప్పినట్లు సృంజయుని పుత్త్రుఁడు పెరిఁగి తనవీర్యముచేత నన్నుఁ గీడ్పఱుపఁగలడు. కాన నీవిపుడే పులిరూపముగొని యారాజపుత్త్రునిఁ జంపుము' అని యాజ్ఞాపించెను. ఆవజ్రమో పగవారిపురముల గెలుచునట్టిదిగాన యింద్రుఁడు పురికొలుపఁగా నక్కుమారునిఁ దుదముట్టించుటకు నెప్పుడు కందువ నరయుచు నేయుండెను. సృంజయుండు నింద్రునకు సాటియై వెలుంగు పుత్త్రునిఁ బడసి సంతుష్టినొంది యంతఃపురపువారితోఁగూడ నెప్పుడును వనమందే వసించియుండెను. పిదప నొకనాఁ డబ్బాలుఁడు గంగాతీరమునం దెవరును లేని యొకవనమందుఁ గ్రీడించుటకు దాది

తోఁగూడంబోయెను. ఆబిడ్డని కపుడించుమించుగా నయిదేండ్లు. వానికప్పటికి మేటియేనుంగువంటి పరాక్రమము గలిగియుండెను. అట్లాడుచుండఁగా నాబిడ్డఁడు తనపైఁ దటాలునఁ దూకివచ్చుచున్న యొకపులిని జూచెను. ఆ బాలుఁడు వడవడవడంకుచు బులిచే నలంపఁబడి యసువెడలి పుడమిపయింబడెను. తోడనే దాదియుఁ గూవెట్టెను. ఇంద్రునిమాయచేవచ్చిన యాపులియు రాజకుమారునిఁ జంపినతోడనే యక్కడనే మఱుఁగయ్యెను. ఎంతోకష్టమునఁగూవెట్టుచున్న దాదియెలుఁగువిని సృంజయుఁడు తానే యక్కడికిఁ బరుగునవచ్చెను. అట్లువచ్చి యాబిడ్డనిఁగాంచెను. వాఁడు నెత్తురుద్రావంబడి యసుఱువీడి యాకాశమునుండి యానందము కుందిపడియున్న చంద్రునివలెఁ బరుండియుండెను. అంత నారాజు ఱొమ్ముఁగొట్టుకొనుచు నెత్తుటఁ దోఁగియున్న యాబాలుని నోడియుం దెత్తిపెట్టుకొని యాతురుఁడై పలవించెను. అంత నాబిడ్డని తల్లులును శోకమున రోదనముసేయుచు సృంజయుఁడున్నయయ్యెడకుఁ బాఱుతెంచిరి. పిదప సృంజయుఁడు మనస్సు నాయందుఁ జెల్లించి నన్నే తలంచుకొనెను. అప్పుడతని చింతనెఱింగి నే నతనికెదుటఁ బొడకట్టితిని. ఆరాజు శోకరసంబు ననోలలాడుచుండఁగాఁ గృష్ణుఁడు నీకుఁ జెప్పినమాట లన్నియు నతనికి వినిపించితిని. పిదప బిడ్డని బ్రతికించినయెడ వాఁ డింద్రు ననుసరించి వర్తింపవలయునేకాని వేఱువిధమున వానిని బ్రతికింప శక్యముగాదనిచెప్పి వానిని బ్రదికించితిని. అటుపిమ్మట నా కుమారుఁడు సువర్ణష్ఠీవి మిక్కిలిపొగడ్తయుఁ బరాక్రమమును బడసి తల్లిదండ్రులకు సంతోషముగావించెను. భయంకరపరాక్రముఁడయిన యాసువర్ణష్ఠీవి తనతండ్రిస్వర్గమునకుఁ బోఁగానే

వేయినూఱేండ్లు రాజ్యపాలనము చేసెను. ఆకాలమందు బహు దక్షిణలతోఁ గూడిన గొప్పయాగములు పెక్కులు గావించి దేవతలకును పితృదేవతలకును దృప్తిగావించెను. అతఁడు తనవంశ పరంపరకుఁ గారణముగాఁ బెక్కండ్రు పుత్రులనుగని బహుకాలమునకుఁబిదపఁ బరలోకమునొందెను. రాజోత్తమా! నీవును నీకుంగల యీశోకమును దిగవిడువుము. శ్రీకృష్ణుండును వ్యాస మహర్షియుఁ జెప్పినట్లు నీతండ్రితాతలనుండివచ్చిన రాజ్యమును గయికొని పరిపాలింపుము. పవిత్రములయిన మహాయజ్ఞములు చేసి యిష్టంబగులోకమును బొందఁగలవు' అనెను. ఇది ముప్పది యవయధ్యాయము.

---

## రాజధర్మపర్వము.

{ వ్యాసుఁడు ధర్మరాజునకుఁ దత్త్వోపదేశము సేయుట. ధర్మరాజు వ్యాసుని నాశ్రమముల మేలిమినడుగఁగా నతఁడు చెప్పుట. }

అంత ధర్మతత్త్వజ్ఞుం డగువ్యాసుండు దుఃఖించుచు నూరకున్నధర్మరాజును జూచి 'రాజా! రాజులకు (క్షత్రియులకు) ప్రజలను బాలించుట ధర్మము.* లోకమునకు ధర్మమే ప్రమాణము. నిత్యమును ధర్మమునే యనువర్తించువారికి ధర్మమే ప్రమాణము. కాఁబట్టి నీ తాతముత్తాతలమార్గము (పదము) ననుష్ఠింపుము. బ్రాహ్మణులకుఁ దపస్సె ధర్మము. అది వేదములం

---

* ఇట మూలము. — ధర్మః ప్రమాణం లోకస్య నిత్యం ధర్మానువర్తినః। అనుతిష్ఠస్వ తద్రాజన్ పితృపైతామహంపదమ్। బ్రాహ్మణేషు తపో ధర్మః స నిత్యో వేదనిశ్చితః। తత్ప్రమాణం బ్రాహ్మణానాం శాశ్వతం భరతర్ష

దు శాశ్వతముగా నిర్ణయింపఁబడి యున్నది. అది బ్రాహ్మణులకు శాశ్వత మయిన ప్రమాణము. అటువంటి ధర్మముల కన్నిటికిని క్షత్రియుఁడే రక్షకుఁడు. విషయలోలుఁడై యెవ్వఁడీ క్షత్రియుని శాసనము నతిక్రమించి నడచునో వాఁడు లోకయాత్రకు విఘాతకుఁడు గాన వానిని రెండుచేతులార నడంపవలయును. ఎవ్వఁడు మోహమునకుఁ బాలై ప్రమాణమైనదానిని నప్రమాణముఁ గావించునో వాఁడు భృత్యుఁడయినను బుత్త్రుఁడయినను దపస్వియైనను మఱి యెట్టివాఁడయినను, అట్టి పాపుల నన్నియుపాయములచే నడఁచిపుచ్చవలయును; లేదా పొరిపుచ్చవలయును. ఇందులకు వేఱువిధముగా రాజు వర్తించునేని పాపమునొందును. ధర్మము మిక్కిలియు నశించుచుండఁగా

---

భ। తస్యధర్మస్య కృత్స్నస్యక్షత్రియః పరిరక్షితా । యస్త్వయం ప్రతిహన్త్యస్యశాసనం విషయేరతః । సబాహుభ్యాం వినిగ్రాహ్యో లోకయాత్రా విఘాతుకః'—ఇందులకు దాక్షిణాత్యపాఠము: ధర్మః ప్రమాణంలోకస్య నిత్యంధర్మానువర్త్యతామ్॥ అను...పదమ్ । బ్రాహ్మణేషుతు యోధర్మః సనిత్యో వేదనిశ్చితః । తత్ప్రమాణం ప్రమాణానాం శాశ్వతం భరతర్షభ । తస్యధర్మస్య ...రక్షితా । తథాయః ప్రతిహన్త్యస్య శాసనం విషయేనరః । సబాహుభ్యాం వినిగ్రాహ్యో లోకయాత్రావిఘాతుకః' 'లోకమునకు ధర్మము ప్రమాణము. నిత్యమును ధర్మమునే యనువర్తింపుము. తండ్రితాతలనాఁటి రాజ్యపనిము ననుష్ఠింపుము. వేదములందు నిశ్చితమై బ్రాహ్మణులందు నిత్యము నెలకొనియుండు ధర్మమే ప్రమాణములందెల్ల శాశ్వతమయిన ప్రమాణము. ఆధర్మము న...రక్షకుఁడు. ఆరాజు శాసనమును మనుష్యుఁడెవ్వఁడు చెఱుపునో వాఁడు లోకయాత్రకు విఘాతుకుఁడుగాన వానిచేతులు రెంటిని దీసివైవవలయును' అని యొక వ్యాఖ్యానము.

నెవఁడు దానిని రక్షింపఁడో వాఁడు ధర్మమును జంపువాఁడగును. నీవు ధర్మరక్షకుఁ డయినక్షత్రియుఁడవు గావున ధర్మమును హతము గావించినవారిని (దుర్యోధనాదులను) వారి యనుచరులతోడ హతులంగావించితివి. ఇట్లు నీవు నీస్వధర్మమునందు వర్తించుచుండఁగా (ధర్మమును దప్పినట్లు) శోకించుచున్నావేల? రాజును గొట్టనువలయును; పెట్టనువలయును; ధర్మంబునఁ బ్రజలను బాలింపనువలయును' అనెను. అందులకు ధర్మరాజు 'తపోధనా! నీవు చెప్పుమాటయందు నేను సందేహపడలేదు. నీవు సకలధర్మవిదులందును మిన్నవు. నీకు ధర్మము ప్రత్యక్షము కదా! అయినను జంపఁదగనివారిని బెక్కండ్రను రాజ్యము నిమిత్తము చంపివైచితిని. ఆకార్యములే నన్నుఁ గాల్చుచును వ్రేల్చుచును నున్నవి' అనెను. వ్యాసుఁడు 'ధర్మపుత్రా! కర్మమునకు (మంచిదానికిని జెడ్డదానికిని) కర్త యీశ్వరుఁడా? లేక మనుష్యుఁడా? ఫలము (సుఖముగాని దుఃఖముగాని) తనంతటనే లోకమునఁ గలుగుచున్నదా? లేక పూర్వకర్ముచేఁ గలుగుచున్నదా? మనుష్యుఁ డీశ్వరునిచేత నియుక్తుఁడై యే, కర్మమును మంచిదానిని జేయుచున్నాఁడేని (యాకర్మమునకయిన) ఫల మీశ్వరునే చెందవలయును. ఒకఁడు గొడ్డలితోనడవియం దొకమ్రానిని నఱకునేని యాపాపము కలుగునది పురుషునికేకాని యెంతమాత్రము గొడ్డలికిఁగాదు. లేక యాగొడ్డలి వట్టి యుపాదానకారణమే యగుటవలన (నఱకినయా) పాపము తెలివిగల నఱకిన పురుషునే చెందవలయునుగాని తెలివిలేనిగొడ్డలిని గాదన్నచో, అప్పు డాపాపము గొడ్డలిని జేసిన (తెలివిగల) పురుషునిని జెందవలయును. అయిన నిట్లు గలుగదు. ఒకఁడుచే

సినకర్మమునకు ఫలము మఱియొకఁడు పొందుననుట సమ్మతము కాదు; కాఁబట్టి కర్మఫలమునంతయు వీనియందు వానియందేల! యీశ్వరునియందే సమర్పింపుము. లేక కర్మమునకు మంచిదానికో చెడ్డదానికో పురుషుఁడే కర్తయనియు (వానినియమించునట్టి) యీశ్వరుఁడు లేఁడనియుఁ జెప్పితివేని (యపుడు పరలోకమును ఫలమునిచ్చువాఁడును లేనందున) నీవు చేసినదేదియు నీకు సెబ్బరగావింపఁజాలదు. రాజా! ఎవ్వఁడుగాని యెప్పుడేని కర్మవిధిచే నేర్పడియుండుదానిని దప్పించుకొనఁజాలఁడు. లేక నీవుపూర్వమందుఁ జేసినకర్మములకు విధియే(ఏర్పాటే)ఫలితమగునేని (యపుడు పూర్వకర్మములనుబట్టియే యిప్పటి నీధర్మములు నేర్పడియుండుటవలన నీవు స్వతంత్రుఁడవు గానేరవుగాన) చెట్టు నఱికినపాపము గొడ్డలిచేసినవాని నంటునట్లు, తొంటిపాప మీ జన్మమం దెవ్వనిని జెందనేరదు. * లేక నీవు 'ఏర్పాటుగాదు హఠమే(యదృచ్ఛ)లోకమందు నెలకొని పనులు జరిపించుచున్న' దని తలంతువేని యప్పటికి (నేర్పాటులేనందున)నిట్టియశుభ మీ యుద్ధమందలి నాశము జరిగియుండదు. ఇఁక మీఁదను జరుగదు.(యుద్ధమునందలి నాశము ముందేర్పాటువలననేకదా కలిగి

* దీనికి 'యది వామన్యసేరాజన్ హఠమేకం ప్రతిష్ఠితమ్। ఏవ మప్యశుభం కర్మ నభూతం నభవిష్యతి' అని నీలకంఠపాఠము. హఠమేకమ్ అనుటకు 'హఠమేవ' అని పాఠాంతరము. అప్పుడు మనుష్యునకు 'బలవంతముగా వధముకలుగుట నిశ్చయమని తలంతువేని యిప్పటికిని నీవు చేసినది చెడ్డకార్యముగాదు. ఈయభిప్రాయమునందు ముందును వెనుకను నేకీడును మేలును గలుగుటకుఁ గారణములేఁ'దని యర్థము.

నది) లేక లోకమందుఁ బుణ్యము పాపమనెడి కారణములవలన సుఖమును దుఃఖమును గలుగునని చెప్పుట యుక్తమని తలంతు వేని యాపుణ్యపాపములను శాస్త్రమొక్కటిచేతనే తెలియఁద గును. అట్టిశాస్త్రమందు రాజులకు దండము దాల్చుట పుణ్యమని విధింపఁబడియున్నది. అది లోకమునందు నంగీకరింపఁ బడియు న్నదియే.* కర్మములు మంచివియుఁ జెడ్డవియుఁ జక్రమునందుం బోలె నిందుఁ జుట్టుచుండుననియు మనుష్యులు తమ మంచిచె డ్డల ఫలము లనుభవింతురనియు నామతము. ఒకపాపకర్మము నుండి మఱొకటి కలుగుచున్నది. కాఁబట్టి చెడ్డ కర్మములనెల్ల విడువుము.నీమనసు నిట్లు శోకమునం దుంపకుము. పరులకు నిందిం పఁదగినదైనను నీకు స్వధర్మమగుదానియందు వర్తించువాఁడవు; ఇట్టి నీకు దేహమునుదిగవిడుచుట బాగుకాదు. దేహముతో బ్రతికిఁ యుండువాఁడు దుష్కర్మములకయిన ప్రాయశ్చిత్తములను విధ్యు క్తముగాఁ జేసికొనఁగూడును. శరీరమును విడిచినవాఁడట్లుచేయ నేరక కీడ్పాటొందవలయును. కాఁబట్టి, రాజా! నీ వసువులతో నుంటివేని ప్రాయశ్చిత్తము చేసికొనఁగూడును. ప్రాయశ్చిత్తము చేసికొనక దేహమును దిగవిడిచి పిదపఁ బశ్చాత్తాపపడఁగలవు' అనెను. అదివిని ధర్మరాజు 'పితామహా! నేను రాజ్యమందలి

---

* 'లోకమునందలి విధిచొప్పున రాజునకు దండముదాల్చుట న్యాయమయి నప్పటికిని, అట్లుచేయునపుడు మంచికార్యమువలెఁ జెడ్డకార్యము నతనికిఁ దెలి యకయే సంభవించునని నీకుఁ దోఁచునేని చెడ్డకార్యమునకుఁ గారణముగా నుం డుటను విడిచి స్థిరమగు శుభకర్మఫలమును దెలిసికొనుము' అని యర్థాం తరము.

పేరాసచేత నాయొక్కనినిమిత్తము, పుత్రులను పౌత్రులను నన్న దమ్ములను దండ్రులను, మామలను, గురువులను, మేనమామల ను, దాతలను, మేనల్లుండ్లను, సంబంధులను, స్నేహితులను, సుహృదులను, జ్ఞాతులను, మహాత్ము లయినక్షత్రియులను పెక్కు దేశములనుండిన యనేకరాజులను నందఱను జంపించితిని. తపోధనా! ఆరాజులు నిత్యమును ధర్మమాచరించు చుండిన వారు; మాటిమాటికి యజ్ఞములు చేయుచుండినవారు; వీరు లు. అట్టిరాజులనుగూర్చిన నే నేగతి నొందఁగలనో? దీనినిమరల మరలఁ జింతించుచు నాశోకముచేత నెల్లప్పుడును దగ్ధుఁడ నగుచు న్నాను. శ్రీమంతులును రాజసింహులు నయినయావీరులను బా సిన యీభూమినిని, ఘోరమయిన జ్ఞాతివధమును, పెక్కువిధము లఁజంపఁబడిన తక్కినక్షత్రియులను, కోట్లకొలఁదిని రూపుమాసిన తక్కిన మనుష్యులను జూచి తపించుచున్నాను. పితామహా! పెని మిటులను బుత్రులనుఁ దోఁబుట్టువులను బాసినయాయుత్తమ కాంతల దురవస్థ యిప్పు డెట్లుండునో? వారు 'పాపులాపాండ వులు వృష్ణులతోఁడఁజేరి పాడుచేసిరి' అని పాండవులమగు మమ్ముఁ దిట్టుచు మేనులుచిక్కి స్రుక్కుచు నేలపయింబడి పొరలా డుచుందురు. బ్రాహ్మణోత్తమా! పతులను బుత్రులను దండ్రు లను నన్నదమ్ములను గానలేక యా కాంతలందఱును బ్రియం బునఁ దమప్రాణముల విడిచి యమునింటికిఁ బోవుదురు. ఇందు సందేహము లేదు. ధర్మమును జక్కఁగా విమర్శింపఁగా మేము స్త్రీవధ పాపమును బొందఁగలము. అట్టి మేము సుహృ దులను జంపి తీఱనిపాపమునొంది తలక్రిందుగా నరకమునఁ గూలఁగలము. సత్తమా! కాఁబట్టి యుగ్రతపంబుచేసి యీదే

హామును విడిచిపుచ్చెదను. పితామహా! అయిన నాశ్రమముల విశేషమును నాకుఁ జెప్పుము" అనెను. ఇది ముప్పదియొకఁడవయధ్యాయము.

---

## రాజధర్మపర్వము.

{ వ్యాసుఁడు యుద్ధమృతులయిన రాజులసంతతులను వారివారిరాజ్యములఁ బట్టముఁగట్టి యశ్వమేధము చేయుమని ధర్మరాజునకుఁ జెప్పుట. }

ధర్మరాజు చెప్పినదివిని వ్యాసుఁడు బుద్ధియందు సూటిగా నాలోచించి మరల నతనితో 'క్షత్రియోత్తమా! క్షత్రియధర్మమును దలంచిచూచి నీ వీశోకమును బోకార్చుకొనవలయును. స్వధర్మమును మున్నిడికొనియేకదా యీక్షత్రియులు హతులయిరి. సంపూర్ణమయిన సంపత్తిని, నీభూమియందు విపులమయినకీర్తినిని, గోరి యితరులను జంపఁగోరిన యాక్షత్రియులు కాలముచేత మృతినొందిరి. నీవును భీముఁడు నర్జునుఁడును నకులసహదేవులును వారిని జంపినవారుగారు. కాలము తాను మార్పుచేయు ధర్మము ననుసరించి యామనుష్యుల ప్రాణములను గొంపోయెను. కాలమునకుఁ, దల్లియనియుఁ దండ్రియనియు మఱియేదియనియుఁ గాని యభిమానము చూపఁదగినదొకటియు లేదు. భరతసత్తమా! ప్రాణుల పుణ్యపాపములకు నది సాక్షియైనది. అదియే యీయాయుద్ధమును నిమిత్తముగాఁ గొని వారిని సంహరించినది. అది ప్రాణులనుగొని ప్రాణులను జంపించుచున్నది. ఇది దాని యైశ్వర్యత్వము. * కాలము కర్మ

---

*ఇట 'కర్మసూత్రాత్మకం విద్ధి సాక్షిణం శుభపాపయోః' అని మూలము.

ములకు సూత్రమయినది - అనఁగా కర్మములను వానివాని ఫలములనొందునట్లు నడుపునది. ఏలనఁగా నది పుణ్యాపాపకర్మములకుసాక్షియైనదని తెలియుము. కాలమే సుఖదుఃఖము లనుఫలములనిచ్చునది. మహాబాహూ! హతులయిన యాక్షత్రియులు గావించినకర్మములను దలంచుకొనుము. అవియే వారినాశమునకు హేతువులయినవారిని గాలముబారిం బడునట్లుచేసినది. విధి నిన్నుఁబయికొని యిటువంటి కర్మమును జేయించినది గాన నీవును విధికిలోనై నడచుకొనుటయె యాచారముగాఁగలవాఁడవని నిన్నుఁదెలిసికొనుము. వడ్రపువాఁడుచేసిన యంత్రము, దానిని త్రిప్పుమనుష్యునకు వశమైనడచునట్లు,ఈ జగమంతయుఁ గాలముతోఁగూడినకర్మము త్రిప్పినట్లుతిరుగుచున్నది.మనుష్యునకు నుత్పత్తి వినాశములు, కారణమేది తెలియకయు, నలవ్రూకగాను, గలుగుటనుజూడఁగా నీశోకమును సంతోషమును నిరర్థకములే యగును. రాజా! ఈ విషయమై నీమనసునకు నీవు కలిగించుకొనుబంధము వట్టిదేకాని వాస్తవముకాదు. అయినను దాని నివర్తించుకొనఁగోరితివేని యందులకువలయు ప్రాయశ్చిత్తములను జేసికొనుము. తొల్లి యొకప్పుడు దేవాసురులకు యుద్ధము జరిగినది వినుచున్నారము. వారిలో నసురు లన్నలు, దేవతలు తమ్ములు. వారలకు నయితము రాజ్యలక్ష్మి నిమిత్తమే వెను విరోధముకలిగి ముప్పదిరెండువేల సంవత్సరములు యుద్ధము ప్రవర్తించెను. అందు దేవత లీభూమినంతయు నొక్కటే నెత్తురు సముద్రముగాఁ గావించి యసురులను జంపి స్వర్గమును బడసిరి.

---

'కర్మమూర్త్యాత్మకం విద్ధి' అని దాక్షిణాత్యపాఠము. కాలమే కర్మముయొక్క ప్రత్యక్షరూపమని తెలియుము అని యర్థము తెలియునది.

ఆయుద్ధమందు నసురులకు సాయముచేయుటకై గర్భంబునఁ గ
న్నఁగానక భూమినుండి యెనుబదియెనిమిదివేవురు బ్రాహ్మణులు
వచ్చియుండిరి. వారిని శాలావృకులందురు. వారు ముల్లోకము
లందును బ్రసిద్ధులు. వేదములందుఁ బారంగతులు. దేవతలా
బ్రాహ్మణులను సయితము నుఱుమాడిరి. అధర్మమును వృద్ధిఁ
జెందించి ధర్మమునకు విచ్ఛేదము కలిగింపఁ దివురుదురాత్ములను
రాజులును దేవతలును క్రూరులయిన దైత్యులనుంబోలె వధింప
వలయును. ఒకకులమునం దొకనిని జంపినయెడలఁ దక్కినవారికి
క్షేమముగలుగు నేనియు, అట్లె యొకకులమును జంపినయెడ దేశ
మునకు క్షేమముగలుగు నేనియు, నావధములుధర్మనాశకములుగా
నేరవు. నరపతీ ! ధర్మమొకానొకటి యధర్మమువలెను నధర్మ
మొకానొకటి ధర్మమువలెను నుండును. వివేచన గల ప్రాజ్ఞుఁడు
దానిని వివేచించి తెలిసికొనవలయును. పాండవా ! నీవును
జదువరి వగుదువు. కాఁబట్టి నీమనస్సును దిటపఱచుకొనుము.
దేవతలు తొల్లి చన్నమార్గము వెంటఁ బోయినాఁడవే కాని
మఱేమి కాదు. ఇట్టివారు నరకమును బొందరు. నీ పీతమ్ములను
సుహృదులను నూఱడింపుము. మనుష్యుఁ డెవ్వఁడు పాప
కార్యమునకుఁ దొడంగినపుడు పాపబుద్ధి గలిగియుండి, దానిని
జేయుచున్నపుడయిన నట్టిబుద్ధి మానక గలిగియె యుండి, చేసిన
పిదప నందులకై మనస్సునఁగుందుటగాని లజ్జపడుటగాని లేకుం
డునో, వానియందా పాపమంతయును బాపమని చెప్పఁబడును.
అట్టిపాపమునకుఁ బ్రాయశ్చిత్తమును గలుగదు. ప్రాయశ్చితము
వలన నాపాపమునకుఁ దగ్గుటయుఁగలుగదు. నీవో మంచికుల
మందుఁ బరిశుద్ధముగా జనించినవాఁడవు. పగవాఁడయినదుర్యో

ధనునిదోషమువలన నీ కిష్టము లేక యే యీకార్యము చేయవలసి వచ్చినది. చేసినపిదప నిట్లు పరితపించుచున్నావు. అశ్వమేధ మనెడి మహాయాగ ముత్తమ మయినప్రాయశ్చిత్తమని చెప్పఁబడుచున్నది. మహారాజా ! ఆయాగమును జేయుము. నీయిష్టముచొప్పునఁ బాపరహితుండవై యుందువు. మహాత్ముఁడగు దేవేంద్రుఁడు మరుత్తులనుగూడి శత్రువులను జంపి యొక్కొక్కయాగముగా నూఱశ్వమేధయాగములుచేసి పాపములు దూల్చి స్వర్గమును సుఖోదయములగు లోకములనుబడసి యామరుత్తులతోడ దిక్కులను వెలింగించుచున్నాఁడు. అట్లమరులకు రాజయి స్వర్గలోకమున నప్సరసలతోడ వెలుంగుశచీపతియగు నింద్రుని,ఋషులును దేవతలు నారాధించుచున్నారు. అనఘా ! నీవును బరాక్రమమున రాజులను జయించి యీభూమిని బొంది యున్నావు. నీవు జయించిన రాజులపట్టణములకును రాజ్యములకును స్నేహితులంగూడి చని,యందుఁ గలయారాజులపుత్రులను మనుమలను లేక సహోదరులను నాయారాజ్యములకు రాజులుగాఁ బట్టముగట్టుము. గర్భమం దుండుబిడ్డల యందును కనికరమును బచరించి ప్రజలనందఱను రంజించుచు భూతలమును బరిపాలింపుము. ఏరాజులకుఁ గొడుకులు లేరో వారి కూఁతుండ్ర నారాజ్యమునకుఁ బట్టముగట్టి యేలునట్లుచేయుము. స్త్రీలు సహజముగా భోగమం దాసక్తిగలవారు. నీవిట్లు చేయుదువేని వారు తమశోకములను దిగవిడిచి సుఖంబుందురు. సమస్తరాజ్యములను నిట్లూఱటఁ గలిగించి తొల్లి జయంబుగొన్న యింద్రుఁడునుంబోలె నశ్వమేధయాగమును జేయుము. ఓ క్షత్రియ సత్తమా ! యుద్ధమందుఁ గూలినయాక్షత్రియులను గుఱించి

శోకించుట యెంతమాత్రము దగదు. దైవము ప్రభావముచే మోహితులై వారు తమతమకర్మముల చేతనే నాశమునొందిరి. నీవు క్షత్రధర్మము ననుష్ఠించితివి; అకంటకమయిన రాజ్యమునుబడసితివి. కౌంతేయా! నీస్వధర్మమును గాచుకొనుము. దానివలన నీవు పరలోకసుఖము నొందుదువు' అనెను. ఇది ముప్పదిరెండవయధ్యాయము.

---

## రాజధర్మపర్వము.

{వ్యాసుఁడు ధర్మరాజునకుఁ బ్రాయశ్చిత్తములకుఁ దగుపాపములను వాని ప్రాయశ్చిత్తములనుజెప్పుట.}

ధర్మరాజు 'పితామహా! మనుష్యుఁ డెం దేకార్యములుచేసి ప్రాయశ్చిత్తము చేసికొనవలయునో, దేనిని జేసి యాపాపము నుండి విడివడునో, నాకుఁజెప్పుము' అని యడుగఁగా వ్యాసుఁడత నితో విహితములయిన కర్మములను జేయకపోవుటచేతను నిషిద్ధములయినవానిని జేయుటవలనను మనుష్యుఁడు పాల్లునడవడి గలవాఁడై ప్రాయశ్చిత్తము చేసికొనవలసిన వాఁడగుచున్నాఁడు. సూర్యుఁ డుదయమగునపుడును నస్తమించునపుడును బరుండి నిదురించుబ్రహ్మచారి, పుచ్చిన గోళ్లుగలవాఁడు, నల్లని పండ్లుగల వాఁడు, *పరివిత్తియు, †పరివేత్తయు, బ్రాహ్మణుల వెంపును దూషించువాఁడును, ‡అగ్రేదిధిషువును, §దిధిషూపతియును వ్రతము

---

* తమ్ముఁడు పెండ్లాడియుండ బ్రహ్మచారిగానున్న యన్న.

† అన్న బ్రహ్మచారిగానుండఁ బెండ్లాడిన తమ్ముఁడును.

‡ అక్క కన్నియగా నుండఁగా దానిచెల్లెలిని పెండ్లాడినవాఁడు.

§ చెల్లెలికిఁ బెండ్లియైనపిదప దాని యక్కను పెండ్లాడినవాఁడు.

చెడినవాఁడును,ద్విజాతులను మూఁడువర్ణములవారినిఁజంపినవాఁడును, అపాత్రమందు దానముచేసినవాఁడును, పాత్రమున కొసఁగనివాఁడును, సముదాయమునకు యాగముచేసినవాఁడును, మాంసమును విక్రయించినవాఁడును, ఔపాసనము మొదలయిన యగ్నికార్యములను విడిచినవాఁడును, *వేదమును విక్రయించినవాఁడును, శూద్రస్త్రీని జంపినవాఁడు, నను వీరిలోఁ బూర్వులయినవారు మిక్కిలి గర్హితులు. యాగమునకుఁగాక యూరక గోవధముచేసినవాఁడును, అడవిని గాల్చినవాఁడును, అబద్ధముచెప్పి గొలుచువాఁడును, మోసముచేసి బ్రతుకువాఁడును, గురువు నిషేధించువాఁడును, మాటచేతఁగాని మనస్సుచేతఁగాని దారపోసికొని దానముచేసినదాని నపహరించినవాఁడును, పరులిచ్చుదానిని వారించువాఁడును, ఒకబంతియందే వేఱుపాకమును భుజించువాఁడును, భుజించువారి నవమానించువాఁడును, సొంతజనులతోఁ గలహించువాఁడును, నాశ్రయించినవానిని రక్షింపనివాఁడును, నియమమును మీఱిన వాఁడును, నను వీరొక్కొక్కరును దమతమపాపములకుఁ దగునట్లు ప్రాయశ్చిత్తముచేసికొనవలయును. ఇఁక లోకమునకును వేదమునకును విరుద్ధములయిన యకార్యములను నీకుఁజెప్పెదను. ఆలించి వినుము. స్వధర్మమును విడుచుట, పరధర్మము ననుష్ఠించుట, అయోగ్యునిచే యాగముచేయించుట, అభక్ష్యమును భక్షించుట, శరణాగతుని దిగవిడుచుట, భృత్యులను బోషింపకుండుట, ఉప్పు చింతపండు మొదలయిన రసపదార్థములను విక్ర

* వేతనమునకు వేదములను జదివించినవాఁడు.

యించుట, పశుపక్ష్యాదులను తిర్యక్కులను జంపుట, శక్తి యుండియు * ఆధానమును మొదలయిన కర్మములను జేయుచుండుట, నిత్యము (పసులకు నాహారము మొదలుగా) నిచ్చువానికి నీకుండుట, దక్షిణ యొసఁగకుండుట, బ్రాహ్మణుల సొమ్మునపహరించుట మొదలుగా నివియన్నియు ధర్మము నెఱింగినవా రకార్యములని తెలిపెదరు. తండ్రితో జగడముసేయు కొడుకును, గురుభార్యను బొందువాఁడును, ధర్మపత్నిని బాడిమెయిఁ బొందనివాఁడును, అధార్మికు లగుదురు. వేనిని జేసినను వేనిని జేయకున్నను మనుష్యుఁడు ప్రాయశ్చిత్తము చేసికొనవలయునో యాకార్యములు వేదములందును విస్తరముగను సంగ్రహముగను జెప్పఁబడియున్నవి. ఇటువంటికార్యములు చేసియు మనుష్యునకుఁ బాపము పొందకుండుటకుఁ గొన్ని కారణములు గలవు; వానిని జెప్పెదను. యుద్ధమం దాయుధమునుగొని తన్నుఁ గొట్టవచ్చువాఁడు వేదాంతవేత్తయైనను వానిని జంపుట బ్రహ్మహత్యగాదు. ఈవిధి,వేదములందలి మంత్రములు చెప్పుచున్నవి. వేదప్రమాణములచే విధింపఁబడిన ధర్మమును నీకుఁ జెప్పెదనుఁ తన వృత్తమునుండి తొలఁగిన యాతతాయి యగుబ్రాహ్మణుని జంపుటవలనఁ బాపముగలుగదు. ఒకని కోపము మఱొకనికిఁ గోపము గలిగించినది. ప్రాణమున కపాయముకలుగునపుడు ధర్మవిదుల యనుమతినొంది తెలిసి సుర నుపయోగించువాఁడు పిదప శుద్ధినొందవలయును. అభక్ష్యమును భక్షించుటవలనఁ గలుగు పాపమంతయుఁ బ్రాయశ్చిత్తవిధిచొప్పున శుద్ధిఁబొందునని నీకుఁ జెప్పితిని. గురువునాజ్ఞను గొని గురుపత్నిని బొందినవాఁడు దోష

* ఔపాసనమనెడు స్మార్తాగ్నిని వైదికమయిన మూఁడగ్నులుగాఁ జేయుట.

మునొందఁడు. ఉద్దాలకుం డనుఋషి శిష్యునిఁగొని శ్వేతకేతుం డనుపుత్త్రునిఁ బుట్టించుకొనెను. గురువుకొఱకై యాపదయందు దొంగలించుటవలన దోషముగలుగదు. అయినను దాను విచ్చల విడి భోగించుటకై దొంగలించువాఁడు దోషియగును. బ్రాహ్మ ణులసొమ్ముదక్కఁ దక్కినవానిని (ఆపదయందుఁగాని గుర్వర్థము గాని) దొంగలించినచో దోషము లేదు. అట్లు దొంగలించి తాను భుజింపనివాని నేపాప మంటదు. తనప్రాణమునుగాని యొరులప్రాణ మునుగాని రక్షించునపుడును, గురువుకొఱకును, స్త్రీలయెడను, వివాహములందును, నబద్ధము చెప్పవచ్చును. స్వప్నమందు శుక్లమువిడిచినయెడల నందులకు మరల నుపనయన మక్కఱలే దు. మండుచున్న యగ్నియందు నేయివేల్చుటయే యందులకుఁ బ్రాయశ్చిత్తము. అన్నపతితుఁడుగాఁగాని సన్న్యాసిగాఁ గాని పయినచోఁ దమ్మునికిఁ బారివిత్త్యదోషముగలుగదు.ఒకస్త్రీ వేఁడి కొనఁగా దానితోఁ బొందినయెడల నది ధర్మదూషకముగాదు. వ్యర్థముగాఁ బశువులను జంపుటయుఁ జంపించుటయుఁగూడదు. విధ్యుక్తముగాఁ బశువులను వధించుట వానియెడ ననుగ్రహ మేయగును జుమీ. తెలియమిచే ననర్హుఁ డయినబ్రాహ్మణునకు దానముచేయుటయు నర్హుఁడయినవానికి దానముచేయక పోవు టయు దోషముగాదు. అపరాధము గలభార్యను దొలఁగఁబు చ్చుట దోషముగాదు. దానినట్లు గావించుట దాని పరిశుద్ధికిఁ గారణమగును. అట్లు చేయుపురుషునికిఁ బాపముగలుగదు. సోమరసము తత్త్వమును దెలిసినవాఁడు దాని నమ్ముట వలనఁ బాపమునొందఁడు. సమర్థుఁడుకాని పనివానిని దిగవిడు చుటయు దోషముగాదు. గోవులకొఱకు నడవిని గాల్చుటయు

నిషిద్ధముగాదు. ఇట్లు చెప్పఁబడిన కార్యములు చేయుటవలన దోషము లేదు ; దోషములనుదూల్చి పరిశుద్ధి నొసంగు ప్రాయశ్చిత్తవిధులను సవిస్తరముగా నీకుఁ జెప్పెదను' అనెను. ఇది ముప్పదిమూడవయధ్యాయము.

---

## రాజధర్మపర్వము.

### వ్యాసుఁడు ధర్మరాజునకుఁ బాపములకుఁ బ్రాయశ్చిత్తములను జెప్పుట.

వ్యాసుఁడు 'మనుష్యుఁడు చాంద్రాయణము మొదలయిన తపమును యాగాదులయిన కర్మములను గోదానము మొదలయిన దానములను జేసి మరల నాపాపములకుఁ బోకుండు నేని పాపమువీడి పరిశుద్ధుం డగును. బ్రహ్మహత్యచేసినవాఁ డసూయవిడిచి, యెప్పుడును బ్రహ్మచారియై, తనకు వలయునది తానే చేసికొనుచు, నెప్పుడును జులుకుగలిగి, దనపాపమును లోకులకుఁ దెలుపుచును, నొకచేత ఖట్వాంగ మనుకఱ్ఱను నొకచేతఁ గపాలమును నెత్తికొని, బిచ్చమెత్తిన యన్నము నొకపూఁట గుడిచి, నేలపయిఁబరుండి, పండ్రెండుసంవత్సరము లుండు నేని, యాపాపమునుండి విముక్తుఁడగును. వలయునని బ్రహ్మహత్యచేసినవాఁడేని, ఆయుధము గలవానికడకుఁ బోయిఁ దన్నుఁజంపించుకొనవలయును. లేక తెలిసినవారియిచ్చచొప్పుననో తనయిచ్చచేతనో యగ్నిని దరికొలిపి యందుఁ దనదేహమును విడువవలయును; తల క్రిందుగా వంచుకొని యేదేనియొక వేదమును జపించుచు మున్నూఱు యోజనములదూరము యాత్రచేయవల

యును. లేక తనధనమునంతయు వేదవిదులగు బ్రాహ్మణులకు నొసంగవలయును; లేక జీవనమునకుఁ జాలినంత ధనమును వలయు వస్తువులు నిండియున్న గృహమును దానముచేసి పశువులను బ్రాహ్మణులను బోషించుచు వచ్చినయెడల బ్రాహ్మణహత్య నివర్తించును. లేక *కృచ్ఛ్రమనుతపమును నాలుగేండ్లు తెగక చేయుచువచ్చినయెడల బ్రహ్మహత్యగలవాఁడు పరిశుద్ధుఁడగును; లేక యొకమాసమును నాలుగుగా భాగించి ముందుచెప్పిన యాకృచ్ఛ్రనియమముచొప్పున మూఁడేండ్లు భుజించుచువచ్చిన యెడల నాపాపమునుండి విడివడును; లేక యొక్కమాసమున కొక్కమాఱుభుజించుచువచ్చునేనియొక్కసంవత్సరమునఁబరిశుద్ధుఁ డగుననుటకు సందేహములేదు. అట్లు దృఢముగా నిరాహారవ్రతము పూనునేని మఱియుఁ దక్కువకాలముననే శుద్ధినొందవచ్చును. అశ్వమేధయాగము సయితమీపాపమును దొలఁగించి శుద్ధియొసంగు ననుటకు సందేహములేదు. అశ్వమేధమును జేసి యవభృథస్నానమును గావించిన మనుష్యులందఱును నిట్టి పాపములనుండి విడివడి పరిశుద్ధులగుదురనుట వేదముఖ్యవిషయము. మఱియు బ్రాహ్మణనిమిత్తము యుద్ధమునఁ గొట్టువడినను, లేక లక్షగోవులనో, పాలుపితుకఁదగిన కపిలగోవుల నిరువదియైదువేలింటినో సత్పాత్రమునందు దానముచేసినను, బ్రహ్మహత్య మొద

* కృచ్ఛ్రమనఁగా మూఁడుదినములు వేకువను మాత్రమును, మఱి మూఁడు దినములు సాయంకాలమున మాత్రమును, అవ్వలి మూఁడుదినములు దైవికముగా దొరికినదానిని మాత్రమును భుజించుచు, మఱియవ్వలి మూఁడుదినము లుపవాసముండు విధి. ఈ మూఁడేసి దినములకు మాఱుగా ఏడేసిదినము లనుష్ఠింపఁగా మూఁడుసంవత్సరములకుఁ బరిహారమని తెలియునది.

లయిన పాపము లన్నింటినుండి విముక్తుఁడగును. ప్రాణసందేహముగలిగినపుడు చక్కఁగాఁ బిదికెడి వేయిపశువులను దూడలతోఁగూడ సాధువులయిన దరిద్రులకు దానముచేసినచోఁ బాపమునుండి విడివడును, రాజా! బ్రాహ్మణులకుఁ గాంభోజదేశపు గుఱ్ఱములను నూటింటిని దానముచేయునేని పాపమునుండి విడివడును. మఱియు నెవఁ డొక్కనికయినను వాఁడు కోరిన దంతయు నిచ్చుటయేకాక యట్లిచ్చుటను జెప్పికొనకయునుండునో వాఁడును బాపమునుండి విముక్తుఁడగుచున్నాఁడు. ఒక్కమాఱు మద్యము త్రాగినవాఁ డామద్యమును నిప్పువలెఁ గాఁచి త్రాగునేని వాఁడిహమందును బరమందును బరిశుద్ధి నొందుచున్నాఁడు. నిర్జలమగు ప్రదేశమందుఁ గొండకొననుండి క్రిందఁబడియు, నగ్నియందుఁ జొచ్చియు,*మహాప్రస్థానము సనుష్ఠించియుఁగాని దేహము విడిచినవాఁడు సమస్తపాపములనుండి విడుమర నొందును. బ్రాహ్మణుఁడు మద్యముద్రాగినయెడ బృహస్పతి సవమనెడి యాగముచేసి పాపమువీడి †సభకుఁబోవ నర్హుఁడగునని వేదముచెప్పుచున్నది. లేక యొకఁడు మద్యముద్రావెనేని వాఁడు మత్సరమువిడిచి భూదానముచేసి మరల మద్యము ద్రావకుండునేని యాదోషమునుండి చక్కఁబడి పరిశుద్ధుఁడగుచున్నాఁడు. గురుభార్యనుబొందినవాఁ డెఱ్ఱగాఁ గాఁచిన యినుప

---

* మహాప్రస్థానమనఁగా కేదారక్షేత్రమునందు హిమవంతమునారోహించుట. అనఁగా ప్రాణత్యాగమునకై యుత్తరముగాఁబోయి హిమవంతము నెక్కుట.

† ఇందులకు 'సమితిం బ్రాహ్మణో గచ్ఛే దితివై బ్రహ్మణః శ్రుతిః' అని మూలము. 'సమితిం బ్రహ్మణో గచ్ఛేత్' అని ఉత్తరకోశపాఠము. బ్రహ్మలోకము పొందునని బ్రహ్మయే చెప్పినాఁడని యర్థము.

జాతిపయిఁ బరుండవలయును. లేక తనపురుషచిహ్నమును (లింగమును) కోసివైచి యాకాశముచూచుచు నూరువెడలి యడవికిఁ బోవలయును. దేహమును విడుచుటచేత నొకఁడు దానుచేసిన పాపకర్మములనుండి వీడుచున్నాఁడు. అట్టిస్త్రీ లొక సంవత్సరమువఱకు నాహార విహారాదులు వదలి నియమములతో నుందురేని యట్టిపాపకర్మములనుండి విముక్తి నొందుదురు. ఎవఁడు మహావ్రతమును, (నొకమాసము నీరు సయితము ద్రావకుండుటను), నాచరించునో, లేక తనధనమునంతయు దానముచేయునో, లేక గురువునిమిత్తము యుద్ధమునందు హతుఁడగునో, యతఁడు పాపకర్మమునుండి విడివడును. గురువునెడఁ బొల్లుగా వర్తించువాఁడును గురువు నడ్డగించినవాఁడును నతనికిఁ బ్రియము యొనదానిని జేసి యాపాపమునుండి తొలఁగును. బ్రహ్మచర్యవ్రతమును విడిచినవాఁడు బ్రహ్మహత్యకునయిన ప్రాయశ్చిత్తమును జేసి కొనవలయును. లేదా, యావ్రతోలునుగట్టుకొని యాఱుమాసములు కృచ్ఛ్రమను తపముచేసెనేని యా పాపమునుండి విడివడును. పరస్త్రీని బొందినవాఁడును బరధన మపహరించినవాఁడును సంవత్సరము వ్రత మాచరించి యా పాపమునుండి ముక్తుండగును. ఎవనిధనము దొంగలించునో వాని కంతమాత్రము ధనమును దనచేత నగునుపాయములు పెక్కింటిచేత నిచ్చివుచ్చవలయును. అప్పుడు వాఁ డాపాపమునుండి విడివడును. పరివిత్తియుఁ బరివేత్తయు నన్నకుఁ బెండ్లియైనపిదప మనోనియమముగలిగి పండ్రెండురాత్రులు కృచ్ఛ్రమను వ్రతమునలిపి పరిశుద్ధుఁడగును. వారిలోఁ బిన్నవాఁడు పితరుల నుత్తరింపఁజేయుటకు మరల వేఱుకన్యను బెండ్లి చేసికొనవలయును. ఆరెండవ

పెండ్లిచే మొదటఁ బెండ్లాడినస్త్రీకి దోషము ముట్టకపోవును. కావున దానిని జేకొనుటచేఁ బురుషునికి దోషముకలుగదు. ధర్మవిదులయినవారు స్త్రీలు మహాపాపములు చేసినపుడు నాలుగుమాసము లుపవాసవ్రతము చేసినచో శుద్ధినొందుదురని తెలియుదురు. * స్త్రీలు పాపముచేసినట్లు సందేహింపఁబడినచో దెలిసినవానికి వారినిబొందుట న్యాయముగాదు. పాత్రము బూడిదచేత శుద్ధమగునట్లు వారు రజస్సుచేత పరిశుద్ధినొందుదురు. కంచుపాత్రము, శూద్రుఁ డెంగిలిచేసినను, పశువులు మూరుకొన్నను, పుక్కిలింతచేత నెంగిలియైనను దానిని బాలు పెరుఁగు నేయి మూత్రము పేడ యను పంచగవ్యములును; మన్ను,నీరు, బూడిద, చింతపండు, నిప్పు అనెడి యైదునుజేర్చి యీపదింటిచే శుద్ధిసేయవలయును. ఇట్టిశుద్ధివిధిరూపమగు ధర్మము బ్రాహ్మణునకుఁ బూర్ణముగాను, క్షత్రియునకుఁ బాతికపాలు తక్కువగాను నుండును. వైశ్యునకును శూద్రునకును మఱియు నొక్కొక్క పాతికపాలు తక్కువగ విధింపఁబడుచున్నది ఆనలువురు నీశుద్ధికై ప్రాయశ్చిత్తము చేసికొనవలసినపు డీ విధానమునుబట్టి వారిలో నశుద్ధి యెవరియం దెక్కుడగునో తేలికయగునో తెలిసికొనవచ్చును. ఆ గురులాఘవములను దెలిసిననే తగునట్లు ప్రాయశ్చిత్తము చేసికొనఁగూడును. పశుపక్ష్యులను జంపినను, బెరుఁగుచున్న వృక్షములను బెక్కింటిని నఱికినను, నాపాపమును వెల్ల

---

* స్త్రియ స్త్వాశఙ్కితాః పాపే నోపగమ్యా విజానతా' అని మూలము. "పాపా నోపగమ్యా' అని ఉత్తరకోశపాఠాంతరము. స్త్రీలు పాపమొకప్పుడుగాని మనస్సుచేతఁగాని చేసినట్లు సందేహము తోఁచెనేని ధర్మవిదు లంతమాత్రమునకు వారిని పాపాత్మికలుగా గణింపరని యర్థాంతరము.

డించుకొనుచు మూఁడురాత్రులు వాయుభక్షుఁడై యుండవల యును. పొందఁదగని స్త్రీని బొందినచో నాపాపమునకుఁ బ్రాయశ్చిత్తము చేయుటకు నాల్గు నెలలు తడిపుట్టములతో విభూదిపఱచి పరుండవలయును. రాజా! అకార్యముల కన్నింటికిని బ్రహ్మచెప్పిన విధిచొప్పునను దృష్టాంతమును వేదములను ననుసరించియు, హేతువునుబట్టియు, ప్రాయశ్చిత్త విధియగును. బ్రాహ్మణుఁడు శుచిప్రదేశమున గాయత్రిని జపించుచు మితాహారుఁడయి హింస వదలి కొంచెపు మాటలుగలిగి వర్తించునేని సమస్త పాపముల నుండి విముక్తుఁడగును. అట్టియెడ నతఁడు పయికప్పులేని వట్టి బయలునందు పగలెల్లనుండి రాత్రులు నందే పరుండియుండవ లయును. పగటి మూఁడుమార్లును రాత్రి మూఁడుమార్లును వస్త్రములతోనే జలములందుఁజొచ్చి స్నానముచేయవలయును. మఱియు వాఁడినియమము గలిగి స్త్రీలతోను శూద్రులతోను బతితులతోను మాటాడకుండవలయును. బ్రాహ్మణుఁ డిట్టివ్రతము నాచరించునేని తాను దెలియకచేసిన పాపములనుండి విడివడును. మనుష్యుఁడు చేయు మంచిసెబ్బర కర్మములకు భూతములెల్ల సాక్షియగును. అట్టి కర్మములకు ఫలము వాఁడు దేహమువిడిచినదే పొందును. ఆపుణ్యపాపకర్మములలో నేది దక్కిన దానిని గ్రిందుపఱిచి యెక్కుడగునో దానిఫలమునే కర్మకరుఁడు పొందుచున్నాఁడు. కాబట్టి మనుష్యుఁడు * జ్ఞానముచేతను దపస్సుచేతను సత్కర్మములచేతను పుణ్యఫలమును వృద్ధిఁబొందించుకొనును. అట్లె యతఁ డశుభకర్మములను జేసెనా పాపమును వృద్ధిఁబొందించుకొనును. కాఁబట్టి పుణ్యకర్మములనే చేయవల

---

* 'జ్ఞానేన' అని మూలము 'దానేన' అనిపాఠాం.

యును. పాపకర్మమునుండి నివర్తింపవలయును. పాపకర్మములు నివర్తించు నిమిత్తమై ధనము నెప్పుడు దానముచేయవలయును. అట్లుచేసిన పాపమునుండి విడుమర కలుగును. ఆయా పాపమునకుఁ దగిన ప్రాయశ్చిత్తమును నుదాహరించితిని. మహాపాతకములకుఁ దప్పఁ దక్కిన పాపములకెల్లఁ బ్రాయశ్చిత్తము విధింపఁబడుచున్నది. భక్ష్యములు అభక్ష్యములు వాచ్యములు అవాచ్యములు ననెడిపాపములు తెలిసి చేయుట తెలియకచేయుట యనుదీనినిబట్టి రెండువిధములుగా నున్నది. † తెలిసిచేసిన పాపమంతయు మిక్కిలి దుర్భరమైన దగుచున్నది. తెలియక పొరపడిచేసినది స్వల్పదోషమే యగును. రెంటికిని ప్రాయశ్చిత్తము గలదు. పాపము నింతవఱకుఁ జెప్పఁబడిన ప్రాయశ్చిత్తవిధి చేతఁ బోకార్చుట శక్యమేకాని యశక్యముగాదు. అయిన నీ ప్రాయశ్చిత్తవిధి యాస్తికులకును శాస్త్రమందు విశ్వాసముగలవారికిని విధింపఁబడి యున్నది; కాని నాస్తికులకును, శాస్త్రవిశ్వాసము లేనివారికిని దంభమును ద్వేషమును ముఖ్యముగాఁ గలవారికిని విధింపఁబడినది కాదు. ఇహమందును బరమందు

* 'నివర్తేత్పాపకర్మణః' అనిమూలము 'నిమిత్తేపాపకర్మణామ్' అనిపాఠాంతరము. పాపకర్మము నిమిత్తమై అనఁగా దానిని దొలఁగించుకొనుటకు పుణ్యకర్మము చేయుమని యర్థము.

† 'జానతాతుకృతం పాపం గురుసర్వం భవత్యుత । అజ్ఞానాత్స్వల్పకో దోషః ప్రాయశ్చిత్తం విధీయతే' అని మూలము. 'అజ్ఞానాత్ స్ఖలితేదోషే ప్రాయశ్చిత్తం విధీయతే' అని పాఠా. ఇందులకు 'ప్రాయశ్చిత్తము తెలియక పొరపడిచేసిన పాపమును దొలఁగించుటకై విధింపఁబడినది; కాని తెలిసి చేసిన పాపమునకుఁగాదు. అట్టిపాపము దుర్భరమైనది' అని యర్థము.

ను హితముఁగోరువాఁడు శిష్టుల యాచారమును ధర్మమును * దైవమును నెప్పుడును గొలువవలయును. † రాజా! వారిని వధించినపుడు నీ ప్రాణములను గాఁచుకొనుటకో లేక నీకుఁ గలరాజధర్మములనుబట్టియో యట్లు చేసితివి; కావున నావధపాపమునుండి నేను బూర్వము చెప్పిన హేతువులచేత, తనంతట విడివడ్డవాఁడ వయితివి. కాన యందులకై నీ కేమియుఁ జేయనక్కఱలేదు. అయినను గాని జాలినిబట్టి నీకుఁ బాపమేదో కలదని తలంతువేని యందులకై ప్రాయశ్చిత్త మాచరింపుము. అది దగునేకాని, యప్రాజ్ఞులకే తగినట్టి దుఃఖముకారణముగా ప్రాణములు విడుతురా? ఇది నీకెంతమాత్రము దగదు సుమా' అనెను. మహాత్ముఁ డామహర్షి యిట్లు చెప్పఁగా ధర్మరాజు గడియసేపాలోచించి యాతపోధనునిఁ జూచి యిట్లనియె. ఇది ముప్పదినాలవయధ్యాయము.

## రాజధర్మపర్వము.

{ వ్యాసుఁడు ధర్మరాజునకు భక్ష్యాభక్ష్యములను పాత్రాపాత్రములను దెలుపుట. }

ధర్మరాజు 'పితామహా! ఏది భక్షింపఁదగినది? దేనిని భక్షింపరాదు. దేని నిచ్చుట పొగడ్తకెక్కినది? పాత్రమేది?

* 'శిష్టాచారశ్చ దిష్టశ్చధర్మః' అని. దా. మూలము. 'శిష్టశ్చధర్మః' అని జౌ. మూలము.

† 'స రాజన్మోక్ష్యసే పాపాత్తేన పూర్వేణ హేతునా। త్రాణార్థం వావధే తేషా మథవా నృపకర్మణా'' మూలము. 'స రాజన్మోక్ష్యతే పాపాత్తేన పూర్ణేన హేతునా' (దా.మూ) 'ప్రాణార్థం వాధనేనైషా మథవానృపకర్మణా' (జౌ. మూ).

అపాత్రమెద్ది? నాకుఁజెప్పు'మని యడిగెను. వ్యాసుఁడు 'ఈవిషయమై ప్రజాపతియగు మనువునకును ఋషులకునుఁ దొల్లి సంవాదరూపమున జరిగినయితిహాసము నుదాహరించుచున్నారు. తొల్లి కృతయుగంబున వ్రతపరాయణులగు ఋషులు కొందఱు గూడి మనువు తీఱుపాటునఁ గూర్చుండియుండఁగా, నతనిని ధర్మమునుగూర్చి యడుగువారై "ప్రజాపతీ! ఏది భుజింపఁదగినది? దానమేది? పాత్రమెవరు. * అధ్యయనమెట్లు? తపమెట్లు? కార్యములెవ్వి? అకార్యములెవ్వి? ఇవన్నియు మాకుఁజెప్పుము' అనిరి. అందుల కాస్వాయంభువమనువు వారితో 'ఋషులారా! ధర్మమును గలరూపున విస్తరించియు సంగ్రహించియుఁ జెప్పెదను వినుఁడు; విశేషించి దోషము చెప్పఁబడనిచోట జపమును హోమము నుపవాసము నాత్మజ్ఞానమును, ఇట్టివిగల మహానీయులును, పుణ్యనదులు నను నివి మనుష్యునిఁ బరిశుద్ధునిఁగావించునవిగాఁ జెప్పఁబడినవి. కొన్నిపర్వతములుగూడఁ బవిత్రములయినవి. మఱియు బంగారమును దినుట, నేయిగుడుచుట, †రత్నస్నానము, దేవాలయమునకుఁ బోవుటయు నను నివి పురుషునిఁదప్పక త్వరితముగాఁ బరిశుద్ధునిఁజేయుచున్నవి. మనుష్యుఁడెవఁడుగాని గర్వించె నేని యెప్పుడును బ్రాజ్ఞుఁడు గానేరఁడు. అట్లు గర్వించినవాఁడు దీర్ఘాయువునుగోరునేని ‡ తప్తకృచ్ఛ్రమను తపమును (ఆగర్వమునకుఁ

* దానమధ్యయనంతపః' (జౌ. మూ) 'గమ్యాగమ్యా' కథం స్త్రియః. అని (దా. మూ.) కానియింములకు మీఁద ను త్తరము లేదు. కానయిది పరిహృతము.

† రత్నములు వైచిన జలములచే స్నానముచేయుట.

‡ 'త్ర్యహం త్రం చోష్ణపాభవేత్' అని మూలము. ఇదియే తప్తకృచ్ఛ్రము. మొదటిమూఁడుదినములు ఆఱుపలముల వేఁడినీళ్లను పిదప మూఁడుదినములు మూఁడు

బరిహారముగా) చేయవలయును. ఈయఁబడని వస్తువు నెత్తకుండు టయు, దానమును, అధ్యయనమును, దపమును, అహింసయు, సత్యమును, క్రోధము లేమియు, * క్షమయు నను నివియే ధర్మమునకు లక్షణములు. అదే ధర్మము దేశకాలభేదమునుబట్టి యధర్మముగాఁ బర్యవసించును. ఆదానమును, అనృతమును, హింసయు †నొక్కొక్క సందర్భమందు ధర్మముగాఁ జెప్పఁబడియున్నవి. తెలిసినవారికి నీ రెండువిధముల ధర్మములును బ్రవృత్తియనియు నివృత్తియనియు రెండు విధములగును. ఈ ప్రవృత్తి నివృత్తులు రెండును వైదికము లౌకికమునని మఱియు రెండువిధములగును. అందు వైదికమగు నివృత్తికి (అనఁగా వేదోక్తకర్మములువాని బ్రహ్మానుసంధానముఁదగిలియుండుటకు) ఫలము, అమర్త్యత్వము (చచ్చిపుట్టుట లేకుండుట). వైదికమయిన ప్రవృత్తికి (వేదాదికర్మములననుష్ఠించుటకు) ఫలము మర్త్యత్వము (చచ్చి మరలంబుట్టుట). లౌకికము లయినయూ రెంటికిని, నది శుభమయినచో శుభఫలమును అశుభమయినచో నశుభ ఫలమును గలుగునని తెలియవలయును. ఈ రెంటిని వానివాని శుభాశుభ ఫలములనుబట్టి వేఱువేఱ తెలిసికొనవలయును. చేయుపనులు నీచముగానుండినను నఫి,

---

పలముల కాఁచినపాలును పిదప మూఁడుదినములు ఒక పలము వేఁడి నేతినిని గుడిచి పిదప మూఁడుదినము లొక్కటియుఁ గుడువక యుండుటయే యీవ్రతము.

* 'ఇజ్యా' అని పాఠాంతరము- యాగకర్మమని యర్థము.

† 'ధర్మోహ్యావస్థికస్స్మృతః' అని (ఔ. మూలము) 'ఆత్యన్తికస్స్మృతః' అని(దా.మూ).ఆదానము అనఁగా నొకరిసొమ్మును బుచ్చుకొనుట. రాజపరాధులపై దండుగలు విధించి దానిని రాజ్యోపయోగములకు నెత్తికొనుట దోషము గాదు. అసత్యము - భృత్యుఁడు తన యేలినవానిఁ గాచుటకై కల్లలాడిన దోష

దైవము, శాస్త్రోక్తకర్మము, తన బ్రతుకు, * తన మరణము, నను వీనినిబట్టి చేయఁబడునేని శుభఫలమునే యిచ్చును. ఒక పని, మీఁద నొకరికిఁ గీడుగలిగించునని సందేహముతోఁ జేసినను గాని, లేక తప్పక కీడుగలిగించునని యనుభవముచేఁ గనుఁగొనియే (అనఁగా నిశ్చయముతో) చేసిననుగాని, యందులకుఁ బ్రాయశ్చిత్తముచేసికొనవలయును. కోపముచేతఁగాని మోహము చేతఁగాని యొకపనిచేసినయెడల నక్కార్యమునకుఁ దగినట్లు వేదమునందుఁ జెప్పినవిధిననుసరించి శరీరమును వాఁడునట్లుపవాసముచే సుశిక్షించుకొనవలయును. మఱియేదేని తన మనస్సునకుఁ బ్రియముగావించుటకో పరుల మనస్సున కప్రియముగావించుటకో క్రోధమోహములచేతఁ జేసినయెడల నప్పాపమును మంత్రజపములచేతను, బరిశుద్ధాన్నభోజనముచేతను దొలఁగించు కొనవలయును. రాజొకవిషయమున దండము విధింపక తప్పెనేని యొకదిన ముపవాసముండి తన్ను శుద్ధునిఁగావించుకొనవలయును. ఆరాజున కట్టిదండము నుపదేశించుటకుఁ దప్పినపురోహితుఁడుమూఁడునా ళ్లుపవాసముండవలయును. తనకుఁ బుత్రాదిక్షయమువలన శోకమునొందుచు నాయుధములు మొదలయినవానిచేఁ దన మరణమునకుఁ బ్రయత్నించియుఁ జావకున్నవాఁడేని మూన్నాళ్లు పస్తుపడియుండవలయును, శాశ్వతమయినజాతి,

---

ము గాదు. హింస - రాజపరాధిని వధించుటయుఁ దన్నుఁగాచికొనుటకై శత్రువును వధించుటయు దోషముగాదు.

*'ప్రలయః' అని (దా.మూ.) 'ప్రాణదః' అని (కౌ.మూలము) ప్రాణమును గాచుకొనునట్టి పని యని యర్థము. ఇట్లే యుభయప్రతులకు నయ్యెయెడల పాఠభేదములు మెండుగఁ జూపట్టుచున్నవి.

ఆశ్రమము, గ్రామము, కులము ననెడి వీనిసంబంధించిన ధర్మములనన్నిటిని దిగవిడిచిన మనుష్యులకు మఱియేధర్మమును గలుగదు. ధర్మసందేహము గలిగెనేని వేదశాస్త్రముల నెఱింగిన పదిపండితులనయినను, ధర్మశాస్త్రమును జక్కఁగా నేర్చిన ముప్వురనయినను, విచారించి వారు చెప్పినది ధర్మమని నిర్ణయించుకోనవలయును. ఎద్దు, మన్ను, చిన్నచీమలు, *ముఱికియందుఁ బుట్టుపురువులు, (వత్సనాభి మొదలయిన) విషమును బ్రాహ్మణులు తినరాదు. మఱియు వాగు పొలసులేని చేఁపలను, తాఁబేలు తప్ప జలములందుఁ గలుగు తక్కినవలుగాలి ప్రాణులగు కప్ప మొదలగు వానిని భుజింపరాదు. మఱియు జలపక్షులగు భాసమును (గంపపులుఁగులు) అంచలను, గరుడపక్షులను, చక్రవాకములను, నీరుకోళ్లను, కొంగలను, కాకులను, నీరుకాకులను, గ్రద్దలను, డేఁగలను, గూబలను, మఱి వాఁడు లయిననిడుదకోఱలుగలిగి మాంసమును దినుజంతువులను, రెండువరుసల పండ్లుగలవానిని, నాలుగుకోఱపండ్లు గలవాని, నన్నింటిని బ్రాహ్మణుఁడు భుజింపరాదు. మఱియు గొఱియ, గాడిద, క్రొత్తగానీనిన యావు, లొట్టియ, †స్త్రీ యనువీరలపాలును బ్రాహ్మణుఁడు త్రాగరాదు. బ్రాహ్మణుడుమరణముగలిగిన యింటను బురిటియింటను నన్నమును బదిదినములవఱకును గుడువరాదు. ఈని పదిదినములుకాని యావుపాలను గుడువరాదు. క్షత్రియునియన్నము, తినువాని తేజమును, శూద్రునియన్నము వాని బ్రహ్మవర్చసమును, కంసాలియన్నమును వెనిమిటియుఁ బుత్త్రుఁడులేని పడఁతియన్నమును వాని యాయు

† శ్లేష్మాతకః 'అని మూలము. విరిగికాయలని కొందఱ వ్యాఖ్యానము.
* 'సూకరాణాంగవామ్' (దా.మూ) 'సూతికానాంగవామ్' (ఔ.మూ)

వునుసపహరించును. పాడిదప్పి వడ్డిగొని బ్రతుకువాని యన్నము మలమునకు సాటియగును. వేశ్యాయన్నమును, తన పెండ్లాముఱంకుమగనియన్నమును, ఆఁడుదానికి లోఁపడినవాని యన్నమును, శుక్లమునకు సాటియగును. యాగమునందు దీక్షితుఁడయినవాని యన్నమును (అతఁడు వపాయాగము చేయువఱకును) గుడువరాదు. యాగమునందు సోమమునమ్మినవాఁడు, లోభి, వడ్రవాఁడు, మాదిగవాఁడు,ఱంకులాలు,చాఁకలి, వైద్యుఁడు, ఊరితలారులు, జనులగుంపు, గ్రామమంతటిచేత నపవాదముపడినవాఁడు,నటుఁడు, స్త్రీలపడుపున బ్రతుకువాఁడు, అన్నకుముందు పెండ్లాడినవాఁడు, పుంస్త్వములేనివాఁడు, బట్టువాఁడు, జూదరి యనువీరల యన్నమును భుజింపఁదగదు. ఎడమచేతఁ దేఁబడినదియు, ఎండినదియు, ప్రాఁతగిలినదియు, మద్యసంబంధముగలదియు, తినఁగా మిగిలినదియు,తనకని ప్రత్యేకముగానెత్తిపెట్టఁబడినదియు (శేషమైనదియు) నగునన్నమును భుజింపరాదు. పిండి, చెఱకు, కాయగూర, పాలు, పేలపిండి, బొరుగులు, పెరుఁగుతోఁగలిపిన పేలపిండియును వీనితోఁజేయబడినవి నాళ్లుచెల్లిన యెడల భుజింపఁదగవు. పాయసము, పులగము, మాంసము, అప్పమును, దేవతలకు నివేదింపఁబడనివిగా నుండినచో గృహస్థులయిన బ్రాహ్మణులు వీనిని భుజింపరాదు. గృహస్థుఁడగువాఁడు దేవతలను, ఋషులను, పితరులను, ఇలువేల్పులను మనుష్యుల నందఱనుబూజించి యటమీఁదఁ దాను భుజింపవలయును. * ఇల్లు విడిచినపోయిన సన్న్యాసివలె స్వగృహమునందు గృహస్థుఁ డుండవలయును.

---

* ఇట్లు గృహస్థుఁడింట వసించుటచే ఇలువిడిచిపోయిన సన్న్యాసి వంటివాఁడగునని యర్థాంతరము.

ఇట్లుండుగృహస్థుఁడు ప్రియభార్యలం గూడియుండి ధర్మమును బడయుచున్నాఁడు. కీర్తినిగోరి కాని, (ఇయ్యనియెడ నేమను కొందురోయను) భయముచేతఁగాని, దానముచేయరాదు. తన కుపకారముచేసినవాఁడని దానముచేయరాదు. గాయకులు,నర్తకులు, విదూషకులు, మదించినవాఁడు, పిచ్చిపట్టినవాఁడు, దొంగ, దూషించువాఁడు, మూఁగ, కురూపి, అంగహీనుఁడు, పొట్టివాఁడు, దుష్టుఁడు, దుష్కులమునఁ బుట్టినవాఁడు, వైదికసంస్కారములేనివాఁడు, నను వీరలకు దానముసేయరాదు. వేదాధ్యయనములేని బ్రాహ్మణునకు దానముచేయరాదు; శ్రోత్రియుఁడగువానికే చేయవలయును. సరియైనపద్ధతిని చేయఁబడని దానమునుసరియైనపద్ధతిని గొనని ప్రతిగ్రహమును రెండును దానమునిచ్చినవానికిని బుచ్చుకొన్నవానికిని ననర్థములకే యగును. చంద్రమానని కట్టెయనుగాని అాతినిగాని బట్టుకొని సముద్రమును దాఁటఁగోరు వాఁడెట్లు మునింగిపోవునో యట్లె నిచ్చినవాఁడును బుచ్చుకొన్నవాఁడును మునిఁగిపోదురు. తడికట్టియలలను బఱపినయగ్గి యెట్లువెలుఁగదో యట్లెతపమును వేదాధ్యయనమును నాచారమునులేని బ్రాహ్మణుఁడు దానముపుచ్చుకొనుటచేఁ బ్రకాశింపఁడు; ఇచ్చినవానికి ఫలమునొసంగఁడు.మానిసిపునుకయందలి నీరును, కుక్కతోలుతిత్తియందలి పాలును,తామున్నస్థానముల దోషమువలన దుష్టములెట్లగునోయట్లె మంచి నడవడిలేనివాని యందున్నశాస్త్రములును వ్యర్థములగును. శాస్త్రములు తెలియకుండినను, అసూయాదులు గలిగి యున్నను, వేదములులేకయున్నను బ్రాహ్మణునియందును వ్రతములేని తక్కువవారియందును గరుణచేతఁ జేయుదానము యుక్త

మగును. * ఒకఁడు బీదయనియు రోగియనియు దుఃఖితుండ
నియు వానికి దానముచేయవచ్చును. కానివాఁడు తనకేదేని
యాప్తమును జేయుననికాని ధర్మము కలుగుననికాని తలఁచి
చేయరాదు. వేదము తెలియని బ్రాహ్మణునకిచ్చినదానము వ్యర్థ
మందురు, ఏలనఁగా పాత్రదోషమువలన నది ఫలింపదు. ఇందు
లకు విచారింపఁబని లేదు. మ్రానితోఁ జేయఁబడిన యేనుఁగయు,
తోలుచేఁ జేయఁబడిన మృగమును, వేధమధ్యయనము చేయని
బ్రాహ్మణుఁడును నను నిమ్మూఁడును వరుసగా నేనుఁగు మృగము
బ్రాహ్మణుఁడను పేళ్లుదాల్చియుండుట తప్పఁ దక్కిన పనయేమి
యునోందరు. పడఁతులయందు నపుంసకుఁడును, ఆవునం దావు
ను, పసహూలియుండునట్లును, రెక్కలులేనిపక్షి యట్లును, వేదము
తెలియని బ్రాహ్మణుఁడు వ్యర్థుఁడే యగును. † మనుష్యులులేని
గ్రామమును, నీరులేనినూయియు, అగ్ని లేని వేఁడిమియు, నెట్లో
యట్లె మూర్ఖునియందుఁ జేసినదానమును నిష్ఫల మగును. మూ
ర్ఖుఁ డెల్లవారికిని బగవాఁడు; దేవతలకును బితరులకును జేయు
హవ్యకవ్యములను జెఱుపువాఁడు; కాన వాఁడు మంచిలోకముల
ను బొందనేరఁడు. ధర్మరాజా! ఈ ధర్మమునంతయుఁ గలయంత
వట్టు (మనువపుడు చెప్పినదంతయు) నీకు సంగ్రహముగాఁ జెప్పి

---

* ఇందులకు 'నవై దేయ మనుక్రోశా ద్దీనార్తాతురకేష్వపి' (జౌ. మూలము) 'దీనా యాపగుణాయచ' అని (దా. మూలము). గుణములేనివాఁడు దరిద్రుఁడని యీవచ్చునుగాని తక్కిన యాప్తకారిత్వాది హేతువులఁబట్టి యీరాదనుట.

† 'గ్రామస్థానం యథాశూన్యం' అని (దా. మూ.) గ్రామధాన్యం యథాశూన్యం' అని (జౌ. మూ). గింజలేని పొల్లుధాన్యమువలెనని యర్థము.

తిని. ఇది మిక్కిలి విస్తరించి వినఁదగినది'' అనెను. ఇది ముప్పది యేనవయధ్యాయము.



## రాజధర్మపర్వము.

వ్యాసుఁడును కృష్ణుడును జెప్పినట్లు ధర్మరాజు మనసున శాంతినొంది హస్తినాపురమును బ్రవేశించుట.

ధర్మరాజు 'మునీంద్రా! రాజధర్మములను జతుర్వర్ణధర్మములను నన్నింటిని వినఁగోరుచున్నాను. ఆపదలయందు నీతియెట్టులు జరుపవలయునో ధర్మమార్గము నవలంబించి యెట్లు భూమిని జయింపవచ్చునో వినఁగోరుచున్నాను. నీ విపుడు ప్రాయశ్చిత్తమును భక్ష్యాభక్ష్యవివరణముతోఁ గూడ ముచ్చటించితివి. ఇది నాకుఁ గౌతూహలముగలిగించి నామనస్సును నుబ్బించుచు న్నట్లున్నది. ధర్మచర్యయు రాజ్యమును నెప్పుడు నొకటికొకటి విరోధించియుండును. కాన ధర్మముతో విరోధింపక రాజ్యమెట్లు చేయవచ్చునని యీవిషయమునే నిత్యమును జింతించుచున్నను నామనస్సున కేమి తెలివిడి లేకున్నది. కాన రాజధర్మాదులను దెలుపుము' అని యడిగెను. అందులకు వ్యాసుఁడు నారదునిఁ జూచి ధర్మరాజుతో 'మహాబాహూ! నీవు ధర్మము నంతయు వినఁగోరుదువేని కురుపితామహుండును వృద్ధుండునగు భీష్మునికడకుఁబొమ్ము. అతఁడు భాగీరథికన్నపుత్రుఁడు, సర్వజ్ఞుఁడు, సర్వధర్మవిదుఁడు. కాన నీకు మనస్సున ధర్మరహస్యములందుఁగల సందేహములను ద్రుంచివైవఁగలఁడు. అతఁడు దేవనదియగు

గంగకన్నవాఁడు గాన యింద్రుఁడు మొదలయిన దేవతలనెల్లఁ గన్నారఁజూచినవాఁడు. ఆప్రభుఁడు బృహస్పతి మొదలయిన దేవర్షులను బలుమాఱు నుపచారముఁచే సంతోషపెట్టి వారివలన రాజనీతి నభ్యసించెను. ఆకురుసత్తముఁడు దేవాసురులకు గురుండగు శుక్రుం డెఱింగిన నీతిశాస్త్రము సవ్యాఖ్యముగాఁ దెలిసి యున్నాఁడు. అమ్మహాబుద్ధి, భార్గవుండగు చ్యవనునివలనను వసిష్ఠునివలనను విధ్యుక్తముగా వేదములనెల్ల వ్యాకరణాద్యంగములతోఁడఁ జదివెను. ఆపురుషతిలకుఁ డధ్యాత్మవిద్యాతత్త్వములఁ దెలిసినవాఁడయి తేజంబు జ్వలించుచుండు బ్రహ్మమొదటిపుత్త్రుఁడగు సనత్కుమారునివలన నాత్మవిద్యనును, మార్కండేయునివలన సన్న్యాస ధర్మమంతయును, పరశురామునివలనను నింద్రునివలనను నస్త్రవిద్యనను, జక్కఁగా నేర్చుకొనెను. మనుష్యజన్మముగలవాఁడయ్యు నతనిమరణ మతనియిచ్ఛకు లోనయినది. పుత్త్రుఁడులేకుండియు నతనికిఁ బుణ్యాలోకము గలదనుట మిక్కిలి ప్రసిద్ధము. పుణ్యులయిన బ్రహ్మర్షు లతనికి నెప్పుడును సభ్యులయి యుండిరి. తెలిసికొనవలసిన విషయములం దతనికిఁ దెలియని దొక్కటియు లేదు. ధర్మముల సూక్ష్మమును దక్కంగల తత్త్వములను నాభీష్ముం డెఱింగినవాఁడుగాన యతఁడు నును జెడలుటకు మునుపే యతనికడకుఁ బోయితివేని నీ కుపదేశము సేయును' అనెను. అందులకు ధర్మరాజు వ్యాసుంజూచి నేను 'భూమినంతయు నాశమగునట్లు మేనుగరుపాఱునట్టి యిట్టి గొప్పజ్ఞాతివధమును గావించి సమస్తలోకమునకు నెగ్గుచేసితిని. ఇంతమాత్రమా ! కపటములేక మాతో ని యుద్ధముచేయుచుండఁగా నవ్వీరునే కపటముగాఁగొట్టి కూలఁద్రోయించితినే! అట్లుచేసి

యతనికడకుఁబోయి యడుగుటయెట్లు'? అనెను. అదివిని యదుతిలకుండగు కృష్ణుఁడు చతుర్వర్ణములకును హితము సేయఁ గోరినవాఁడై యారాజవర్యునితో 'రాజోత్తమా! నీవు శోకమును దలఁచి మిక్కుటమయిన నిర్బంధము పెట్టుకొనుట యిప్పుడెంతమాత్రము దగదు. వ్యాసుఁడు చెప్పినట్లు చేయుము. మహాతేజులయినతమ్ములును బ్రాహ్మణులును హతశేషులయిన రాజులును నందఱును వేసవికాలముతుదను బర్జన్యునింబోలె నిన్ను వేఁడుకొనువారై వచ్చి కొలిచియున్నారు. మహారాజా! చతుర్వర్ణములతోఁ గూడిన కురుజాంగలరాజ్యమంతయును నిన్ను వేఁడ వచ్చియున్నది. మహాత్ములయిన యీ బ్రాహ్మణుల ప్రియమునకుఁగాను, అపారతేజుండయిన యీగురుని వ్యాసునిని యోగమునుబట్టియు, నేను మొదలు నాస్నేహితులకును ద్రౌపదికిని బ్రియమును లోకమునకు హితమును గావింపుమా' యనెను. అంత ధర్మరాజు కృష్ణుఁడు చెప్పినదివిని సర్వలోకహితముగోరి గొప్పమనస్సున లేచెను. అమ్మహాయశుఁడు, కృష్ణుఁడు, వ్యాసుఁడు, దేవస్థానుఁడు, అర్జునుఁడును దక్కుంగల పెక్కండ్రు ననునయింపఁగా, మనంబునఁగల దుఃఖమును దుందుడుకును దిగ్గవిడిచెను. ఆపాండవుండు, వేదమునందును వేదార్థమందును దక్కుంగల శాస్త్రములందును సమర్థుండుగాన తనమనంబుచే నిశ్చయించుకొని దుఃఖమువీడి నెమ్మదినొందెను. అతఁడు నక్షత్రములచేఁ బరివృతుఁడగుచంద్రుండునుంబోలె,వారలచేతఁ బరివేష్టితుండై ధృతరాష్ట్రుని మున్నిడుకొని తనపట్టణమునకుఁ బోవ బయలువెడలెను. అట్లు వెడలునపు డతఁడు ధర్మవిదుండుగాన పెక్కువేల దేవతలను బ్రాహ్మణులను బూజించెను. పిదప

శుభలక్షణములుగల పదునాఱు గుఱ్ఱములు పూన్పంబడినదై కంబములును కడవసములును బలువంబడి మంత్రములచే నర్చితంబయిన క్రొత్త తెల్లనిరథంబునందు, వందిజనులు కైవారములు సేయుచుండ, నాధర్మరాజు, అమృతమయంబగు రథంబును సోమదేవుండునుం బోలె, నారోహించెను. భయంకరపరాక్రముండగు భీముఁడు గుఱ్ఱముల పగ్గములు పూనెను. అర్జునుండు కాంతులు దొలంకు శ్వేతచ్ఛత్రమును బట్టెను. రాజు శిరసుపయినిబట్టిన యాతెల్ల గొడుగు, తెల్లని మబ్బులుగల యాకాశమందు, నక్షత్రములచేతబలసియున్న చంద్రునింబోలె వెలింగెను. నకుల సహదేవులిరువురును జంద్రుని కిరణంబులవలెఁ బ్రకాశించుచున్నవియు నలంకృతములును సుందరములునగు రెండు చామరములను వీచిరి. ఆసహోదరులందఱు నలంకృతులై యేకరథమునఁ జేరుట, యేనుభూతములు నొక్కచోటఁ జేరినట్లు చూపట్టెను. రాజా! ధృతరాష్ట్రునిపుత్రుఁడుయుయుత్సుఁడుమనోవేగముగల నాలుగుగుఱ్ఱములుపూన్చిన మేలిరథమునెక్కి పాండవజ్యేష్ఠుండగు ధర్మపుత్రుని వెంటనంటిపోయెను. శ్రీకృష్ణుఁడును సాత్యకితోఁగూడి శైబ్య సుగ్రీవము లనుగుఱ్ఱములు పూన్చిన పచ్చబంగారు తేరిపయి నెక్కి పాండవులకుఁ బిఱుద బయలుదేఱెను. ధర్మపుత్రుని పెదతండ్రియగు ధృతరాష్ట్రుఁడు గాంధారింగూడి నరయానము ( పల్లకి ) నెక్కి ముందు బయలుదేఱెను. కుంతి ద్రౌపది సుభద్రమొదలగుకౌరవస్త్రీలందఱును విదురుని మున్నిడికొని పలువిధములయిన వాహనములతో బయలుదేఱిరి. అంతఁ జక్కఁగా నలంకృతములయిన పెక్కురథములును గజములును దురగములును బదాతి సమూహములును



177. ధర్మరాజు శ్రీకృష్ణునితోడ హస్తినాపట్టణమును ప్రవేశించుట.

వెనువెంట బయలువెడలినవి. అంత వైతాళికులును సూతులు ను మాగధులును సుభాషితములఁ గైవారములు సేయుచుండ రాజు యుధిష్ఠిరుండు హస్తినాపురమునకుఁ బోయెను. ఆధర్మ రాజునంటిన క్రంత సంతోషపూరితు లయిననానాజనులు నెరసి యుండ లెక్కడరాని జనసమూహములు మిక్కిలి క్రిక్కిఱిసియు లోకంబున సాటిలేనిదై నీటుగులుకు చుండెను. పురజనులు ధర్మ రాజు నెదుర్కొని తోడ్కొని పోవఁగోరి పట్టణమును రాజ వీథులను వలయునట్లు నానావిధముల నలంకరించిరి. ధ్వజముల చేతను దెల్లనితోరణమాల్యములచేతను అగరు మొదలయిన వాసన ధూపములచేతను రాజవీథి మొదలయిన ప్రదేశము లన్నియుఁ జక్కఁగా నలంకృతములై యుండెను. ఆరీతినే రాజ భవనముచుట్టును విలువగల మేలిపువ్వులచేతను వాసనపుఁబొడుల చేతను బెక్కుపూదండలచేతను జక్కఁగా సింగారించిరి. పట్టణపు ద్వారములం దక్కడక్కడఁ గ్రొత్తవియు దృఢములయినవియు నగు తెల్లని పూర్ణకుంభములును దెల్లని పుష్పములును నెల కొల్పఁబడినవి. అంత ధర్మపుత్త్రుఁడు జనులు శుభవాక్యములఁ బొగడుచుండ సుహృదులం గూడి యట్లు చక్కఁగా నలంకృత మయినహస్తినాపురద్వారమును బ్రవేశించినవాఁ డయ్యెను. ఇది ముప్పదియాఱవయధ్యాయము.



## రాజధర్మపర్వము.

(పురజనులు పాండవులను బొగడుట. ధర్మరాజు రాజసభా ప్రవేశము. ధర్మరాజును నిందించిన చార్వాకుఁ డనురాక్షసుఁడు బ్రాహ్మణ కోపముచేత నశించుట.)

పాండవుల ప్రవేశమును జూడ నువ్విళ్లూరుచుఁ బురజనులు వేలకొలఁదిని రాఁదొడఁగిరి. నలుగడల నలంకృతమై జనసమూహములు నిండియున్న యారాజవీధి, చంద్రుఁ డుదయించినపు డుప్పొంగు మహాసముద్రముంబోలె వెలింగెను. రాజమార్గము లందు రత్నమయము లయినగొప్పగొప్పగృహములు క్రిక్కిఱిసియున్న స్త్రీల బరువుచేత నల్లలాడుచున్నట్లు చూపట్టుచుండెను. ఆపడంతుకలు నునుసిగ్గు నూలుకొన నల్లల్ల ధర్మరాజును భీముని నర్జునుని నకుల సహదేవులను గొనియాడిరి. వారు ద్రౌపదిని జూచి 'పాంచాలీ! మహర్షిని గొలుచుగౌతమియుంబోలెఁ బురుషతిలకు లయినయిట్టిపతులను బడసి వెలుంగుచున్న నీవే ధన్యురాలవు! కల్యాణీ! నీచేసినకార్యము లమోఘములు! నీవ్రతచర్యయు నట్టిదే' యని కొనియాడిరి. వారి పొగడిక వాక్యములచేతను, ప్రేమచేత నొండొరులతోడ మాటాడు చప్పుళ్లచేతను, బురమంతయుఁ గలకలమని మ్రోయుచుండెను. అంత ధర్మరా జారాజమార్గమును దగురీతిని గడచి చని యలంకృతమై యొప్పు లొలుకుచున్న రాజభవనమును జేరెను. అంతఁ బ్రకృతులందఱును బురజనులును దేశజనులు నందంద ధర్మరాజును డగ్గఱి చెవి కింపయినమాటల 'రాజేంద్రా! శత్రునిషూదనా! భాగ్యముచేత శత్రువులను జయించితివి. ధర్మముతోడను బలము

తోడను మాభాగ్యమువలన మరల నీరాజ్యమును బడసితివి. మహారాజా! ఇందుండి వందలకొలఁదియేండ్లు మాకు రాజవై యింద్రుఁడు స్వర్గమును బరిపాలించునట్లు ధర్మంబునఁ బ్రజలను బరిపాలింపుము' అని చెప్పిరి. ఇట్లు రాజభవనము ద్వారమందు నలుప్రక్కల బ్రాహ్మణు లాడుచున్న యాశీర్వాదములను గయి కొనుచు మంగళోపచారములచేతఁ బూజితుండై ధర్మరాజు దేవేంద్రునిరాజభవనమువలె నొప్పుచున్న రాజగృహమందుఁ బ్రవేశించి జయశబ్దములను విన్నపిదప రథమునుండి దిగెను. శ్రీమంతుఁ డమ్మహాయశుఁడు లోపలఁ బ్రవేశించి యందున్న దేవతల సన్నిధికిఁబోయి వానినెల్లఁ జందనము పుష్పములు రత్నములు మొదలయిన వస్తువులచేతఁ బూజించి యంత మరల వెలికివచ్చెను. అందు మంగళవస్తువులను గేలంగొని తమ్ముఁ జూడఁగోరివచ్చి నిలుచున్న బ్రాహ్మణులను గాంచెను. ఆశీర్వదింపఁగోరి యాబ్రాహ్మణోత్తములుచుట్టును బరివేష్టింపఁగా నాధర్మరాజు నక్షత్రగణములు బలసియున్న చంద్రునివలె నప్పుడు పరిశుద్ధుఁడై వెలింగెను. అతఁడు పువ్వులు మోదకములు రత్నములు నవ్వారి యైన బంగారములు గోవులు వస్త్రములు మున్నగువానిచేతను మఱి యుఁదక్కిన పెక్కువస్తువులచేతను నా బ్రాహ్మణులను విధ్యుక్తముగాఁ బూజించెను; మఱియు భృత్యులు గానివారికి వల యునవియెల్ల నరయునట్లును గావించెను. పిదప గురుం డయిన ధౌమ్యునిని బెదతండ్రి యగుధృతరాష్ట్రునిని మున్నిడికొని, యింద్రుఁడు సుధర్మాసభను బ్రవేశించునట్లు, ధర్మరాజు రాజసభ యందుఁ బ్రవేశించెను. అంత సుహృదులకు సంతోషకరమును వినుటకు మిక్కిలి యింపయినదియుఁ బుణ్యంబును నగు పుణ్యా

హావాచనధ్వని దేవలోకమును వ్యాపించునదై చెలంగెను. వేద విదులగు బ్రాహ్మణుల వాక్కులు హంసధ్వనులుగలవై యర్థనిబిడములైన పదములతోడఁగూడి వినఁబడెను. పిదప దుందుభి వాద్యధ్వనియుఁ, జెలువయిన శంఖధ్వనియు, వందిమాగధుల జయాజయధ్వనులు, నుప్పతిల్లెను. బ్రాహ్మణు లాదిగాఁ గల యాజనుల ధ్వనులన్నియు నుడిగినతోడనే దుర్యోధనునికిఁ జెలికాఁ డయినచార్వాకుఁ డనురాక్షసుఁడు సిగయు మూఁడుదండములును జపమాలయుఁ గలసన్న్యాసిబ్రాహ్మణవేష మూని యాశీర్వదింపఁ గోరుచున్నవారై యున్న మహాతపస్వులగు నందలివేలకొలఁదిబ్రాహ్మణులసమూహమునం దుండి ధైర్యంబున రాజగు యుధిష్ఠిరునింజూచి భయంబు మాలి పలుకం దొడంగెను. ఆదుష్టుఁ డందలి బ్రాహ్మణుల యొక్కరిమాటయు వినక మహాత్ము లయినపాండవులను బాపాత్ములని చెప్పఁదలఁచి 'ఓ! కుంతికొడుకా ! ఇందుఁ గలబ్రాహ్మణులందఱును దమ యభిప్రాయములను నాముఖమున నీకుఁ జెప్పుచున్నారు. నీవు జ్ఞాతులను వధముచేసిన చెడురాచవాఁడవు.ఇస్సీ! నీబ్రైసి. అదియట్లుండనీ. ఈరీతిని జ్ఞాతులనెల్ల నాశముచేసితివే. ఇట్టి కట్టిఁడికి నీకు రాజ్యమేమి? వట్టి జ్ఞాతులనుమాత్రమా ! పెద్దలనుగూడఁ జంపి పుచ్చితివే ! ఇట్టి నీకు బ్రదుకుటకంటె చచ్చుటే మేలు' అనెను. దుష్టుఁ డారాక్షసుఁ డాడినయీమాటలు విని యందుఁ గల బ్రాహ్మణులందఱు నామాటలకు భయపడి వ్యథనొందుచు బిగ్గఱ నాక్రోశించిరి. అంత నాబ్రాహ్మణులు నాధర్మరాజును మిక్కిలి లజ్జితులై యెంతయు వెతనొందుచుఁ గొంతసేపు మాటాడకుండిరి. పిదప ధర్మపుత్రుఁడు వారితో 'పెద్దలారా!

మీకు మ్రొక్కెద; బతిమాలుకొనెదను. నన్ను గ్రహింపుఁడు. *నేనిదె ప్రాణములు విడుచుట దగ్గఱియున్నది. కాన నన్ను 'ఇస్సీ' యని నిరాకరించుట మీకుఁదగదు' అనెను. అందుల కా బ్రాహ్మణులందఱును 'రాజా! వీఁడు మాతోఁ జేరిన బ్రాహ్మణుఁడేకాఁడు. ఎవఁడో యన్యుఁడు' అని చెప్పి యంతటఁ దాము దపంబులచే నిర్మలులును వేదవిద్వాంసులు నయినమహాత్ములు గాన జ్ఞానదృష్టిచే వాఁడెవ్వఁడగుటయుఁ దెలిసికొని 'రాజా! వీఁడు దుర్యోధనునకు సఖుఁడుగా వాసికెక్కిన బ్రహ్మరాక్షసుఁడు. ఆ దుర్యోధనునకు హితము సేయఁదలఁచి వీఁడు సన్న్యాసివేషమున వచ్చినాఁడు; ఈమాటలు మేము చెప్పలేదు. ధర్మాత్మా! నీ విట్లు భయపడవలదు. నీకును నీతమ్ములకును మంగళంబగుఁగాక' యనిరి. అంతఁ బవిత్రులగు నాబ్రాహ్మణులు క్రోధంబు దీపింప నందఱు నా పాపరాక్షసుని హుంమ్మని హుంకారములచే నద ల్చుచుఁ దూలఁగొట్టిరి. వారల తేజంబువలన నారాక్షసుఁడు దగ్ధుఁడై పిడుగుపడి యొఱగిన చిగురించు మ్రాఁకుంబోలె నేలం గూలెను. అట్లాబ్రాహ్మణులు ధర్మపుత్రుని సంతోషపఱిచి యతనిచేఁ బూజితులై గృహములకుఁ బోయిరి. ధర్మపుత్రుఁడును సుహృదులంగూడి ముదంబునఁ బొదలుచుండెను. ఇది ముప్పదియేడవయధ్యాయము.



* ఇందులకు 'ప్రత్యాసన్నవ్యసనినమ్' అని మూలము. నీలకంఠులు దీనికి 'ప్రత్యాసన్నాః సమీపస్థాః వ్యసనినః చిరదుఃఖినో భ్రాతావయోయస్య తమ్ - భ్రాత్రాదిదుఃఖ పరిహారార్థం మమేదం రాజ్యకరణమ్ నతు స్వసుఖార్థమిత్యర్థః' అని యర్థము చేసిరి; కాని యిదిచాలఁ గ్లిష్టము. సమీపించిన మరణవ్యసనముగల వానిని అనుటే సరసము.

## రాజధర్మపర్వము.

**కృష్ణుఁడు ధర్మరాజునకుఁ జార్వాక రాక్షసుని పూర్వవృత్తాంతమును జెప్పుట.**

అంత దేవకీపుత్త్రుఁడు శ్రీకృష్ణుఁడు తమ్ములతోడం గూడి యున్న ధర్మపుత్త్రుంజూచి సమస్తమును గనుఁగొన్నవాఁడుగాన 'అయ్యా! ఈ లోకమందెప్పుడును నాకు బ్రాహ్మణులు పూజనీయులు. వాక్కునందు విషమును మిక్కిలి యనుగ్రహమును గలిగిభూమియందు సంచరించుచున్న దేవతలుచుమీ వీరు! తొల్లి కృతయుగంబునఁ జార్వాకుఁడను రాక్షసుఁడు బదరీక్షేత్రమందుఁ బెక్కు సంవత్సరములుతపము చేయుచుండెను.అంత బ్రహ్మదేవుఁడువచ్చి వలసినవర మడుగుమని మాటికి మాటికిని జెప్పగాఁ నారాక్షసుఁడు 'నా కేప్రాణివలనను భయము లేకుండవలయు'నని యడిగెను. ఆజగత్పతియు బ్రాహ్మణుల నవమానించుటం దప్పఁ దక్కినయెడల నేప్రాణివలనను భయము గలుగకుండున ట్లుత్తమమయిన వర మొసంగెను.ఆపాపాత్ముఁడట్లు వరముఁబడసి మిక్కుటమయిన బలిమియు వేండ్రమయినచేష్టలును మతిలేని పరాక్రమమును బొంది దేవతలను దపింపఁజేయఁ దొడంగెను. వాని బలిమికిఁ గీడ్పడి దేవత లొక్కటిగాఁగూడి బ్రహ్మకడకుఁబోయి యారాక్షసుని వధింపవలయు నని చెప్పిరి. ఆదేవుఁడును వారిం జూచి 'వీనికిని జిరకాలముననే మృత్యువు గలుగునట్లుగా నే నేర్పాటు చేసియున్నాను. మనుష్యులలో దుర్యోధనుఁడను నొక రాజు వీనికిఁ జెలికాఁడగును. వీఁడు వానివలని స్నేహమునకు బద్ధుఁడై బ్రాహ్మణుల నవమానించును. బ్రాహ్మణులో వాగ్బలముగలవారు. వారు తమ్ము నవమానించిన కారణమున మిక్కిలి

కుపితులై యీ పాపాత్మునిఁ దమకోపాగ్నిచేఁ గాల్చి కూల్తురు' అనెను. ఆచార్వాకుఁడే యిదిగో బ్రాహ్మణదండముచేతఁ గొట్టుపడి నేలంబండి యున్నాఁడు; కావున శోకింపకుము. రాజా! క్షత్రియతిలకులును వీరులు నగునీజ్ఞాతులు క్షత్రధర్మము చొప్పున నీచేత హతులయిరి. కాన యామహాత్ములు స్వర్గలోక మందిరి. కాఁబట్టి యీవిషయమై వేఱుతలంపు వలదు. వలయు కార్యములను జేయఁ బూనుము. శత్రులనుఱుమాడుము. ప్రజలను రక్షింపుము. బ్రాహ్మణులను బూజింపుము' అనెను. ఇది ముప్పదియెనిమిదవయధ్యాయము.

---

## రాజధర్మపర్వము.

### ధర్మరాజు రాజ్యాభిషేకము.

అంత రాజయినధర్మపుత్రుఁడు శోకమును దాపమును విడిచి సంతసంబున గొప్పదియగు బంగారుపీఠమునఁ దూర్పు మొగముగాఁ గూర్చుండెను. సొగసయి ధగధగ వెలుఁగుచున్న బంగారుపీఠములం దతని కెదురుగా సాత్యకియుఁ గృష్ణుఁడును గూర్చుండిరి. ధర్మరాజును నడుమ నుంచుకొని యతని కిరుప్రక్కల భీమసేనుఁడును నర్జునుఁడు మణులుచెక్కిన మేలిపీఠములందుఁ గూర్చుండిరి. బంగారముచే సింగారింపఁబడిన తెల్లనియేనుఁగుదంతపు మంచముమీఁదఁ గుంతియు సహదేవుఁడును నకులుఁడును గూర్చుండిరి. దుర్యోధనునిపురోహితుఁ డయిన సుధర్ముఁడును విదురుఁడును ధౌమ్యుఁడును ధృతరాష్ట్రుఁడును నగ్నివలె జ్వలించుచున్న యాసనములందు వేఱువేఱ కూర్చుండిరి. ధృతరాష్ట్రుఁ డున్నయెడకు సమీపమున యుయుత్సుఁ

డును గాంధారియు సంజయుఁడును కూర్చుండిరి. ధర్మరాజందుఁ గూర్చుండి తెల్లని పువ్వులను, సర్వతోభద్రాదిచిహ్నములచే గుర్తింపఁబడిన స్వస్తికములను దేవతాపీఠములను, అక్షతలను భూమిని, బంగారమును, వెండిని, రత్నములను, స్పృశించెను. పిదపఁ బ్రజలందఱును బెక్కులు మంగళ ద్రవ్యముల నెత్తికొని పురోహితుని మున్నిడికొని ధర్మపుత్రునిఁ గాంచిరి. అంత, భూమి బంగారము పలువిధము లయిన రత్నములును వెండి రాగి, మన్ను ననెడివీనిచేతఁ జేయఁబడినపూర్ణకుంభములు, పుష్పములు పేలాలు దర్భలు పాలు పెరుఁగు నేయి తేనె, జమ్మి రావి మోదుగుసమిధలు, మేడిమ్రానితోఁ జేసిన స్రువము, బంగారపుఁబనిగల శంఖము, మొదలుగా నభిషేకము నకువలయు నుపకరణములను దక్కిన సంభారములను సమకట్టిరి. అంతఁ గృష్ణుని యాజ్ఞచొప్పునఁ బురోహితుండగు ధౌమ్యుఁడు ఉత్తరపుఁదూర్పు వైపున గొంతపల్లముగా నుండు చోట లక్షణముచొప్పున వేది నమర్చి దానిపయిని సర్వతోభద్రమను తెల్లని యాసనము నుంచిరి. దానికిఁ బాదములుగట్టిగా నెలకొనియుండెను. అది యగ్నివలె ధగధగ వెలుంగుచుండెను. దానిపయిని బులితోలు పఱవంబడి యుండెను. ధౌమ్యుఁడుసింహాసనమందు మహాత్ముం డయినధర్మరాజును ద్రౌపదిని గూర్చుండఁ జేసి విధ్యుక్తముగా మంత్రములు చెప్పుచునగ్నియందు హోమము గావించెను. అంతఁ గృష్ణుఁడు లేచి పూర్ణమగు శంఖము నెత్తికొని యుధిష్ఠిరుని భూమికిఁ బతిగాఁ బట్టాభిషేకముచేసెను. అట్లే కృష్ణునియనుమతిని ధృతరాష్ట్రుఁడును బ్రజ లందఱును నభిషేకము గావించిరి. శ్రీకృష్ణుఁడు పాంచజన్య మను



184. శ్రీకృష్ణుఁడు ధర్మజుని పట్టాభిషిక్తునిగాఁ జేయుట.

శంఖమునెత్తి యభిషేకము సేయఁగానే, తమ్ములతోడఁ గూడి యున్న ధర్మరా* జమృతముఖుఁడై చూపట్టెను. పిదపఁ బణవములును, ఆనకములును దుందుభులు నను వాద్యములను వాయించిరి. ధర్మరాజు, నందుఁ జేయఁబడిన కార్యములన్నియు ధర్మంబునఁ బరిగ్రహించెను; మఱియు నవ్వారిగా దక్షిణల నొసంగి విధ్యుక్తముగా వారలను బూజింపనుగూడఁ బూజించెను. అంతఁ జక్కఁగా వేదాధ్యయనము చేసినవారును ధృతిమంతులును శీలసంపన్నులు నగు బ్రాహ్మణులను వేయినిష్కములొసంగి సంతోషపెట్టి వారలచే నాశీర్వాదము చేయించుకొనెను. ఆ బ్రాహ్మణులు నుబ్బునొంది హంసములవలె నింపయిన యెలుంగుల స్వస్తియు జయమును జెప్పి ధర్మరాజుంజూచి 'మహాబాహూ! భాగ్యవశమున జయముగలవాఁడ వయితివి. మహాతేజా! నీ పరాక్రమముచేతనే స్వధర్మమును నీవు పడయుటయు భాగ్యము. పెక్కువీరుల క్షయముగావించి పగవారి నుఱుమాడి యొక కొఱంతయులేక కుశలముగానే యర్జునుఁడును భీముఁడును నకులుఁడును సహదేవుఁడును నీవు నామహాయుద్ధమునుండి విడివడి సుఖంబుండుటయు గొప్ప భాగ్యమే. భారతా! మీఁదఁ జేయవలయుకార్యములనెల్ల శీఘ్రముగానే చేయుము' అని పొగడుచుఁ దెలిపిరి. ఇట్లు సత్పురుషులెల్లఁ బ్రీతిగడలుకొనఁ బూజించుచుండఁగా ధర్మరాజు సుహృదులతోఁగూడ గొప్ప రాజ్యమును బడసినవాఁడయ్యెను. ఇది ముప్పదితొమ్మిదవయధ్యాయము.



---

* అనఁగా మిక్కిలియుఁ గనుఁబండువై.

## రాజధర్మపర్వము.

ధర్మరాజు భీమాదులను వారివారికిఁ దగిన యౌవ రాజ్యము మొదలయిన యధికారములందు నియోగించుట.

ప్రజలు దేశకాలములకుఁ దగురీతిని జెప్పిన యప్పలుకులు విని ధర్మరాజు 'బ్రాహ్మణోత్తము లందఱును జేరి మాయందు గుణములను, గలవానినో లేనివానినో, చెప్పుచున్నారుగాన పాండవులు తప్పక ధన్యులే. మీ రసూయ మాని మమ్ము నిట్లు గుణసంపన్నుల నుగాఁ జెప్పుచున్నారుగాన మేమెల్ల మీదయకుఁ బాత్రులయిన వారమగుట నిక్కమని నా యభిప్రాయము. మా పెదతండ్రి ధృతరాష్ట్రమహారాజు మాకుఁ బరమదైవము. నా ప్రియమును గోరినవా రందఱు నతనియాజ్ఞ చొప్పునను నిష్టముచొప్పునను నుండవలయును. గొప్పజ్ఞాతివధమును గావించియు నితనికొఱకే జీవించియున్నాను. నేనెప్పుడును బ్రాలుమాలక యితనికి శుశ్రూష సేయఁ గోరుచున్నాను. సుహృదు లగుమీకు నాయం దను గ్రహముకలిమి నిజమేని ధృతరాష్ట్రునియందుఁ దొంటివలెనే మీరు ప్రవర్తింపవలయును. లోకములకును మీకును మాకును నితఁడే రాజు. భూమియుఁ బాండవులందఱును నితనియను గ్రహమందున్నవారు. నేను జెప్పిన యీమాట మీ రెప్పుడును మీ మనసులం దుంచుకొనవలయు' నని చెప్పి పట్టణము నుండియుఁ బల్లెపట్టులనుండియు వచ్చిన ప్రజలనెల్ల నిచ్చలు పోవచ్చునని యనుమతియిచ్చి యౌవరాజ్యమునకు భీమసేనుని నియమించెను. అతఁడు బుద్ధిసంపన్నుండగు విదురుని మంత్రా లోచనమందును గార్యనిశ్చయమందును సంధివిగ్రహాదిషడ్గుణ

మూల యాలోచనమునందును బ్రీతిమీఱ నియోగించెను. సర్వగుణసంపన్నుండును వృద్ధుండు నగుసంజయుని, చేసినదానిని జేయనిదానిని దెలిసికొనుటయందును, ఆదాయవ్యయము లాలోచించుటయందును, నేర్పఱిచెను. సేనలకొలంది లెక్కించుకొనుటయందును వారు చేయుపనులను బరామర్శించుటయందును వారలతిండివేతనములఁ జూచుకొనుటయందును నకులు నాజ్ఞాపించెను. ఇతరరాజ్యములవలని రాయిడులనును గర్వించినవారిని నడంచుటకు నర్జునుని నియమించెను. బ్రాహ్మణులను దేవతలను నారాధించుటయందును దక్కిన వైదికకార్యములందును నెప్పుడును నుండునట్లు పురోహితుఁడగు ధౌమ్యున కనుమతి యొసంగెను. సహదేవుని నెప్పుడును దనచెంత నుండున ట్లానతిచ్చెను. సహదేవుఁ డెట్టి సమయమందును రాజును గాపాడశక్తుం డగును. మఱియు ధర్మరా జెవ్వరెవ్వ రేయేకార్యములను జేయశక్తులో వారి నాయానియోగములం దుండునట్లు సంతోషంబున నియమించెను. ఆ ధర్మాత్ముఁడు విదురునిని సంజయునిని మహామతియగు యుయుత్సునిని గుఱించి 'నాతండ్రియగు ధృతరాష్ట్రమహారాజుకార్యమును మీరు పాటించి పాటించి చేయవలయును. నా కార్యమునుంబోలె నతనికార్యమునంతయును బరాకునడక మీరు చేయవలయును. పురజనులకుఁ బల్లెటూరివారలకు నయినకార్యముల నన్నింటి నెప్పుడును నతని యనుజ్ఞగొని ధర్మంబునఁ జేయవలయును' అనెను. ఇది నలువది యవయధ్యాయము.

---

## రాజధర్మపర్వము.

ధర్మరాజు మృతులయిన జ్ఞాతులు మొదలగువారికి శ్రాద్ధాదులుగావించి వారిబంధువులను రక్షించుట.

అంత ధర్మరాజుదారబుద్ధిగావున యుద్ధంబున మృతులయిన జ్ఞాతులందఱకును వేలువేలు శ్రాద్ధములను జేయించెను. ధృతరాష్ట్రుఁడు తనపుత్రుల నుద్దేశించి మరణానంతర మిచ్చునట్టి పెక్కువస్తువులతోఁగూడిన దైవము లోలుకుచున్నయన్నమును గోవులను ధనములను మిక్కిలి వెలపొడుగయిన నానావిధరత్నములను దానముచేసెను. ధర్మరాజు ద్రౌపదితోడ మహాత్ముఁడగు ద్రోణునిని, గర్ణునిని, ధృష్టద్యుమ్నునిని, అభిమన్యునిని, ఘటోత్కచునిని, ఉపకారులును సుహృదులునయిన విరాటుఁడు మొదలగువారినిని, ద్రుపదునిని, ఉపపాండవులను గూర్చి వేలువేలు గోవులను ధనములను రత్నములను వస్త్రములను వేలకొలఁది బ్రాహ్మణులకొసంగి తృప్తిగావించెను. మఱియును యుద్ధమున హతులయినరాజులను, బంధువులుకాని వారి నుద్దేశించి యుద్దేశించి వారలకు వలయు పరలోకక్రియలు గావించెను. అతఁడు మృతులయిన సుహృదుల నందఱ నుద్దేశించి వారల పరలోకమునకు వలయు పెక్కు సభలను బెక్కు సరస్సులను బెక్కు చలిపందిరులను జేయించెను. ఇట్లారాజుల విషయమై తాను ఋణము లేనివాఁడును లోకులయాడికకు లోను గానివాఁడునై ధర్మంబునఁ బ్రజలను బాలించుచు నతఁడు కృతకృత్యుండయ్యెను. అతఁడు మునుపటివలెనే ధృతరాష్ట్రుఁడు గాంధారి విదురుఁడు మొదలుగాఁ బూజ్యు లయినకౌరవు

లనుఁ దక్కుంగల భృత్యులను నందఱును బూజించెను. అతఁడు దయాపరుఁడుగాన యుద్ధంబునఁ బతులను బుత్త్రులను బాసిన స్త్రీల నందఱను గనికరంబునఁ బూజించి కాచుచు వచ్చెను. మఱియు నతండు మిక్కిలి కరుణయే ముఖ్యముగాఁ గలిగి బీద లు గ్రుడ్డివారు మొదలయిన కష్టజనులకు గృహములు భోజ నము వస్త్రములు మొదలగువాని నొసంగి రక్షించుచుండెను. ఆ ప్రభుండు భూమినంతయు జయించి శత్త్రువులయెడ ఋణవిము క్తుఁడై విరోధి యొక్కఁడును లేక సుఖముగా విహరించుచుండెను. ఇది నలువదియొకండవయధ్యాయము.



## రాజధర్మపర్వము.

### ధర్మరాజు కృష్ణుని శతనామముల స్తోత్రము చేయుట.

ధర్మరాజు పట్టాభిషిక్తుఁడై రాజ్యమునుబొంది మహాప్రాజ్ఞుండు గాన పుండరీకాక్షునిఁ జూచి శుచియై చేతులు మోడ్చి 'కృష్ణా! యదుశార్దూలా! నీయనుగ్రహముచేతను, నీతిచేతను, బలము చేతను, బుద్ధిచేతను, నట్టి పరాక్రమముచేతను, బితృపైతా మహమయిన యీరాజ్యమును మరలఁబొందితిని. పుండరీకాక్షా! అరిందమా! నీకు మాటిమాటికి నమస్కారము. పరిశుద్ధులయిన ద్విజులు నిన్నొక్కనినే పురుషుండనియు *సాత్వతులకు పతియని యుఁ జెప్పెదరు; బహువిధములగు నామములచేత స్తుతించెదరు. విశ్వకర్తా! విశ్వాత్మా! విశ్వసంభవా! విష్ణూ! జిష్ణూ! హరీ! కృష్ణా! వైకుంఠా! పురుషోత్తమా! నీకు నమస్కారము. పురా

* భక్తులకుఁ బాలకుఁడని యర్థము.

ణుండవగు నీవదితియందు * నేడుమార్లు గర్భత్వమందుంటివి. నీ వొక్కఁడవే పృశ్నిగర్భుఁడవుగా నుండినవాఁడవు. నిన్ను † త్రియుగుఁడనియుఁ జెప్పెదరు. నీవొక్కండవే శుచిశ్రవుఁడు, హృషికేశుఁడు, ఘృతార్చిస్సు, హంసుఁడు, త్రిచక్షువు, శంభుడు, విభుఁడు, దామోదరుఁడునని చెప్పఁబడుచున్నావు. నీవే వరాహుండవు, అగ్నివి, బృహద్భానుడవు, వృషభుఁడవు, తార్క్ష్యలక్షణుఁడవు, అనీకసాహుఁడవు, పురుషుఁడవు, శిపివిష్టుఁడవు, ఉరుక్రముఁడవు, వరిష్ఠుఁడవు, ఉగ్రసేనానివి, సత్యుఁడవు, వాజసనివి, గుహుఁడవు, అచ్యుతుఁడవు, శత్రువులకు చ్యుతిగలిగించువాఁడవు, సంస్కృతుఁడవు, వికృతివి, వృషుఁడవు, కృష్ణధర్ముఁడవు. ఆదివి, వృషదర్భుఁడవు, వృషాకపివి, సింధువవు, విధూర్మివి, త్రికకప్పు, త్రిధాముఁడవు, త్రివృత్తు, అచ్యుతుఁడవు, సమ్రాట్టు, విరాట్టు, స్వరాట్టు, స్వారాట్టు, భూతమయుఁడవు, భవుఁడవు, విభుఁడవు, భువు (భూః), అతిభువు (అతిభూః) కృష్ణుఁడవు, కృష్ణవర్త్ముఁడవు. నీవే స్విష్టకృత్తు, భిషజావర్తుఁడవు, కపిలుఁడవు, వామనుఁడవును. నీవే యజ్ఞుఁడు, ధ్రువుఁడు, పతంగుఁడు, జయత్సేనుఁడనియును జెప్పఁబడుచున్నావు. నీవే శిఖండివి, నహుషుఁడవు, బభ్రువు, దివిస్పృక్కు, పునర్వ

---

* అదితియందు నేడుమార్లు గర్భమగుట యెట్లన- అదితియందు ఆదిత్యులలోఁ బండ్రెండవవాడగు విష్ణుఁడును వామనుండునని రెండుమార్లు అదితిరూపాంతరములగు పృశ్ని మొదలగు వారలందు పృశ్నిగర్భుఁడు పరశురాముఁడు దశరథరాముఁడు బలరాముఁడు కృష్ణుఁడనని యేనుమార్లు కానవెరసి యేడుమార్లని తెలియునది.

† త్రియుగుఁడు మూఁడు జంటలు అనగా జ్ఞానశక్తులు, బలైశ్వర్యములు, వీర్యతేజములు అను మూఁడు జతల గుణములు గలవాఁడని యర్థము.

సువు,సుబభ్రువు, రుక్మయజ్ఞుఁడు,సుషేణుఁడు, దుందుభియు, నీవు గభస్తినేమి, శ్రీపద్మఁడు, పుష్కరుడు, శుష్మధారణుడు, ఋభువు, విభువు, సర్వసూక్ష్ముఁడు, ధరిత్రియనియుఁ జెప్పఁబడుచున్నావు. అంభోనిధియు నీవే. బ్రహ్మయు, పవిత్రంబగు ధామమును, ధర్మవిదుండును, హిరణ్యగర్భుండును, పురుషుండును, స్వధయు (స్వధా), స్వాహాయును, కేశవుండును నీవే. కృష్ణా! నీవే జగమునకు నుత్పత్తియుఁ బ్రలయమును. నీవే మొదట నీ విశ్వమును సృజించుచున్నావు. విశ్వయోనీ! ఈవిశ్వమును నీవశమందున్నది. శార్ఙ్గమును జక్రమును ఖడ్గమును పాణియందుఁ గలవాఁడా! నీకు నమస్కారము' అని స్తుతించెను. ఇట్లు ధర్మరాజు సభామధ్యమున స్తుతింపఁగాఁ బద్మాక్షుఁడగు యదుశ్రేష్ఠుఁడు కృష్ణుఁడు సంతోషముగడలుకొనఁ బాండవజ్యేష్ఠుఁడగు ధర్మపుత్రునిఁ బూర్ణంబగు శుభవచనంబుల నభినందించెను. ధర్మరాజు కీర్తించిన యీ విష్ణునామశతమును బఠించువాఁడును వినువాఁడును బాపములన్నింటినుండి విడివడును. ఇది నలువది రెండవయధ్యాయము.

---

## రాజధర్మపర్వము.

### {ధర్మరాజు భీమాదులకు దుర్యోధనాదుల గృహములనొసంగుట.}

అంత రాజు ధర్మపుత్రుఁడచట వచ్చిన ప్రజలనందఱను వీడుకొలుపఁగా వారు తమతమగృహములకుం బోయిరి. పిదప ధర్మరాజు భయంకరపరాక్రముం డగుభీముని అర్జునుని నకులసహదేవులనును జూచి తిన్ననిమాటల బుజ్జగించుచు ' భరతసింహములారా ! మహాయుద్ధమందు శత్రుల పెక్కులాయుధములచేఁ

దేహములు గొట్టువడియున్నవి. శోకమునను గోపమునను దాపమునను మీరు మిక్కిలి యలసిసొలసి యున్నారు. నన్నుఁ బట్టి మీరు మిక్కిలి తక్కువవారలుంబోలె నడవికిం జని దుఃఖం బగు మనికి ననుభవించితిరి గదా ? కాఁబట్టి యింక మీకు సుఖ మగునట్లును, మీయిచ్చవచ్చినట్లును, ఈజయమువలని ఫలమును ననుభవింపుఁడు. మీ బలపుఁ నేర్పుకొని పూమీకరణపటుత్వము లను మరలఁ బూర్ణముగా నొందుఁడు. రేపు వేకువను మిమ్ముఁ గలసెదను' అనెను. అంత నింద్రుఁడు తనమందిరమును బొంది నట్లు మహాబాహుం డగుభీముఁడు ధృతరాష్ట్రుని యనుజ్ఞగొని తనయన్న యొసంగినదుర్యోధనునిగృహమును బొందెను. అది యుప్పరిగలచేత నొప్పుగులుకుచు, పలువిధముల రత్నములచేఁ బర్వి దాకసిలును దాసులును నెరసి బెరసియుండ మొఱయు చుండెను. అర్జునుఁడు రాజు నాజ్ఞచేత దుశ్శాసను భవనమును బొందెను. అదియు నుప్పరిగల వరుసలతోఁగూడి బంగారుతోర ణములచే రంగారుచు దాసీదాసులచే నిండి, ధనదాన్యము లవ్వా రిగాఁ గలిగి దుర్యోధనునిగృహమువలెనే వెలుంగుచుండెను. మహారాజు ధర్మపుత్రుఁడు నకులునకు దుర్మర్షణుని భవనము నొసంగెను. అది దుశ్శాసనుని గృహమునకంటె మేలయినది. అది రత్నములచేతను బంగారముచేతను నలంకృతమై కుబేరుని భవనమువలెఁ జూపట్టుచుండెను. నకులుఁడు పేరడవియందు నలజడిచే స్రుక్కియున్న వాఁడుగాన యది యతనికే మిక్కిలి తగియుండుటంబట్టి రాజు ప్రీతిమీఱ నా భవనము నతనికొసం గెను. పిదపఁ దనకు నెప్పుడును బ్రియములాచరించుచుండు సహా దేవునకు దుర్ముఖుని మేటిభవనము నొసంగెను. అది కాంతివెం

పుసాంపారుచు, బంగారముచే సింగారింపఁబడి, తామరతేకుల వంటి వెడందఁగన్నుంగవలఁ జెన్నారుచిన్నారిపూవుఁబోండ్లను మేలిపూసెజ్జలును నెరయఁగలిగి యుండెను. నకులుఁడు దానిని, కుబేరుఁడు కైలాసముఁ బొందినట్లుంబోలెఁ,బడసి యెంతయు ముదమునొందెను. యుయుత్సుండును విదురుండును సంజయుండును సుధర్ముఁడును *ధౌమ్యుఁడును దమతమగృహములకుఁ బోయిరి. బురుషవ్యాఘ్రుం డగు కృష్ణుండు సాత్యకింగూడి వ్యాఘ్రము పర్వతగుహంబోలె, యర్జునునిభవనమును బ్రవేశించెను. అందుఁ బలువిధములయిన భక్ష్యములచేతను నన్నములచేతను బానీయములచేతను వారందఱును ముదమొంది యారాత్రి మిక్కిలి సుఖంబుగా వసించియుండి వేకువను హాయిగా మేలు కొని రాజగుధర్మపుత్రునికడకు వచ్చినవారయిరి. ఇది నలువది మూఁడవయధ్యాయము.

---

## రాజధర్మపర్వము.

ధర్మరాజు ప్రజలకును బంధువులకును ధనాదులొసంగి కృష్ణునిఁ గుశలప్రశ్నము చేయుచు స్తుతించుట.

జనమేజయుఁడు వైశంపాయనునితో 'మహర్షి ! ధర్మరాజు రాజ్యమును బడసినపిదప మఱియు నేమిచేసెను ? ముల్లోకములకును బరమగురుం డయినభగవంతుఁడు కృష్ణుం డేమిచేసెను?

---

* ఇట ధౌమ్యుఁ డెప్పటియట్ల హస్తినాపురమునఁ దనగృహమునకుఁ బోయెననుట యెట్లు ? అతనికి ముం దాపట్టణమున సుధర్మునకుంబోలె గృహ ముండుట విచార్యము.

వీనిని నాకు వివరించిచెప్పు'మనెను. వైశంపాయనుఁడు 'అనఘా! వాసుదేవుని మున్నిడికొని పాండవు లేమిచేసిరో కలరూపునఁ జెప్పెదను వినుము. ధర్మరాజు రాజ్యమును బడిసినపిదప సకల వర్ణములవారిని నడంకువతోఁ దమతమధర్మంబులందు వర్తించు నట్లు దిట్టపఱిచెను. అతఁడు మహాత్ములయినస్నాతకబ్రాహ్మణులను వేగురి నొక్కొక్కరికి వేయినిష్కము లిచ్చి, దృప్తి గావించెను. అట్లె కొలిచి బ్రతుకుభృత్యులను నాశ్రితులగు నతిథులను బీదలను గుఱిచెప్పువారలను(తార్కికులను) నందఱను వారికోరికలనెల్ల నిచ్చి తృప్తులను గావించెను. అతఁడు పదునాలుగువేలగోవులను, ధనమును, బంగారమును, వెండిని, నానా విధవస్త్రములను, బురోహితుం డగుధౌమ్యునకు దానముచేసెను. మఱియుఁ గృపుఁడు విదురుఁడు మొదలయినవారిని దండ్రులంబోలెఁ బూజించి సంతుష్టులను గావించెను. ఆధర్మపుత్త్రుఁడు దాతలందు మిన్న గావునఁ దన్నాశ్రయించిన వారినందఱను బలువిధములయిన భక్ష్యములచేతను నన్నములచేతను బానములచేతను, వస్త్రములు శయనములు ఆసనములు మొదలయినవానిచేతను, సంతోషింపఁజేసెను. అంత నారాజు * లభించిన ధనాదులకు దానియందలి కొంతభాగము పాత్రములకునొసంగుటచేత శాంతికము గావించి యుయుత్సునిని ధృతరాష్ట్రునిని దగినట్లు సత్కరించెను. అతఁడు ధృతరాష్ట్రునికిని గాంధారికిని విదురునకును రాజ్యమును నివేదించి దాను నెమ్మదినొంది సుఖంబుండెను. అట్లు పట్టణమువారిని దక్కినవారినందఱను మనస్సుకలంక

* ఇందులకు 'లబ్ధప్రశమనం కృత్వా' అని మూలము. 'దీనికి రాజ్యమందు నిమ్మళపాటును లభించునట్లు చేసి' యని ప్రతాపచంద్రరాయల వ్యాఖ్య.

లేకుండునట్లుచేసి యంత ధర్మరాజు చేదోయి గీలించి మహాత్ముండగుకృష్ణునికడకుఁబోయెను; అట మేరుపర్వతమున నున్ననల్లనిమేఘమువలె రత్నములుదాపిన పెద్ద బంగారుమంచముపయి నాసీనుండై యున్న కృష్ణునిఁగాంచెను. అతఁడు దివ్యాభరణ భూషితుండై తనదివ్యదేహముచేతనే యెంతయు తలతల మెఱయుచుండెను. అతఁడు పచ్చనిపీతాంబరము గట్టి, బంగారముచేతఁ బొదిఁగిన నీలమణివలె వెలుంగుచుండెను. అతని వక్షఃస్థలమునందున్న కౌస్తుభమణి యుదయపర్వతమునం దుదయించుచున్న సూర్యునివలెఁ దేజరిల్లుచు నతని కెంతయు సొంపుగూర్చుచుండెను. అతనికి ముల్లోకములందును సాటియేదియుఁగలుగదు. ఆధర్మరాజు పురుషోత్తముండును మహాత్ముండు నగువిష్ణువును జేరి చిఱునవ్వుదొలఁకు తియ్యనిపలుకుల నతనితో 'బుద్ధిమంతులయందు మేలుబంతీ! ఈరాత్రి నీకు హాయిగాఁ దెల్లవాఱెనే కదా? అచ్యుతా! నీజ్ఞానేంద్రియములన్నియుఁ దెలివినొందెనా? అట్లే నిన్నుఁబొంది ప్రకాశించుచున్నబుద్ధియుఁ దేటనొందెనా? *త్రిలోకములగతియైన వాఁడా! త్రివిక్రమా! నీ యనుగ్రహము చేత మేము రాజ్యమునొందితిమి. భూమి మావశమందున్నది. జయమును మేలయినకీర్తియుఁ గలిగినవి. ధర్మమునుండి చ్యుతులము కామయితిమి' అనెను. ధర్మరాజిట్లు చెప్పుచున్నను గృష్ణుఁడేమియుఁబలుకక ధ్యాననిష్ఠయందే యుండెను. ఇది నలువది నాలుగవయధ్యాయము.



* 'త్రిలోకగతివిక్రమ' అనిమూలము. 'త్రిలోకగతవిక్రమ' అను పాఠమున మూఁడులోకములను బొందిన పరాక్రమముగలవాఁడా యని యర్థము.

## రాజధర్మపర్వము.

కృష్ణుఁడు ధర్మరాజును ధర్మములు వినుటకై భీష్ముని కడకుఁ బొమ్మని చెప్పి తాను నతనిప్రార్థనచే భీష్మునికడకుఁ బోవఁ బూనుట.

ధర్మరాజు, 'మహాపరాక్రమశాలీ! నీవేమో ధ్యానించుచున్నావే! ఇది యెంతో యాశ్చర్యముగా నున్నది. లోకపరాయణా! ఈ మూఁడులోకములకును శుభమేకదా! నీయింద్రియములును మనస్సును బుద్ధియందుఁ జొప్పింపఁబడి (లయించి) యున్నవి. * జాగ్రత్తు స్వప్నము సుషుప్తి యనెడు మూఁడవస్థలకు నవ్వలిదయైన నాలుగవధ్యానావస్థ నూఁది స్థూలసూక్ష్మకారణము లనుమూఁడుశరీరములకు నవ్వల నీజీవుఁడుండుటకు నామనసు మిక్కిలి యాశ్చర్యపడుచున్నది. శరీరమునందు నెలకొన్న యైదువిధములగు ప్రాణవాయువులును నడఁపఁబడియున్నవి. మీయింద్రియము లన్నియు మనస్సునందు నెలకొల్పంబడియున్నవి. వాక్కును మనస్సును మహత్తత్త్వమను సమష్టిబుద్ధియందుఁ జొనుపఁబడియున్నవి. శబ్దాదిగణములును దానిని దెలియు నింద్రియములు నాత్మయం దడఁగియున్నవి.

---

* 'అప్రకాన్తో యతో జీవస్తేన మే విస్మితం మనః' అని (దా. మూ) 'యతో దేవ తేన' అని (ఔ. మూ). జాగ్రత్తు స్వప్నము సుషుప్తి అనుమూఁడవస్థలును సామాన్యజనులకుఁ గలుగును. నాలుగవదియగు తురీయావస్థ యోగులకుఁ గలుగును. ఆయవస్థయందుఁ బ్రపంచమంతయు నెంతమాత్రమునుతోఁపక యాత్మ యంతర్గతమగు తనయందో బ్రహ్మమునందో నెలకొనునని అద్వైతసిద్ధాంతము. మనస్సు ఇంద్రియముల కధిష్ఠానమయిన యొక యింద్రియము. బుద్ధి విమర్శనసాధనమయి యంతఃకరణచతుష్టయములో నొక్కటియగును.

యోగస్థితియం దున్ననీబుద్ధియు మనస్సును మేనియందలి రోమములును గదలక స్థిరములై యున్నవి. మాధవా! కట్టెయువలెను గొండవలెను జాతివలెను నే చేష్టయులేక యున్నావు. అచ్యుతా! దేవా! గాలిలేనిచోటం గలదీపము కంపములేక వెలుంగునట్లు సమాధియందు స్థిరుండై కదలక మెదలక వెలుంగుచున్నావు. ఇది యెందులకో వినుటకు నేను దగుదునేని, నీకును నిది వెలిపుచ్చం దగునేని, నిన్నుం జెంది వేఁడుచున్న నాకు నీ సందేహమును ద్రుంపుము. పురుషోత్తమా! నీవీ లోకమును సృజించువాఁడవును; ద్రుంచువాఁడవును. నీవే *క్షరమును నక్షరమును. నీ వాదియు నంతమును లేనివాఁడవు. అన్నిటికంటె నాద్యుఁడును నీ వొక్కఁడవే. ధర్మపాలకులందు మేటివి గదే! నిన్ను శరణొంది శిరస్సుచేఁ బ్రణతుండ నయిన నీభక్తునికి నాకు నీ యీధ్యానము కలరూపును జెప్పుము' అనెను.

అంతఁ గృష్ణుడు మనోబుద్ధీంద్రియములను, వానివాని పట్టులయందుంచికొని చిఱునవ్వుతోడ ధర్మరాజుం జూచి 'ఆఱిపోవుచున్న యగ్నివలె శరతల్పగతుండై యున్నపురుషసింహుఁడు భీష్ముఁడు నన్ను ధ్యానించుచున్నాఁడు. కాన నామనస్సు నతని కడకుఁబోయినది. పిడుగు మ్రోఁతవలె నులియునెవ్వని యల్లెత్రాటిధ్వనిని నింద్రుఁడు సయితము సయింపఁజాలఁడో యాభీష్మునియందు నామనస్సు పోయినది. ఎవ్వఁడు తొల్లి రాజసమూహమునంతయు బలిమిచే జయించి ముగ్గురు కన్నియలను వరించి తెచ్చెనో వానికడకు నామనసుపోయినది. ఎవ్వఁడిరువది మూఁడురాత్రులు పరశురామునకుఁ బోరాటమిచ్చెనో, అప్ప

* నిత్యవస్తువులును అనిత్యవస్తువులును.

టికి నారాముఁడెవనిని మీఱలేకపోయెనో, యట్టివానియెడకు నామనసుపోయినది. అయ్యో! ఏభరతతిలకుని గంగ తన గర్భమందుఁ దాల్చికనెనో యావసిష్ఠశిష్యునియెడకు నామనసుపోయినది. ఏబుద్ధిమంతుఁడు మిక్కిలిఁయుఁ దేజంబురాజిల్ల దివ్యాస్త్రములను మఱిసాంగములగు చతుర్వేదములను దాల్చునో యాతనికడకు నామనస్సుపోయినది. అతఁ డింద్రియముల నొక్కటిగాఁజేసి మనస్సును బుద్ధితోఁగూర్చి నన్ను శరణుఁజొచ్చినాఁడు. కాఁబట్టి యతనికడకు నామనసుపోయినది.అతఁడుజరిగినదియు జరుగనున్నదియు నెఱుఁగును. అతఁడు ధర్మవిదులందు తలయున్నచుమీ; కాన యతనికడకు నామనసుపోయినది.పురుషసింహుండును మహాత్ముండు నయినయాభీష్ముఁ డడఁగిపోయెనేని భూమి చంద్రుఁడు లేని రాత్రివలె నగునుజుమీ. కాఁబట్టి ధర్మరాజా! గంగాపుత్రుండయినయాభీమునికడకుఁ బోయి మ్రొక్కి పాదములు పట్టుకొని ధర్మార్థకామమోక్షములను, వైదికధర్మంబును, నాలుగాశ్రమములను క్షత్రియధర్మముల నన్నింటిని మఱియు నీమనసునందుఁ గలదానిని నడిగి తెలిసికొనుము. కౌరవులకెల్ల మునుపటివాఁడగు నాభీష్ముఁ డస్తమించెనా, లోకమందు జ్ఞానములు మిక్కిలికుఱుచలగును. కాఁబట్టి యతనికడకుఁబొమ్మని నినుఁబురికొల్పుచున్నాను' అనెను. కృష్ణుఁడు చెప్పినయా మేలిమాటలను యథార్థములయినవానిని విని ధర్మరాజు కన్నీటిచేనెలుంగు డగ్గుత్తికవడ నతనితో 'మాధవా! భీష్ముని ప్రభావమునుగుఱించి నీవు చెప్పినదంతయు నిజమే. అందునాకు సందేహములేదు. మహాతేజా! భీష్ముని ప్రభావమును నతనిమహాభాగ్యమును మహాత్ము లయినబ్రాహ్మణులమూలమున నాకు వినికిగలదు. శత్రునిషూదనా! లోకములకుఁ

గర్తవగునీవును నిట్లు చెప్పుచున్నావు. యదునందనా ! నీమాట నిజమాయని విచారింపను వలయునా ? మాధవా ! నన్ననుగ్రహింపవలయునని తలంపు నీకుఁ గలదేని నిన్ను మున్నిడికొనియే మేము భీష్మునియొద్దకుఁ బోవుదుము. సూర్యుఁడుత్తరాయణమునకుఁ దిరుగఁగానే యతఁడు లోకాంతరము నొందఁగలఁడు. కాఁబట్టి నీ దర్శనమతనికిఁ బడయఁదగును. లోకంబుల కాద్యుఁడును క్షరాక్షరరూపుఁడును నగుదేవుని నీదుదర్శన మతనికిఁ బెద్దలాభము. నీవు బ్రహ్మమయంబగు నిధివేకదా ' యనెను. అదివిని కృష్ణుఁడు ప్రక్కనున్న సాత్యకునిఁజూచి 'నా తేరి నాయిత పఱుపు' మనెను. తోడనే సాత్యకి కృష్ణునిపొంతనుండి శీఘ్రముగా వెలికి వచ్చి దారుకునితో 'శ్రీకృష్ణులరథ మాయితపఱుపు' మనెను. అదివిని దారుకుఁడు కృష్ణుని రథమాయితపఱచెను. అందలి యంగములెల్ల బంగారుచే నలంకృతములై యుండెను. మరకతమణుల చేతను జంద్రకాంత సూర్యకాంతమణులచేతను నందందు రచితములై విభంగమ్ములు వెలుగుచుండెను. దానిచక్రములు బంగారు కట్లు గలిగియుండెను. అది సూర్యునికాంతివలె ధగధగ వెలుంగుచు నాశ్చర్యకరము లయినపెక్కురత్నములచేత నలంకృతమగు మధ్యభాగముగలిగి క్రొత్తగా నుదయించిన సూర్యమండలమువలెఁ బ్రకాశించుచుండెను. దానికి సొగసయిన గరుడధ్వజమును బతాకలును గట్టంబడియుండెను. మిక్కిలియు వేగముగాఁ బఱచునట్టి యామేటిరథమునకు బంగారుసొమ్ములుదాల్చినవై మనోవేగములగు శైబ్య సుగ్రీవాదులగు నుత్తమాశ్వములను బూన్చి తేరాయితమయ్యెనని దారుకుఁడు కృష్ణునికడకువచ్చి చేతులు

మోడ్చి నిలిచి విన్నవించినవాఁడయ్యెను. ఇది నలువదియైదవయ ధ్యాయము.

---

## రాజధర్మపర్వము.

(భీష్ముఁడు కృష్ణునిఁ బలుమాఱు స్తుతించుట. కృష్ణ ధర్మపుత్రాదులు భీష్ముని కడకువచ్చుట. భీష్ముఁడు కృష్ణుని దర్శించి ముక్తినొందుట.)

జనమేజయుఁడు వైశంపాయనునితో 'పాండవుల పితామహుండు భీష్ముఁడు శరతల్పంబునం బరుండి యెట్టియోగసమాధి నొందెను? ఎట్లు దేహమునువిడిచెను? జెప్పుము' అని యడిగెను. వైశంపాయనుఁడు 'రాజా ! మహాత్ముండగు భీష్ముఁడు శరీరమును విడిచినవిషయమును శుచివై యాలించివినుము. సూర్యుఁ డుత్తరాయణమునఁ బ్రవర్తింపఁగానే మాఘమాసమున శుక్లపక్షము సప్తమియందు మృగశీర్షానక్షత్రము నడిమిభాగమును సూర్యుఁడు పొందినపుడు భీష్ముఁడు సమాధినొంది మనంబు నాత్మయందే లయింపజేసెను. వందలకొలఁది బాణములు పర్వియున్న దేహముతో భీష్ముఁడు పెక్కులు కిరణములు పర్వుచున్న సూర్యమండలమువలె మిక్కిలి కాంతిగలిగి వెలుంగుచుండెను. వ్యాసుఁడు, దేవశ్రవుఁడు, నారదుఁడు, దేవస్థానుఁడు, వాత్స్యుఁడు, సుమంతువు, అశ్మకుఁడు, జైమిని, పైలుఁడు, శాండిల్యుఁడు, దేవలుఁడు, మైత్రేయుఁడు, అసితుఁడు, వసిష్ఠుఁడు, కౌశికుఁడు, (విశ్వామిత్రుఁడు) హారీతుఁడు, లోమశుఁడు, ఆత్రేయుఁడు, బృహస్పతి, శుక్రుఁడు, చ్యవనుఁడు, సనత్కుమారుఁడు, కపిలుఁడు, వాల్మీకి, తుంబురుఁడు, కురుఁడు, మౌద్గల్యుఁడు, పరశురాముఁడు, తృణ

బిందుఁడు, పిప్పలాదుఁడు, వాయువు, సంవర్తుఁడు, పులహుఁడు, కచుఁడు, కాశ్యపుఁడు, పులస్త్యుఁడు, క్రతువు, దక్షువు, పరాశరుఁడు, మరీచి, అంగిరస్సు, కాశ్యుఁడు, గౌతముఁడు, గాలవుఁడు, ధౌమ్యుఁడు, విభాండుఁడు, మాండవ్యుఁడు, కృష్ణానుభౌతికుఁడు, ఉలూకుఁడు, మార్కండేయుఁడు, భాస్కరి, పూర్ణుఁడు, కృష్ణుఁడు, సుధర్ముఁడు మొదలయినవారును, శ్రద్ధ, శమము, దమము, మొదలగు సుగుణములు గలవారును, మహాత్ములునగు పెక్కుఋషుల సమూహములచేఁ బరివృతుం డయినభీష్ముఁడు, గ్రహనక్షత్రములచేఁ బరివృతుం డగుచంద్రునింబోలెఁ బ్రకాశించెను. ఆపురుషసింహుండు శరతల్పంబున నుండి శుచియై చేతులు మోడ్చికొని మనోవాక్కాయంబులచేత శ్రీకృష్ణుని ధ్యానించి జగత్పతియు,మధుసూదనుండును,యోగేశ్వరుండును, పద్మనాభుండును, జిష్ణుండును, అనాదినిధనుండును, ఆత్మయోనియు, సనాతనుండును, నగు వాసుదేవునిఁ గృష్ణుని నుబ్బునఁ జెలంగు నెలుంగున నిట్లు స్తుతింపఁ దొడంగెను. మాటకారులందు మిన్నయగు నాపరమధర్మాత్ముండు భీష్ముఁడు వాసుదేవు నిట్లు స్తుతించెను. 'శ్రీకృష్ణు నారాధింపఁగోరి సంగ్రహముగను విస్తరముగను నేను జెప్పఁదలంచుమాటకు నా పురుషోత్తముఁడు సంతోషించుఁగాక. శుచియు, శుచియగుపదము (స్థానము) గలవాఁడును, హంసుండును (ఉత్తమపదమందుండువాఁడును), తత్పరుండును (సమస్తమునకు నధికుఁడయినవాఁడును) పరమేష్ఠియు, ప్రజాపతియు నగు నాపరమాత్ముని నాయాత్మయంతటితో నొక్కటిగా యోగసమాధిచేఁ జేర్చి శరణమొందుచున్నాను. దేవతలును ఋషులును, ఆద్యంతములులేని పరబ్ర

హ్మాము నెఱింగినవారుగారు; లోకమును సృజించిన భగవంతుఁడగునారాయణుఁ డొక్కఁడే యెఱుఁగును. దుఃఖములకు నౌషధమయిన యీపరబ్రహ్మమును దేవతలును, దేవర్షులును, సిద్ధులును, దక్కిన ఋషిసమూహములును, మహోరగులును, నారాయణునివలననుండి తెలిసికొనిరి. దేవతలును. అసురులును, గంధర్వులును, యక్షులును, రాక్షసులును, పన్నగులును, నందఱును 'ఇతఁడెవఁడు ? ఎక్కడనుండి కలిగెను ? భగవంతుఁడెట్లయ్యె ?' నని కలరూపును దెలిసినవారుగారు. * వలయందుఁ బిట్ట లడంగియుండునట్లు, ఈలోకములును బ్రజలును నతనియం దడంగి వెలుంగుచుండును. కాన యతఁడు జగమునకుఁ గోశమనఁబడుచున్నాఁడు. గుణ(శేష)భూతము లయినయీ లోకము లన్నియును దారమునఁ గ్రుచ్చిన మణిగణములవలె భూతేశుండగు నతనియందు నెలకొనుచున్నవి ; లయించుచున్నవి. అధ్యాత్మతత్త్వముల విచారించునిపుణు లతనిని విశ్వమున కంతయుఁ గర్తగాను స్థావరజంగమములకుఁ బతిగాను జగంబున కధ్యక్షునిఁగాను జెప్పెదరు. విశ్వము నంగములుగా (దేహముగాఁ) గలిగి, విశ్వమును బనిగానుగలిగి, నిత్యుఁడై , యంతట వ్యాప్తుఁడై , యుండు నతనియందు గట్టిదారము పోఁగునందుఁ బూదండపూలవలె, విశ్వమందలి చేతనాచేతనములు గ్రువ్వంబడియున్నవి.

---

* 'యమాహుర్జగతః కోశం యస్మింశ్చనిహితాః ప్రజాః । యస్మిల్లోకాః స్ఫురన్త్యేతే జాలే శకునయోయథా' అనిమూలము. కొ. మూలమున 'జలే శకునయోయథా' యనిపాఠము. 'నీవుజగమునకుఁ గోశము. నీయందు ప్రాణు లుంపఁబడియున్నారు. జలమందు హంసాదిపక్షులవలె నీయందు లోకములు దేలుచున్నవి' అని యర్థము.

కిరీటములు గలవేయిశిరసులు గలవాఁడును, వేయికరములును జరణములును నేత్రములును గలవాఁడును, వేయిముఖముల వెలుంగువాఁడును, జగంబునకుఁ బరమగతియు నగు దేవుని నారాయణుండని పలుకుదురు. అతఁడణువులలో మిక్కిలి యణువుగాను బెద్దవియగువానిలో మిక్కిలి పెద్దవాఁడుగాను, బరువయినవానిలో మిక్కిలి బరువైనవాఁడుగను, గొప్పవానిలో మిక్కిలి గొప్పవాఁడుగను నున్నాఁడు. వాకములందును (మంత్రములందును), అనువాకములందును (బ్రాహ్మణములందును), నిషత్తులందును (ఉపాసనావిధులందును), ఉపనిషత్తులందును, సత్యంబగు (అమోఘంబగు) కర్మములుగలవాఁడుగను సత్యప్రతిపాదకములగు సామములందు సత్యముగాను జెప్పఁబడుచున్నాఁడు. హృదయమందు నెలకొని, యుపాసకులగు భక్తులనుబాలించుచు (వాసుదేవసంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధులను) నాలుగురూపములు గలిగిన యద్దేవుని,దివ్యములును రహస్యములు నగునాలుగు పరమనామములచేతఁ బేర్కొనుచున్నారు. తపము లతనియందే యెప్పుడు సలుపఁబడియుండును. తపము లతనియంగములందు నెలకొనియుండును. అతండు సర్వాత్ముఁడు, సర్వవ్యాపి, సర్వమయుఁడు, సర్వజ్ఞుఁడు, సర్వకర్త. భూమియందు బ్రహ్మవాచకములయిన వేదమును యాగములను గాచుకొఱకు దేవకి యతనిని, అరణి యగ్నినింబోలె, వసుదేవునివలనఁ గాంచినదయ్యె. అమృతత్వము (మోక్షము) నొందుకొఱకు నితరములను గొలువక నతనినే గొలుచువాఁడు మనస్సు నితరములనుండి మరల్చుకొని యాశలన్నియునువీడి కల్మషరహితుం డయినయాపరమాత్ముని, యోగముచే హృదయాకాశమందుఁ జూచుచున్నాఁడు.

ఇట్టట్టని తర్కింపను దెలిసికొనను నలవి గానివాఁడు; అం తటను వ్యాప్తుఁడయినవాఁడు; వాయువును నింద్రుని నతిశయిం చినకర్మములు గలవాఁడు; సూర్యాగ్నులను మించిన తేజము గలవాఁడు; బుద్ధికి నింద్రియములకును గోచరింపని స్వరూ పముగలవాఁడు; ప్రజలకుఁ బాలకుఁడు నగునట్టి నారాయణుని శరణుఁజొచ్చెదను. పురాణములందుఁ బురుషుం (సర్వవ్యాపి) డనియు, యుగాదులందు బ్రహ్మంబనియు, ప్రలయమందు సంకర్ష ణుండనియు,చెప్పఁబడినవాఁడును నుపాస్యుఁడు నగునతనిని నుపా సించుచున్నాను. ఒక్కండయ్యును బెక్కురూపముల నవత రించువాఁడును, అధోక్షజుండును, ఇంద్రియనులచేఁ దెలియ రానివాఁడును, సమస్తకామములనొసంగువాఁడును, నగునతని నితరములను గొలువని భక్తులు విహితములగు కర్మముల నాచ రించుచు యజించుచున్నారు. సత్యుండును, ఏకాక్షరమగు నోం కారస్వరూపుఁడును, బ్రహ్మమును, సదసత్తులకుఁ బరుండును, ఆది మధ్యాంతములు లేనివాఁడు నయినయాయీశ్వరుని దేవత లును ఋషులు నిక్కముగా నెఱుంగరు. దేవతలును, అసురు లును, గంధర్వులును, సిద్ధులును, ఋషులును, ఉరగులును నంద ఱును ప్రయతులై సుఖమునకు భేషజమయిన యాపరముని నెప్పు డును నర్చించుచుందురు. ఆదియు నంతములేనివాఁడును, దేవుఁ డును, సనాతనుఁడును, చూడను దెలియనివాఁడును, తనకుఁ దానే కారణమైనవాఁడును, ప్రభుండును, నారాయణుండు నగు హరి నందఱును బూజించుచున్నారు.

### భీష్మస్తవరాజము.

దైత్యులను నాశముసేయఁగోరి యదితియందు బంగారు

వర్ణముగల నొకగర్భముగానుండి పండ్రెండువిధములుగా వెలికి వచ్చిన సూర్యుఁడుగా వెలుంగు నాభగవంతునికి నమస్కారము. శుక్లపక్షమందు దేవతలను గృష్ణపక్షమందుఁ బితరులను నమృతముచేఁ దృప్తులఁ జేయించినవాఁడును, ద్విజులకు రాజును, సోమరూపుండు నగునాభగవంతునకు నమస్కారము. అగ్ని మొదలయిన దేవతలచేత ధరింపఁబడు నీజగమునందు మొదటి హవిస్సును భుజించు హోతయను రూపముగల యాదేవునకు నమస్కారము. అజ్ఞానమనెడి పెనుచీఁకటికి నవ్వలయై యెందును నిండి యున్నయపారతేజమై వెలుంగు నేపురుషునిఁ దెలిసినవాఁడు మృత్యువును గడచునో యాదెలియఁదగిన వస్తువు (జ్ఞేయము) అగువానికి నమస్కారము. సామగులు బృహత్తను సామమందును, ఋగ్వేదు లుక్థమనుమంత్రమందును, యజుర్వేదుల గ్నిచయనమను మహాయజ్ఞమందును, నుపాసించు నట్టివాఁడును, మిక్కిలి యురువైనవాఁడును, వేదస్వరూపుండు నగునతనికి నమస్కారము. పదములను గాలు మొదలయిన యంగములుగాను, ఆపదములసంధులను వ్రేలికణుపులుగాను, అచ్చులను హల్లులను భూషణములు గాను, గలయక్షరస్వరూపుఁడుగను వాగ్రూపుఁడుగను బ్రాహ్మణులు చెప్పు నతనికి నమస్కారము. ముల్లోకముల హితముకొఱకు యజ్ఞాంగుఁడగు వరాహరూపుండై భూమి నుద్ధరించిన వీర్యస్వరూపుం డగునతనికి నమస్కారము. ఋగ్యజుస్సామములను మూఁడువేదముల నాధారముగాఁ గలదియు ధాన, కరంభము, పరివాపము, పురోడాశము, పా లనెడు పంచవిధహవిస్సులుగలదియు, గాయత్రి మొదలయిన యేడు ఛందస్సులుగలదియునుగాఁ గావింపఁబడు యజ్ఞము స్వరూపముగాఁ గలవానికి నమ

స్కారము. (ఆశ్రావయ) అని నాలుగును, (అస్తుశ్రౌషట్) అని నాలుగును, (యజ) అని మూఁడును. (యేయజామహే) అని యైదును, (వషట్) అని రెండును నక్షరములుగల మంత్రములచేఁ గావింపఁబడు హోమము రూపముగాఁగల యాతనికి నమస్కారము. గాయత్రి మొదలయిన ఛందస్సు లంగములుగాను, యాగమును శిరసుగాను, *రథంతరము బృహత్తను సామములు ఱెక్కలుగాను,గల యజుర్వేద మనుపక్షిరూపమున వెలుంగుచు స్తోత్ర రూపుఁ డగునా భగవంతునకు నమస్కారము. విశ్వసృజు లను ప్రజాపతులు వేయేండ్లు చేసినసత్రయాగమందు బంగారు ఱెక్కలు గలగరుడపక్షిగా నావిర్భవించిన ఋషియగు నాభగవంతునకు నమస్కారము. ధర్మార్థము ముక్తిహేతువగు వేదము నందలి యుపాయము సాధువు లింద్రియములనడంచి పొందఁదగు యోగధర్మ మనుసేతువును గట్టినసత్యరూపుఁడగు నాభగవంతునికి నమస్కారము. వేఱువేఱు ప్రయోజనములనుగోరి వేఱువేఱయినయాచారములతోడ వేఱువేఱుకర్మములచే నారాధింపఁబడు ధర్మరూపుండగు నాభగవంతునకు నమస్కారము. ప్రాణులు సమస్తములును గలుగుటకుఁగారణమును, అవి తమయంగములందు మరులుగొని యున్మాదులగుటకుఁ గారణమును, నయిన యా కామరూపియగు భగవంతునకు నమస్కారము. ఇంద్రియములకు గోచరించు శరీరమందుండియు మహర్షులకును వెదుకఁదగినంత సూక్ష్మరూపివై యీ దేహమునకు సాక్షివై బుద్ధివలన వెలుంగు క్షేత్రరూపివైన యాతనికి నమస్కారము. 'ఐదుజ్ఞా

*రథంతరబృహత్పక్షః అని(దా.మూ)'రథంతరబృహత్సామ' అని(ఔ.మూ) రథంతర మనుగొప్పసామధ్వని గలదియని యర్థాంతరము.

నేంద్రియములు, ఐదుకర్మేంద్రియములు, మనసు, ఐదుభూతములు ననెడి యీ పదియాఱింటిచేతను నావరింపఁబడియుఁ దన స్వరూపముమాఱక పదియేడవదియగు జ్ఞానరూపమై వెలుంగుచున్నాఁడు' అని సాంఖ్యులుచెప్పు సాంఖ్యరూపుఁ డయినయా భగవంతునకు నమస్కారము. ఇంద్రియములనడంచి శ్వాసమును గెలిచి నిదురవీడి సంతోషమున యోగమును జేయువారలకు జ్యోతిగాఁజూపట్టు యోగరూపుఁ డయినయతనికి నమస్కారము. సమస్తమును దిగవిడిచి శాంతులయిన సన్న్యాసులు పుణ్యపాపములను రెంటిని విడిచి పునర్జన్మమనుభయము లేక దేనిని బొందెదరో యామోక్షము రూపముగాఁగలభగవంతునకు నమస్కారము. అగ్ని ముఖమును, స్వర్గలోకము శిరసును, ఆకాశము నాభియు, భూమి పాదమును, సూర్యుఁడు కన్నును, దిక్కులు చెవులును, ఈలోకములు శరీరమునుగాఁగల యాభగవంతునకు నమస్కారము. నెల, ఋతువు, అయనము, సంవత్సరమునను పెక్కు లంశములచే యుగములందుఁ జుట్టుచుండువాఁడును, సృష్టిప్రలయములు చేయువాఁడును నగు కాలము రూపముగాఁ గలయతనికి నమస్కారము. వేయియుగములతుదిని మిక్కుటముగా జ్వలించుచున్నజ్వాలలు గలయగ్నియై లోకములను గాల్చు కఠోరరూపుఁ డయినయాతనికి నమస్కారము. సమస్తభూతములను దహించి లోకమంతయు నేకార్ణవముగాఁ జేసి తా నొక బాలునిరూపమున నిదురపోవు మాయారూపుఁ డయినయాతనికి నమస్కారము. నాలుగు సముద్రముల నడుమ వేయితలలుగలిగి సాటిలేని మేను గలపురుషుండయి యోగనిద్ర సేయు నా భగవంతునికి నమస్కారము. లోకముల కునికిపట్టయిన తామరపూవు

ను నాభియందుఁ గలపద్మము రూపముగాఁగలవాఁడయి పుట్టుక లే కుండునా తమ్మికంటికి నమస్కారము. కేశములందు మేఘములును, అంగసంధులం దెల్లను నదులును, ఉదరమున నాలుగు సముద్రములునుగల జలరూపుఁడయిన యతనికి నమస్కారము. ఉత్పత్తి స్థితి ప్రలయము మొదలగు కార్యములను గలిగించు కారణరూపుం డయినయతనికి నమస్కారము. రాత్రి నిదుర పోవునపుడు నిదురింపనివాఁడును, పగట సంగములేని కర్తయు, ఇష్టానిష్టములు రెంటికిని సాక్షియునై యుండు నాత్మరూపియైన యాభగవంతునకు నమస్కారము. సొంత ప్రయోజనములేక ధర్మ కార్యము నిమిత్తమై సమస్త కార్యములందును నడ్డులేని యత్న ముగల యీశత్వముగలిగి కార్యరూపుఁ డగునాభగవంతునకు నమస్కారము. ముఖమందు బ్రాహ్మణజాతియు, భుజములందు క్షత్రియజాతియు, కడుపునందును దొడలందును వైశ్యజాతియు, పాదములందు శూద్రజాతియునుగల జాతిరూపుఁడయిన యాతనికి నమస్కారము. అన్నపానములను సాధనముగాఁగొని సారమయిన యింద్రియములను బెంచునదియు శరీరములను దాల్చునదియునగు ప్రాణము రూపముగాఁ గలయతనికి నమస్కారము. ప్రాణములధారణమున కయినభక్ష్యభోజ్యలేహ్యచోష్యములను నాలుగువిధము లయినయన్నములును భుజించి పక్వము గావించు జఠరాగ్నిపాకరూపుఁ డగునతనికి నమస్కారము. విషయములందు వర్తించుచున్నమనుష్యులకు వారికిఁ గలరాగద్వేషము లనుగుణములకుఁ దగినట్టు లావిషయములను గాచునట్టి రూపుగల యాభగవంతునకు నమస్కారము. ఇంతింతని కొలఁది యిడరాని శరీరముగలవాఁడును, అంతటను గలబుద్ధియు నింద్రి

యములును గలవాఁడును, దుదిలేని పరిమాణముగలవాఁడును, దివ్యరూపుఁడునయిన యాభగవంతునకునమస్కారము. కాలము, యజ్ఞము, కార్యము, కారణమునను వీనికి మీఁదయినవాఁడును, కారణము లేనివాఁడును, లోకమున కాదియగువాఁడును నగు విశ్వరూపునకు నాతనికి నమస్కారము. విద్యుత్తునందుఁ గలదియు, జఠరమందుఁ గలదియు, జలమందుఁగలదియు (బాడబాగ్నియు), వెలుపలఁగలదియునగునన్నింటినిభక్షించునట్టియగ్నిరూపుండగు నతనికి నమస్కారము. అణిమాదులయిన యైశ్వర్యములుగలవాఁడయి, పాతాళమునందుండి యీభూమిని మోచు ననంతుఁడనెడి యాది శేషరూపుం డగునతనికినమస్కారము. దివ్యరూపులగు నగ్నిసూర్యుఁడు చంద్రుఁడు నక్షత్రము లనుజ్యోతులకును బ్రకాశము నొసంగు తేజోరూపుం డయినయాభగవంతునకు నమస్కారము. శబ్దము మొదలయిన యైదువిషయములతోడ వెలుంగు జ్ఞానమునందు నా విషయములను దొలంగించి శుద్ధ జ్ఞానమయిన యేయాత్మను శాస్త్రజ్ఞానముచేతఁ దెలియుదురో జ్ఞానరూపుఁడయిన యాభగవంతునికి నమస్కారము. కర్మనిష్ఠయు జ్ఞాననిష్ఠయుఁగల యుత్తమఋషులును, దేవతలును సందేహము తీఱ విచారించి యెవని తత్త్వమును దెలియుచున్నారో యారహస్యరూపుండయిన భగవంతునకు నమస్కారము. జటలును దండమును దాల్చినవాఁడును, వ్రేలుకాడు బొజ్జ గలమేనుగలవాఁడును, కమండలువు నంపపొదిగాఁ గలవాఁడును, నగు నా బ్రహ్మరూపియగు భగవంతునకు నమస్కారము. కేల శూలము గలవాఁడును, మూఁడుకన్నులవాఁడును, విబూదిపూసిన మేటి లింగమురూపము గలవాఁడును, దేవతల కీశుఁడును, మహాత్ముం

డును, రుద్రరూపుండు నగునా భగవంతునకు నమస్కారము. చంద్రకళచే వెలుంగొందు శీర్షముగలవాఁడును, సర్పమును యజ్ఞోపవీతముగాఁగలవాఁడును, పినాకమను విల్లును శూలమును గేలందాల్చినవాఁడును, నుగ్రరూపుండును నగునా భగవంతునకు నమస్కారము. వసుదేవుఁడు దేవకియందు నవతరింపఁ జేసిన వాఁడును, గేల శంఖమును చక్రమును గదయుఁగలవాఁడును, నగు వాసుదేవరూపుం డగునతనికి నమస్కారము. తలపునుకల మాలికగలవాఁడును, బులితోలుగట్టినవాఁడును, బూదిపూసిన శరీరము గలవాఁడును నగురుద్రరూపి యగునాభగవంతునకు నమస్కారము. అన్నిటిని రక్షింపఁగోరి ప్రాణులందుఁ బెక్కు దెఱంగుల పాశబంధములచే మోహింపఁజేయు మోహరూపుం డగు నతనికి నమస్కారము. సమస్తప్రాణుల హృదయమందు నుండునదియు నన్నింటినివిడిచి నివర్తించినదియు నాశము లేనిదియు సూక్ష్మమునగు చైతన్యము రూపముగాఁ గలయతనికిఁ నమస్కారము. క్రోధము ద్రోహము మోహము మొదలయిన దోషములు లేనివాఁడై, ఐదుభూతములును నాత్మయునాభూతముల యాదియు నంతమునై శాంతి రూపముగాఁగలయతనికి నమస్కారము. అన్నియు నెవనియందుఁ గలవో, అన్నియు నెవని వలననుండి కలుగుచున్నవో, ఎపుఁ డన్నియెడలనుండి వెలుంగుచున్నాఁడో, అన్నియు నెవ్వనిరూపమో, ఎవఁడు అన్నింటి రూపమో, యా సర్వరూపుఁ డయినభగవంతునకు నమస్కారము. వేయిపడగలు గలయాదిశేషుఁ డనుదివ్యసర్పముచేత నలంకృత మయినపాలసముద్రమనెడి మంచమునందుఁ బరుండియున్న నిద్రారూపుం డయినయాతనికి నమస్కారము. విశ్వే

దేవతలు, మరుత్తులు, రుద్రు,లాదిత్యులు, అశ్విదేవతలు, వసువులు, సిద్ధులు, సాధ్యులు ననెడిదేవతలు రూపుగాఁగల భగవంతునకు నమస్కారము. ప్రకృతి, మహత్తు, అహంకారము, మనస్సు, బుద్ధి, యింద్రియములు, పంచభూతసూక్ష్మములు, విశేషములు, ననెడియీతత్త్వములరూపము గలయాభగవంతునకు నమస్కారము. భూతము,భవిష్యత్తు, వర్తమానమనెడి మూఁడు కాలములందు నుండునదియు, భూతముల యాదియు నంతము నైనదియు, సమస్తప్రాణులకును మున్నుగలదియు నగు (సత్య) రూపుం డయినయాతనికి నమస్కారము. సూక్ష్మజ్ఞులయిన జనులు సూక్ష్మమునకంటె సూక్ష్మమయిన యేపరబ్రహ్మరూపమును వెదకి యెఱుఁగుదురో యా సూక్ష్మరూపుండగు భగవంతునకు నమస్కారము. పాతాళమునకుఁబోయిన వేదములను మిక్కిలి వేగముగా నెత్తికొనివచ్చి బ్రహ్మదేవున కియ్యఁదగుమత్స్యావతారముఁబూనిన యా భగవంతునకు నమస్కారము. అమృతమును జిలుకు కాలమందు మంథరపర్వతమును వహింపఁదగినట్లు మిక్కిలి కఠినమైన శరీరముతోడ నమరినకూర్మరూపము గొన్న యతనికి నమస్కారము. వనపర్వతములతోడంగూడిన భూమిని యొక్కటేకోఱపంట నెత్తి వెలికి వచ్చినయద్భుత వరాహరూపుం డగునా భగవంతునకు నమస్కారము. లోకము నంతయు వడఁకించునట్టి నరసింహరూపము గొని హిరణ్యకశిపుం డనువానిని జంపిన యా సింహరూపుఁడగు భగవంతునకు నమస్కారము. బంగరువన్నెకన్నులును సటలుఁగలదియు గోఱ పండ్లును నఖములును గలదియు, నసురరాజయిన హిరణ్యుని నాశమునకుఁ గారణమయినదియు నగుగర్వమురూపము గల

యా భగవంతునకు నమస్కారము. దేవతలును గంధర్వులును దానవులును దైత్యులును గలరూపు దెలియరాని సూక్ష్మరూపముగల యతనికి నమస్కారము. మాయచేత వామనరూపము దాల్చి బలిచక్రవర్తి నడంచి మూఁడులోకములను కాలియడుగులచేతఁ గడచిన శూరరూపుఁ డయినయాతనికి నమస్కారము. ఆయుధధారులందు మిన్నయైన జమదగ్నికుమారుఁడును భూమిని క్షత్రియరహితముగాఁ జేసినవాఁడును నయిన పరశురాముఁడుగా నవతరించిన యాభగవంతునికి నమస్కారము. ధర్మమును మిక్కిలియు దిగవిడిచిన తప్పునకై యుద్ధమందుఁ దా నొక్కండును నిరువదియొక్కమాఱు క్షత్రియులను వధించిన కోపరూపుండగు నా భగవంతునకు నమస్కారము. శరీరమునందుఁ దన్ను నయిదు విధములుగా విభజించుకొని ప్రాణులను చేష్టగలవానినిగాఁ జేయు ప్రాణవాయురూపుండయిన యా భగవంతునకు నమస్కారము. దశరథకుమారుం డయినరాముఁడుగా నవతరించి పులస్త్యకులమందుఁ బుట్టిన రావణుని యుద్ధమందుఁ జంపిన క్షత్రియరూపుం డయినయాభగవంతునకు నమస్కారము. నాఁగేటిని రోఁకటినిదాల్చి నల్లని వస్త్రముగట్టి రోహిణీపుత్త్రుఁ డయినబలరాముఁడుగా నవతరించి యా భోగరూపుండయిన భగవంతునికి నమస్కారము. శార్ఙ్గమను వింటిని శంఖమును జక్రమును ధరించినవాఁడును, పీతాంబరము ధరించినవాఁడును, వనమాలఁ దాల్చినవాఁడును నగు కృష్ణరూపుండగు నతనికి నమస్కారము. కంసునిఁ జంపఁగోరి గోకులమందు వసుదేవుని కుమారుఁడుగా నవతరించి విహరించిన శ్రీమంతుడును లీలారూపుఁడు నయిన యతనికి నమస్కారము. యదువంశము

నం దుదయించి వసుదేవునిపుత్త్రత్వము నొంది భూమిభారము నడఁగించిన శ్రీకృష్ణరూపుండగు నతనికి నమస్కారము. యుద్ధమునం దర్జునునకు సారథియై మూఁడులోకములకును హితమునకై గీతామృతము నొసంగిన యాబ్రహ్మరూపుం డయినభగవంతునకు నమస్కారము. మరల లోకమును రక్షింపఁగోరి యసురులను వశముచేసికొని బుద్ధరూపమును దాల్చినయతనికి నమస్కారము. కలివచ్చినపిదప ధర్మమును నెలకొలుపుటకై గుఱ్ఱపువాహన మెక్కి మ్లేచ్ఛుల నుమ్మాలింపఁ గల్కిరూపమున నవతరింపఁబోవు నాభగవంతునకు నమస్కారము. తారవంశమందుఁబుట్టిన కాలనేమియను నసురవరుని వధించి యింద్రునకు రాజ్యము నొసంగినసాంఖ్యరూపుఁ డయినయతనికి నమస్కారము. క్షరములయిన (నాశమునొందునట్టి) వస్తువులకు సాక్షియై సర్వప్రాణుల శరీరములందునుండి యక్షరుఁడై (నాశములేనివాఁడై) వెలుంగు సాక్షిరూపుఁడయిన యాభగవంతునకు నమస్కారము. ఓమహాదేవా! నీకు నమస్కారము. భక్తవత్సలా! నీకుమ్రొక్కు. సుబ్రహ్మణ్యా! (బ్రాహ్మణులకు హితముసేయువాఁడా!) నీకు నమస్కారము. పరమేశ్వరా! నన్ను ననుగ్రహింపుము. ప్రభూ! సర్వమును నీవు వ్యక్తావ్యక్త (స్థూలసూక్ష్మ)రూపముల వ్యాపించియున్నవాఁడవు. సహస్రనేత్రములు గలవాఁడును సర్వలోకమహేశ్వరుఁడును హిరణ్యనాభుండును(బంగారుపొక్కిలిగలవాఁడును),యజ్ఞాంగుఁడును, నాశరహితుఁడును నంతట ముఖములుగలవాఁడును నగు నారాయణునికినమస్కరించుచున్నాను. దేవేశుండును మంగళములకునికిపట్టును నయిన హరిని మనంబున భావించు మనుష్యులకు, నెప్పుడును నేకార్య

మందును నమంగళము గలుగదు. భగవంతుఁడు విష్ణువే మంగళము. మధుసూదనుఁడే మంగళము. పుండరీకాక్షుఁడే మంగళము. గరుడధ్వజుఁడే మంగళము. విశ్వకర్తా ! నీకు నమస్కారము. విశ్వాత్మా ! నీకు నమస్కారము. విశ్వసంభవా ! నీకు నమస్కారము. పంచభూతములకు నవ్వలనుండు నిత్యముక్తుండయిననీకు నమస్కారము. మూఁడులోకములందు నున్న నీకు నమస్కారము. ఈ మూఁటికి నవ్వలనుండునీకు నమస్కారము. సకల దిక్కులందును నుండు నీకు నమస్కారము. లోకములను సృజించువాఁడును నాశముసేయువాఁడును నగు విష్ణూ ! నీకు నమస్కారము. ఒకరిచేతను జయింపఁబడని నీవే లోకములకుఁ గర్తవు. నీవే హృషీకేశుఁడవు. నీవే సంహర్తవు. కాఁబట్టి మూఁడుకాలము లందును, దివ్యములయి విలసిల్లు నీ ప్రభావములను జూచుచున్నాను. సనాతనమయిన యారూపమునుగల రూపును జూచుచున్నాను. నీశిరసుచేత దేవలోకమును, పాదములచేత భూదేవియును, నీకాలియడుగుచేత మూఁడులోకములును వ్యాప్తములయినవి. నీవు సనాతనపురుషుఁడ వగుదువు. దిక్కులు చేతులుగాను సూర్యుఁడు కన్నుగాను శుక్రుఁడువీర్యముగాను నీయందు నెలకొనియున్నారు. అమితతేజుండయినవాయువురూపము గలనీచేత సప్తవిధములయిన వాయుమార్గములును వ్యాప్తములైనవి. ప్రభూ! వ్యక్తంబగు స్థావరజంగమరూపమును నవ్యక్తమగుబ్రహ్మరూపమును గలనీచేత జగమంతయు వ్యాప్తమైయున్నది.నల్లగిసె పూవంటి కాంతిగలిగినవాఁడును, పీతాంబరుండును, నచ్యుతుండును నగు శ్రీగోవిందునికి మ్రొక్కువారికి నెట్టి భయమునుగలుగదు. శ్రీకృష్ణునిఁ గూర్చి చేసిననమస్కార

మొక్కటిరైయెనను బది యశ్వమేధయాగములుచేసి యవభృథ స్నానము గావించినందులకు సాటియగును. పది యశ్వమేధయాగములు చేసినవానికిఁ బునర్జన్మముకలదు. భగవంతునికి మ్రొక్కినవానికిఁ బునర్జన్మము గలుగదు. కృష్ణునిఁగూర్చి వ్రతములాచరించువారును రేయుంబవలు కృష్ణమూర్తిని ధ్యానముచేయువారును నగ్నియందు మంత్రములచేత వేల్చిననేయుంబోలె కృష్ణస్వరూపులై కృష్ణునిఁబొందుదురు. నరకభయము నుండి రక్షించుటకుఁ గంకణము గట్టుకొన్నవాఁడును, సంసారమహానదియందలి సుడిగుండములకుఁ దెప్పకొయ్యవంటివాఁడును, నగు శ్రీవిష్ణువునకు నమస్కారము. వేదమును ధర్మమును రక్షించు దేవుండై గోవులకును బ్రాహ్మణులకును హితుండై లోకరక్షకుండును గోవిందుఁడునగు శ్రీకృష్ణునకు పెక్కు నమస్కారములు. 'హరి!' యను రెండక్షరములు ప్రాణయాత్రయనునడవినిబోవు వానికి దారిబత్తెమును సంసారమును గుదుర్చు నౌషధమును నగును. కష్టశోకములయందు రక్షకమగును. నారాయణుఁడే పరబ్రహ్మము. నారాయణుఁడే పరమతపము. నారాయణుఁడే పరమసత్యము. నారాయణుఁడే పరములందుఁ బరముఁడు. సత్యమును ధర్మమును సమస్తలోకమును విష్ణురూపముగా నుండుట నిజమగునేని నాపాపము నశించుఁగాక. అపారతేజుం డయిన యజ్ఞవరాహుఁ డగు శ్రీవిష్ణుని మ్రొక్కు భక్తులకునమస్కారము. సురోత్తమా ! పుండరీకాక్షా ! నిన్ను శరణముఁజొచ్చి సద్గతి నొందఁగోరుచున్న భక్తునకు నాకు నేది శ్రేయమో దాని నీవే యాలోచింపవలయును. ఇట్లు విద్యకును దపమునకును గారణ

భూతుండై తనంతఁ గారణరహితుఁడై యుండు విష్ణుఁడు స్తుతిం పఁబడెను. స్తుతిరూప మయినయజ్ఞముచేత నారాధితుండయిన శ్రీజనార్దనుండు నాయందుఁ బ్రీతిగలిగియుండుఁగాత" మనెను.

భీష్ముండు కృష్ణునియందు మనస్సు చెల్లించి యింతయుఁ జెప్పి యిప్పుడు 'కృష్ణునికి నమస్కారము' అనిచెప్పి నమస్కరించెను. భీష్ముఁ డట్లు స్తుతించుట విరమింపఁగానే యందుఁగల వేదవిదు లగు బ్రాహ్మణోత్తము లుత్తమ తేజుం డయినయాభీష్మునిఁ గన్నుల నీరుగన్పట్టఁ గొనియాడిరి. బ్రాహ్మణులందఱును బురుషోత్తముం డయినశ్రీకృష్ణునిని భీష్మునిని, మఱలమఱలఁ గొనియాడిరి. శ్రీకృష్ణుఁడు యోగమహత్త్వముచేత భీష్మునిభక్తి నెఱింగినవాఁడుగాన ముల్లోకములకును దెలుపఁదగిన దివ్యజ్ఞానమును నతని కొసంగి తనయున్నచోటికిఁ బోయెను. భీష్మునకుం గలయాభక్తియోగమును గృష్ణుఁ డెఱింగి వేగలేచి సంతోషముగ నా వాహనమం దారోహించెను. కృష్ణుండును సాత్యకియు నొక రథమునెక్కి పోయిరి. ధర్మరాజును నర్జునుఁడును నొకరథంబును, భీముండును నకులుండును సహదేవుండును నొకరథంబును, గృపుడును యుయుత్సుండును సంజయుండును సూతుండును మూఁటియొక రథము నెక్కిపోయిరి. ఒకపట్టణమువలె విస్తరించిన తేరులతోడ బయలువెడలిన యాపురుషశ్రేష్ఠులు, గంభీరములగు నేమిధ్వనులచేత భూమిని వడంకించిరి. ఆకృష్ణుఁడు దారిని బోవునపుడు బ్రాహ్మణు లాడు పురుషోత్తమస్తుతివచనముల నల్ల వినెను. వానిని విని కృష్ణుఁడు మనంబునసంతసించి యంత నచటఁ జేతులు

కట్టికొని వినయంబునను న్న భీష్మునిఁగాంచిహర్షించెను.*ఇట్లుభీష్ముం డుచెప్పిన శ్రీకృష్ణు స్తుతిని భక్తితోఁడఁ బఠించువాఁడును వినువాఁడును శ్రీకృష్ణుని యనుగ్రహమువలనఁ బాపములన్నియువిడిచి తుదను శ్రీకృష్ణునిఁ బొందును.యోగులు ప్రాణము వెడలుకాలమందు మిక్కిలి ప్రయత్నంబున మనంబున నేభగవంతునిఁ దిరముగా భావింతురో యాహరిని భీష్ముం డెదుర్కొని కృతార్థుండై తన ప్రాణములు విడిచెను. తొల్లి భీష్మునిచేఁ జెప్పంబడినదియు మహాపాపములను నాశము సేయునదియు నాశ్చర్యమయిన కృత్యములుగలదియు శ్రీకృష్ణుం గూర్చినదియు నయినయీ స్తవరాజము సమాప్తమయినది. పరిశుద్ధుఁడై ముముక్షు వగువాఁడు నింద్యము లగుపాపములను నపహరించునీ స్తవరాజమును జదివి తనంతటఁ గలిగినయనిత్యలోకములను గడచి మహాత్ముని నాశరహిత మగుపదవిని బొందుచున్నాఁడు. ఇది నలువదియాఱవ యధ్యాయము.



## రాజధర్మపర్వము.

{కృష్ణుఁడు పరశురాముని పరాక్రమము చెప్పఁగా భీష్ముడు దానిని వివరింపుమని కృష్ణుని వేఁడుట.}

అంత, ధర్మరాజును దక్కిన పాండవులు నలువురును కృష్ణుఁడు మొదలయిన వారందఱును నతివేగమునంబోవు గుఱ్ఱములు పూన్చినవియు ధ్వజములు మొదలయిన వానిచే నలంకృత మయినవియుఁ బట్టణములకు సాటియైనవియునగు రథ

* ఇదిమొదలు నీయధ్యాయముకడవఱకుఁ గలపాఠము ఔత్తరాహమూలమందుఁ గానిపింపదు. కానిపింపమిరయే సంగతముగా నున్నది.

ములెక్కి వేగముగాఁ గురుక్షేత్రమునకుఁ బోయిరి. అందు కేశములు మజ్జయెమ్ములు మొదలగునవి నెరసిబెరసియుండెను. వారా కురుక్షేత్రమందుఁ బ్రవేశించిరి.అది మహారథులయినరాజులుశరీరములువిడిచినచోటు;అందు పర్వతములవంటి యేనుఁగులగుట్టములయెమ్ములపోగులు గ్రిక్కిఱిసియు హంసలవంటి మనుష్యుల తలపునుక లెల్లెడల నావరించియు నుండెను; పెక్కులు కవచములును బెక్కులాయుధములును పెక్కువేల చితలును నిండియుండెను; మఱి భూతరాక్షసగణము లందు సంచరించుచుండెను.ఇట్లు భుక్తశేష మయినయంతకునిపానశాలను బోలియున్నయా కురుక్షేత్రమును జూచుచు మహారథులువారు వేగముగాఁ బోయిరి. అట్లు పోవుచుండఁగా మహాబాహుండు కృష్ణుండు ధర్మరాజునకుఁ బరశురాముని పరాక్రమమంతయుఁ జెప్పఁదొడంగెను. 'ఓ ! భారతా ! కొంతదూరమున నిదిగోఁ గానఁబడు నేదుకొలనులును, బరశురామునిచేఁ గావింపఁబడినవి. క్షత్రియుల రక్తములచే నిండినయీమడుఁగులం దతఁడు పితరులకుఁ దర్పణము చేసెను. పరశురాముఁడుభూమి నిరువదియొక్కమాఱు క్షత్రియులులేనిది గావించి యిచ్చట నిప్పుడకార్యమునుండి విరతి నొందెను" అనెను. ధర్మరాజు 'తొల్లి పరశురామునిచే నీ భూమి యిరువదియొక్కమాఱు క్షత్రియులు లేనిదిగాఁ జేయఁబడినదని తాము చెప్పిన విషయమందు నాకుఁ బెనుసందేహము కలిగియున్నది. అపారపరాక్రమా ! రాముఁడు క్షత్రియజాతి బీజమును లేకుండునట్లు లోకమును దహించిన పిదప మఱల నెట్లు క్షత్రియజాతి యుత్పత్తిల్లినది. యదుసత్తమా! మహాత్ముండగు పరశురాముఁడు క్షత్రియజాతి నెట్లు నాశముచేసెను? అది

మఱల నెట్లు పెరిఁగినది? గొప్పరథ యుద్ధంబునఁ గోట్లకొలఁదిని క్షత్రియులు హతులయిరి. అట్లే మఱల భూమి క్షత్రియులచేత వ్యాప్తమయినది. యదుసింహమా! భృగువంశంబునఁ బుట్టిన వాఁడును మహాత్ముఁడును నయిన పరశురామునిచేత మున్నీ క్షత్రియజాతి కురుక్షేత్రమున నెందులకై దహింపఁబడినది. వృష్ణికులతిలకా! గరుడధ్వజా! నాయీసందేహమును దీర్పుము. కృష్ణా! ఉపేంద్రా! వేదమును నీవచనమునకు మించినదిగాదు' అనెను. అంతఁ బ్రభుండగు కృష్ణుండు క్షత్రియులచే నాభూమి నిండినవిషయమునంతయుఁ గలరూపున ధర్మరాజునకు దారిని బోవుచునే చెప్పవాఁడయ్యె. ఇది నలువదియేడవయధ్యాయము.

---

## రాజధర్మపర్వము.

**కృష్ణుఁడు ధర్మరాజునకు పరశురాముని వృత్తాంతమును జెప్పుట.**

శ్రీకృష్ణుఁడు 'ధర్మరాజా! పరశురాముఁడు పుట్టినకారణమును, నతనిప్రభావమును, నతనిచేఁ గోట్లకొలఁదిని క్షత్రియులు హతులగుటయు, మఱల నీభారతయుద్ధమందుఁ గొట్టువడునట్లుగా క్షత్రియులు వర్ధిల్లుటయు, మహర్షులుచెప్పఁగా నేను విన్నతెఱంగున నీకుఁ జెప్పుచున్నాను విను'మని యిట్లుచెప్పెను. 'రాజా! బ్రహ్మపుత్రుఁడయిన యజునికి బలాకాశ్వుఁడను నొక పుత్రుఁడుండెను. అతనికిఁ గుశికుఁడని ప్రసిద్ధినొంది ధర్మవిదుండగు పుత్రుఁడొకఁడుండెను. లోకమునం దతఁ డింద్రునకు సాటియైనవాఁడు. అతఁడు మూఁడులోకములకు నీశ్వరుండును నెవ్వరిచేతను జయింపఁ దరముగానివాఁడు నగు నొకపుత్త్రునిఁ బడ

యఁగోరి పెనుతపము గావింపఁదొడంగెను. భారతా ! పుత్త్రు నుత్పాదించుటకు వలంతియై కడింది తపంబూనిన యాకుశికునిఁ జూచి లోకపతులకును బతియైన సహస్రాక్షుం డింద్రుఁడు తానె వచ్చి యాకుశికునకుఁ గుమారుఁడై పుట్టెను. కుశికుఁడును గుమారుఁడయి పుట్టినయింద్రునకు గాధియను పేరుపెట్టెను. ఆగాధికి సత్యవతి యనుకూఁతురు పుట్టెను. గాధి యాకన్యను భృగుపుత్త్రుఁడయిన ఋచీకునకుఁ బెండ్లిచేసెను. పిదప సత్యవతి పుత్త్రునిఁగోరి ఋచీకుని బ్రార్థింపఁగా నతఁడు గాధికిని దనకును బుత్త్రుఁడుగలుగఁగోరి వేఱువేఱ రెండుచరువులను బక్వము గావించెను. అంత భృగుపుత్త్రుఁ డాఋచీకుఁడు భార్యను బిలిచి 'ఈచరువు నీవును, మఱియొక చరువు నీతల్లియు నుపయోగింపవలయును. మీతల్లికి నామె చరువువలన దీప్తిమంతుండును క్షత్త్రియతిలకుండునగు పుత్త్రుండు పుట్టఁగలఁడు. వాఁడు లోకమున క్షత్త్రియులకెల్ల జయింపరానివాఁడు; మఱిమేటి క్షత్త్రియుల నుక్కడఁచు నట్టివాఁడు. నీకో ధృతిమంతుఁడును శమసంపన్నుండును తపఃకలితుండునగు బ్రాహ్మణ శ్రేష్ఠునిఁ బుత్త్రునిఁగా నీచరువుపుట్టించును' అనెను. అతఁడు భార్యకుఁజరువు లనిచ్చి యట్లు చెప్పి తపంబుగోరి యడవికిఁబోయెను. ఆసమయమునందె తీర్థయాత్రకై గాధిరాజు బయలువెడలి భార్యతోడ ఋచీకాశ్రమమునకు వచ్చెను. అప్పుడు సత్యవతి తనకుఁ బతి ప్రసన్నుఁడై యొసంగిన రెండుచరువులనెత్తికొని సంతసంబునఁ దల్లియొద్దకుఁబోయి దానిని దెలిపెను. ఆబిడతల్లియో తనకయిన చరువును గూఁతునకిచ్చి దానిచరువును దెలియక తానుపయోగించుకొనెను. అంత సత్యవతి క్షత్త్రియుల కంతకరమయిన గర్భ

మునుదాల్చెను. అది ప్రకాశించుచున్న దేహముతోఁ జూచు టకు భయంకరముగానుండెను. ఋచీకుఁడు తనచెలువ యప్సరస యుంబోలె వెలుంగుచుండుటనుజూచి ధ్యానయోగమున జరిగిన దానిని గనుఁగొని 'కల్యాణీ! చరువులనుమార్చినీతల్లి నిన్నువంచిం చినది. అది కారణముగా నీయందు మిక్కిలి మచ్చరముగలవాఁ డును గ్రూరకర్ముఁడునగు పుత్త్రుఁడు పుట్టఁగలఁడు.నీతల్లి తపోధనుఁ డయిన బ్రాహ్మణోత్తముని గాంచును. నీచరువునందు బ్రాహ్మ ణజాతి కగుసౌర్యమునంతయుఁ బదిలపఱిచితిని. క్షత్త్రియవీర్యము నంతయు నీతల్లిచరువునం దుంపఁబడినది. అయినను జరువుల మాఱుపాటువలన నిది నేనుసంకల్పించినట్లు కానేరదు. నీతల్లికి బ్రాహ్మణుఁడుపుట్టును. నీకు క్షత్త్రియుఁడుగలుగును" అనెను. పతి యిట్లుచెప్పఁగా నాభాగ్యవతి సత్యవతి, వడవడవడంకుచుఁ దల వాంచి మ్రొక్కి "ప్రభూ!నీవు 'బ్రాహ్మణజాతికి నింద్యుఁడయిన కొడుకు నీకుఁ గలుగు' నని యిట్టిమాట నను బోఁటిదానికిఁ జెప్పఁదగునా ! తగదే !" యనెను. ఋచీకుఁడు 'పడఁతీ! నీయెడ నే నిట్టికోరిక సంకల్పించినవాఁడనుగాను. చరువులు వీడ్వడు టంబట్టి యుగ్రకర్ముం డయినకొడుకు నీకుఁగలుగు' ననెను. సత్య వతి 'మునీంద్రా ! నీవుకోరితివా లోకములనుగూడ సృజిం తువు! ఇఁకఁ బుత్త్రునిఁగలిగించుటఁ జెప్పనేల ? ప్రభూ ! కాఁబట్టి నాకై శమసంపన్నుఁడును జక్కటిగలవాఁడునగు పుత్త్రు నియ్యం దగు ' ననెను. ఋచీకుఁడు 'కల్యాణీ ! నేను నవ్వులాటలకు నింత వఱకు నబద్ధమయినమాట చెప్పినదిలేదు. ఇంక నగ్ని ని మున్నిడి కొని మంత్రపూర్వకముగా సమర్థించిన చరువువిషయమై నా మాట పొల్లుకాదని చెప్పవలయునా ? నీతండ్రి కులమంతయు.

బ్రాహ్మణకులమగునని తపశ్శక్తిచే మును పేనాకుఁ దెలిసియున్నది చుమీ' యనెను. సత్యవతి 'నీవు మంత్రశక్తిగలవారలయందు మిన్నవుగదే ! నీయిచ్చచొప్పున పౌత్రుఁ డిటువంటివాఁడగుఁ గాక. పుత్రుఁ డిట్టివాఁడువలదు. వలదు. శమసంపన్నుఁడును జక్కటిగలవాఁడునగు పుత్రుఁడు నాకుఁ గలుగనిమ్ము' అనెను. ఋచీకుఁడు 'వరవర్ణినీ ! పుత్రుఁడనియుఁ బౌత్రుఁడనియు నాకు భేదము లేదు. నీవు చెప్పినట్లె యగుఁగాక.' యనెను. అంత సత్యవతి తపస్సక్తుండును శాంతుండును నియతవ్రతుండునగు జమదగ్ని యనుపుత్రునిఁ గనెను. కుశికపుత్రుం డగుగాధికి బ్రహ్మతేజస్సంతయు నిండారి బ్రహ్మర్షికి సాటియగు విశ్వామిత్రుండను పుత్రుఁడుగలిగెను. జమదగ్ని మిక్కిలి భయంకరుఁ డయినపరశురాముని గాంచెను. అతఁడు సమస్తవిద్యలందును దుదముట్టి, ధనుర్వేదపారగుఁడయి యుండెను. అతఁడు మఱియు క్షత్రియాంతకుఁడయి యగ్నివలెఁ దేజరిలుచుండెను. అతండు గంధమాదనపర్వతమందు మహాదేవుండగు రుద్రుని సంతోషపఱిచి, యద్దేవునివలన మిక్కిలియుఁ దేజంబుదొలఁకు పరశువును నస్త్రములును వరముగాఁబడసెను. ఆగండ్రగొడ్డలి జ్వలించుచున్నయగ్నివలె వెలుంగుచు, మొక్కవోని వాఁడిమొనగలిగి యిట్టిదట్టిదని చెప్పరానిదై యుండెను. కాన యతండు దానిచే లోకములం దసమానుఁడై యుండెను. ఇట్లున్నకాలమున, హైహయదేశమునకు రాజర్జునుఁ డనువాఁడుండెను. అతఁడు కృతవీర్యునిపుత్రుఁడు, మిక్కిలి తేజస్వి,మంచిబలవంతుఁడు. అతఁడు దత్తాత్రేయుని ప్రసాదమువలన వేయిబాహువులఁబడసి మహాతేజుం డయినచక్రవర్తియై యశ్వమేధ మనుయాగము చేసెను.

అతఁడు పరమధర్మవిదుండుగాన, యాయాగమందుఁ దనభుజబల ముచేతను నస్త్రబలముచేతను యుద్ధంబునజయించి భూమినం తయుఁ బర్వతములతోను సప్తద్వీపములతోను బ్రాహ్మణులకు దానముచేసెను. ఆపరాక్రమశాలి తన్నగ్నిదేవుఁడు దప్పిగొని యాచింపఁగా, పెక్కులుగ్రామములను బట్టణములను రాష్ట్రము లను గొల్లపల్లెలను నతనికి భిక్షగానొసంగెను. కాన యాపురు షతిలకుని ప్రభావముచేత నగ్నియన్నింటిని దహింపఁగోరి యత నిబాణములవలననుండి దరికొని జ్వలించుచు నాయర్జునుని పర్వ తములను భూమినంతయు దహించివైచెను. అట్లాయగ్ని వా యువుచేత మిక్కిలి యెసరేఁగి యర్జునుఁడును దోడుపడఁగా మహాత్ముఁ డగువసిష్ఠమహర్షి యాశ్రమ మున్నయరణ్యమును, అందెవరును లేకుండఁగాఁ గాల్చివైచెను. అట్లు; తనయాశ్రమము దగ్ధముకాఁగానే, వసిష్ఠుఁడు మహాప్రభావుడుగాన యర్జునునియె డఁగోపముగొని యతనిని శపించువాఁడై 'అర్జునా! నీవు నా యా శ్రమవనమును గొప్పదానిని విడిచిపెట్టక కాల్పనేకాల్చితివిగా ! కాఁబట్టి రణమున రాముఁడు నీచేతులను ఛేదించును బో'మ్మని శపించెను. అర్జునుఁడో మిక్కిలి తేజమును బలిమియుఁగలవాఁ డయ్యు నెప్పుడును శమముగలిగి బ్రాహ్మణులయందు భక్తియుఁ నార్తులకు శరణొసంగుటయుఁగలిగి మంచిదాతయు శూరుం డునై యుండును. అతఁ డామహాత్ముఁడొసఁగిన శాపమును బాటిం చినవాఁడు గాఁడయ్యె. అతనికి మిక్కిలిబలవంతు లగుపుత్రులు గలరు; వారాశాపముచేతఁ దండ్రివధకు నిమిత్తభూతులగుటకై యెప్పుడును గర్వమున విఱ్ఱవీఁగుచుఁ గ్రూరులై యుండిరి. వారొ కప్పుడు జమదగ్నిహోమధేనువుదూడనుబట్టి తీసికొనిపోయిరి.

బుద్ధిమంతుఁడగునర్జునుఁ డదియెఱుంగఁడు. అదికారణముగా జమదగ్నికుమారుఁడును మహాత్ముఁడు నగుపరశురామునితోడ యుద్ధముకలుగఁగా నం దతఁడు రోషంబుమీఱ నర్జునునిచేతులను నఱికివైచెను. అంత నారాముఁడు గ్రమ్మఱుచున్న యాదూడను వారి యంతఃపురమునుండి తనయాశ్రమమునకుఁ దీసికొనిపోయెను. అర్జునునికొడుకులు బుద్ధిహీనులు గాన యపుడందఱు నొక్కటి గాఁగూడి జమదగ్నియాశ్రమమునకుఁ బిలువంబడకయే పోయి భల్లపుమొనలచే నతనిశిరసును దేహమునుండి ద్రెస్సిపడఁ గూల్చిరి. అపుడు మహాయశుండు పరశురాముం డందు లేఁడు; సమిధలును దర్భలును దేరబయటఁ బోయియుండెను. అతండుతిరిగివచ్చి తనతల్లివలనను నాయాశ్రమవాసులవలనను జరిగినయాప్రవృత్తిని జక్కవిని క్రోధంబునొంది కాలాగ్ని సమానుఁడయ్యెను. అతండు ధనుర్వేదమం దద్వితీయుఁడు; దివ్యాస్త్రములచే నెంతయు భూషితుఁడు. అర్ధచంద్రబింబమువలెఁ బరశు వతనికేలఁ గ్రాలుచుండెను. అతఁడు పితృవధమున కెంతమాత్రము సయింపక మిక్కిలి యుఁగోపమునొంది భూమియందు క్షత్రియుఁడొక్కడేని లేకుండునట్లుచేయుదునని ప్రతినచేసి యాయుధమును గయికొనెను. అంత నాభృగుసింహుఁడు పరాక్రమంబుమెఱసి మిక్కిలి వేగపోయి యర్జునుని పుత్త్రులను బౌత్త్రులను మిగతలేకుండఁ బడగూల్చి కోపంబుసందడింప హైహయదేశపువారగు క్షత్త్రియులను బెక్కువేలమందినిజంపి భూమిని సముద్రమువఱకు రక్తమునఁ దొప్పఁదోఁగునట్లు గావించెను. అతం డపారతేజంబురాజిల్ల భూమిని క్షత్త్రియులులేనిది గావించి యంతనెంతయు దయ పయిఁకొనఁగా వనమునకే పోయెను. అతఁడు స్వభావముచేతనే కోపముగల

వాఁడు. అంతఁ గొన్ని వేలసంవత్సరములు కడచనువఱకు నట్లూర కుండి పిదప నెప్పటియట్లు కోపంబునొందినవాఁ డయ్యె. అది యెట్లనఁగా, యయాతిపతన మనుక్షేత్రమున యాగమునందు జనసమూహము గూడియుండెను. ఆగుంపునందు విశ్వామిత్రుని మనుమఁడును రైభ్యునికొడుకు నగుపరావసుఁ డనుమహాతపస్వి యొకండు రామునిఁజేరి 'రామా! నీచేసినప్రతిజ్ఞపొల్లు; ఈజనుల కూటమునందు నిన్నునీవే పొగడికొనుచున్నావు. ఈయాగము నకు వచ్చియున్న ప్రతర్దనుఁడు మొదలయినవారు నీకు క్షత్రియులు గారా! ఈ భూమి మరల వందలకొలఁది క్షత్రియులచేత నంతట నెరసిబెరసియే యున్నదే! క్షత్రియవీరులకు భయపడి యొకకొండయం దొదిఁగియున్నావే' అని యెత్తిపొడిచెను. పరా వసువు చెప్పినమాట వినఁగానే పరశురాముఁ డాయుధమును గేలంబూనెను. అతఁడు మున్ను వందలకొలఁది క్షత్రియులను జం పక విడిచియుండెను. వారంతకు మిక్కిలి వృద్ధినొంది యెంతయుఁ బరాక్రమము మెఱయుచు భూమిని బాలించుచుండిరి.. అతఁడు మరల వారినందఱను బాలురను సయితము వేగ దునుమాడి వైచెను. అపుడు గర్భస్థులగు క్షత్రియులచే మఱల భూమినిండిన దయ్యె. గర్భములు పుట్టుచుఁ బుట్టుచునుండఁగా, మరల నతఁడు వానిని జంపుచునుండెను. అప్పుడు క్షత్రియస్త్రీలుకొందఱుబిడ్డలను రక్షించిరి. ఇట్లులిరువదియొక్కమాఱు భూమిని నిఃక్షత్రియముగా వించిరాముడంతఁ దాను జేసిన యశ్వమేధయాగము తుదను నీభూ మినికశ్యపునకు దక్షిణగా నొసంగెను. ఆకశ్యపుఁడును శేషించిన క్షత్రియులను గావంగోరి స్రుక్కును బట్టినచేత దక్షిణను గయి కొని పరశురామునిఁజూచి 'మహామునీ! నీవు దక్షిణసముద్రంపుఁ

దీరమునకు బోవలయును. నీవు నా దేశమం దెక్కడను వసింప రాదు. నీవు భూమిని నశ్వమేధయాగమందు నాకు దక్షిణగా నొసంగితివి. ఇచ్చినభూమిని మరలఁబుచ్చుకొనుటకు నీకధికారము లేదు ' అనెను. అంత పరశురాముఁడు సముద్రునికడకు బోఁగా నతఁ డతనికి భయపడి పడమటిదిక్కున శూర్పాకర మను దేశమునొకటి నిర్మించియిచ్చెను. కశ్యపుఁ డాభూమిని దానమునఁ గయికొని దానిని బ్రాహ్మణులయం దర్పించి తాను వనంబునకుఁబోయెను. పిదప నీలోక మరాజకము కాఁగా శూద్రులును వైశ్యులును విచ్చలవిడి నడచుచు మేలుజాతివారగు ద్విజులభార్యలయందుఁ వర్తింపఁ దొడఁగిరి. బలవంతులు బలహీనుల నడువందొడంగిరి. అప్పు డెవ్వఁడును దనధనమునకే తానేలిక గానేరఁడయ్యెను. మూర్ఖులయిన కొందఱుబ్రాహ్మణులు తాము పండితులమని విఱ్ఱవీఁగుచుఁ గలుద్రావఁదలపడిరి. బ్రాహ్మణులుక్షత్రియులు వైశ్యులుశూద్రులందఱును దుర్మార్గమునవర్తించుచు నొండొరుల నండగొని యొకరినొకరు చంపఁబూనిరి. బ్రాహ్మణులు తమధర్మమును విడిచి దుష్పథమును ద్రొక్కి పాషండులయిరి. అందఱును దొంగతనమును, కల్లలను మాయలనుబన్నిరి. కొందఱు దురాచారులు తమవర్ణధర్మములను నాశ్రమధర్మములను దప్పక నడపుచు సన్మార్గమున వర్తించుచున్న బ్రాహ్మణులను వైశ్యులను ధార్మికులగు శూద్రులను నెంతమాత్రమును భయములేక వధించిరి. మఱికొందఱు యాగములను నధ్యయనమును జేయువారిని, ఆశ్రమములందు నెలకొని తపము సలుపువారిని,గోవులను, బాలురను, స్త్రీలను, వృద్ధులను,నాశము చేసిరి. వేదములును ధర్మశాస్త్రములును రాజనీతియు నపుడడఁగి

పోయినవి. ఆచారములు తలక్రిందుగాఁ దప్పి నడచుచుండుట చేతఁ బెక్కండ్రు ద్విజు లపుడు ప్రాయికముగా వ్రాత్యులును మ్లేచ్ఛులునయిరి. అపుడు భూమిధర్మరక్షకులయిన క్షత్రియులు దన్ను విధ్యుక్తముగాఁ గాచుటకు లేకుండినందునఁ గ్రమమంతయుఁ దలక్రిందుకాఁగా నా తెఱపిని దురాత్ములు తన్నుఁ బీడించుచుండఁగాఁ జేయునదిలేక వేగ రసాతలమును జొచ్చెను. అట్లు భూమిభయపడి పరువిడుచుఁ బాతాళమునకుం గ్రుంకుచుండుటం జూచి యంతఁ గశ్యపుఁడు గొప్పమనస్సుగలవాఁడుగాన తన తొడయందు దానినిదాల్చి యుద్ధరించెను. దానిచే నాభూమి 'ఉర్వి'యనుపేరు గలదయ్యెను. అప్పుడు భూదేవి కశ్యపుని సంతోషపెట్టి, తన్ను రక్షించు నుద్దేశముతో బాహుబలసంపన్నులగు క్షత్రియులు కావలయునని యమ్మునిని యాచించునదై 'మునీంద్రా! హైహయవంశమువా రయినమేటిక్షత్రియులను స్త్రీలయందుఁ బదిలముగానుంచి రక్షించుచున్నాను.వారు నన్నురక్షింతురుగాక. విదూరథునిపుత్రుఁ డయినయొకరాజు పూరువంశమువాఁడు, ఋక్షవంత మనుపర్వతమున ఋక్షముల (ఎలుఁగుబంట్లు) చేతఁ బెంపఁబడుచున్నాఁడు. అట్లె సౌదాసుని పుత్త్రుని, నపారతేజుం డయినపరాశరుఁడు దయగూరి రక్షించుచున్నాఁడు. వాఁడు క్షత్రియుఁడై యుండియు నాపరాశరునకు శూద్రునివలె సమస్తకార్యములును జేయుటచే సర్వకర్ముఁడని ప్రసిద్ధుఁడయ్యెను. అతఁడు నన్నురక్షించుఁగాక. శిబిపుత్రుఁడు మహాతేజుండు. వాఁ డరణ్యమునందు గోవులచేఁ బెంపఁబడినవాఁడుగాన గోపతి యను పేరొందెను, వాఁడు నన్ను రక్షించుఁగాక. ప్రతర్దనుని పుత్రుఁడు మహాబలుఁడు, పసులకొట్టమునందు వత్సము(దూడ)

లచేఁ బెంపఁబడినవాఁడు గాన, వత్సుండను పేరుగలఁడు. ఆరాజు నన్ను రక్షించుఁగాక. దివీరథుని పౌత్త్రుఁడును దధివాహనుని పుత్త్రుండు నగునంగుఁడను రాజును గంగాతీరమున గౌతముఁడు రక్షించుచున్నాడు. గృధ్రకూటమను పర్వతమున మహాతేజుండయి గొప్పభాగ్యముచేఁ జెలువుగులుకుచుండు బృహద్రథుఁడను వానిని గోండమృచ్ఛులు గాచుచున్నవి. మరుత్తుని వంశమునఁబుట్టినరాజులు పరాక్రమమున నింద్రునింబోనివారు క్షత్త్రియకుమారులు. సముద్రునిచేత రక్షితులై యున్నారు. అందందుఁ బ్రసిద్ధులై యున్న యాక్షత్త్రియకుమారులు శిల్పి కంసాలి మొదలగు జాతుల నిప్పుడు నాశ్రయించియున్నారు. వీరు నన్ను రక్షింతురేని నేను నిలుకడగా నిలకొందును. వీరలతండ్రులును, తాతలును, రామునిచేత నానిమిత్తము యుద్ధమున హతులయిరి. మునిసత్తమా! *వారలకు ఋణమీఁగుటకై పూజ నాకుఁ జేయవలసియున్నది. కడచిపోయినరాజులచేత నాకు రక్షణమును నేను గోరలేదు. ఇప్పుడున్నక్షత్త్రియులచేత నే నుండఁగోరెద. దీనిని వేగ యొడఁగూర్పవలయు' ననెను. అంతఁ గశ్యపుఁడు భూదేవి నిర్దేశించిన క్షత్త్రియులను రప్పించి వారిని రాజులుగా నభిషేకము గావించెను. వారలవంశములు పుత్త్రపౌత్త్రపారంపర్యము గలిగి భూతలంబునఁ బ్రతిష్ఠితములయ్యెను. ధర్మపుత్త్రా! నీవు నన్నడి

* ఇట 'తేషా మపచితిశ్చైవ మయా కార్యా మహామునే' అని మూలము. వారలకు నుత్తరక్రియల చేయింపవలసినది నాకుఁగర్తవ్యమని ప్రతాపచంద్రుల వ్యాఖ్య. 'నహ్యహం కామయే నిత్య మతిక్రాంతేనరక్షణమ్' అనుటకు ధర్మము నతిక్రమించినవారిచేత రక్షణను నే నెప్పుడును గోరనని నీలకంఠవ్యాఖ్య. నేనిప్పటిరాజులచేత రక్షణమును గోరలేదని ప్రతాపచంద్రవ్యాఖ్య.

గిన యీపురాతనకథ తొల్లి యిట్లు జరిగినదయ్యె ' ననెను. ఇట్లు మహాత్ముఁడు కృష్ణుఁడు ధర్మరాజునకుఁ జెప్పుచు ముల్లోకములను సూర్యుండునుఁబోలె నిజకాంతులచేఁ బర్వుచు నారథంబుననే వేగముగాఁ బోయినవాఁడయ్యె. ఇది నలువదియెనిమిదవ యధ్యాయము.

---

## రాజధర్మపర్వము.

(ధర్మరాజు మొదలగువారు భీష్ము నాశ్రయించుట. కృష్ణుఁడు భీష్మునకు నుపచారోక్తులు చెప్పి ధర్మరాజునకు ధర్మోపదేశముఁ జేయ వేఁడుట.)

అంత ధర్మరాజు పరశురాముఁడు చేసినయద్భుతకర్మమును విని మిక్కిలి యాశ్చర్యమునొంది కృష్ణునితో 'వృష్ణికులతిలకా! రాముని క్రోధమువలన భూమి క్షత్రియుఁడే లేనిదిగాఁ జేయంబడెనుగా ! ఔరా ! ఆతనిపరాక్రమ మేమనవచ్చు ! అది దేవేంద్రుని పరాక్రమమువలె నున్నదే ! ఆరామునివలన భయమున నడుంకుచున్నక్షత్రియకులోద్ధారకులును గోవుచేతను, సముద్రునిచేతను, గొండముచ్చులచేతను, నెలుఁగుబంట్లచేతను, వానరములచేతను బదిలముగా రక్షితులయిరిగా! ఔరా! ఏమాశ్చర్యము! అచ్యుతా! బ్రాహ్మణోత్తములు ధర్మయుక్తమయిన యిట్టి కార్యమును గావించినపట్టయినయీమనుష్యలోకము ధన్యమైనది. భూమియందలి మనుష్యులును మిక్కిలి భాగ్యవంతులే' యనెను. ఇట్లు కథలు చెప్పికొనుచు నాధర్మరాజును గృష్ణుఁడును శరతల్పంబున భీష్ముండు పరుండియున్నయెడకుఁబోయిరి. అట్లుచని వారు మిక్కిలి పవిత్రమయిన యాప్రదే

శమున, ఓఘవతీనదితీరమున శరతల్పముపయిఁ బరుండియున్న భీష్మునిం గాంచిరి. అతఁడు నిజకిరణసమూహముచేఁ బరివృతుఁ డయిన సాయంకాలసూర్యునివలె వెలుంగుచు దేవతలు దేవేంద్రుఁడుంబోలె మునులు దన్నుఁ గొలుచుచుండఁగా వెలయు చుండెను. కృష్ణుండును ధర్మరాజును దక్కిన నలువురు పాండవులును గృపుఁడు మొదలయినవారును గొంతదవ్వుననే భీష్మునిఁ గాంచి వాహనములనుండి దిగిపోయిరి. అంతఁ గృష్ణుండును సాత్యకియు ధర్మరాజుమొదలయినరాజులును, మిక్కిలి చలించు చున్నమనమును గుదుటంబెట్టి యింద్రియముల నొక్కటి గావించుకొని యందుఁగల వ్యాసుఁడు మొదలయిన ఋషిసత్త ములకుసమీపమునకుఁబోయి వందనము లాచరించి పిదప భీష్ముని కడకుఁబోయిరి. అంతఁ గృష్ణుఁడు భీష్మునితో 'తపస్సువర్ధిల్లు చున్నదా'? అని యడిగి కూర్చుండెను. తక్కిన పురుషవీరులంద ఱు నతనింగలసి కూర్చుండిరి. పిదపఁ గృష్ణుఁ డాఱుచున్నప్పటి యగ్నియుంబోలె నున్న భీష్మునిఁగాంచి, కొంచెము మనంబున దుఃఖించుచు 'మాటకారులందుమేటీ! ఇంద్రియములెల్ల మును పటివలెఁ జేటలయి యున్నవేకదా? నీదుబుద్ధియుఁ గలఁతలే కున్నదిగదా? బాణములు కొట్టువడి దుఃఖముచేఁ బీడితమయిన నీదేహము నొప్పులేకున్నదా? మనస్సునందలి దుఃఖముకన్న, మేని యందలి దుఃఖము మిక్కిలి పెద్దదిగదే! ప్రభూ! ధర్మనిత్యుం డయిన నీతండ్రి శంతనునివలననుండి వరమునుబొందుటం బట్టి మరణము నీయిచ్ఛకులోనయి యున్నదిగదా! అయిన నిది శరీర వేదనను దొలఁగింపఁ గారణముగాదే! శరీరమునందున్న శల్యము, మిక్కిలి సూక్ష్మమయినను నెంతయు బాధగలిగించును. శరస

మూహములచే శరీరమంతయు నిండియున్న నీదు వేదన యేమని చెప్పుదు! భారతా! దేవతలకును వలయుహితము లుపదేశింప వలంతివి. ఇట్టి నీకుఁ బ్రాణుల జననమరణములనుబట్టి పరులు చెప్పవలసినది లేదేకదా! పురుషతిలకా! జరిగినదియు, జరుగఁ గలదియు, జరుగుచున్నదియు నగునన్నియు జ్ఞానవృద్ధుండయిన నీకు నఱచేతియందలి యుసిరికవలె నగును. ప్రాణుల యిహాసంసారమును, దానివలన ధర్మముచేఁ గలుగు ఫలమును నీకుఁ దెలిసియున్నవి. మహాప్రాజ్ఞుండవుగదే! నీవు ధర్మమయమగు నిధివిగదా! నీవు బలువైనరాజ్యమునం దుండి యే తెవులును లేక యవయవముల నింపుఁదనముతోఁ గూడినవాఁడవై వేయిమంది సుందరీమణులచేతఁ బరివృతుండ వయ్యుండియు నొక్కండ వూర్ధ్వరేతసుండ వని నేను గనుఁగొనుచున్నాను. అమోఘధర్ముండును మహావీర్యుండును శూరుండును ధర్మైకపరాయణుండును శరతల్పగతుండును శంతనుపుత్త్రుండునునగు భీష్ముం డొక్కఁడు తక్క మూఁడులోకములందును దపోబలంబున మృత్యువును జయింపఁగలరాజు కలిగినట్లు విన్నదిలేదు. అయ్యా! సత్యమందును, దపమందును, దానమందును, వేదమందును, యాగమందును, ధనుర్వేదమందును, దర్కశాస్త్రమందును నీవలె ధర్మార్థకామములకుఁ గారణభూతుండగు మఱొక్కని నే నిది వఱకు విన్నదిలేదు. క్రూరత్వములేక, పరిశుద్ధుఁడును, దాంతుఁడును, సర్వభూతహితరతుండును, మహారథుండు నగు నిను బోఁటివానిని మఱొక్కనిని విన్నదిలేదు. దేవతలు, అసురులు, గంధర్వులు, యక్షులు, రాక్షసులు మొదలయినవారి నందఱను నేకరథుండవై నీవొక్కండవే జయింపశక్తుండ వనుటకు

సందేహము లేదు. మహాబాహూ! ఇంద్రసమానుఁడ వయిననీవు వసువులనెడి యెనమండ్రు దేవతల యంశములు నొక్కటిగాఁ జేరి తొమ్మిదవవసువుగాఁ బుట్టినవాఁడవనియు, గుణములందెల్ల వారికి నుత్తముఁడ వనియు బ్రాహ్మణు లెప్పుడును జెప్పెదరు. పురుష వర్యా! నేనును నాయంతట నిన్నెఱుంగుదును. పురుషసత్తముండ వగునీవు దేవతలందును శక్తివలనఁ బ్రసిద్ధి కెక్కిన వాఁడవు. మనుజేంద్రా! భూమియందలి మనుజులగుణము లందు నీకు సమానుఁ డయినపురుషుని నెందును నేను జూడ లేదు; వినను లేదు. రాజా! నీవు సమస్తగుణములచేతను దేవతల కును మిన్నవు. నీవు నీతపోబలమువలన స్థావరజంగమములయిన లోకములను సృజింప శక్తుండవు. ఇఁక నుత్తమగుణములచే నీకు వలయు నుత్తమలోకములను బొందుటను జెప్ప నేల? ఈ పాండవజ్యేష్ఠుఁడు ధర్మరాజు జ్ఞాతివధమునకు మిక్కిలి పొక్కు చున్నవాఁడు. నీ వితనిశోకమును బోకార్పవలయును. నాలుగు వర్ణములధర్మములును, నాలుగాశ్రమములధర్మములును, ధర్మార్థ కామమోక్షము లనునాలుగువిద్యలందుఁగల ధర్మములును వైదికులకుఁగల విశేషధర్మములును, యోగసాంఖ్యములతోఁ జేరిన సనాతనధర్మములును నన్నియు నీకుఁ జక్కఁగాఁ దెలిసియున్నవి. గాంగేయా! చతుర్వర్ణములకు వలయునదియు విరుద్ధముగా నిదియు ననుష్ఠింపఁబడుచున్నదియు నగు ధర్మశాస్త్రము సవ్యాఖ్యానముగా నీకుఁ దెలియును. ప్రతిలోమజాతులకును మ్లేచ్ఛులకును గలధర్మములు నాయాదేశజాతికులములకుఁ గలధర్మ లక్షణములును, వేదములందును శిష్యులచేతను జెప్పంబడు ధర్మములును నీ కెప్పుడునుఁ జక్కఁగాఁ దెలియును. ప్రవృత్తి నివృత్తి

క్రమములును దెలియును. ఇతిహాసపురాణముల ధర్మములును ధర్మశాస్త్రమును గొఱంతలేక యన్నియు నీకు మనంబున నెలకొనియున్నవి. పురుషసత్తమా! ఈలోకమందు సంశయమును గలిగించు విషయములన్నియును నాసందేహము తీఱునట్లు విశదముగా నుపదేశించుటకు నీవుదప్ప లోకమున మఱెవ్వఁడును లేఁడు. రాజా! అట్టి బుద్ధిమంతుఁడ వగునీవు ధర్మరాజు మనసునందుఁగలిగిన శోకమును బుద్ధిచేతఁ బోకార్పుము. ఉత్తమంబుగ బుద్ధివిస్తరించియున్న నినుబోఁటి పెద్దలుగదా మోహము నొందుచున్న జనులకు శాంతిగలిగింపఁ జాలువారు' అనెను. ఇది నలువదితొమ్మిదవయధ్యాయము.

---

## రాజధర్మపర్వము.

భీష్ముఁడు కృష్ణునిఁ బ్రశంసించుట. కృష్ణుఁడు ధర్మోపదేశము చేయుమని చెప్పుట.

కృష్ణుఁ డట్లుచెప్పినవచనము విని భీష్ముండు మొగము కొంచెము పయికెత్తి చేతులు జోడించికొని యతనితో 'కృష్ణా! లోకములు పుట్టుకకును నాశమునకును గారణమైనవాఁడా! హృషీకేశా! నీకు నమస్కారము. అపరాజితుండ వగునీవే లోకమునకుఁ గర్తవును సంహర్తవునుగా నున్నావు. పంచభూతములకును నవ్వల నున్ననీవు మోక్షపదమునం దున్నవాఁడవు. విశ్వమును నీకార్యము. విశ్వమునకు నీవాత్మవు. విశ్వమునకు నీవ పుట్టుచోటవు. ఇట్టి నీకు నమస్కారము. యోగీశ్వరా! నీకు నమస్కారము. సర్వమునకు ముఖ్యస్థానమైనవాఁడా! నమస్కారము. మూఁడులోకములందును మూఁడులోకముల కవ్వలను

నున్న నీకు నమస్కారము. పురుషసత్తమా ! నీవు నన్ను గుఱించి చెప్పిన మాటలచేత ముల్లోకములందును వెలుంగు నీదివ్య ప్రభావములును నేను గనుఁగొనుచున్నాను. సనాతనంబగు నీరూపముఁగూడ నాకుఁ దెలియుచున్నది. అమితమయిన తేజస్సు గలవాయువు సప్తమార్గములను నీచేత నిరుద్ధములై యున్నవి. నీశిరసుచేత దేవలోకమును బాదములచేత భూమియు వ్యాప్తములై యున్నవి. దిక్కులు నీచేతులుగను, సూర్యుఁడు కన్నుగను, శుక్రుఁడు వీర్యముగను నెలకొనియున్నారు. నల్లని పూవన్నెగలిగి పచ్చని బంగారువలువగలదై యువ్యయంబగునీది వ్యవిగ్రహమును జూచి మెఱపుతోఁగూడిన మబ్బును నూహించుచున్నారము. పుండరీకాక్షా ! సురోత్తమా ! భక్తితోడ నిన్ను శరణుఁజొచ్చి యిష్టంబగుగతినిబొందఁ గోరుచున్న నాకు నీవు శ్రేయము నాలోచింపవలయును' అనెను.

కృష్ణుఁడు 'పురుషసింహమా ! నాయందు నీకుత్తమమయిన భక్తియుండుటవలననే నాదివ్యరూపము నీకుఁ బ్రదర్శితమయ్యెను. రాజేంద్రా ! భక్తిలేనివానికిని, భక్తియుండియుఁ జక్కటిలేని వానికిని, భక్తియుఁ జక్కటియునుండియు దమములేనివానికిని, నేను దర్శన మొసంగుటలేదు. నీవే నాయందెప్పుడును భక్తిగల వాఁడవును, జక్కటిగలవాఁడవును. దమమునను,దపమునను, సత్యమునను, దానమునను నిరతుండవు; పరిశుద్ధుండవు. కావుననే నన్ను దర్శించుట కర్హుండవు. నీ తపముచేతఁ బునరావృత్తిలేని యుత్తమలోకములు నీరాక నెదురుచూచుచున్నవి. కురుప్రవరా ! నీజీవితకాలము నేఁడు మొదలుగా నిఁక *ముప్పదిదినములున్నవి.

---

*ఇట 'పఞ్చాశతం షట్చ కురు ప్రవీర, శేషం దినానాం తవజీవితస్య' అని

అవి నూటుదినములకు సాటియైనవి. అటమీఁద నీదేహమును విడిచి నీవు నీ సత్కర్మములఫలము నొంది వెలుంగఁ గలవు. సూర్యుఁ డుత్తరాయణమునఁ బోవుకాలము నెదురుచూచుచున్న నిన్ను జ్వలించుచున్న యగ్నికి సాటియైన యీదేవతలు వసువులనువారిదిగో నందఱును విమానముల నారోహించి మఱేఁగి యుండి నిన్నెదురుచూచుచున్నారు. పురుషప్రవీరా! జగత్తు కాలమునకు లోనయి భగవంతుఁడు సూర్యుఁ డుత్తరాయణమునకుఁ దిరిగినంతమాత్రనే నీవువిద్వాంసులు దేనినిబొంది మరలిరారో యట్టి యుత్తమలోకములను బొందఁగలవు. భీష్మా! నీ విహలోకమును విడిచిపోఁగానే లోకమునందు జ్ఞానములన్నియు

---

మూలము. 'ఇఁక నీజీవితకాలము ఏఁబదియాఱు దినములున్నవి' అని యర్థము. అయినను భీష్ముఁడు 'అష్టపఞ్చాశతం రాత్ర్యః శయాన స్యాద్య మే గతాః' అని తాను పరుండినది మొదలుకొని యేఁబదియెనిమిది దినములని చెప్పఁబోవుచున్నాఁడు. వానిలో నింతవఱకుఁ జెప్పిన దినములు ఇరువదియెనిమిది...ఎట్లన—భీష్ముండు శరతల్పమునఁ బడినపిదప యుద్ధము జరిగిన దినములు ఎనిమిది. పిదప దుర్యోధనుఁడు మృతినొందిన యాశౌచ దినములు పదునాఱు. ఇరువదియేనవనాఁడు శ్రాద్ధము. ఇఱువదియాఱవనాఁడు పట్టణప్రవేశము. ఇరువదియేడవనాఁడు పట్టాభిషేకము. ఇరువదియెనిమిదవనాఁడు ప్రజల నాశ్వాసించుట. ఇరువదితొమ్మిదవనాఁడు భీష్ముని కడకు వచ్చుట. అది మొదలుగా ముప్పదిదినములు శేషించియుండునవి. కాఁబట్టి 'పఞ్చాశతంషట్' అనుట 'పఞ్చ ఆశతం షట్' పఞ్చషట్ అయిదు ఆర్లు=ముప్పది దినములు. ఆ ముప్పది దినములను 'ఆశతమ్=శతావధి' నూఱు దినములచేతఁ జేయఁదగినంత ముప్పది దినములచేతను జేయుంగాఁడునని యర్థము గ్రహించునదని మఱియొక వ్యాఖ్యానము. ప్రతాపచంద్రు లేఁబదియాఱు దినములు మిగతయని యర్థముచేసియున్నారు.

మిక్కిలి కీడ్పడిపోవును. ఆకారణమునుబట్టియే యందఱును ధర్మవివేచనమునకై నీసమీపమునకు వచ్చియున్నారు. కాఁబట్టి, సత్యసంధుఁ డగుయుధిష్ఠిరుఁడు జ్ఞాతిశోకమువలనఁ దెలివిచెడియున్నవాఁడుగాన, ధర్మార్థయోగములతోఁ గూడిన యథార్థవచనంబులనతనిశోకము పోవునట్లుగా నుపదేశింపుము' అనెను. ఇది యేబదియవయధ్యాయము.

---

## రాజధర్మపర్వము.

(భీష్ముఁడు తనకు శస్త్రబాధచే ధర్మోపదేశమునకుఁ బటుత్వము లేదనఁగా కృష్ణుం డతనికి శరీరదార్ఢ్యాదు లొసంగుట. అంతట సాయంకాలము కాఁగా వారువారు తమతమ నెలవుల కరుగుట.)

అంతఁ గృష్ణుండు ధర్మార్థయుక్తముగాఁ జెప్పినయాహితవచనమువిని భీష్ముఁడు చేమోడ్చి యతనితో 'లోకనాథా! మహాబాహూ! అచ్యుతా! నారాయణా! శివా! నీ వాక్యమును విని సంతసంబునఁ జెప్పలఁ దేలితిని. వాక్పతీ! నీసన్నిధియందు నేనేమి చెప్పఁబోయెదను. వాక్కుచేతఁ జెప్పఁదగినదంతయు నీదువాక్కయిన వేదమం దడఁగి యున్నది. ఇహలోకమందును, బుద్ధిమంతులకుఁ బ్రియమయిన దేవలోకమందును జేయఁబడినదియుఁ జేయవలయునదియు నన్నియు బుద్ధిమంతుఁ డగునీవలన వెలువడుచున్నవి. నీ ముందఱ ధర్మార్థకామమోక్షముల స్వరూపములను జెప్పువాఁడు, దేవరాజయిన యింద్రునిముందఱ దేవలోకమును బట్టిచెప్పువానికి సాటియగును. మధుసూదనా! నామనసో బాణ

ముల దెబ్బలచే వ్యథ నొందియున్నది. నాయంగములు విరవిరఁ బోవుచున్నవి. నాబుద్ధియుఁ దెలివిడిగాకున్నది. ఏదేని కొంచెము మాటలాడుటకు నాకు మఱియుఁ బయిపయిఁ దోఁపకున్నది. గోవిందా! విషాగ్నులకు సమానము లయినబాణములచే పీడింపబడుచున్నవాఁడనుగాన నాకు సత్తువ యుడిగిపోవుచున్నట్లున్నది. ప్రాణములును వేగిర పడుచున్నవి. నామర్మములు పురపుర నెరియుచున్నవి. నామనస్సు తిరుగుడు పడుచున్నది. దౌర్బల్యమువలన పలుకు నాలుకకు రాకతడఁబడుచున్నది. ఇట్టిస్థితియం దున్ననే నెట్లు చెప్ప నుత్సహింతును? కృష్ణా! నాయెడ చక్కఁగ ననుగ్రహింపుము. మహాబాహూ! నన్ను క్షమింపుము. నేనేమియుఁ జెప్పఁజాలను. నీసన్నిధియందు బృహస్పతి యైనఁ బలుకఁదొడగెనా విరవిరఁబోవును. నాకు దిక్కులనియు నాకాశమనియు భూమియనియుఁ దెలియకున్నది. మధుసూదనా! వట్టినీబలము వలననే నిలిచియున్నాను. కాఁబట్టి సకలవేదములకును వేదమవై వెలుంగు నీవే ధర్మపుత్రునకు వలయుహితమును జెప్పవేఁడెదను. లోకములకుఁ గర్తయు శాశ్వతుండునయిన నీముంగల ననుబోఁటివాఁడొకఁడు గురువుముంగల శిష్యుండునుంబోలె నెట్లుమాటాడఁగలఁడు' అనెను.

అందులకుఁ గృష్ణుఁడు 'ఈ చెప్పఁబడినమాట కురుకులధురంధరుఁడును మహావీర్యుండును మహాసత్త్వుండును స్థిరచిత్తుఁడును సర్వార్థదర్శియునగు నీకు నెంతయుఁదగును. గాంగేయా! బాణములదెబ్బలచే పీడ గలిగియున్నట్లు నాకుఁ జెప్పితివే! అందులకు నేనిదిగో ననుగ్రహించి నీకు వర మొసంగెదను. ప్రతిగ్రహింపుము. నీదేహమునం గలసొలయికయు మూర్ఛయుఁ

దాపమును బీడయుఁగలుగవు. ఆఁకలిదప్పులును బొందవు. అన ఘా! నీజ్ఞానేంద్రియములన్నియుఁ బరిపూర్ణములయి వెలుంగును. నీబుద్ధికి నించు కయినకీడ్పాటు తోఁపదు. నీమనస్సు మబ్బుల నుండి విడివడిన చంద్రునివలె రజస్తమస్సులవలన వీడి యెప్పుడు సత్యమునందే నెలకొనియుండును. ధర్మమును గుఱించినది గాని యర్థమును సంబంధించినదిగాని యేదేది నీవుతలంచుకొందువో యాద్దానియందు నీదుబుద్ధిమిక్కిలి యెక్కుడుగాస్ఫురించును. రాజ సింహమా! జ్ఞానమనెడి దివ్యచక్షువుచేత నీలోకమునంగల నాలు గువిధములయిన ప్రాణిసమూహములను, తేటనీటియందుఁ జేఁపలం బోలెఁ, గలరూపునఁ జూడఁగలవు!' అనెను. అట్లుచెప్పినపుడు వ్యాసుఁడు మొదలయిన మహర్షులెల్లవారును ఋగ్యజుస్సామవేద వాక్యములశ్రీకృష్ణునర్చించిరి. పాండవులును, భీష్ముఁడును, శ్రీకృష్ణుఁ డు నున్నప్రదేశమున సమస్తఋతువులందును బూచుదివ్యము లగుపువ్వులవాన యాకాశతలమునుండి కురిసెను. వాద్యములన్ని యు మ్రోఁగెను. అప్సరసలు గుంపులుగూడి పాడిరి. అం దహిత మగునదియు ననిష్టమైనదియు నేదియుఁ జూపట్టినదిగాదు. శుభ వాయువు సమస్తమయినవాసనలు గుబులుకొని నిర్మలమై హా యిగా వీచెను. దిక్కులు తెలివినొందెను. మృగములును బక్షు లును నిమ్మళముగా నిటునటు*పరుగిడుచును నఱచుచు నుండెను. అంత నొకముహూర్తమునకు సహస్రకిరణుం డగుసూర్యుఁడు పడమటిదిక్కునందు † మహారణ్యము నొకకొనయందు నగ్ని

* ప్రాద్రవన్' అని (బొ.మూ.) 'ప్రావదన్' అని (దా. మూలము)

† దివాకరః దహన్వనమి వైకాన్తే ప్రతీచ్యాం ప్రత్యదృశ్యత' అని మూల ము. ఏకాంతప్రదేశమున నడవినిగాల్చువానివలెనని యర్థాంతరము. ఇదిసరసము.

వలెఁ జూపట్టెను. అంత మహర్షులందఱును లేచి శ్రీకృష్ణుని భీష్ముని ధర్మపుత్రునిని వీడుకొనవేఁడిరి. అంతఁ బాండవులును కృష్ణుండును సాత్యకియు సంజయుండును గృపుఁడును మహర్షులకు నమస్కరించిరి. ఇట్లు వారిచేతఁ జక్కఁగాఁ బూజితులై ధర్మనిరతులగు నా మహర్షులందఱును 'జే పిచ్చుటికి వచ్చెద'మని చెప్పి నిచ్చలువేగముగాఁ బోయిరి. అట్లె శ్రీకృష్ణుండును బాండవులును భీష్ముని వీడుకొని ప్రదక్షిణముచేసి సుందరములయిన యరదము లారోహించిరి. అంత బంగారుమయములయి చెలువగు కూబరములతోఁ గూడిన రథములును, పర్వతములవంటి మత్త గజములును, గరుడునిలీల వేగమునం బోవుతురగములును, చేత విలు మొదలగునాయుధములఁ దాల్చినపదాతులును, గూడిన సైన్యము ఋక్షవంత మనుపర్వతమునకు ముందును వెనుకను నర్మదానది ప్రవహించునట్లు రథములకు ముందును వెనుకను మితిమీఱిన వేగమునఁబొంగి పొరలిపోయినవి.అపుడు చంద్రుఁడా సైన్యమున కుబ్బుగలిగించుచును, సూర్యుఁడు రసములను బీల్చి కొన్న యోషధులకు మరలఁ దనగుణముచే వాని నెప్పటియట్లు రసవంతములనుగావించుచును,నుదయించెను.అంతఁ గృష్ణుండును బాండవులందఱును నమరావతికి సమం బగుపట్టణమునకుఁ బోయి బడలి, సింహములు గుహాలందుంబోలెఁ దమదమ భవనంబులం బ్రవేశించినవా రయిరి. ఇవి యేఁబదియొకండవయధ్యాయము.



## రాజధర్మపర్వము.

{ కృష్ణుఁడును ధర్మరాజు మొదలగు వారును గాల్య కరణీయములం దీర్చుకొని భీష్ముని కడకుఁ బోవుట. }

అంతఁ గృష్ణుఁడు గృహమునకుఁబోయి పరుండి నిదురగూర్కి తెల్లవాఱుటకు నొకజాముండఁగా మేలుకాంచెను. ఆమాధవుఁడు ధ్యాననిష్ఠయందుండి తెలియందగినవానినెల్లఁ దెలిసికొని పిదప సనాతనం బగుబ్రహ్మమును ధ్యానించెను. చక్కఁగా శిక్షితులై యింపయినకంఠములుగలిగి స్తుతులను బురాణములను దెలిసిన సూతులు ప్రజాపతియు విశ్వకర్తయు నగువాసుదేవుని స్తోత్రముచేసిరి. కొందఱుపాఠకులు చేతితాళములు వైచుచుఁ బాడిరి. కొందఱు శంఖము మృదంగము మొదలయిన వాద్యములు పెక్కువాయించిరి.వీణలువేణువులు పణవములుమొదలగు వాద్యములధ్వని యతిమనోరమమై * యాకృష్ణునిగృహము నవ్వుచున్నదోయన్నట్లు వెల్లివిరిసి వినఁబడెను. అంత రాజు యుధిష్ఠిరుని నగరునందును మధురము లయినవాక్కులు మంగళశబ్దములతోఁ గూడినవై పాటలయు వాద్యములయు ధ్వనులచేతఁ బెచ్చుపెరిఁగి వినఁబడెను. పిదపఁ గృష్ణుఁడు లేచి స్నానముచేసి యంజలిగీలించి రహస్యముగా మంత్రముల జపించి యంత నగ్ని దరికొలిపి యాజ్యములవేల్చెను. అతఁడు చతుర్వేదవిదులగు బ్రాహ్మణులకు వేయిగోవులను దానముచేసి,యొక్కొక్కరివలనను మంగళాశీర్వచనము లొందెను. పిదప గోవుమొదలయిన మంగళ

* సహాసఇవ వి స్తీర్ణః శుభ్రవే తస్యవేశ్మని' అని మూలము. కృష్ణునినవ్వినట్లున్న యాగృహమునందు వ్యాపించెనని యర్థాంతరము.

ద్రవ్యములను స్పృశించి విమల మయినయద్దమందుఁ దన్నుఁ జూచుకొని యంత సాత్యకినిజూచి 'శినిపుత్రా! పొమ్ము. రాజ భవనమునకుఁబోయి మహాతేజుం డయినధర్మరాజు భీష్మునిఁ జూచుటకు నాయితముగా నున్నాఁడాయని తెలిసికొనుము" అనెను. సాత్యకియు నమ్మాటవిని త్వరితముగాఁబోయి ధర్మరా జును దారసించి 'రాజా! కృష్ణునితే రాయితమై యున్నది. జనార్దనుఁడు భీష్మునియొద్దకుఁ బోవువాఁడై నిన్నెదురుచూచు చున్నాఁడు. మహాద్యుతీ! ఇటమీఁదఁ జేయవలసిన కార్యమును తాము జేయఁదగును' అనెను. అందులకు ధర్మరాజు 'అర్జునా! నా తేరాయితపఱుపుము. మనము సైనికులతోఁబోరాదు. మన మమాత్రమే పోవుదము సుమీ. ధార్మికాగ్రేసరుం డగుభీష్ము నకు గుంపులచేఁ బీడకలిగింపరాదు. కాన ముంగలఁబోవు కావ లివారుసైతము రాకనిలువవలయును. నేఁడుమొదలు భీష్ముఁడు మనకుఁ బరమరహస్యములను జెప్పఁగలఁడు. కాఁబట్టి పెఱజ నులు మనతోఁగూడవచ్చుట నాకిష్టముగాదు' అనెను. అదివిని పురుషసింహుఁ డర్జునుఁడు వెంటనే మేలయినరథ మాయత్త ముగానున్నదని యతనికిఁదెలిపెను. అంత రాజు యుధిష్ఠిరుఁడును నకులసహదేవులును భీమార్జునులును నేవురును నైదుభూతము లవలె నొక్కటిగాఁజేరి కృష్ణునిమందిరమునకుఁ బోయిరి. అమ్మ హాత్ములు పాండవులువచ్చుటయు ధీమంతుఁడు కృష్ణుఁడు సాత్యకి తోడ రథమునెక్కెను. ఆపురుషసింహములు రథములందుండి యొండొరులకు వందనములుగావించి 'రాత్రి హాయిగాజరిగెనా' యని యడిగి మేఘములవలె శబ్దించు నారథరాజములం దరిగిరి. దారుకుఁడు కృష్ణునియశ్వములను, వలాహకము, మేఘపుష్పము,

శైబ్యము, సుగ్రీవము ననువానిని దోలెను. అట్లు దోలఁగా నాశ్రీకృష్ణునిహయములు మిక్కిలివేగమును మహాబలమును గలవి గాన,గాలిజలములనలచే భూమినిర్గాముచు నాకాశమును మ్రింగు నవియుంబోలె వేగమునం బోయెను. అంతవారు సమస్తధర్మములకును క్షేత్రంబయిన కురుక్షేత్రమునకు వచ్చిదిగి దేవతలతోడంగూడిన బ్రహ్మదేవుఁడునుంబోలె మహర్షులతోడం గూడి శరతల్పంబున వెలుంగుచున్న భీష్ముఁడున్నయెడకుఁ బోయిరి. అచ్చటికిఁబోయి కృష్ణుండును సాత్యకియు ధర్మరాజును భీమసేనుండు నర్జునుండును నకులసహదేవులును రథమునుండి దిగి తమ కుడిచేతులనెత్తి యందుఁ గలఋషులను బూజించిరి. ఆధర్మరాజు వారలచేతఁ బరివృతుండై నక్షత్రములచేఁ బరివృతుండగు చంద్రుఁడునుంబోలె వెలుఁగుచు నింద్రుండు బ్రహ్మదేవునికడకు వచ్చునట్లు భీష్మునికడకు వచ్చెను.ఆకాశముననుండి క్రిందఁబడిన సూర్యుండునుంబోలె శరతల్పంబునఁ బరుండి యున్నమహాబాహుని నాభీష్ముని ధర్మరాజు భయంబున నడుంకుచుఁ గాంచిన వాఁడయ్యె. ఇది యేఁబదిరెండవయధ్యాయము.

---

## రాజధర్మపర్వము.

### కృష్ణుఁడు భీష్మునితో ధర్మములను జెప్పుమనుట.

జనమేజయుఁడు వైశంపాయనునితో 'మునీంద్రా ! సమస్త సైన్యములను హతములయినపిదప ధర్మాత్ముండగుమహావీర్యుండును, సత్యసంధుండును, జితాత్ముండును, మహాభాగుండును, శంతనుపుత్త్రుండు నగు పురుషసింహుఁడు భీష్ముఁడు వీరశయనం

బగు శరతల్పంబునఁ బరుండియుండ, నతనిఁ బాండవులు బలసి కొలుచుచుండఁగా నట్టివీరులు సమాగమమొందినపుడు కథ లేమేమి జరిగెను ? నాకుఁ జెప్పుమని యడిగెను. వైశంపాయనుఁడు 'రాజా ! కురుపితామహుం డాభీష్ముఁడు శరతల్పగతుండై యుండఁగా తపస్సిద్ధులగు నారదాదిఋషులును హతశేషులయినధర్మరాజు మొదలగు రాజులును, ధృతరాష్ట్రుఁడును గృష్ణుఁడును భీముండును, అర్జునుఁడును నకులసహదేవులును మొదలగువా రతనియొద్దకువచ్చి కూడిరి. అమ్మహాత్ములందఱును భూమియందుఁబడిన సూర్యుండునుంబోలె వెలుంగుచున్న భీష్మునిఁ జూచి కొంతశోకించినవారయిరి. అంత దివ్యదృష్టిగలనారదుఁ డొకముహూర్తము సేపాలోచించి యంతఁ బాండవులను హతశేషులయిన రాజులనందఱను జూచి 'రాజులారా ! కాలమునకుఁదగినది చెప్పెదను. ఈ భీష్ముని మీరు తెలియఁగోరునదెల్ల నడుగుదురుగాక. అందులకిదియె తగినకాలము. ఏలన భీష్ముఁడు సూర్యునివలె నస్తమింపఁబోవుచున్నాఁడు. ఇతఁడు తనప్రాణముల విడువఁ దలఁచుచున్నాఁడు. కాన మీరందఱు నితని నడుగుఁడు. నాలుగువర్ణముల వారికిని గలనానాధర్మములనన్నింటిని బూర్ణముగా నితఁడెఱుంగును. ఈ వృద్ధుఁడు దేహమును వీడి పరమంబులగు లోకములను బొందనున్నాఁడు గాన శీఘ్రముగా మనసునందుఁ బాదుకొనియున్న సందేహముల నితని నడుగుఁడు" అనెను. నారదుఁడిట్లు చెప్పినదివిని రాజులందఱును భీష్మునిపొంతకుఁబోయిరి; కాని యతని నడుగనేరక యొకరినొకరు చూచుకొనిరి. అంత ధర్మరాజు కృష్ణునిఁజూచి "దేవకీనందనా ! పితామహునిఁ బ్రశ్నించుటకు నీవుదక్క వేఱొకఁడు శక్తుఁడుగాఁడు. మధుసూదనా ! యదూ

తిలకా ! ఇందుఁగల మాయందఱిలోపల నీవేకదా యుత్తముం డవు; సర్వధర్మవిదుండవును. కాఁబట్టి నీవే మొదటఁ బితామహు నితో మాటాడుము' అనెను. అందులకుఁ గృష్ణుఁ డప్పుడడ్డులేక భీష్ముని యెదుటఁబోయి 'రాజసత్తమా ! రాత్రి నీకుహాయిగాఁ గడచెనా ? నీకు బుద్ధి తేటఁదనముగలిగి తోఁచుచున్నదా ? జ్ఞానములన్నియుఁ జక్కఁగాఁ దెలియుచున్నవా? హృదయము గీడ్పడకున్నదిగదా? మనసునఁ గలంత లేదేకదా?' యనియడిగెను. అందులకు భీష్ముఁడు 'వృష్ణికులతిలకా ! నీ యనుగ్రహమువలన నా దేహమునందలి మంటయు, బడలికయు, తబ్బిబ్బును, సత్తువ లేమియు, తెవులును, నొప్పును నన్నియు నప్పుడే తొలఁగిపోయినవి. మహాద్యుతీ ! జరిగినదియు జరుగనున్నదియు జరుగుచున్నదియు నన్నియును నఱచేతి యుసిరికవలె నాకుఁ గానవచ్చుచున్నవి. వేదోక్తములయిన యగ్నిహోత్రాదిధర్మములును, వేదాంతములందలి శమదమాది ధర్మములును, నీ విచ్చినవరమువలన, అచ్యుతా! యన్నింటిని కనుఁగొనుచున్నాను. శిష్టులు చెప్పిన ధర్మమును నాహృదయమునఁ దోఁచుచున్నది. జనార్దనా ! ఆయా దేశములకు జాతులకుఁ గులములకును దగిన యాయాధర్మములను దెలిసినవాఁడనైతిని. నాలుగాశ్రమములధర్మములును రాజధర్మములును నన్నిటిని జక్కఁగా నెఱుఁగుచున్నాను. ఏదేది యెప్పుడెప్పుడు చెప్పవలయునో నేను జెప్పఁగలను. నీప్రసాదమువలన నామనస్సునందు మంచి తెలివి దొలఁకాడుచున్నది. నీమూర్తిని ధ్యానించినందున నేను బాటవము హెచ్చి వయసుకానివలె నయితిని. జనార్దనా ! నీప్రసాదమువలన లోకమునకు మేలెద్దియో చెప్పుటకు సమర్థుఁడనగుచున్నాను. నీయంతట నీవే పాండవునకు

మేలెద్దియో యేల చెప్పరాదు? మాధవా! ఈవిషయమైనయుద్దేశ మేమో వేగచెప్పుమా' అనెను.

అందులకుఁ గృష్ణుఁడు 'కురుసత్తమా! కీర్తికిని శ్రేయస్సునకును నేను మూలమని యెఱుంగుము. అన్నివస్తువులును మంచివిగాని చెడ్డవిగాని నావలననుండియే కలుగుచున్నవి. చంద్రుఁడు చల్లనికిరణములు గలవాఁ డనఁగా నాశ్చర్యపడుమనుష్యుఁడు లోకమునం దెవఁడేని గలఁడా? అట్లె నాకు యశస్సునిండియున్న దనఁగా నెవఁడాశ్చర్యపడును? కాఁబట్టి మిక్కిలియుఁ ద్యుతిచే రాజిల్లుచున్న నీకు మఱియు నెక్కుడు యశస్సు గలిగింపవలయునని తలఁచి విపులమయినబుద్ధి నీకొడఁగూర్చితిని. ఈభూమి స్థిరముగా నెలకొని యుండునంతదాఁక నీదుకీర్తి కొఱవడక లోకములందుఁ బర్వి యెందును సంచరింపఁగలదు. పాండవులప్రశ్నములకు నీవు చెప్పునుత్తరమంతయు వేదవచనముంబోలె భూతలమున నెలకొనియుండుఁగాక. నీవచనమును బ్రమాణముగాఁగొని తనమనసుచేతఁ దన్నెఱుంగుమనుష్యుఁడు, శరీరముపోయినపిదప సమస్త పుణ్యములఫలము ననుభవించును. భీష్మా! నీకీర్తి మఱియు నెట్లు వెచ్చు పెరుఁగునని యందులకై నీకు దివ్యమతి నొసంగితిని. భూతలమున మనుష్యుని * యశస్సు వెలయునంతదాఁక వానికీర్తి యక్షయమై యుండును. ఇదినిజము. యుద్ధమునందుఁ జావఁగా మిగిలినరాజులందఱును బెక్కుధర్మములు వినఁగోరి నిన్నుబలసి నలుప్రక్కలఁ గూర్చుండియున్నవారు. వారలకు నీ వుపదేశము సేయుము. నీవు వయసునందుఁ బెద్దవు, చదు

---

* యశస్సు పరచిత్తచమత్కారజనకమగు గుణసమూహము. కీర్తి పరులు సాధువుగాఁ జెప్పికొనుట యని రెంటికి భేదము తెలియనది.

వరివి, ఆచారవంతుఁడవు, రాజధర్మములందును దక్షుఁ గల ధర్మములందును గుశలుండవు. నీవు పుట్టినదాదిగాఁ బాపమును నది కొంచెమయినను నీయందుఁ గలుగఁజూచినది లేదు. రాజులందఱును నిన్ను సమస్తధర్మములును దెలిసినవాఁడని తెలియుదురు. రాజా ! తండ్రి కొడుకుల కుపదేశించునట్లు నీవు వారలకుఁ బరమం బయిననీతి నుపదేశింపుము. నీవు మహర్షులను దేవతలను నెల్లప్పుడు నుపాసించినవాఁడవు. కాన, వీరలకు నీధర్మములను నశేషముగాఁ దప్పక చెప్పవలయును. ధర్మమును వినవలయునని కోరి యడిగినవారికి నట్లడుగఁబడినవాఁడు తెలిసినవాఁడై యుండెనేని వారికిఁ దప్పక చెప్పవలయుటయే ధర్మమని బుద్ధిమంతులు చెప్పెదరు. ప్రభూ ! అట్లు బదులు చెప్పనియెడలఁ గడిఁదిదోషము కలుగునుజుమీ. కాఁబట్టి ! తెలిసినవాఁడవుగాన నీవలనఁ దెలిసికొనఁగోరి నీదుపుత్రులును బౌత్రులును నడుగుసనాతన ధర్మములను వారలకు నుపదేశింపుము " అనెను. ఇది యేఁబది మూఁడవయధ్యాయము.



## రాజధర్మపర్వము.

కృష్ణుఁడు భీష్మునితో ధర్మరాజాజంకుని చెప్పఁగా
భీష్ముఁడు ధర్మరాజునకు సమాధానము చెప్పి
ధర్మము నడుగ ననుమతియిచ్చుట.

అంత మహాతేజుఁడు భీష్ముఁడు 'గోవిందా ! నీవు సమస్త భూతములందు నుండునంతరాత్మవు. నీ ప్రసాదమువలన నాదు వాక్కును మనసును దృఢములుగా నున్నవి. ఇఁక ధర్మములను జెప్పెదను. ధర్మాత్ముఁడు యుధిష్ఠిరుఁడు నావలన ధర్మములు

వినునేని; మిక్కిలియు సంతోషంబున వానినెల్లఁ జెప్పెదను. ఏమహాత్ముఁడు, ఏధర్మాత్ముఁడు; రాజుగా నుండుటను దెలిసి మహా ఋషులందఱును మిక్కిలి వార్షించుచున్నారో, యాధర్మపుత్త్రుఁడు నన్నడుగుఁగాక. ధర్మము లాచరించి యశంబులు వెలుంగుచున్న కురువు లెల్ల వారి లోపలను నెవనికి సమానుఁ డొక్కండును గెలుగఁడో యాయుధిష్ఠిరుఁడు నన్నుఁ బ్రశ్నించుఁగాక. ధైర్యమును, దమమును, బ్రహ్మచర్యమును, క్షమయును, ధర్మమును, ఓజమును, దేజమును,ననెడి యీగుణంబు లెప్పుడు నెవ్వనియందు నెలకొనియుండునో యాయుధిష్ఠిరుఁడు నన్నడుగుఁగాక. సంబంధులను, అతిథులను, ఆశ్రితులను, భృత్యులను, నెవ్వఁడు మిక్కిలియు సత్కరించి బహూకరించునో యాయుధిష్ఠిరుఁడు నన్నడుగుఁగాక. సత్యము, దానము, తపము, శౌర్యము, శాంతి, సామర్థ్యము, తొట్రుపడమి యను నివియెల్లను నెవనియందుఁగలవో యాపాండవుఁడు నన్నడుగుఁగాక. ఎవ్వఁడు కామమువలనఁగాని తొందరపడికాని, భయమువలనఁగాని, ధనమునుబట్టికాని, యధర్మమునుజేయఁడో యట్టి ధర్మాత్ముఁడు యుధిష్ఠిరుఁడు నన్నడుగుఁగాక. నిత్యము సత్యమును, నిత్యము క్షమయు, నిత్యము జ్ఞానమునుగలవాఁడును, అతిథులకుఁ బ్రియుఁడును, సజ్జనులకు నిత్యమును దానము సేయువాఁడును, నగునాయుధిష్ఠిరుఁడు నన్నడుగుఁగాక. ఎప్పుడును యజ్ఞములును నధ్యయనమును జేయుచుండువాఁడును, సదా ధర్మనిరతుఁడును, క్షమావంతుఁడును, రహస్యము లెల్ల విన్నవాఁడును నగు నాయుధిష్ఠిరుఁడు నన్నడుగుఁగాక' యనెను. అందులకుఁ గృష్ణుఁడు 'రాజా! ధర్మరాజు మిక్కుటమైన లజ్జచేతను శాపముగలుగునో యనుభయమువలనను జం

కుచు నీదగ్గఱకు రానేరకున్నాఁడు. తాను లోకనాథుం డయి యుండి లోకములను నాశము చేసినందునను, పూజ్యులగు పెద్దలనును, మాన్యులగు సంబంధులను, బంధువులను, రక్షింపఁదగిన భక్తులను, బూజ్యులయిన యాచార్యులను, బాణములచే భేదించినందునను, దనకు శాపము గలుగునోయని భయపడి నిన్నుఁ గదియరాకున్నాఁడు' అనెను. అందులకు భీష్ముఁడు 'కృష్ణా! దానమును, అధ్యయనమును, తపస్సును, బ్రాహ్మణులకు ధర్మమగునట్లు క్షత్రియులకు యుద్ధమందు దేహమువిడుచుట ధర్మమగును. తండ్రియుఁ, దాతయుఁ, దోఁబుట్టువులును, ఆచార్యుఁడును, సంబంధులును, బంధువులును బొల్లయిన ప్రవర్తనముతో యుద్ధముచేయ వత్తురేని వారలను జంపుట ధర్మమే. కేశవా! కాఁబట్టి నెఱితప్పి యుద్ధమునకువచ్చు లుబ్ధులగుపాపులు గురువు లయినను వారలను జంపు క్షత్రియుఁడు ధర్మము తెలిసినవాఁడే కాని వేఱుగాఁడు. పేరాసగొని ప్రాచీనము లగుధర్మముల మేరను బాటింపక వర్తించు మనుష్యుని యుద్ధంబునఁ జంపు రాజు ధర్మమును దెలిసినవాఁ డగును. యుద్ధములందు, రక్తము లనునీళ్లును, వెంద్రుక లనుతృణములును, గజము లనుకొండలును, ధ్వజము లనువృక్షములును గలదిగా భూమిని గావించు క్షత్రియుఁడే ధర్మము తెలిసినవాఁడు. యుద్ధమునకుఁ బిలువఁబడిన క్షత్రియుఁడు తప్పక యుద్ధము చేయవలయును. క్షత్రియున కిట్టియుద్ధము ధర్మమనియు నిహపరములు రెంటియందును మంచిగతికిఁ గారణమనియు మనువు చెప్పెను' అనెను.

భీష్ముఁ డిట్లు చెప్పఁగా యుధిష్ఠిరుఁడు మిక్కిలి వినయముతో నతని కన్నుల కెదుటఁ జని యతని యడుగులను బట్టుకొని వంద

నముచేసెను. విలుకాండ్రందఱిలోపలను మేటి యగునాభీష్ముఁడు, సంతోషంబున ధర్మరాజు శిరసు మూర్కొని గారామునఁ గూర్చుండుమనిచెప్పి "కురుసత్తమా! నాయనా ! భయపడకుము. మిక్కిలి చనవున నన్ను వలసినదడుగుము" అనెను. ఇది యేఁబదినాలుగవయధ్యాయము.



## రాజధర్మపర్వము.

### భీష్ముఁడు ధర్మరాజునకు రాజధర్మమును జెప్పుట.

ధర్మపుత్త్రుఁడు కృష్ణునకును పితామహుండగుభీష్మునకును ప్రణామముచేసి, యందుఁ గల పెద్దలయందఱ యనుమతివడసి, ప్రశ్నము సేయువాఁడై 'రాజా ! ధర్మవిదు లయినవారు రాజుల ధర్మమే పరమమైనదని చెప్పెదరు. ఇది పెద్దయు భారముగా నాకుఁ దోఁచుచున్నది. కాఁబట్టి పితామహా ! క్షత్త్రియధర్మములు సవిస్తరముగా నాకుపదేశింపుము. రాజధర్మము జగమునందుఁ గలప్రాణిసమూహమునకెల్ల ముఖ్యాధారమయినది. ధర్మము, అర్థము, కామము ననుమూఁడుపురుషార్థములును రాజధర్మములందుఁ దగులుకొనియున్నవి. మోక్షధర్మమును మిక్కిలి స్పష్టముగా నిండడంగియున్నది. వాగెలు గుఱ్ఱమును, అంకుశము గజమును నడంచునట్లు, రాజధర్మము లోకము నడంచునని చెప్పంబడుచున్నది. రాజర్షులు పరంపరఁగా జరుపుచు వచ్చుచున్న యీ రాజధర్మము తబ్బిబ్బు నొందునేని, లోకమంతయుఁ గుదురు తప్పిపోవును; సర్వమును వ్యాకులపడును. సూర్యుండుదయించి

యశుభం బగుచీఁకటిని దొలఁగించునట్లు; రాజధర్మము లోకమున కశుభం బగుపోకడను బోకార్చును. కాఁబట్టి, భరతసత్తమా ! నీవు ధర్మపాలకులందు మేలుబంతివి గావున నాకొఱకయి మొదట రాజధర్మములను జెప్పుము. పరంతపా ! మాకందఱకును రహస్యశాస్త్రములు నీవలన నేర్పడుఁగాక. ఏలనఁ గృష్ణుఁడు నిన్నే బుద్ధియందు మిన్నగా నభిమానించు చున్నాఁడుగదే' అనెను.

భీష్ముని యుపదేశము ప్రారంభము.

భీష్ముఁడు 'మహనీయం బైనధర్మమునకు నమస్కారము. వేధయగు కృష్ణునకు నమస్కారము. బ్రాహ్మణులకును నమస్కరించి శాశ్వతము లయినధర్మములను జెప్పెదను. యుధిష్ఠిరా ! రాజధర్మములను, మఱియు నీవు గోరునట్టి యితరధర్మములను, వివరించుచున్నాను; నియమంబున వినుము. కురుతిలకా ! ప్రజలను రంజింపఁగోరు రాజు మొట్టమొదట విధిచొప్పున దేవతలను బ్రాహ్మణులను నారాధింపవలయును. దేవతలను బ్రాహ్మణులను నర్చింపఁగా రాజు ధర్మమును జేయకుండుటవలని దోషము నుండి విడివడుచున్నాఁడు; లోకముచేతను బూజింపఁబడు చున్నాఁడు. పుత్రా ! ధర్మరాజా ! ఎప్పుడును బౌరుషముగలిగి పాటుపడుచుండుము. రాజులకుఁ బౌరుషములేక దైవమే కార్యమును సాధింపనేరదు. పౌరుషమును దైవమును రెండును బండికిఁ గన్నులుంబోలె సమస్తకార్యములకు సాధారణమయిన సాధనము లగును. ఈ రెంటియందుఁ బౌరుషము మేలయినదని నేను దలఁచుచున్నాను. తనపౌరుషముచేఁ జేసిన కార్యము తుదను, అది ఫలించినను ఫలింపకపోయినను దైవమునే దృఢముగాఁ



251. ధర్మపుత్రాదులు శరతల్పగతుఁడైన భీష్మునికడకువచ్చి ధర్మోపదేశమును బడయుట.

దలఁచి దుఃఖము నుండికాని సుఖమునుండికాని మనుష్యుఁడు * విడివడుచున్నాఁడు, నీవు చెల్లించు పౌరుషము నిష్ఫలమయి నను దానికై సంతాపపడవలదు. దానియందె యెప్పుడును బూనికగలిగి యుండవలయును. ఇట్టి విడువని పూనికయె రాజులకుఁ బరమమయిన నీతి. సత్యమువలె రాజులకు సిద్ధిగలిగించు నది మఱొకటిలేదు. సత్యమందు నిరతుఁడయినరాజిహము నందును బరమునందును సుఖంబుండును. రాజేంద్రా! ఋషు లకు సయితము సత్యమే పరమమయిన ధనము. అట్లె రాజుల యందు విశ్వాసము గలిగించునది వారి సత్యమునకంటె మఱొ క్కటిగలుగదు. గుణవంతుఁడును, శీలవంతుఁడును, అడఁకువయు, నింద్రియనిగ్రహమును గలవాఁడును, † మెత్తఁదనము గల వాఁడును, ధర్మాత్ముఁడును, జూచుట కింపయినవాఁడును, మిక్కిలి దాతయు నగురాజెప్పుడును రాజ్యలక్ష్మిని విడిచి తొలఁగఁడు. కురునందనా! నీతిని జక్కఁగా విచారించి (స్వరంధ్రములనుగప్పి కొనుట, పరరంధ్రములను దానరయుట, నిజ మంత్రాలోచమున ననెడియీ) మూఁటిని గప్పిపుచ్చికొని యివి తప్పఁదక్కినసర్వకా ర్యములందుఁ జక్కటి నూఁదియుండుము. చక్కటి గలిగియున్న

* 'పౌరుషంహి పరంమన్యే దైవం నిశ్చిత్య ముహ్యతే' అని మూలము. ఆ రెంటిలో పౌరుషమే యెక్కుడని తలఁచుచున్నాను. ఏలనఁగా దైవము పౌరుషముచేత నయిన ఫలములవలన నిశ్చయింపఁ బడుచున్నది. కాని తనం తట దెలియునదిగాదు' అని యర్థాంతరము 'ముచ్యతే' అనుపాఠము గ్రహింపఁ బడెను.

† మృదుర్ధర్మ్యః అని (క. మూ) 'మృదుదండః' అని (ద. మూ) మృదు వయిన దండము గలవాఁడని యర్థము.

ఋషులు పెక్కండ్రు దేవలోకమునందు మోదంబునఁ దేలుచు న్నారు. రాజు మెత్తనై యుండునేని యందఱు నతని నుల్లంఘిం తురు; మిక్కిలి వేండ్రమైయుండునేని లోకు లతనికిఁ గలఁగుచుం దురు. కాఁబట్టి సమయముచొప్పున నతఁడు రెండువిధములనుం డవలయును. పుత్రా! నీకు బ్రాహ్మణు లెప్పుడును దండింపఁదగిన వారు గారు. ఏలనఁగా లోకమున బ్రాహ్మణులు ప్రాణులం దు త్కృష్టులయినవారు. మహాత్ముం డయినమను వీవిషయమై రెం డుశ్లోకములను బాడియున్నాఁడు. నీ వారెంటిని స్వధర్మము లను ష్ఠించునపుడు మనస్సునం దుంచుకొని యుండవలయును.అవియే వనఁగా-జలములనుండి యగ్నియు, బ్రాహ్మణునుండి క్షత్రియుఁడు ను,ఱాతినుండి యినుమును బొడమినవి.వాని తేజములు (శక్తులు) అన్నిటఁ జెల్లుచుండునుగానిఁ దమజన్మస్థానములందు నడఁగిపో వును. ఇనుము ఱాతినిగొట్టునపుడును,అగ్ని జలములను గాఁచు నపుడును, క్షత్రియుఁడు బ్రాహ్మణుని ద్వేషించునపుడును, నా మూఁడును గీడ్పడును - అనుటయే. మహారాజా! కాఁబట్టి యిట్లుండుట తెలిసి నీవు బ్రాహ్మణుల కెప్పుడును మ్రొక్కుచుండ వలయును. ఏలన శమసంపన్నులగు నాబ్రాహ్మణోత్తములు, వేదములను యజ్ఞములను దాల్చుచుందురు. సామాన్యముగా విధి యిట్లున్నను, లోకయాత్రకు విఘాతుకు లగుబ్రాహ్మణులను, రాజు తన చేతులబలువుచేతనే యడంపవలయును. తొల్లి మహ ర్షి శుక్రుఁడు రెండుశ్లోకములను బాడెను. దానిని మనసునం దె చ్చరికగలిగి,వినుము. అవి యేవనఁగా-యుద్ధమం దాయుధమెత్తి కొని తన్నెదిరింప వచ్చుబ్రాహ్మణుఁడు వేదాంతవిదుఁ డయినను ధర్మము నపేక్షించు రాజు తనధర్మముచొప్పున నాయుధముచేత

నాతని నడంచి పుచ్చవలయును. ఏలనఁగా ధర్మవిదుం డగురాజు ధర్మము నశించుచుండఁగా దానిని రక్షింపఁబూనునేని దానిచే నతఁడు ధర్మమునకు హానిచేసినవాఁడుగాఁడు. ఏలనఁగా నల్లేది రించినవాని కోపమే యడంచువానికోపమును గలిగించినది. కాన, రాజుకోపము న్యాయ్యమగును - అనుటయే. రాజోత్తమా ! ఈవిధులఁజొప్పున బ్రాహ్మణులను రక్షించియే తీఱవలయును. వా రపరాధములు చేసిరేని వారిని నీదేశము నవ్వలికి వెడల నంపవలయును. వారు దండమునకుఁ దగియుండినను నీవు వారిని బీడింపరాదు. బ్రహ్మహత్య, భ్రూణహత్య, గురుతల్పగమనము, రాజును ద్వేషించుట యనెడియీదోషములు గలబ్రాహ్మణుని, దేశము వెలికి వెడలఁగొట్టవలయును. కాని, వారికి శరీరదండనము విధించుట యెప్పుడును నీతిగాదు. బ్రాహ్మణులందు భక్తిగలవారియెడను నీవు మక్కువగలిగి యుండుము. *రాజులకు నిట్టిపురుషులను జేర్చుకొనుటకంటె మించిన బొక్కసము మఱొక్కటిలేదు. మహారాజా ! శాస్త్రములందుఁ జెప్పఁబడిన భూమి, జలము, మరుభూమి, వనము, పర్వతను, మనుష్యులు, ననెడి యాఱుదుర్గములందును, ఇవి యేల, సమస్తదుర్గములందును, మనుష్యదుర్గమే పగవారికి నెంతమాత్రము భేదింప నలవిగానిది. కాఁబట్టి వివేకజ్ఞానము గలరాజు నాలుగువర్ణములవారియందును నెప్పుడును దయఁజూపవలయును. ధర్మాత్ముఁడును, సత్యసంధుండు నగు

---

* 'న కోశో పరమోఽన్యోఽస్తి రాజ్ఞాం పురుషసంచయాత్' అని మూలము. 'నశోకః పరమా తుష్టీ రాజ్ఞాం భవతిసంచయాత్' అని (దా.మూ) జనులను జేర్చుకొనుటవలన రాజులకు శోకములేక మిక్కిలి సంతోషము కలుగునని యర్థము.

రాజు ప్రజలను రంజించును. పురుషసత్తమా! అయినను నీ వె ప్పుడును వారియెడ క్షమగలిగి యుండరాదు. ఏలన రాజు మెత్త నివాఁడై యుండునేని, మెత్తంబడిన యేనుంగువలె* నధముఁడే యగును. ఈవిషయమై బృహస్పతిరచితమైన శాస్త్రమునందీయొ కక్క శ్లోకము చెప్పఁబడియున్నది. అది చెప్పెదవినుము. "రాజెప్పు డును క్షమగలిగియుండునేని నీచుఁడయినమనుజుఁడు సయిత మతనిని, మావంతు డేనుఁగుతలపయినే యెక్కినట్లు, కీడ్ప ఱుచుచున్నాఁడు" అనుటయె. కాఁబట్టి శ్రీమంతుఁడగురాజెప్పు డును మృదువుగాను నెప్పుడును వేండ్రముగాను నుండక మిక్కిలి చల్లఁగను మిక్కిలి వేఁడిగను లేకుండు వసంతకాలపు సూర్యుని వలె నుండవలయును. మహారాజా! రాజు తన వారిని బరులను వారుచేయు కార్యములను బ్రత్యక్షముగాఁ జూచుటచేతను, ముఖ వికారాదులయిన యనుమానములచేతను, దక్కినయెడల వారి చేతల నుపమానముగాఁ గొనుటచేతను, బురుషులలక్షణములను జెప్పు సాముద్రికాదిశాస్త్రములచేతను, నెప్పుడును బరీక్షింపవల యును. † సమస్తములయిన వ్యసనములను నీవు దిగవిడువవల

---

* 'అధమోహి మృదూరాజా' అని మూలము. 'అధర్మోహి మృదూరాజా' అని(దా.మూ) రాజు మృదువుగా నుండునేని ధర్మవిరోధి యగునని యర్థము.

† వ్యసనములు పదునెనిమిది—వానియందు వేఁట, జూదము, పగలు నిదు రించుట, పరులనిందించుట, స్త్రీలోలత్వము, మదము, వ్యర్థప్రయత్నము, ఆట, వాద్యము, అన్నిడి యీపదియును గామమువలనే గలుగునవి. తెలియనితప్పును వెలిపుచ్చుట, తప్పులేనివానిని దండించుట, కపటమునుగా బాధించుట, పరులయం దసూయచే చాపోపమి, పరులగుణములను దోషములుగా చెప్పుట, పరులధనము నప హరించుట, పరుసంపుమాటలు, క్రూరమయిన దండనము అన్నిడి యీ యెని

యున్న, * వాని నీ వెంతమాత్ర ముపయోగింపరాదని కాదు; వానియందు మిక్కిలి తగులుమాత్రము గూడదు. † వ్యసనముగలవాఁడు లోకమునఁ గీడ్పాటునొందుచున్నాఁడు. మిక్కిలి ద్వేషించునట్టి రాజు ప్రజలమనస్సు గలంచుచుండును. రా జెప్పుడును ‡ గర్భిణీధర్మమునం దుండవలయును. ఇట్లు చెప్పుటకుఁ గారణమును వినుము. గర్భిణి తనమనసునకును నాలుకకును నింపయినవస్తువును భుజియింపక యాగర్భమునకు హిత వయినదానిని గయికొనునట్లు, ధర్మము ననువర్తించు రాజు తనకుమాత్ర మింపయినదానిని విడిచి ప్రజలకేది హితమో దానియందే యెప్పుడును దప్పక వర్తింపవలయును. పాండవా! నీ వెప్పుడుగాని ధైర్యమును విడువరాదు. ఏలనఁగా రాజు ధైర్య

మిది క్రోధముచేఁ గలుగునవి. మొదటితెగయందలి పాపము, జూదము, స్త్రీలోలత్వము, అను నాలుగును, రెండవతెగయందలి పరులసొమ్ము నపహరించుట, పరుసనిమాట, క్రూరదండనము అనెడి యీమూడును మిక్కిలి కష్టము లయినవి.

* ఇందులకు 'నచైవ న ప్రయుంజీత సంగంతు పరివర్జయ' అని మూలము. 'న చైతాని ప్రయుంజీథాః సంగంతు పరివర్జయ' అని (దా. మూ) దానిని ప్రయోగింపవలదు. వానియందు సంగము దిగవిడువుమని యర్థము. ఇది యంత సరసము గాదు.

† 'వ్యసనీ యస్తులోకేఽస్మిన్పరిభూతో భవత్యుత' అని మూలము. 'లోకస్య వ్యసనీ నిత్యం పరిభూతో భవత్యుత' అని (దా. మూ) వ్యసనముగల వానికి లోకులందఱవలనను నెపుడుఁ గీడ్పాడు నొందుచుండునని యర్థము.

‡ అనఁగా తల్లి కడుపునందలి బిడ్డయందుంబోలె, రాజు ప్రజలయందు వర్తింపవలయును.

ముగలిగి దండమును స్పష్టముగాఁ గావించుచుండునేని * యతని యాజ్ఞకు నడ్డులేక చెల్లుచుండును. పనివాండ్రతో మితిమీఱి పరిహాసమాడరాదు. అందుఁగలదోషమును జెప్పెదనువినుము. ఒడయుఁడు తన్నుఁగొలిచి బ్రతుకువారితో మిక్కిలికలయికగా నుండెనేని వా రతని నంతగా † సరకుసేయరు; మఱి తమతమకు నియతములయిన పదములయందు నిలువరు. ఒడయనిమాటను మీఱి నడుతురు. ఒకపనికిఁ బుచ్చినయెడల వారుపోవఁ గొంకుట యేకాక; పోయినను నధిపతి రహస్యములను వెలిపుత్తురు. (అడుగరాని రహస్యమునైన నడుగుదురు.)యాచింపరాని దానినయిన యాచింతురు. ఒడయుఁడు భుజింపఁదగినవస్తువులను భుజింతురు. రాజు తమపయిఁ బ్రభుత్వమునెఱపెనేని కోపించి మండిపడుదురు. అతనికంటె మించి వెలుంగఁజూతురు. లంచములు దీసియు, మోసపుచ్చియు నతనికార్యములు చెఱుపుదురు. రాజునుత్తరువులంబోని కల్ల పత్రికలను గల్పించి రాజ్యము నిస్సారమును జేయుదురు. అంతపురపునాఁడు కావలివారితో తగులు గలిగియుందురు. రాజువలెనే వేషములు వేసికొందురు. రాజు సన్నిధియందే లజ్జవిడిచి యోకిలించుట, యావులించుట, యుమియుటయుఁ జేయుదురు; అతనిని గుఱించిన మాటలను నితరులు తోడఁ గొంకులేక ముచ్చటింతురు. రాజు మెత్తనై యుండెనే

---

* 'ధీరస్య స్పష్టదండస్య నహ్యాజ్ఞా ప్రతిహన్యతే' అని (దా. మూ.) 'నభయం విద్యతేక్వచిత్' అని (ఔ. మూలము) ఎచ్చటను భయముగలుగదని యర్థము.

† 'అవమన్యంతి భర్తారం సంహర్షా దుపజీవినః' అని మూలము 'సహర్షముపజీవినః' అని (దా. మూ) పరియాచకమాడు నొడయని పాటింపరని యర్థాంతరము.

నియు బరియాచక మాడువాఁడేనియు నతనిభృత్యు లతనినెంత మాత్రము గణింపక యతఁడెక్కుఁదగినగుఱ్ఱమునుగాని, యేనుఁగునుగాని, రథమునుగాని యుబ్బున నారోహింతురు. అతని నిసుహృదులు కొలువునందే, 'రాజా! ఇది నీకుఁ జేయనలవిగాదుపో, ఇట్లుచేయుట చెడ్డపని' యని యిట్టిమాటలు పలుకుదురు. అందులకు రాజు కోపించునేని వారు నవ్వనే నవ్వుదురు. రాజు వారిని మరియాదలఁ బూజించినను వారు*సంతోషమునొందరు. ఒకరినొకరు మించఁగోరి యొండొరుల రారాపుచేయుచుందురు. మంత్రాలోచనమును భేదింతురు. రాజ్యమందలి చెడుగులను బయలుపుత్తురు. రాజు నుత్తరువులను నంతగా సరకుసేయక యవజ్ఞతో వేడుకగాఁ జేయుదురు; కాని వెఱపుచేతఁగాదు. †రాజునలంకారములు, భోజనవస్తువులును, స్నానద్రవ్యములును, చందనాద్యనులేపనములు రాజు వయినవని యెన్నక యతని నెగతాళి సేయుచునే జంకుమాలి తా మనుభవింతురు. మఱి తమ కిచ్చినయధికారము లేపాటివని నిందించుచు వానిని దిగవిడుతురు.

---

* 'సంఘర్ష శీలాశ్చత దాథవ స్త్యన్యోఽన్యకారణాత్' అని మూలము. 'సంహర్ష శీలాశ్చ' అని (ఔ. మూ) ఇతరకారణములనుబట్టి వారు సంతోషపడుదురు.

† 'అలంకారాణిభోజ్యాని తథాస్నానానులేపనే । హేలయావా నరవ్యాఘ్ర స్వస్థా స్తస్యోపభుఞ్జతే' అని మూలము. దీనికి 'అలంకారేచ భోజ్యేచ తథాస్నానానులేపనే। హ్రీయమాణే నరవ్యాఘ్ర స్వస్థా స్తస్యోపశృణ్వతః' అని (ఔ. మూలము) రాజున కలంకారములు భోజనద్రవ్యములు మొదలయినవి తేఁబడకున్నను నతని యెదుటనే నెమ్మదిగ నూరకుందురుగాని తెచ్చియియ్యరు అని యర్థాంతరము.

న్యాయముగా తమ కయినవస్తువులతో నెంతమాత్రము తనివి నొందక రాజున కయినవస్తువులను బలిమిని గయికొందురు. మఱి పక్షిని ద్రాడుగట్టి యాడించునట్లు రాజుతో వేడుకలాడ నిచ్చ గింతురు. లోకులకు 'రాజు మేముచెప్పునట్లు నడచువాఁడు' అని చెప్పి కొనుచుందురు. యుధిష్ఠిరా! రాజు మెత్తనివాఁడై పరి యాచకము లాడుచుండు నేని యీ చెప్పిన దోషములును నింకను వేఱయినవియు నుప్పతిల్లుచుండును' అనెను. ఇది యేఁబదియైదవ యధ్యాయము.

---

## రాజధర్మపర్వము.

### భీష్ముఁడు ధర్మరాజునకు రాజధర్మములను జెప్పుట.

భీష్ముఁడు 'ధర్మరాజా! రా జెప్పుడును బూనికగలిగి యుండ వలయును. ఆఁడుదానివలెఁ బూనిక లేకుండురాజును బ్రజలు గొనియాడరు. ఈవిషయమై మహాత్ముఁడు శుక్రుఁ డొకశ్లోకము చెప్పియున్నాఁడు. దానిని నీకుఁ జెప్పెద నాలించి వినుము. అది యేమనఁగా—'యుద్ధమునకు నొల్లనిరాజును, అధ్యయనమునకై బయటఁబోని (లేక యాలుబిడ్డలయందే తగులుగలిగిన) బ్రాహ్మ ణునిని, నీభూమి, సర్పమెలుకలునుంబోలె మ్రింగుచున్నది' యని యె. ఈవిషయము నెప్పుడు నీవు మనస్సునం దుంచుకొనవల యును. నరోత్తమా! సంధిచేసికొనఁదగినవారితో సంధిచేయు ము. విరోధింపఁదగినవారితో విరోధము పెట్టుకొనుము. రాజ్యా ముసప్తాంగములకు నెవఁ డొమ్మని పనిచేయునో వాఁడు నీకు గురు వయినను మిత్రుఁడయినను, వానిని దప్పక చంపియే తీఱవలయు ను. మరుత్తుఁ డనురాజు పాడిన యొకపురాతనశ్లోకముగలదు. అది

బృహస్పతిమతముచొప్పున రాజు నధికారమునుగుఱించి తొల్లి చెప్పఁబడినది. అది యేదనఁగా 'ఇది చేయఁదగును; ఇది చేయఁ దగదని తెలియక గర్వించి చెడుదారిని ద్రొక్కినవాఁడు గురువ యినను వానికి * దండము చేయవలసిన దెప్పుడును తప్పరాదు' అనియె. బాహుని పుత్త్రుం డగుసగరమహారాజు బుద్ధిమంతుఁ డుగాన పురజనుల హితమునే కోరి తనపెద్దకొడు కయినయస మంజసుని దిగవిడిచెను. ఆ యసమంజసుఁడు పురజనుల బాలు రను బట్టికొనిపోయి సరయువునందు ముంచుచువచ్చెను. కావు ననే తండ్రి సగరుఁడు మాటికిఁ దెగడి యూరు వెడలఁగొట్టెను. ఉద్దాలకుం డనుఋషియు బ్రాహ్మణులకుఁ గపటోపచారము చేసి నాఁడని, మహాతపస్వి శ్వేతకేతుఁ డనుతనగారాబుపుత్త్రుని దిగనాడెను. లోకమునందుఁ బ్రజలను రంజించుటయు, సత్య మును రక్షించుటయు, కపటములేక వ్యవహరించుటయు నను నివి రాజునకు సనాతనధర్మము. (కప్పమునకై ధాన్యములనెత్తి కొనుట మొదలయిన విధముల) రాజు పరులధనమునకు హాని కలిగింపరాదు. తానియ్యవలసిన కూలి మొదలగునవి కాలమున నిప్పింపవలయును. పరాక్రమమును, సత్యవాక్కును, క్షమయు ను, గలరాజు పదవినుండి తొలఁగఁడు. రాజు తనమంత్రము లను వెలిపుచ్చరాదు. క్రోధమును జయింపవలయును. తాను నీతిశాస్త్రముల యర్థము ననుసరించి నిశ్చయములు చేయ వలయును. ధర్మార్థకామమోక్షములు నాలుగింటియందును

---

* 'ఉత్పథం ప్రతిపన్నస్య దండో భవతి శాశ్వతః' అని మూలము. 'పరి త్యాగో విధీయతే' అని (దా. మూ.) దిగవిడువవలయునని యర్థము.

నాసక్తుఁడై యుండవలయును. * మూఁటియందుఁ దన మంత్రాలోచనము గప్పిపుచ్చుకొని యుండవలయును. రాజ్య మంత్రములను వెలువడనట్లు రక్షింపకుండుటకంటె, రాజులకుఁ జెడుగు వేఱెద్దియులేదు. రాజు నాలుగువర్ణములధర్మములను బాలింపవలయును. ధర్మములు సంకరము గాకుండునట్లు రక్షించుట రాజులకు సనాతనధర్మము. తనవారినిదక్క పరులయం దొక్కనిని నమ్మరాదు. తనవారిని సయితము మితిమీఱి నమ్మరాదు. (సంధి, విగ్రహము, యానము, ఆసనము, ద్వైధీభావము, ఆశ్రయము) అనెడి యాఱుగుణములయందుఁ గల గుణములను దోషములను నిత్యమును బుద్ధిఁగొని కనుఁగొనుచుండవలయును. రాజు తన పగవారియందలి ఛిద్రములు గనుఁగొనుచు, రాజ్యము వృద్ధి హాని సమస్థితుల తత్త్వములను దెలియును. తగిన వేఁగులవారినిగొని పరులమర్మములు గనుఁగొనుచునుండునేని లోకు లట్టివాని నెప్పుడును గొనియాడుచుందురు. రాజు యమునివలె దండము నెఱపుచుఁ, గుబేరునివలె బొక్కసము నార్జించుచుండవలయును. మంత్రి, రాజ్యము, కోట, ధనశాల, గజ తురగాదిచతురంగ,మని తనరాజ్యమునంగల యీయైదింటికిని బరరాజ్యమునం గలయీయైదింటికిని స్థానవృద్ధి క్షయములను దెలియుచుండవలయును. అతఁడు పోషింపఁబడనివారిని బోషించుచుఁ, బోషింపఁబడిన వారిస్థితి నరయుచును, బ్రసన్నమయినముఖము గలిగి చిఱునవ్వుదొలఁకఁ బలుకుచుండవలయును. మఱియుఁ బెద్దల నుపాసించుచు, ప్రాలుమాలికను

* స్వామి, అమాత్య, సుహృత్, కోశ, రాజ్య దుర్గ బలము లేడును రాజ్యాంగములు. మూఁటియందనఁగా న్యాయలాభభోగములు మూఁడు.

విడిచి యితరులవస్తువులకుఁ బేరాసపడక సజ్జనులనడవడియందే బుద్ధినిలిపి వారి యాచారములను సూటిగాఁ బాటించుచుండ వలయును. సజ్జనులచేతనున్న ధనముల నెప్పుడుగాని దీసికొనరాదు. ఆ సత్పురుషులవలన ధనముదీసికొని సత్పురుషులకు నొసంగ వలయును. రాజు తనంతటనే దండించువాఁడై దాతయై యాత్మ నిగ్రహాము గలవాఁడును, దన పరివారమునడంచి యేలువాఁడును, గాలమెఱిఁగి యిచ్చువాఁడును, గాలమున భుజించువాఁడును, బవిత్రమయిన నడవడిగలవాఁడునై యుండవలయును. సత్కులమునఁ బుట్టినవారును, రోగము లేనివారును, బగవారిచే వంచింపఁ దరముగానివారును, మంచికుటుంబములతోడి సంబంధము గల వారును, దనయందు భక్తిగలవారును, శూరులును, మానులును, శిష్టుల నవమానింపనివారును, శిష్టులును, సాధువులును, విద్యావిదులును, లోకము నెఱింగినవారును, బరలోకమును బాలించువారై ధర్మములందుఁ దగిలి పర్వతములవలెఁ జలింపకుండువారునునగువారిని, సంపదచే నలంకృతుఁడు కాఁగోరురాజు తనకు నెప్పుడుసహాయులుగా నుంచుకొనవలయును. తనకును వారికిని భోగములందు భేద మెంతమాత్రము లేక సమానతగలిగియుండవలయును. శ్వేతచ్ఛత్రము, ఆజ్ఞయను నీరెంటియందే వారికంటె తన కతిశయ ముండవలయును.తక్కిన భోగములన్నియు వారికిని దనకును సమానములై యుండవలయును. తాను వారియెడ నడచుకొనురీతి యెదుటఁగాని మఱుఁగునఁగాని యొక్కతీరుననే యుండవలయును. ఇట్లుచేయు రాజు దుఃఖమెంతమాత్రమును బొందఁడు. ఏ రాజు లోభియుఁ గపటవర్తనుఁడునై యందఱియెడలను శంకించుచు నందఱిసొమ్ములను హరించుచుండునో వానిని వాని

జనులే వేగ * వధించిపుత్తురు. పరిశుద్ధవర్తనము గలవాఁడై †లోకుల మనంబుల రంజించుటయందే యాసక్తి గలిగియుండు రాజు శత్రువులకుఁ జిక్కినను గాని క్రిందుపడఁడు. ఒకవేళఁ గ్రిందుపడినను తోడనే పెరిఁగినిలుచును. కోపము మిక్కిలియు లేక వ్యసనంబులకుఁ బాలుగాకయు క్రూరముగా దండింపకయు నింద్రియములగెలిచియు వెలయునట్టిరాజు, సమస్తప్రాణులకును హిమవత్పర్వతముం బోలె, సకలప్రజలకును నమ్మి యండఁగొనం దగినవాఁడగును. అతఁడు ప్రాజ్ఞుండై న్యాయగుణములతోఁగూడి పరరాజుల రంధ్రములను గనుఁగొనుటయందే కనుగలిగి, చూచుటకు నింపయి యుండవలయును. మఱియు సమస్తవర్ణములవారికిఁ గల నీతిని అనీతిని జక్కఁగాఁ దెలిసి వలయుకార్యములు వేగముగాఁ జేయువాఁడై క్రోధమునడంచి యెంతయుఁ బ్రసన్నతగలిగి గొప్పమనస్సుతో నుండవలయును; ‡ రోగప్రకృతిగాకయుఁ బ్రయత్నపరుఁ డయ్యు, యజ్ఞాదికర్మములందుఁ దత్పరుఁడయ్యు నుండవలయును; తన్నుఁ దాను బొగడికొనరాదు; § అతఁ డారంభించిన కార్యము లన్నియు లెస్సగా ముగింపునొందియే చూపట్టుచుండవలయును. అట్టిరాజే రాజు

---

* 'వధ్యతే' అనిమూలము. 'బాధ్యతే' అని (దా. మూ.) బాధింపఁబడు నని యర్థము.

† 'లోకచిత్తగ్రహేరతః' అని మూలము. 'లోకస్యానుగ్రహేరతః' అని (దా. మూ.)

‡ 'అరోగప్రకృతిః' (జో.మూ)

§ ఆరబ్ధాన్యేవ కార్యాణి సుపర్యవసితాన్యపి । యస్యరాజ్ఞః ప్రదృశ్యన్తే అనిమూలము. 'న పర్యవసితాన్యపి' అని (దా. మూ)

లందుమిన్న; ఎవని దేశమందు మనుష్యులు, తండ్రియింటఁ బుత్రు లుంబోలె నిర్భయముగాఁ జరించుచుందురో యారాజే రాజు లందుమిన్న; ఎవని దేశమందు వసించుజనులు తమధనములను దాఁచికొనక తెల్లముగా పెంపుసొంపు లనుభవించుచు నయాపన యములను నెఱింగియుందురో యారాజే రాజులందు మిన్న; ఎవ్వని దేశమందుఁ గాఁపున్నజనులు తమతమ ధర్మములందుఁ దప్పక వర్తించుచు దేహమాత్ర సుఖములందు మిక్కిలి ప్రీతి లేక యంతరింద్రియనిగ్రహమును గలిగియుందురో; విధ్యుక్త ముగాఁ బరిపాలింపఁబడి రాజునకు వశ్యులై వినయసంపన్ను లయి జగడ గొండితనములు లేక, దానమునందు రుచిగలిగియు నుందురో యతఁడే రాజనఁదగును. ఎవనిరాజ్యమునందు, డంభ మును గపటమును మాయలును మత్సరమును గలుగవో యా రాజునకే సనాతనధర్మము సిద్ధించును; ఎవ్వఁడు జ్ఞానవంతుల జ్ఞాన ములను గారవించుచుఁ, దెలియవలసిన *బరహితములగు శాస్త్ర ములందాసక్తుఁడై ,సజ్జనులమార్గమునను సరించుచు, దానశీలుఁడై యొప్పునో యారాజు రాజ్యమున కర్హుఁడగును;ఎవ్వనిచారులును మంత్రాలోచనములును జేసినవియుఁ జేయకుండునవియును నతని శత్రువులకుఁ దెలియరాకుండునో యారాజే రాజ్యమునకర్హుఁడు. మున్ను మహాత్ముఁ డయినశుక్రుఁ డొకరాజునుగూర్చి రాజధర్మ ములను జెప్పినప్పుడీ శ్లోకమును బాడియున్నాఁడు. అది యేద నఁగా—'మొదట రాజునుబడయవలయును.పిదపభార్యను, బిదప ధనమునుబడయవలయును. రాజు లేకుండినచో నీలోకమునందు

* 'క్షేమయోపరహితేరతః' అని మూలము. 'శ్రేయాఁపరహితేర్రతః' అని (దా.మూ)

భార్యయెక్కడిది ? ధనమెక్కడిది ' అనియే. * కాఁబట్టి రాజ్య మునుగామించువారికి స్పష్టముగాఁ బ్రజలనురక్షించుటకంటెను సనాతనమయినధర్మము మఱొక్కటి రాజ్యమందుఁ గలుగదు. ప్రజారక్షణమే లోకమును ధరించునది. ప్రచేతసునిపుత్త్రుఁడగు మనువు రాజధర్మమునుగుఱించి యీ రెండుశ్లోకములు నుదాహరించియున్నాఁడు. దాని నెచ్చరికతో వినుము. అవియేవనఁగా- 'సముద్రమునందుఁబగిలిన యోడను దిగవిడుచునట్టు యీయాఱుగురను మనుష్యుఁడు విడిచిపెట్టవలయును. వారెవ్వరన-చదివింపని యాచార్యునిని, అధ్యయనముచేయని ఋత్విజుని, రక్షింపని రాజును, ప్రియముగాఁ బలుకనిభార్యను, గ్రామమునందే గ్రుమ్మఱు పసులకాపరిని, అడవికిఁబోవ మంగలినిని, విడువవలయును' అనుటయె. ఇది యేఁబదియాఱవయధ్యాయము.



---

* ఇట ఔత్తరాహకోశములందు 'శ్లోకశ్చాయం పురాగీతో భార్గవేణ మహాత్మనా, ఆఖ్యానేరామచరితే నృపతింప్రతి భారత 'అని యొక్క శ్లోకముగాఁ జెప్పఁబడియున్నది. 'ఆఖ్యానే రామచరితే' అనుటకు రామచరిత్రమనెడి యాఖ్యానమందని యర్థము. దాక్షిణాత్యకోశములందు 'శ్లోకద్వయం పురా గీతం భార్గవేణమహాత్మనా, ఆఖ్యాతే రాజచరితే' అని రెండుశ్లోకములుగానున్నది. 'ఆఖ్యాతే రాజచరితే నృపతింప్రతి' అనుటకు ఒకరాజునకు రాజధర్మము చెప్పినపుడని యర్థమగుచున్నది. ఇందు భార్గవుఁ డనుటకు శుక్రుఁడని కొందఱును పరశురాముఁడని కొందఱును నర్థముచేసియున్నారు. ఆశ్లోకములు 'రాజానం ప్రథమంవిన్దేత్తతో భార్యాంతతో ధనమ్ । రాజన్యసతి లోకేఽస్మిన్ కుతోభార్యాకుతో ధనమ్ ॥ 'తద్రాజ్యేరాజ్యకామానాం నాన్యో ధర్మః సనాతనః, ఋతేరక్షాంతు విస్పష్టాం రక్షాలోకస్య ధారిణీ ॥' ఇందు మొదటిదిమాత్రమే, భార్గవుఁడుచెప్పెనని ఔ- కోశములును, రెండును జెప్పెనని దా- కోశములును, ప్రతిపాదించుచున్నవని తెలియునది.

## రాజధర్మపర్వము.

{ భీష్ముఁడు మొదటినాఁడు ధర్మరాజునకు రాజధర్మములు చెప్పుట. నాటిసాయింకాలము కృష్ణాదులు తమతమ నెలవులకుఁ బోవుట. }

భీష్ముఁడు 'యుధిష్ఠిరా! ప్రజలనురక్షించుట రాజధర్మములందుఁ జిలికియెత్తిన వెన్నచుమీ. భగవంతుఁడు బృహస్పతి దీనిని దప్ప మఱొక్కధర్మమును గొనియాడఁడు. మహాత్ముండగు విశాలాక్షుండును, శుక్రుండును, దేవేంద్రుఁడును, మనువును, భరద్వాజుండును, గౌరశిరుం డనుమునియు, ననెడియీ బ్రహ్మవాదులును బ్రాహ్మణులును రాజధర్మములను రచించినవారు. వీరందఱును నీప్రజారక్షణ ధర్మమునే కొనియాడెదరు. రాజుల కీరక్షణము నోడఁగూర్చు సాధనమెద్దియో వినుము. 'బాహాటముగానుండుచారులను రహస్యముగనుండు చారులను నియోగించుట, వారికిఁ దగినకాలములందు వేతనాదుల నిచ్చుట, మచ్చరము లేమి, మెలపుతోఁబన్ను పుచ్చుకొనుట, ఉపాయముమాలిపన్ను పుచ్చుకొనకుండుట, సజ్జనుల నేర్పఱచుకొనుట, శూరత్వము, నేర్పు, సత్యము, ప్రజలకు హితముసేయుట, శత్రుపక్షమును జక్కటిచేతఁగాని చక్కటిమాలిగాని వృద్ధినొంద నీకుండుట, ప్రాఁతగిలికూలుటకున్నగృహములను జక్కఁజూచుకొనుట, కాలమునకుఁదగిన శరీరదండనమో ధనదండనమో విధించుట, సాధువులనుగూడిన విడువకుండుట, సత్కులమునఁబుట్టినవారిని బోషించుట, సంతరించుకొనవలసినధాన్యాదులను సేకరించుకొనుట, బుద్ధిమంతులను గొలుచుట, సేనలనెప్పుడును సంతోషపెట్టుచుండుట, ప్రజలను బరామర్శించుచుండుట, కార్యములందు సోల

యక దిటగలిగియుండుట, బొక్కసమును వృద్ధిఁబొందించుట, *శత్రుపురజనులకలయికను భేదించుట, పట్టణమును బదిలముగాఁ గావలియుంచి కాచుట, †కావలివారియందుమిక్కిలి నమ్మిక యుంప కుండుట, శత్రువు మిత్త్రుఁడు మధ్యస్థుఁడను ముప్వురకలరూపులను బాటించుచుండుట, భృత్యులందు నమ్మిక యుంపక యుండుట, తన పట్టణము నప్పుడప్పుడు తానై చూచుకొనుచుండుట, శత్త్రువులను దానునమ్మకయే తానుమాత్రము వారలకు నమ్మికలుగలిగించు చుండుట, నీతిమార్గము ననుసరించుచునే యెప్పుడును బ్రయత్న పరుఁడై యుండుట, శత్త్రువుల నలక్ష్యముచేయకుండుట, యెప్పు డు నయోగ్యులను గూడకుండుట యనునివియే. వీనియందు రాజులకుఁ బ్రయత్నపరతయే రాజధర్మములకెల్ల మూల' మని బృహస్పతిచెప్పెను. దీనినిగుఱించిన శ్లోకములను జెప్పెదను వినుము. 'ప్రయత్నముచే నమృతము (దేవతలకు) లభించినది. ప్రయత్నముచేత నసురులు హతులయిరి. ప్రయత్నముచేత మహేంద్రుఁ డిందును దేవలోకమందును శ్రేష్ఠత్వమొందెను. ప్రయత్నశూరుఁ డగువాఁడు మాటలందు శూరుఁడగువానికి నెక్కువయి యుండును. ప్రయత్నశూరు లగువారిని వాక్శూరు లగువారు రంజించుచుఁ గొలుచుచుందురు. ప్రయత్నములేక యుండు వాఁడెంతబుద్ధిమంతుఁడయ్యును వాఁడెప్పుడును శత్త్రువు

---

* 'శత్రువులు తమవశము గావించుకొన్న పురజనులను వారినుండి వేఱు పఱుచుట. 'శత్రుపక్షావివర్ధనమ్' (దా. మూ) 'శత్రుపక్షస్య భేదనమ్ (ఔ. మూలము) శత్రుపక్షమువారిని భేదించుటయని యర్థము.

† 'పురగోప్తురవిశ్వాసః' అని మూలము. 'పురగుప్తిరవిశ్వాసః' అని పాఠాంతరము.

లకు విషములేనిసర్పముంబోలె చుల్కఁగా ధర్షింపఁగూడినవాఁడై యుండును. మిక్కిలి బలియుఁడయినరాజుగూడ తనశత్రువు బలహీనుఁడయి యున్నను వాని నుపేక్షించియుండరాదు. అగ్ని యించుకయినను గాల్చుచున్నది. శత్రువు చతురంగములలో నేదేని యొకయంశమే గలవాఁడయియుండినను, జొరరాని కోట మొదలయినదుర్గము నాశ్రయించియుండునేని, యట్టివాఁడు సమస్తములయిన యంగములు సమృద్ధముగాఁ గలరాజు దేశమును సయిత మంతటిని (ఆదుర్గము బలిమిచే) తపింపఁజేయును. రాజు రహస్యముగాఁ దానాడినమాటయు, శత్రువులను జయించుటకై జనులసమకూర్చుకొనుటయు, అందులకై తాను మనస్సునందుఁగల కపటతంత్రములును, వేఱుకారణములను బట్టియుఁ గల యట్టికార్యమును బయికిఁ * జక్కటిచేతను మెత్తఁదనము చేతను ముసుఁగువైచి కప్పి యుంచుకొనవలయును. రాజు లోకమును † రంజించుటకై మిక్కిలి ధర్మ్యములయిన కార్యముల నాచరింపవలయును. రాజ్యమో మిక్కిలి గొప్పదియగు తంత్రము .దానిని మనస్సు పరిపక్వము గానివారల కెంత మాత్రమును వహింప శక్యముగాదు. రాజ్యమును సకల జనులును నామిషమునుంబోలెఁ గామింతురు. అది పెక్కు సంకటములకుఁ గందువపట్టు; మిక్కిలియు గొప్పదికాన దానిని

---

* 'ఆర్జవే నేహ నిర్జయేత్' (ఔ. మూ) 'మార్దవేనైవ ధారయేత్'(దా. మూ). రెంటికర్థములు నిట వ్రాయంబడియున్నవి.

† 'రంజనార్థ' మ్మని (దా. మూ.) దంభనార్థ' మ్మని (ఔ. మూ). జనులను లోకువ నుంచుకొనుటకై రాజు ధర్మయుక్తముగా నడచుకొనవలయునని యర్థాంతరము. దంభనార్థమనఁగా సంఘాతార్థమని యర్థము.

* మెత్తఁదనముచేతను భరింపఁ దరముగాదు. పరుసనయిన చక్కటిచేతను వహింప శక్యముగాదు. కాన మెత్తని కపటము చేతను బిరుసనిచక్కటిచేతను నెప్పుడును రాజు ప్రవర్తింప వలయును. అట్లు రాజు ప్రజలను రక్షించుచుండు నపుడు దాని వలన నతని కేదేని విపత్తి కలిగినను నది యతనికి విపులమయిన ధర్మము దొరకొనుటే యగును. ఇట్టి నడవడిగల వారే రాజులు. కురుకులతిలకా! ఇప్పుడు రాజధర్మములం దించుక మాత్రమును నీకుఁ జెప్పితిని. నీకు సందేహము గలవిషయమును మరల నడుగుము' అనెను.

అంత, వ్యాసుండును, దేవస్థానుండును, అశ్మకుఁడును, కృష్ణుండును, కృపుండును, సాత్యకియు సంజయుండును మొదలగు వారందఱును, †నెమ్మొగములు దద్దయుఁ బూవులవలె వికసించుచుండ, సంతోషము పిక్కటిల్ల, పురుషసింహుండును ధార్మిక శ్రేష్ఠుండునగు భీష్ముని 'బాగుబాగు' అని పొగడిరి. అంత ధర్మ రాజు విన్ననయిన మనంబునఁ గన్నుఁగవఁ గన్నీరు చిప్పిలుచుండ, భీష్ముని పాదములను మెల్ల నంటుచు, మ్రొక్కి 'పితామహా! నేను రేపటికి నాకుఁగల సందేహముల నడిగెదను. ఏలన నిపుడు సూర్యుఁడు భూమియందలి రసమును బీల్చుకొని యస్త

---

*'నశక్యం మృదునా వోఢుం మాఘాతస్థాన ముల్బణమ్। రాజ్యం సర్వామిషం నిత్యమార్జవే నేహ ధార్యతే॥' అని (దా. మూ). వోఢుం మాయాసంస్థాన ముత్తమమ్' ...నిత్యంనార్జవే నేహ ... అని (ఔ. మూ) ఉత్తమమయిన పదవిని కష్టలభ్యమయిన దానిని మృదువయినవాఁడు వహింప నేరఁడని యర్థము.

†'పుష్ప్యమాణమివానసై॥' అని (ఔ.మూ;)'ఘుష్యమాణమివానసై:' అని (దా. మూ) ఇది సరసముగాదు.

మించుచున్నాఁడు' అనెను. అంతఁ గృష్ణుఁడును గృపుఁడును ధర్మరాజు మొదలగువారును నందుఁ గలబ్రాహ్మణులకు మ్రొక్కి భీష్మునికిఁ బ్రదక్షిణము గావించి ముదంబున రథంబుల నారోహించిరి. ఆవీరులు, నియమముల నెంతమాత్రమును దప్పనివారుగాన దృషద్వతియను నదియందు జలకమాడి, జలాంజలులు విడిచి మంగళములగు మంత్రములను జపించి విధిచొప్పున సంధ్య వార్చి యంత హస్తినాపురమును బ్రవేశించినవారయిరి. ఇది యేఁబదియేడవయధ్యాయము.

---

## రాజధర్మపర్వము.

(భీష్ముండు ధర్మరాజునకు రాజులయుత్పత్తిని బ్రహ్మ గావించిన దండనీతి శాస్త్రివృత్తాంతమును పృథురాజు చరిత్రమును జెప్పుట.)

అంతఁ బాండవులును యాదవులును దెల్లవాఱఁగా లేచి ప్రాతఃకాలకరణీయములను గావించి పట్టణములవలెఁ జూపట్టుచున్న రథముల నెక్కిపోయిరి. వారు కురుక్షేత్రమును జేరి యనఘుండగుభీష్ముని దగ్గఱకుఁబోయి 'రాత్రి హాయిగాఁ గడచెనా' యని యారథికవర్య నడిగిరి; మఱియు వ్యాసాదులగు ఋషులకు మ్రొక్కి, వారు తమ్ము నభినందింపఁగా, భీష్ముని నలుప్రక్కలను బరివేష్టించి కూర్చుండిరి. అంత ధర్మరాజు భీష్ముని యథావిధిగఁ బూజించి యంజలిఘటించి యతనితో "రాజు" అనెడి యీశబ్దమొకటి వాడుకయందున్నది. ఇది యెక్కడనుండి పుట్టినదిని నాకుఁ జెప్పుము. తక్కిన మనుష్యులకుంబోలెనే రాజునకును జేతులును, బుజములును, గుత్తుకయు నున్నవి. బుద్ధియు

నింద్రియములు మనస్సు నున్నవి. సుఖమును దుఃఖమును, నీఁపును, ముఖమును, గడుపును, శుక్లమును, నెమ్ములును, మజ్జయును, కండయు నెత్తురును, దక్కిన వారివలెనే యున్నవి. మఱియు నిశ్వాసములు నుచ్ఛ్వాసములును, ప్రాణములును దేహమును నతనికిఁ దక్కిన మనుష్యులకుఁబోలెనే యున్నవి. ఇతర మనుష్యులకు వలెనే నతనికి జననమరణము లున్నవి. మనుష్యులకుఁ గలగుణము లన్నియు నతనికిని సమముగా నున్నవి. ఇట్లుండియు రాజొక్కఁడే విశేషించిన బుద్ధిగల వారలును శూరులును నగు పెక్కండ్రకు నెట్లధిపతిగా నున్నాఁడు. ఒక్కండే పెక్కండ్రు శూరులును వీరులును నార్యులు నెరసి బెరసియున్న మహీమండలమునంతయు నేలుటయెట్లు? మఱియు లోకులెల్ల నతనిప్రసాదమును గోరుచుండుట యెట్లు? ఒక్కఁడు తెలివినొందియుండెనా లోకమంతయుఁ దెలివి గలిగియుండుటయు, ఒకఁడు కలఁతనొందెనా యందఱును గలఁగుడువడుటయు నిశ్చయముగా నున్నదే! ఇది యెట్లు? నీవలన నిది వినఁ గోరుచున్నాను. నీవు మాటకారులందు మిన్నవు. దీని నంతయుఁ గలిగినది గలిగినట్లు నాకుఁ జెప్పుము. ఇందులకుఁ గారణము మిక్కిలి యల్పముగా నుండనేరదు. ఏలనఁగా నొకనికి దేవునివలె జగమంతయు మ్రొక్కుచున్నది చుమీ' యనెను.

భీష్ముఁడు 'పురుషసింహమా! రాజ్యమెట్లుప్పతిల్లెనో యది యంతయుఁ గడమవడకుండ నెచ్చరికగలిగి వినుము. మొదటఁ గృతయుగమం దది కలిగెను. అంతకు మున్ను మొట్టమొదట రాజ్యమును రాజును లేరు. దండమును దండించువాఁడును గలుగఁడు. ప్రజలందఱును ధర్మముచేతనే యొకరినొకరు రక్షిం

చుచు వచ్చిరి. అట్లు వారు ధర్మముచేత నొండొరులను రక్షించు కొనుచు రాఁగాఁ గొంతకాలమునకు వారికి దాని పటుత్వము మిక్కిలియుఁ దప్పి యెంతయు దీనత్వము గలిగెను. ఆదైన్యము వలన వారిని మోహము (అవివేకము) ఆవేశించెను. అట్లు మనుష్యులు మోహముబారింబడి యెఱుక రూపుమాసినవారయిరి. దానివలన వారికి ధర్మము నశించినదయ్యె. ఇట్లెఱుక నశించి మోహమునకు లోనై యుండుటచే నపుడు లోభము వారి నందఱఁ గయివసముచేసికొనెను. అంత మనుష్యులు తమకు దొరకొనని వస్తువులను గయికొనుటకుఁ బూనఁగా కామమను నది మఱియొకటి వారిని బొందెను. అట్లు కామమునకుఁ జిక్కిన యీమనుష్యులను రాగము పయికొనెను. రాగమునకు లోనై జనులు 'ఇది చేయఁదగును ఇది చేయఁదగ'దని తెలియు వివేకము మానినవారయిరి. అంతఁ బొందరాని పడఁతులను బొందిరి; చెప్పరానిమాటలు చెప్పంబూనిరి. భక్ష్యమా! అభక్ష్యమా! దోషమా!నిర్దోషమా! యని విచారించుటను దిగవిడిచిరి. అన్నియును గయికొనిరి. మనుష్య లోకమిట్లు కలగుండు నొందఁగా నపుడు వేదములు నశించెను; వేదము నశింపఁగా, దాని వలన వెడలిన ధర్మమును నాశము నొందెను. ఇట్లు వేదమును ధర్మమును నశింపఁగా దేవతలుకు దిగులు గలిగెను. వారట్లు దిగులుగొని బ్రహ్మదేవుని శరణుచొరంబోయి యాలోకపితామహునిఁ జేరి,యందఱును దుఃఖము నురవడిచేఁగొట్టువడి చేతులు మోడ్చి యద్దేవునితో 'మహాత్మా! మనుష్యలోకమం దున్నసనాతనమగువేదము లోభ మోహాదిదోషములవలనఁ గబళితమయినది. కాన మాకు భయ మావేశించినది. వేదము నశిం

చుటచేత (యజ్ఞాది రూపమగు) ధర్మమును నశించెను; దాని చేత ముల్లోకముల నధిపతులుగా నుండుపదవి నొందిన దేవత లందఱును (స్వాహాదులు లేనందున) మనుష్యులకు సమానులగు గతి నొందిరి. మేము క్రిందుగా వర్షించువారము, మనుష్యులు (యజ్ఞాది ద్రవ్యము లర్పించు రూపమునఁ) బైకి వర్షించువారలు. వారలు యజ్ఞాదికర్మము లుడుగుటవలన మాగతి సందేహముగా నున్నది. కాఁబట్టి మాకేది మేలో యాలోచింపుము. *నీవను గ్రహించి మాకుఁగలిగించిన యీ మహిమ మఱల మాకుఁ గలుగుఁగాక' యనిరి. అంత బ్రహ్మ వారిం జూచి 'దేవోత్తములారా! మీకు మేలెద్దియో యాలోచించెదను, భయపడవలదు' అనెను. అంత నద్దేవుఁడు, తన బుద్ధిచేత లక్షయధ్యాయములుగల శాస్త్ర మును రచించెను. అందు ధర్మమును, అర్థమును, గామమును వివరింపఁబడెను. ఆమూఁటికిని మొత్తమున బ్రహ్మ త్రివర్గ మని పేరి డెను. ఈమూఁడుగాక నాలుగవది మోక్షమును బ్రతిపాదించెను. దాని ప్రయోజనములు వేఱు, గుణములును వేఱు. మఱియునా శాస్త్రమందు మోక్షమును గుఱించిన మఱియొక త్రివర్గము, సత్త్వము, రజస్సు, తమము అనియు (నాలుగవది నిష్కామ ధర్మమును) జెప్పంబడినవి. అందు దండమును గుఱించిన త్రివర్గము మఱొకటి, † స్థానము వృద్ధి క్షయ మను నవియుఁ గలవు. మనస్సు, దేశము, కాలము, సాధనములు, కార్యప్రయోజన

---

* 'త్వత్ప్రభావ సముత్థో౽సౌ ప్రభావో నోభవత్వయమ్' అని (దా. మూ) 'స్వభావోనో వినశ్యతి' అని (కౌ. మూ).

† స్థానము=వర్తకుల సమత్వము, వృద్ధి=తపస్సుల వృద్ధి, క్షయము=చోరుల క్షీణతయని తెలియునది. ఇవియ మూఁడును.

ములు, (సుహృదాది) సహాయులు, (కారణములు) నని నీతిని సంబంధించి యీ షడ్వర్గమును జెప్పంబడినవి. (ధర్మకాండము జ్ఞానకాండములని రెండువిధముల) వేదమును(వ్యవసాయము వర్తకము మొదలయిన బ్రతుకు) వృత్తియు, విపులమయిన దండనీతియు మఱియుఁ దక్కిన విద్యలు నందు నిదర్శితము లయినవి. రాజా! మంత్రము, వాంఛితములను దెలియుట, అందులకయిన రహస్యపు వేఁగులవాండ్రును రాజపుత్రుల లక్షణములును, నానావిధములయిన యుపాయములుగల చారులను బన్నుటయు, స్నేహము, సామము దానము భేదము దండము ఉపేక్షయ నెడి యైదుపాయములును,బూర్ణముగానం దుదాహరింపఁబడినవి. మంత్రాలోచనము లన్నియు, మంత్రములను భేదించుటయు, మంత్రముల తడఁబాటును, వానిసిద్ధివలనను నసిద్ధివలనను గలుగు ఫలములును, నందు సాంతముగా వర్ణింపఁబడియున్నవి. భయముచేతను, మరియాదచేతను, ధనమునుబట్టియు నేర్పడునవై, అధమము, మధ్యమము, ఉత్తమమున నెడి మూఁడువిధములయిన సంధియు దానియందు వివరముగా రూపింపఁబడినవి. యాత్రాకాలములు *నాలుగును, త్రివర్గము విస్తారమును, ధర్మజయమును, అర్థముచేతనయిన జయమును, ఆసుర(వంచనాదిప్రయుక్తమైన) జయమునని మూఁడుదెగలజయమును, నందు సాకల్యముగా నుపదేశింపఁబడియున్నవి. మంత్రము,రాజ్యము, దుర్గము, సైన్యము, కోశమనెడి యీపంచవర్గమునకుఁగలయుత్తమమధ్య మాధమము

* తనరాజ్యమందు మిత్రవృద్ధి, కోశసంచయమును, బరరాజ్యమందు మిత్రనాశము,కోశహానియు, నని నాలుగుయాత్రాకాలములని యొక వ్యాఖ్య చూపట్టుచున్నది.

లనెడిభేదములును, లక్షణములును జెప్పఁబడియున్నవి. ప్రకాశము అప్రకాశము నని దండము రెండువిధములు గలవు. అందు ప్రకాశమును రహస్యమునగుదండమువిధములు సవిస్తరముగాఁ జెప్పంబడియున్నవి. రథములు గజములు, గుఱ్ఱములు, పదాతులు, పనివాండ్రు, ఓడదండు, వేగులవాండ్రు, శత్రుదేశమునకు దారిచూపువారు అని ప్రకాశదండ మెనిమిదివిధములు. రహస్యదండమున, వస్త్రములందును ఆహారములందును సర్పాదిజంగమవిషములను, వత్సనాభాదిస్థావరవిషములను విషచూర్ణములను బ్రయోగించుటయు, అభిచారాదు లయినవివిధదండములును జెప్పఁబడియున్నవి. వేడుక కయిన యుద్ధమునందును జూదమునందును నమ్మికతోఁ గూడినదియుఁ దొమ్మిదవయుపాయమని పండితులు చెప్పునదియు నగు కైతవమును జెప్పఁబడియున్నది. ధర్మార్థకామములను నాశము సేయునదియు, ఇష్టానిష్టములగు సమస్తకార్యము లందును గలుగునదియు నగు నుపేక్షయు, ఇంద్రజాలాదికమగు మాయయు, మంచిశకునములును, చెడుశకునములును, వేషమూని పగవారియెడఁ జరించుడంబమును, వంచనయు, చిత్తదోషముచేతఁ జెడుపుటయు, చేష్టలేకుండఁ జేయుటయు, నందుఁ జెప్పఁబడుచున్నవి. శత్రువు, మిత్రుఁడు, ఉదాసీనుఁ డనుమూఁడువిధములమనుష్యులును, నవగ్రహములు నక్షత్రములు మొదలగువాని మార్గములగుణములు (విడిపట్టులు గావించుకొను) భూమిగుణములు, మంత్ర యంత్రాదులచేఁ దన్ను రక్షించుకొనుటయు, సమాధానపఱచుటయు, రథములు మొదలయిన యుద్ధపరికరములు క్రొత్తగానిర్మించుటను బరామర్శించుటయు, రథగజ తురగపదాతులకు బలపుష్టికరము లగు

నానావిధములయిన కల్పసిద్ధులును, చక్రము, క్రౌంచము మొదలయిన నానావిధనామములు గలవ్యూహములును, విచిత్రయుద్ధము చేయు కౌశలమును, (గ్రహయుద్ధము ధూమకేతువులు మొదలయిన) యుత్పాతములను, (ఉల్కలుపడుట భూకంపము మొదలయిన) నిపాతములును, చక్కఁగా యుద్ధము సేయు రీతియు, చక్కఁగా పలాయనమొందు పద్ధతియు, ఆయుధముల జ్ఞానమును, వానిని బదును జేయు రీతులును, సేనల వ్యసనములును, వానిని జక్కంబఱచుటయు, వానిని సంతోషపెట్టుటయు, రోగపీడలును, ఆపత్కాలములును, భయకాలములును నందుఁగలవు. మఱియు భేరి మొదలయిన వాద్యముల ధ్వనిచేతఁ బ్రయాణాదులను జెప్పుటయు, పతాకలు మొదలయినవానిచేత వలయునవి తెలుపుటయు, వానిని జూపియు వినిపించియు శత్రువులను మోహింపఁజేయుటయు, క్రూరులయిన చోరులును, అడవిజనులును, నగ్గిని విషమును బెట్టువారును, ప్రతిరూపములను జేయువారును, నను వీరినిగొని శత్రురాజ్యమును బీడించుటయును జెప్పఁబడియున్నవి. శత్రుసైన్యమందలి సేనాపతులను భేదించుటయు, ధాన్యములు చెట్లుచేమలు మొదలగువానిని ద్రుంచివైచుటయు, ఏనుఁగులను మంత్రాదులచేఁ జెఱిపివైచుటయు, మఱియుం గల యాతంకములు పన్నుటయు, పరసైన్యమునందుఁ దనయెడభక్తి గలవానిని మిక్కిలి పూజించుటయు, * పరరాజునకు నమ్మికగలిగించుటయు, రాజ్యము సప్తాంగములు తెలుఁగుటను బెరుఁగు

---

* 'ప్రత్యయోపార్జ సేనచ' అని (ఔ. మూల). పత్యుశ్చోప్రగ్రహణాచ అని (దా. మూ). పతిని జేపట్టుటచేత ననియర్థము. ఈ పాఠ మసంగతము.

టను సమస్థితియం దుండుటను బాటించుటయు, *పూనినకార్యముల సాధించుటకయిన యుపాయములును, రాష్ట్రమును వృద్ధిఁ బొందించుటయు, శత్రువు మిత్రుఁడు మధ్యస్థు లనువారి విస్తరించి చెప్పుటయు, శత్రుదేశమండలి జనుల వశీకరించుకొను నుపాయమును, బలవంతులగువారిని మర్దించుటయును, బోడవడంచుటయును, మిక్కిలి సూటిగా న్యాయమును వ్యవహరించుటయును, కంటకులను దొలఁచిపుచ్చుటయు, మల్లయుద్ధమును, ఆయుధప్రయోగముల సాదనయు, దానముచేయు పద్ధతులును, వలయుసంభారముల సేకరించు తెఱంగును, పోషణము లేనివారిని బోషించుటయుఁ, బోషితులగువారిని బరామర్శించికొనుటయు, దగినకాలముతుదిని ధనము లొసంగుటయు, వ్యసనములందుఁ దగులు లేకుండుటయు, రాజులకువలయు గుణములును, సేనాపతికి వలయుగుణములను, † ఆయాయుపకరణములయు వానినిగొని పనిచేయుకర్తలయు గుణదోషములనును, దుష్టములగు నానావిధములయిన యింగితములును, అనువర్తించువారికి వలయు నడవడియు, అందఱయెడలను శంకగలిగియుండుటయు, పరాకు మానుటయు, తనకు దొరఁకొననివానిని బడయఁగోరుటయు, దొరఁకొన్నవాని వృద్ధిఁబొందించుటయు, అట్లు వృద్ధినొందినదానిని పాత్రములకు విధ్యుక్తముగా నొసంగుటయు, ధర్మముకొ

---

* 'కృతసామర్థ్యయోగశ్చ' అని (ఔ. మూ) 'దూతసామర్థ్య యోగశ్చ' అని (దా. మూ).

† కారణస్యచ కర్తుశ్చ గుణదోషాః' అని (దా.మూ) కారణంచ త్రివర్గస్య గుణదోషాః' అని (దా. మూలము) త్రివర్గములకుఁ గారణములయిన వాని గుణదోషములనని యర్థాంతరము.

ఱకును నర్థమునకును గామమునకును, అపాయమును దొలఁగిం చుటకును ధనము నుపయోగించువిధమును నందు జెప్పఁబడియు న్నవి. కామమువలనను క్రోధమువలనను బుట్టు నుగ్రములగు వ్యసములుపదియు నందుఁ జెప్పఁబడియున్నవి. అందుఁ గామ మువలనఁబుట్టినవి-*వేఁట, జూదము, పానము, స్త్రీలని యందు బ్రహ్మచెప్పినవి నాలుగుగా నాచార్యులు చెప్పెదరు. మాటపరుస దనము, ఉగ్రత్వము, దండముపరుసఁదనము, నీతిమాలినశరీరదం డనము, ఆత్మహత్య, (లేక దేశము వెడలఁగొట్టుట), అర్థదూష ణము (అనఁగా ఒకరిప్రయోజనములనుగాని ధనములనుగాని జెఱుపుట) అని యీయాఱు క్రోధమువలనఁ బుట్టు వ్యసనము లును, పలువిధములయినయంత్రములు సేయుటయును, వానివ్యా పారములును జెప్పఁబడియున్నవి. పరరాష్ట్రమునుబీడించుట, పగ వారిపైఁ దలపడుట, పొలిమేరల గుఱుతు లగుటెక్కెములు మొదలగు వాని నాశముసేయుట, (పగవారికి విడియు నీడ లేకుండుటకై) పెద్దమ్రాఁకులను గూల్చుట, (కోటలు మొదల గువాని) ముట్టడి, † కృషి మొదలగువాని ఫలములను బాడు సేయుట, ఆయుధాదు లయినయుపకరణములను భోగ్రఁగుసేయు ట, ¶ సైనికులకుఁ గవచములు మొదలగు తొడుగువస్త్రములును,

---

* 'మృగయాక్షా స్తథాపానం స్త్రియశ్చభరతర్షభ। కామజాని... వాక్పా రుష్యంతథోగ్రత్వం దండపారుష్యమేవచ।ఆత్మనో నిగ్రహస్త్యాగో హ్యర్థదూ షణమేవచ' అనునివి క్రోధజములగు వ్యసనములు వెరసి పది తెలియునది.

† 'కర్మాంతినాశనమ్' కృషికర్మాదుల, అంత=ఫలమును, నాశముసే యుటయని (దా.మూ). 'కర్మానుశాసనమ్' కృషి మొదలయినకర్మములనుఁ బరా మర్శించుటయని యర్థాంతరము.

¶ 'అవస్కరోఽథ వమనంతథో పాయాశ్చ వర్ణితాః' (దా.మూ)'వమనం

దానిని జేయునట్టి మేలియుపాయములును వర్ణింపఁబడియున్నవి. పణవము, శంఖము, ఆనకము, భేరు లనువాద్యములును, (మణులు, పశువులు, భూమి, వస్త్రము, బంగారము, దాసికలనెడి) యీయఱువిధములగు ద్రవ్యములను (తనకై) సంతరించుకొనుట, (పరులను బాధించుటకై) వానిని నాశముసేయుట, క్రొత్తగా లభించిన రాజ్యములను నిర్మళముగావించుట, సజ్జనులను బూజించుట, విద్వజ్జనులతోడి కలయిక, జపహోమవిధులను దెలిసియుండుట, మంగళద్రవ్యములను (బంగారు మొదలగు వానిని) స్పృశించుట, శరీరము నలంకరించుకొనుట, భోజనవిధి, ఎప్పుడును ఆస్తిక్యము, * ఒక్కఁడే చేయుప్రయత్నము, సత్యసంధత్వము, తియ్యనిమాట, ఉత్సవములయందు జనులు సభగూడునపుడును గృహములయందును (టెక్కెములు గట్టుట) మొదలయిన కార్యములు, అన్నిరచ్చపట్టులను మనుష్యులు ప్రత్యక్షముగను మఱుఁగునను జేయుకార్యములు, మనుష్యుల నడవళ్లను నెప్పుడును బరికించుచుండుటయును, బ్రాహ్మణులను దండింపరామియు, యుక్తియుక్తముగా దండించుటయు, కొలిచి బ్రతుకువారిని తనతోడి చుట్టఱికమును బట్టియు వారిగుణముల నుబట్టియు గాగవించుట, పురజనులను రక్షించుట, రాష్ట్రమును వృద్ధినొందించుట, † ఒక్కొక్కదిక్కునందును శత్రువు మిత్రుఁడు

---

శథోపాస్యాచ వర్ణితాః' అని (దా.మూ) ఇది సంగతముగాదు.

* ఏకేన య థోత్థేయం' అనిమూలము. ఒక్కదారినే వృద్ధినొందువిధము ను' అని యర్థాంతరము. ఇది ప్రతాపచంద్రరాయల యర్థము ననుసరించి వ్రాయఁబడినది.

† యుద్ధమునకై వూనినరాజును 'విజిగీషు' వందురు. వాని నలుప్రక్కలనున్న

దాసీనుఁడని ముగ్గురేసిగా నలుదిక్కులందును గలపండ్రెండు రాజుల మండలమునడుమ నున్నరా జాపన్నిద్దఱ రాజులను గుఱించి చేయవలసిన యాలోచనము, దేహమునకైన శౌచము అభ్యంగనము మొదలయినవానినిగుఱించి వైద్యశాస్త్రమునందుఁ బ్రసిద్ధములై యున్న *డెబ్బదిరెండు సంస్కారక్రియలును, ఆయా దేశములయు జాతులయు కులములయు ధర్మములును, వర్ణింపఁ బడినవి. అందు ధర్మార్థకామమోక్షములును వర్ణింపఁబడినవి. ధనములను గోరుటయు, దానికయిన నానావిధములగు నుపాయములును కృష్యాదులను జేయువిధములును, పన్నువచ్చుబడికి మూలమయినకార్యములను, మాయలను బన్ను తెఱఁగులును, ప్రవహింపక నిలుకడగా నున్ననీటిపట్టుల నీళ్లను జెఱుపువిధములును నందుఁగలవు. లోకులు పూజ్యమగు పెద్దల నడవడినుండి చలింపకుండుటకు వలయునుపాయము లన్నియు నానీతిశాస్త్రమందు వర్ణింపఁబడియున్నవి. ఆ భగవంతుఁడు బ్రహ్మ, శుభంబయినయీశాస్త్రమునురచించి యంత సంతసంబున నింద్రాదులగు దేవతలం జూచి 'లోకమున కుపకారముకొఱకును ధర్మార్థకామములను స్థాపించుకొఱకును జిలికియెత్తిన వెన్నవలె వాక్కునందలి సారమయిన యీ శాస్త్రమును రచించినాఁడను. ఇది

---

రాజులునలువురును శత్రులనఁబడుదురు. ఆనలువుర కవ్వలనున్న నలువురుమిత్రులనియు వారికవ్వలి నలువురు ఉదాసీనులనియు రాజశాస్త్రియునఁ జెప్పఁబడుదురు. కానవెరసి చుట్టును పన్నిద్దరు అగుదురు.

*'ద్వాసప్తతివిధా చైవశరీరస్య ప్రతిక్రియా' అని మూలము. 'ద్విసప్తతిమతీ చైవ ప్రోక్తాయాచ స్వయం భువా'యని (దా. మూ.) ఇది యసంగతముగా నున్నది.

దండనీతితోఁగూడి లోకరక్షణమును గావించును. ఇది నిగ్రహములను అనుగ్రహములను జరుపుచు లోకులయందుఁ జరించుచుండును. దండముచేత నీలోకులు (తమతమ పురుషార్థములయందు) జరుపఁబడుటచేతను, లేక దండమె యెల్లవారిని నడపుచుండుటచేతను, ఈశాస్త్రము మూఁడులోకములందును దండనీతియని ప్రసిద్ధినొందును. షడ్గుణముల గుణములసారమయినయిది యిఁకమీఁద మహాత్ములయం దెంతయు నెలకొనియుండును. ఏలనఁగా ధర్మార్థకామమోక్షములన్నియు నిందుఁ జెప్పఁబడియున్నవి సుఁడీ' యనెను.

అంత నుమాపతియు బహురూపుఁడును విశాలాక్షుండును నగు శివుం డాశాస్త్రమును మొట్టమొదటఁ గయికొనెను.*(అతం డాద్యంతములులేనివాఁడు. జ్ఞానశక్తిమొదలయినశక్తులును, తారకము మొదలయిన విద్యలు నన్నియు నతనివశమందు వర్తించుచుండును.అతఁ డణిమాదిగుణసంపన్నుఁడు.అతనియైశ్వర్యముపరమార్థమైనది. అతండుజగంబులకుఁ బతి;బ్రహ్మాండమునునిర్మించిన ప్రభుఁడు. అయినను బ్రహ్మదేవుని సంతోషముకొఱకుఁ దనపుత్త్రుఁడయినయతనిని పితగాను, బితయగు తా నతనిపుత్త్రునిఁగాను,గొని యతనిలలాటమునుండి వెడలివచ్చి బాలునివలె బెట్టిదముగా రోదనముచేసెను. సమస్తలోకమునకుఁ గర్తయు లోకపితామహుండు నగుబ్రహ్మ యతనికి బంగారంచగాఁ బొడకట్టెను. లెక్కలేని వేలకొలఁదిరుద్రులకు నవ్యయంబగు స్థానమయినవాఁడును, సమస్తప్రాణులకును దేవుండును, నిత్యుఁడునగు నమ్మహాదేవుఁడు)

---

* ఈకుండలీకరణములోని పాఠము కొత్తరాహ ప్రతులందులేదు.

శివుఁ *డొక్కొక్క యుగమందును బ్రజలకు నాయువు తగ్గుచుం
డుటనుజూచి, మహార్థమును బ్రహ్మరచితము నయిననీతిశాస్త్ర
మును బదివేలయధ్యాయములు గలదిగా సంగ్రహించెను. మహా
తపస్వియు మిక్కిలియు బ్రహ్మణ్యుండు నయినదేవేంద్రుఁడు
వైశాలాక్ష మనిప్రసిద్ధమగు నాసంగ్రహమును మహేశ్వరుని
వలనఁబడసెను. అట్లుపడసి యాయింద్రుఁడు ప్రజలహితముఁగోరి
యాశాస్త్రమును బాహుదంతక మనుపేర నైదువేలయధ్యాయ
ములుగలదిగా సంక్షేపించెను. అంత బృహస్పతి దానినే తనబుద్ధి
చేత మూఁడువేల యధ్యాయములుగా సంగ్రహించెను. ఈసంగ్ర
హమే బార్హస్పత్యమనఁబడును. అమితప్రజ్ఞుండును యోగా
చార్యుండును మహాయశుండునగు శుక్రుఁడాశాస్త్రమును వేయి
యధ్యాయములుగలదిగా సంగ్రహించెను. ఇట్లు మహర్షులు లో
కము ననుసరించియుఁ బ్రజలయాయువులు దగ్గుచుండుటఁ దెలి
సియు నీశాస్త్రమును సంగ్రహించినవారయిరి. అంత దేవతలు,
ప్రజాతియగు విష్ణువుకడకుంబోయి 'మనుష్యులనందఱ నొక్కం
డుమేటియై యడంచియేలునంతటి యతిశయము గలవాని నొక్క
నిని దెలుపు' మని యడిగిరి. ఆనారాయణుండు కొంచె మాలో
చించి తనమనస్సునందుండి మిక్కిలి తేజస్సుగల విరజుండను పు
త్రునిఁ బుట్టించెను. మహాభాగుఁడా విరజసుఁడు భూమియందుఁ
బ్రభుత్వము నొల్లఁడయ్యె. అతనిబుద్ధి శాస్త్రపరిశ్రమము గలది
గాన సన్న్యాసమందే చెల్లెను. అతనికిఁ గీర్తిమంతుఁ డనుపుత్త్రుఁ

* యుగానామాయుషోహ్రాసమ్' అనిమూలము. 'ప్రజానా మాయుషో
హ్రాసమ్' అని కొ. మూలము.

డు పుట్టెనుగాని, వాఁడును *పంచేంద్రియముల నతిక్రమించి మోక్షమందాసక్తుఁడయ్యెను. కీర్తిమంతునికిఁ గర్దముఁడు పుట్టెను. కర్దముఁడును గొప్పతపముగావించెను. ప్రజాపతియగు నా కర్దమునికి ననంగుఁడుపుట్టెను. అతఁడు ప్రజలనురక్షించుచు సాధువృత్తిగలిగి దండనీతియందుఁ బండితుఁడై యుండెను. అనంగునకు నతిబలుం డనుపుత్త్రుఁడుగలిగెను. వాఁడు తండ్రికిఁ బిదప గొప్పరాజ్యమునుబడసి నీతితోడఁగొంత కాలమురాజ్యముచేయుచువచ్చెను. ఒకప్పు డతఁడెంతయు నీతిమెఱయుచు నంత నింద్రియములకు లోనయ్యెను. అతఁ డొకప్పుడు చక్కఁదనముచే నిక్కుచూపుచున్నదియు గుణములందెంతయు మేలుబంతియుఁ బతివ్రతయునగు సునీథయను దానిని మృత్యువు మానసపుత్త్రిని భార్యఁగాఁ బడసి యింద్రియములకుఁజిక్కి కామమోహితుఁ డయ్యెను. ఆబిడ ముల్లోకములందు వాసికెక్కినది. అది వేనునిఁగాంచెను. ఆ వేనుఁడు రాగద్వేషములవెంటం బడి ప్రజలందు ధర్మము తప్పి వర్తించుచు నుండఁగా బ్రహ్మవాదులగుఋషులు వానిని మంత్రపూతములగు దర్భలచేఁ జంపిరి. మును లావేనునికుడితొడను జిలుకఁగా నందుండిఁ గురూపియు నశుచియుఁ బొట్టివాఁడును నెఱ్ఱని కన్నులును నల్లని వెండ్రుకలును గలవాఁడునై, కాలినమ్రోడువలె నున్న యొకఁడుగలిగెను. వానిని ఋషులు 'నిషీద' అనుపదముచేఁ గూర్చుండుమనిరి. అదికారణముగా వానివలననుండి పర్వతములును వనములును వసతిగాఁ గలక్రూరులగు నిషాదులును వింధ్యపర్వతమున వసించు మ్లేచ్ఛులును వందలవేలకొలఁదిని ఋ

---

* 'పంచాతిగోఽభవత్' (దా. మూ.) 'మర్త్యాధికోఽభవత్' అని (దా. మూ.) మర్త్యుల కధికుఁడు అనఁగా మోక్షాసక్తుఁడయ్యెననుట.

ట్టిరి. ఆమునులు మఱల నావేనుని కుడిచేతిని దఱచిరి. దాననుండి రూపమున మఱియొకయింద్రునింబోనివాఁడై కవచమును దాల్చి ఖడ్గమును మొలఁగట్టికొని కేలవిలు నమ్ములుదాల్చినయొక పురుషుఁడుపుట్టెను. వాఁడు వేదవేదాంగవిదుఁడు, ధనుర్వేదపారఁగుఁడు. ఆపురుషతిలకునిదండనీతి సమస్తమునాశ్రయించినది. అంత నతఁడు చేతులు మోడ్చి యాఋషులనుజూచి 'నాబుద్ధి మిక్కిలియు సూక్ష్మమై ధర్మార్థములను గనుఁగొనుచున్నది. ఇట్టిబుద్ధిని గొని నేనేమిచేయవలయునో కలరీతిని జెప్పుఁడు. మీరు నాకుఁ బ్రయోజనవంత మగునేపనిని జెప్పెదరో దానిని మీకుఁ దప్పక చేసెదను. ఈవిషయమై విచారమువలదు' అనెను. ఆమహర్షులును దేవతలు నతనితో 'నీవెందెందు ధర్మముగలదో దానినంతయు జంకులేక యాచరింపుము. సమస్తప్రాణులందు నిది ప్రియ మిది యప్రియ మను పక్షపాతమువిడిచి సమముగా వర్తింపుము. కామమును గోపమును లోభమును మానమును దూరమున విడువుము. నీ వెప్పుడును ధర్మమునందే కనుగలిగి లోకమునందెవఁడు ధర్మము నుండి చలించునో వానిని నీచేతులార నెవ్వఁ డయిననుగాని దండింపవలయును. మఱియు భూమియందు వెలసిన వేదమతమును మాటికిఁ బాలించెదనని నీవు మనోవాక్కాయములు మూటిచే తను బ్రతినపట్టుము. మఱియును నీవు 'నేనెంతమాత్రమును జంకు లేక వేదమందుఁ బ్రతిపాదింపఁబడిన ధర్మమును దండనీతిని సహాయముగానూఁది యాచరించెదను. ఒకప్పుడు నింద్రియములకు లోఁకువగాను. బ్రాహ్మణులనునాకు దండింపఁగూడదు. లోకమును వర్ణసంకరమునుండి కాచెదను' అనియుఁ బ్రతిజ్ఞసేయు " మనిరి. ఆఋషులను దేవతలనుజూచి వేనుని పుత్రుఁడు 'దేవోత్తము

లారా!*బ్రాహ్మణులసాహాయ్యము నాకుండునేని యట్లె యగుఁగా క' యనఁగా నా బ్రహ్మావాదులందఱును 'అట్లె యగుఁగాక' యని యతని ననుగ్రహించిరి. వేదనిధి యగుశుక్రుఁ డతనికిఁ బురోహితుఁడయ్యెను. వాలఖిల్యులు మంత్రులయిరి. సారస్వత్యులు గణములయిరి. మహర్షి గర్గుఁ డతనికి జ్యోతిషికుఁడయ్యెను. విష్ణుని స్వశరీరమునుండి † యెనిమిదవవాఁడు పృథుఁడనిలోకమునం దెంతయు వినికి. (శ్రుతులయందు నెంతయుఁ బ్రతిపాదితమై యున్నది.) అతనికిఁ గొంతముందుసూతులును మాగధులును బుట్టియుండిరి. వారిపు డితనికి వందిజనులయిరి. పృథురాజు వారియెడఁ బ్రీతుండయి వారలయందు సూతునకు సముద్రతీరమందలి చవుకుఁ బట్టును, మాగధునకు వానిపేర వెలయు మగధదేశమునొసంగెను. భూమిమున్ను మిక్కిలి మిట్టపల్లముగా నుండెనని మనకుఁ మిక్కిలి వినికిగలదు. అతఁడు దానిని జక్కఁగా సమముగావించెను. ఒక్కొక్కమన్వంతరమందును భూమివిషమమగుచున్నది. పృథుఁడు తనవింటికొపుచేఁ గొండలను బగిల్చి నలుప్రక్కలనుగల శిలలప్రోవుల నెత్తివెచి యీభూమిని సమముగాఁ గావించెను. దేవేంద్రుఁడును బ్రహ్మయు విష్ణుండును, దక్కిన దేవతలును ఋషులును బ్రజలను బాలించు నధికారమం దతనికి నభిషేకముగా

---

* 'బ్రాహ్మణా మేసహాయాశ్చేదేవమస్తు' (దా. మూ.) 'బ్రాహ్మణా మే మహాభాగా నమస్యాః పురుషర్షభాః' అని(ఔ. మూ) 'నమస్యాః' మ్రొక్కఁదగినవారు

† విష్ణువు, విరజసుఁడు, కీర్తిమంతుఁడు, కర్దముఁడు, అనంగుఁడు, అతిబలుఁడు, వేనుఁడు, పృథువు అని విష్ణువునుండి పృథుఁ డెనిమిదవవాఁ డగుట తెలియునది. ఇందులకు 'అత్మనాష్టమ ఇత్యేవ శ్రుతిరేషా పరానృప' అని మూలము. ఇట శ్రుతియనఁగా జనశ్రుతియనికాని వేదమనికాని యర్థము గ్రాహ్యము.

వించిరి. భూదేవి రత్నములనుగొని పృథుమహారాజును దానై వచ్చిచూచెను. నదీపతి యగుసముద్రుఁడు పర్వతరాజగు హిమవంతుండును రత్నములనుగొని యతనిని సేవించిరి. ఇంద్రుఁడు నక్షయ్యంబగుధన మతని కొసంగెను. బంగారుకొండ యగుమేరువును సువర్ణము నొసంగెను. యక్షరాక్షసపతి యగుకుబేరుఁ డతనికి ధర్మార్థకామముల సమర్థింపఁ జాలినధనము నొసంగెను. పృథురాజు సంకల్పముచొప్పునఁ గోటానకోట్లు గుఱ్ఱములును నేనుంగులును రథములును మనుష్యులును గలిగిరి. అతని కాలమందు దుర్భిక్షమును ముసలితనమును మనోవ్యథలును గలుగవయ్యె. దొంగలవలనను సర్పాదులవలనను మఱి తక్కినవానివలనను భయము నొకప్పుడుఁ గలుగదయ్యె. భూమియందుఁ బంటలు విఱ్ఱవీఁగుచుఁ బండెను. అతఁడు సముద్రమున కెదురుచనునపుఁడాదలిజలములు స్తంభించియుండెను. పర్వతములును దొలఁగి యాతనికి దారియిచ్చెను. అతని ధ్వజ మెందును భంగమొందినది గాదు. అతఁడు, గొల్లవాఁ డావునుండి పాలుపిదుకునట్లు భూమినుండి పదునేడువిధము లయినపసులను బిండెను యక్షరాక్షసనాగులం దెవ్వరెవ్వరె కేదేదియిష్టమో వానివాని కాయాదానిని బిండి యిచ్చెను. అమ్మహాత్ముఁ డీమనుష్యలోకమందు ధర్మమును మిక్కిలి యుత్తమమైనదిగాఁ గావించెను. ప్రజలెల్ల నతనిచే రంజితులగుటచేత నతఁడు 'రాజు' అని పిలువఁబడెను. బ్రాహ్మణులకుఁ గలక్షతములను దొలఁగించి త్రాణముగావించుటచే 'క్షత్రియుం' డనియుఁ జెప్పఁబడెను. అతనిచేత భూమి ధర్మంబున వాసికెక్కినందున, సాధువు లతనిపేర దానికి 'పృథివి'యని పేరిడిరి. సనాతనుండగు విష్ణుఁడు తానే వీనిని నెలకొలిపి వీనితో 'రాజా!

నిన్నెవరు నతిక్రమింపఁజాలరు' అని చెప్పెను. అంత నాభగవంతుఁడు తనతపంబుచేత నంశమున నారాజునం దావేశించెను. అది కారణముఁగా నీజగము రాజులకు దేవతలకుంబోలె మొక్కుచు వచ్చుచున్నది. రాజు చారులను బంపి వారిగతులవలన లోకవృత్తాంతములను గనుఁగొనుచు *దండనీతిచేత నెప్పుడును రాజ్యమును రక్షించుచుండును గాన యతని నెవ్వఁడుగాని ధర్షింపరాదు. శుభమయిన కార్యమును శుభమునే కలిగించునదిగావలయును. (మంచిసేయురాజునకు మంచియే చేయవలయును గాని చెఱుపు దగదు.) † రాజు దేహముచేతను నింద్రియములచేతను దక్కినవారివలె సమానుఁడుగా నుండఁగా నతనివశమందు లోకమంతయు నిలిచియుండుటకు నతని దేవత్వగుణము తప్ప వేఱు కారణ మేమున్నది? అపుడు విష్ణుదేవుని లలాటమునుండి బంగారుతామర పుట్టెను. పిదప నాతామరనుండి లక్ష్మీదేవి కలిగి ధర్మునకు దేవి (పత్ని) యయ్యెను. ధర్మున కా శ్రీవలననుండి యర్థము పుట్టెను. అంత ధర్మము నర్థమును శ్రీయును రాజ్యమందుఁ బ్రతి

* 'దండనీత్యా చ సతతం రక్షితారం నరేశ్వరమ్' అని దా.మూ. 'రక్షితవ్యం నరేశ్వర' అని ఔ.మూలము. ఇట సామాన్యముగా రాజమహత్త్వవర్ణనము గాన ప్రథమపాఠమే యంగీకార్యము.

† ఆత్మనాకరణై శ్చైవ సమత్వేహ మహీక్షితః । కో హేతుర్యద్వశేతిష్ఠే ల్లోకో దైవా దృతే గుణః' అనిమూలము. 'సమస్యేహమహీక్షితః' అని యుభయపాఠము. తనబుద్ధిచేత నప్రడపుడు పొడకట్టు అవకాశములు మొదలయినసాధనములచేతను రాజు తన నడవడి జరుపుకొనవలయునని ప్రతాపచంద్రరాయల యర్థము. ఇది యంత సరసముగాకున్నది. పూర్వోక్తమైన యర్థమే యిట యుపపన్నము.

ష్ఠితులయిరి. మనుష్యుఁడు తాను జేసినపుణ్యము క్షీణింపఁగా స్వర్గలోకమునుండి భూమికివచ్చి దండనీతియందు విన్నాణియగు రాజుగా పుట్టుచున్నాఁడు. అట్టివానికి శ్రీవిష్ణువు మాహాత్మ్యము గలుగుచున్నది. వానికి మంచిబుద్ధియుఁ గూడుచున్నది. వాఁడు తక్కినవారికంటెను మహత్త్వమును బొందుచున్నాఁడు. వాఁడు దేవతలచేత స్థాపితుఁడుగాన వానినెవ్వరు నతిక్రమింపనేరరు. దీనినిబట్టియే యొక్కనివశమందు లోకమంతయు నిలిచియున్నది. దీనినిబట్టియే యాయొక్కని లోకమంతయు మీఱకున్నది. మంచియగుకార్యము మంచిదేయగును. దీనినిబట్టియే లోకులందొక్కొక్కఁడును, ఆయొక్కఁడు తమవలెనే దేహాదులుగలిగియుండినను, ఆయొక్కని మాటచొప్పున నడచుకొనుచున్నాడు. ఆరాజు సొంపయినముఖమును జూచినవారెల్ల నతనికి వశులయిరి. కాఁబట్టి వారతనిని రూపవంతునిగను ధనవంతునిగను భాగ్యవంతునిఁగను నెన్నుచున్నారు. అతనిదండము మహత్త్వమువలన నీతి, భూమియందు స్పష్టముగా వెలసినదయ్యె. న్యాయప్రవర్తనము విస్తరించినదయ్యె. ఈ కారణముచేతనే యీజగమంతయు నీతిచేత వ్యాప్తమయ్యెను.

యుధిష్ఠిరా! పురాణముల యాగతియు, మహర్షుల యుత్పత్తియు, తీర్థముల యుత్పత్తియు, * క్షత్రియుల పరంపరయు, చతుర్వర్ణములును, చతురాశ్రమములును, చతుర్వేదములును, వైదికధర్మములును, ఉపవేదములును, ఇతిహాసములును, న్యాయమును, దపమును, జ్ఞానమును, అహింసయు, సత్యమును, దాన

* 'వంశశ్చక్షత్రియాణాం' అని (దా.మూ) 'వంశశ్చ నక్షత్రాణామ్' క్షత్రియులుగానివారి యుత్పత్తియని యర్థము.

మును, మాత్సర్యము లేమియు, పెద్దలసేవయు, శుద్ధియు, ప్రయత్నశీలతయు, సర్వభూతములందును దయయు, భూమియందు వ్యవహరింపఁ బడునవి తక్కినవియన్నియును, సందేహముతీఱ నం దుపదేశింపఁ బడియున్నవి. కావున, యుధిష్ఠిరా! లోకము నఁదు రాజులు దేవతలకు సమానులని యెప్పుడును బ్రాహ్మణులు చెప్పఁదొడంగిరి. రాజులమహత్త్వమునుగుఱించి యంతయు సంపూర్ణముగాఁ జెప్పితిని. ఈవిషయమై మఱియు నేమి చెప్పవలసి యున్నది?' అనెను. ఇది యేఁబదియెనిమిదవయధ్యాయము.



## రాజధర్మపర్వము.

{ భీష్ముఁడు ధర్మరాజునకు చతుర్వర్ణముల ధర్మములను జెప్పుట. }

అంత యుధిష్ఠిరుఁడు పితామహుండగు భీష్మునకు మఱల నభివాదనముచేసి యంజలిగీలించి 'పితామహా! సకలవర్ణముల వారికిని సామాన్యములయిన ధర్మములేవి? చతుర్వర్ణములకు వేఱువేఱునున్న ధర్మములేవి? చతుర్వర్ణముల యాశ్రమము లెవ్వి? రాజధర్మము లనఁబడునవి యెవ్వి? రాష్ట్రము దేనిచే వృద్ధినొందును? రాజెట్లు వర్ధిల్లును? పురజనులును భృత్యులును నెట్లు వృద్ధినొందుదురు? కోశము, దండము, దుర్గము, సహాయులు, మంత్రులు* ఋత్విజులు, పురోహితులు, ఆచార్యులు, నెట్టివారుగా నుండినయెడ రాజు వారిని దిగవిడువవలయును? రాజెవ్వ

---

*ఋత్విజుఁ డనఁగా ఆయానియత సమయములందు నియోగింపఁబడువాఁడు. పురోహితుఁ డెప్పుడును నియుక్తుఁడై యుండువాఁడు.

రెవ్వరిని నేయేయాపదయందు నమ్మవలయును? దేనినుండి తన్ను దృఢముగా రక్షించుకొనవలయును? (ద్వైధీభావమందు భృత్యుల కెటువంటి శపథ ముండవలయును? ఆశపథము నుల్లంఘించిన యధర్మమునకు ఫలమేమి? వీనినంతయును వీని వ్యవహారమును నాకు సంగ్రహముగను సవిస్తరముగను జెప్పవలయును' అనెను.

అందులకు భీష్ముఁడు 'మహనీయమగు ధర్మమునకును వేధయగు కృష్ణునకును నమస్కారము. (ఇట గూడియున్న) బ్రాహ్మణులకును నమస్కరించి శాశ్వతములగు ధర్మములను జెప్పెదను. కోపములేకుండుట, సత్యము పలుకుట, పంచికుడుచుట (లేక పాడియును) క్షమయు, తన భార్యయందుఁ బ్రజలనుగనుటయు, పరిశుద్ధియు, ద్రోహము లేకుండుటయు, చక్కటియు, భృత్యులను బోషించుటయు, ననునివి సమస్తవర్ణములకును సామాన్యములయిన ధర్మములు. బ్రాహ్మణులకు మాత్రముగల ధర్మములును నీకుఁ జెప్పెదను. మహారాజా! (అందు మొదటి యాశ్రమమందున్న బ్రహ్మచారికి) దమమే (ఇంద్రియనిగ్రహమె) పురాతనమయినధర్మము. మఱియు * వేదాధ్యయనమును, వేదమును జదివించుటయు ధర్మములే. వీనిచేతనే యతఁ డనుష్ఠింపవలసిన కర్మములు †సమాప్త మగుచున్నవి. అట్లు స్వధర్మమునందు వర్తిం

* 'స్వాధ్యాయాధ్యాపనంచైవ' అని (దా.మూ) 'స్వాధ్యాయాభ్యసనంచైవ' అని ఔ.మూలము. వేదమును జదువుట, తపములు మొదలగునవి యభ్యసించుటయునని యొక వ్యాఖ్య.

† అనఁగా నివిచేసిననే యతఁడు కృతార్థుఁడగుచున్నాఁడు గాన, తక్కిన కర్మము లంతగా నావశ్యకములు గావనుట.

చుచు, విధర్మములను జేయక, శాంతుఁడయి, జ్ఞానముచేఁ దృప్తి నొందియుండు నా (వటుఁడగు) బ్రాహ్మణునికిఁ దనంతట ధనము లభించె నేని, యతఁడు విధ్యుక్తముగాఁ బెండ్లాడి సంతానమును బడయవలయును. మఱియు దానములును యాగములును జేయవలయును. ఆధనము నతిథులు బంధువులు మొదలగువారికిఁ బంచి కుడువవలయునని సాధువులు చెప్పెదరు. బ్రాహ్మణునకు వేదాధ్యయన మొకటిచేతనే యతనికి విహితములయిన కర్మానుష్ఠానములన్నియుఁ జేసి ముగించిన ట్లగుచున్నది. అతఁడు మఱి యితర మేమిచేసినను జేయకున్నను వేదాధ్యయన మొకటిచే నతఁడు *మైత్రుఁడనఁ బడుచున్నాఁడు. క్షత్రియునకుఁ గల ధర్మములను జెప్పెదను. రాజున కిచ్చుట తగునుగాని పుచ్చుకొనరాదు; యాగము చేయఁదగునే కాని ఋత్విజుఁడై యాగము చేయింపరాదు; వేదాధ్యయనము చేయవచ్చునుగాని యొకరిని జదివింపరాదు. ప్రజలను బరిపాలింపవలయును. దొంగలను వధించుటయం దెప్పుడును బూనికకలిగి యుద్ధమునందుఁ బరాక్రమమును మెఱయవలయును. యాగముల నాచరించుచు మిక్కిలియుఁ జదువరులై యుద్ధములందు గెలుపొందుచుండునట్టి రాజులే యుత్తమలోకములను జయించినవారిలో నున్నలు. క్షత్రియుఁడు యుద్ధమునుండి దేహమున గాయపడక మరలివచ్చునేని యట్టి కార్యమును బురాణవిదులు కొనియాడరు; ఇది నీచులగు క్షత్రి

*'మైత్రుఁడనఁగా భూతములకెల్ల మిత్రుఁడని వ్యాఖ్యలు చూపట్టుచున్నవి. కాని, మీఁదక్షత్రియునకు 'ఐంద్రుఁ'డనుటచే నిట 'మైత్రుఁ'డనఁగా మిత్రుఁడు. సూర్యుఁడు అధిదేవతగాఁ గలవాఁడని యర్థముచేయుట మఱింత సంగతముగా నున్నది.

యుల ధర్మమే ముఖ్యముగా నగునని చెప్పుదురు. దొంగల నడంచుటకంటె నెక్కుడుకృత్యమయినది యతనికి వేఱొద్దియు లేదు. దానము, అధ్యయనము, యజ్ఞమును రాజులకు క్షేమమును గలిగించును. కాఁబట్టి ధర్మమును గోరినట్టి రాజు విశేషించి * యుద్ధము చేయవలయును. రాజు ప్రజలనందఱను వారి వారి ధర్మములందు నెలకొలపి, యొక్కొక్క కార్యమును ధర్మముచొప్పున శమము గుదురుగాఁగలిగి చేయునట్లు గావింపవలయును. రాజు, మఱేకార్యముచేసినను జేయకపోయినను, తన ప్రజలను బాలించుట యొక్కటిచేసెనేని, యతఁడు విహితకర్మముల నెల్లఁ జేసి తీర్చినవాఁ డగుటయేకాక యట్టిరాజు † 'ఐంద్రుఁడు' అని పిలువఁబడుచున్నాఁడు. వైశ్యులకు సనాతనములగు ధర్మములను నీకుఁ జెప్పెదను. దానము, అధ్యయనము, యజ్ఞము, మంచి మార్గములచేత ధనముగూర్చుట,తండ్రి బిడ్డలనుంబోలెఁ బశువుల నన్నింటిని గాపాడుటయు వైశ్యుని ధర్మములు; ఇవితప్ప వేఱే కర్మము నాచరించినను నది యతనికి విరుద్ధ ధర్మమగును. అతఁ డాపశువులను గాపాడుటచేత గొప్పసుఖము నొందును. బ్రహ్మయే, పశువులను వైశ్యునికొఱకు సృజించియిచ్చెను; బ్రాహ్మణునకు రాజునకును ప్రజల నందఱను నొప్పించెను. వైశ్యునివృత్తిని వాని జీవనమును జెప్పెదను. వాఁ డితరుల పశువులను నాఱింటిని మేపునేని వానిలో నొక్కదానిపాలును దాను వేతనముగాఁ ద్రాగవచ్చును. ఇతరుల పశువులు నూఱింటిని మేపునేని వాని

* యుద్ధము లేనిచో రాష్ట్రము పెరుఁగదు గాన ధనము దానాదులకు చాలయునంత దొరకదు గాన ధర్మమును సిద్ధింపదని యర్థము.

† 'ఐంద్రుఁడు' ఇంద్రుఁడు దేవతగాఁ గలవాఁడు అని యర్థము.

యం దొకయావు నెద్దులజతను సంబళముగాఁ దీసికొనవచ్చును. ఇతరుల సంచి మొదలుతో వర్తకము చేసినచో లాభమునం దేడింట నొకపాలు దాను బుచ్చుకొనవచ్చును. (గవయము మొదలగువాని) కొమ్ముల వర్తకమునం దందలిలాభములం దేడవపాలును గొనవచ్చును. (కొన్ని మృగముల వెలపొడుగయిన) గొరిజల వర్తకమునందుఁ బదునాఱవపాలే లాభమెత్తి కొనవలయును. ఇతరుల విత్తనములను గొని సేద్యముసేయునేని పంటలో నేడింట నొకపాలు పొందవలయును. ఇది వీనికి సంవత్సరమున కయిన వేతనము. వైశ్యున కెప్పుడును బశువులను మేపననెడి కోరిక యుండరాదు. వైశ్యుఁడు పశువులను మేపి కాపాడఁ గోరునేని మఱియొకరిచే వానిని నెంతమాత్రమును గాపింపరాదు. శూద్రుని ధర్మములను జెప్పెదవినుము. బ్రహ్మ తక్కిన వర్ణములకు దాసునిఁగా శూద్రునిఁ గల్పించెను. కాఁబట్టి తక్కిన వర్ణములవారికిఁ బరిచర్య చేయుటయే శూద్రునకు ధర్మముగా విధింపఁబడియున్నది. కాన వారలకు శుశ్రూష చేయుటవలననే వాఁడు మిక్కిలి సుఖము నొందును. కనుక వాఁ డీమూఁడువర్ణములవారికిని * వారి పరువులచొప్పునఁ బరిచర్య చేయవలయును. శూద్రుఁ డెప్పుడుగాని యేవిధమునను ధనములను గూర్పరాదు. ఏలన దానివలన వాఁడు పాపమొందును. వాఁడు ధనమును బొందెనేని తనకంటె నెక్కుడగు తక్కినవర్ణములవారిని దనకు లోకువఁ జేసికొనఁజూచును. అయినను వాఁడు ధర్మము చేయఁగోరి రాజు ననుజ్ఞఁబొంది ధనమును జేర్చుకొనవచ్చును. వాని

---

*'పరిచరేత్త్రీన్ వర్ణానను పూర్వశః' అని (జౌ. మూ) 'వర్ణాననసూయకః' అని (దా. మూ, ) అసూయమాలి పరిచర్య చేయవలయునని యర్థము.

వృత్తియు జీవించు విధమును జెప్పెదవినుము. మూఁడువర్ణముల వారును శూద్రునవశ్యము భరింపవలయును. వారు తమకుఁ బరిచర్యచేయు శూద్రునకుఁ బాఁతగిలిగొన గొడుగు, పీవనలు, పావలు, తలగుడ్డలు, పడుకలు, ఆసనములు, చినిఁగిపోవుటచే తమకుఁ గట్టఁదగని వస్త్రములును నీయఁవలయును. ఏలన నవి ధర్మముచొప్పున వాని ధనములు. ఎవఁడేని శూద్రుఁడు ద్విజాతులం దొకనిని శుశ్రూషచేయుటకై యాశ్రయించెనేని యతఁడాశూద్రునకుఁ దగినవృత్తి నేర్పఱుప వలయునని ధర్మవిదులగు వారు చెప్పుదురు. శూద్రుఁడు సంతానములేక మృతుఁడయ్యెనేని వానికి నొడయఁడగు ద్విజుఁడే పిండమొసఁగ వలయును. శూద్రుఁడు వృద్ధుఁడయినను దుర్బలుఁ డయినను నాద్విజుఁడు వానిని బోషింపవలయును. శూద్రుఁడు తన్నుఁ బోషించునొడయునికి నెట్టియాపద వచ్చినపుడును దిగవిడువ రాదు. భర్తకు ధనము నశించెనేని శూద్రుఁడు * తన కుటుంబపోషణమునకుఁ బోఁగా నెక్కువగా మిగిలిన ధనము చేత నతనిని బోషింపవలయును. శూద్రునకు సొంతమయిన ధనములేదు. వానిధనమేదియు వానిఁ బోషించువానికే చెల్లును. యజ్ఞము మూఁడువర్ణముల వారికిని ధర్మముగాఁ జెప్పఁబడినది. †అది శూద్రునకునుగూడ విధింపఁబడి యున్నది.

---

* 'అతిరేకేణ' అని మూలము. మిక్కిలి యక్కఱతోనని దీనికర్థము.

† 'ఉక్తస్త్రియాణాం వర్ణానాం యజ్ఞస్తస్యచ భారత' అని (జై. మూ 'త్రయ్యేవభారత' అని (దా. మూ) దీనిచే శూద్రునకు యజ్ఞము లేదని యర్థము. తక్కిన ప్రతులన్నిటను 'తస్యచ'అని యుండుటంబట్టియు, వెంబడినే 'పాకయజ్ఞైర్యజేత' యని మంత్రములు జపించుట 'స్వాహా' 'వషట్' అని

అయినను శూద్రునకు స్వాహాకారమును వషట్కారమును మంత్రమును లేదు. కాఁబట్టి శూద్రుఁడు, వేదములందుఁ జెప్పఁబడిన వ్రతములను విడిచి * పాకయజ్ఞములను యజింపవలయును. పాకయజ్ఞమునందు దక్షిణ పూర్ణపాత్రమేయగును; మఱొక్క దక్షిణ యీరాదు. తొల్లి పైజవనుఁడనుశూద్రుఁడు †ఐంద్రాగ్నమనుయాగవిధానముచొప్పున లక్ష పూర్ణపాత్రముల నిచ్చెనని మేము వినియున్నారము. ‡యజ్ఞము తక్కిన మూఁడువర్ణముల వారికెట్లో యట్లే శూద్రునకు విధింపఁబడియున్నది. సమస్తములయిన యజ్ఞములందును, శ్రద్ధాయజ్ఞము మొట్టమొదటిదిగా విధింపఁబడియున్నది. శ్రద్ధ పరమదైవతము. అది యజించు

---

చెప్పుటయు లేక యజ్ఞములు చేయవచ్చునని విధించి యుండుటంబట్టియు, యజ్ఞములు శూద్రునకును గలవని యర్థము సేయఁబడెను.

* పాకయజ్ఞమనఁగా స్వల్పయజ్ఞములు. దుష్టగ్రహశాంతియు క్షుద్రదేవతలగు విశ్వేదేవాదుల నారాధించుటయు నిందలి విధులు. పూర్ణపాత్ర మనఁగా 256 పిడికెళ్ల బియ్యము నింపిన పెద్దపాత్ర లేక గంప. శూద్రుఁడీ పూర్ణపాత్రమును దప్ప మఱేదక్షిణనుగాని తన యజ్ఞమునం దీయరాదు.

† ఐంద్రాగ్న విధానమందు లక్షపశువులను గోవులు గుఱ్ఱములు మొదలగు వంటివానిని దక్షిణ యీవలయును. ఈ శూద్రుఁడును ఆవిధానమును అనుష్ఠించినాఁడు కాని యందు మంత్రము లేదు. మఱి లక్షపశువులకు బదులుగా లక్ష పూర్ణపాత్రముల ఏర్పఱుపఁబడినవని తెలియువది.

‡ 'యతోహి సర్వవర్ణానాం యజ్ఞస్తస్యైవ భారత' అని మూలము. దీనికి 'బ్రాహ్మణులు మొదలయిన యేవర్ణములవారి యజ్ఞమును వారికి శుశ్రూష చేయు శూద్రునిని జేరినదగును. అనఁగా శూద్రుఁడు వారికి శుశ్రూష చేయుటచేతనే వారియజ్ఞమును దాను జేసిన యజ్ఞముగానే పొందుచున్నాఁడు. అనఁగా నాయజ్ఞమందుఁ దాను జేయకున్నను శుశ్రూషనుబట్టి చేసినవానివలె

వారిని బవిత్రము చేయునది. బ్రాహ్మణులును పరమదైవము వా రాయాకోర్కులతోఁ గూడికొన్నవారై యొకరినొకరు తమ తమకయిన యాగములను బెక్కులను గావింతురు. తక్కిన మూఁడు వర్ణములవా [illegible] బ్రాహ్మణులు సంతానములను గాంచిరి. *మూ [illegible] సంతానములే. బ్రాహ్మణులు దేవతలకును [illegible] ప్పనను నీకది పరమహితమగును. సకలవర్ణములును వారివలనఁ బుట్టుటచేతను, వారుచేయు యజ్ఞములన్నింటిలోను నన్నివర్ణములవారికిని సంబంధము కలిగియున్నది. అట్లు సంబంధము కలిగియుండుట తమ యిచ్చవొప్పునఁగాదు. బ్రాహ్మణులవలనఁ బుట్టియుండు విధిని బట్టి కలిగినది. ఋగ్యజుస్సామముల నెఱింగిన ద్విజుఁడు దేవతవలె నెప్పుడును బూజ్యుఁడగును. శూద్రుఁడు ఋగ్యజుస్సామములు లేనివాఁడు గాన †ప్రాజాపత్యుఁడగును. మానసికయజ్ఞము

---

భాగము నొందువాఁడని భావము. ఎట్లన శ్రద్ధాయజ్ఞము యజ్ఞములందు మొట్టమొదటిదగాన, శూద్రుఁడు బ్రాహ్మణాదులయందు శ్రద్ధగలిగి వర్తించుటచే తాను వారియజ్ఞములను జేయకపోయినను వారియందలి తనశ్రద్ధయొక్క మహిమచే ఆయజ్ఞము చేసినట్టివాఁడగుచున్నాఁడని భావము.

* తక్కిన మూఁడువర్ణములవారును బ్రాహ్మణుల వలననుండియే పుట్టినవారనుటచే శూద్రుఁడు యజ్ఞమునం దధికారమునొందుచున్నాఁడని తెలియునది.

† ప్రజాపతి అధిదేవతగాఁ గలవాఁడు గాన ప్రాజాపత్యుఁడని యర్థము. బ్రాహ్మణుఁడు ఆగ్నేయుఁడును క్షత్రియుఁడు ఐంద్రుఁడునయినట్లు శూద్రుఁడు ప్రాజాపత్యుఁడగునని తెలియునది. ఋగ్యజుస్సామాదులు తెలిసిన బ్రాహ్మణుఁడు సాక్షాద్దైవము. శూద్రుఁడన్ననో ఋగ్యజుస్సాముల నధిగమించుటకును వేదమంత్రములను బఠించుటకు నర్హత లేకపోయినను ప్రజాపతిని అధిదేవతగాఁగలిగి ఆదేవతను వేదోక్తములుకాని యితరవిధానములచేత నారాధించుచున్నాఁడని తెలియునది.

సకలవర్ణములవారికిని విహితమైయున్నది. ఈ *మానసికయజ్ఞము చేయువానియెడ వాఁడు శూద్రుఁడయినను గాని దేవతలుగాని యితరులగు గొప్పవారుగాని (హవిర్భాగాదులు పుచ్చుకొనుటకు) కోరకుందురనుట యెంతమా[illegible] లేదు. కాఁబట్టియే శ్రద్ధాయజ్ఞము సకలవర్ణములవా[illegible]ఁబడుచున్నది. బ్రాహ్మణులు మూఁడువర్ణములవా[illegible]రణమగు దైవము. కాఁబట్టి యీ తెగవారు తక్కిన మూఁడు త[illegible]వారినిగూర్చి (యీ కామమునుగోరి యీ వర్ణమువాఁడు నన్ను వరింపఁగా నీ యజ్ఞమును యజించుచున్నానని) యుద్దేశించి వారియజ్ఞములు చేయకుండినవారుగారు; చేసియే యున్నారు. అయినను నట్టి యాగమునందు వైదికమయిన యగ్నికిఁ దక్కువయగు వితానమను (లౌకికాగ్నిని) ఆధారముగాఁ జేసిరి. అది కారణముగా బ్రాహ్మణుఁడు మూఁడు వర్ణములవారికిని యాగము చేయించినవాఁడగుచు

* యజ్ఞములు, శారీరకములు, వాచికములు, మానసికములు-అనఁగా శరీరముచేతను, వాక్కుచేతను మనస్సుచేతను జేయఁబడునవని మూఁడువిధములు. బ్రాహ్మణుఁడు. మూఁడువిధముల యజ్ఞములను జేయవచ్చును. క్షత్రియుఁడును వైశ్యుఁడును తమ శరీరముచేత యజ్ఞములు చేయరాదు. కాఁబట్టి తమయజ్ఞములందు బ్రాహ్మణులను నియోగించుకొనవలయును. అయినను. ఈ యిరుదెగలవారును వాక్కుచేతను మనస్సుచేతను యజ్ఞములు చేయవచ్చును. అనఁగా వాచికములగు మంత్రములను జపించవచ్చును. మానసయజ్ఞములు చేయవచ్చును. శూద్రుఁడన్ననో తనయజ్ఞములందుఁ దనదేహము నుపయోగింపరాదు. వాక్కుచేత మంత్రములు జపింపరాదు. కాన వానికిఁ గలది మానసికయజ్ఞ మొక్కటియే. మానసిక యజ్ఞమనగా వేదవిధిలేకయే యొకదేవతకుఁగాని దేవతలకుఁగాని మనస్సుచేత నిచ్చునట్లు నిశ్చయించుట. నిశ్చయించిన వెంటనే నిజముగా సంకల్పించినది యిచ్చి తీరవలయునని తెలియునది.

న్నాఁడు. ఈ కారణమునుబట్టి చూడఁగా నాలుగువర్ణములును, యజ్ఞయోగమునుబట్టి సరిగానే (అనఁగా ధర్మమందు సమానులుగానే) యుండుటకాక, ఒక్క నొకరికొకరు జ్ఞాతులుగాను సంబంధపడి యున్నారు. [illegible]న వారందఱును బ్రాహ్మణుని వికారమే యగుదురు. [illegible]ణుఁడు క్షత్రియాది కన్యలయందుఁ బుట్టించిన పరంపరనుండి కలిగిన వారేయగుదురు. *సృష్టియందు మొదటఁగలిగినవాఁ డెవ్వఁడని నిజమును గనుఁగొనఁగా వర్ణములన్నింటియందును బ్రాహ్మణుఁడే మొదట (బ్రహ్మదేవరూపమున) సృజింపఁబడినాఁడని తెలియుచున్నది. సామము యజుస్సు ఋక్కులును మొదటనొక వేదముగానుండి పిదప పెక్కులయినట్లు బ్రాహ్మణుఁ డొక్కఁడే మొదటఁ గలిగియుండి యతనినుండి తక్కిన వర్ణములు గలిగినవి. ఈవిషయమై పురాణజ్ఞులగువారు మున్ను వైఖానసమునులు యజ్ఞముసేయుచుండు

---

* ఇట 'అధరో వితానస్సంసృష్టః స్త్వథ తత్రసృష్టో బ్రాహ్మణ స్త్రీషు వర్ణేషు యజ్ఞసృష్టః' అని మూలము గ్రహింపఁబడెను. ఇందులకు దాక్షిణాత్య కోశములందు 'అధరో వితాన స్త్వధ తత్రసృష్టో, నబ్రాహ్మణ స్త్రీషువర్ణేషు రాజన్' అనియు ఔత్తరాహకోశములందు 'అధరో వితాన స్సంసృష్టోవైశ్యో బ్రాహ్మణ స్త్రీషువర్ణేషు యజ్ఞసృష్టః' అనియుఁ బాఠాంతరములు. రెండవ దానికి "వితానమనెడి యగ్ని వైశ్యులనలననుండి గ్రహింపఁబడినను మంత్రములతోఁ గూడియున్నను తక్కువేయగును. బ్రాహ్మణుఁడే మూఁడువర్ణములవారినిని యజ్ఞములు చేయించువాఁడగును' అని యర్థము. హోమాగ్నులన్నియు ప్రాయికముగా వైశ్యుల గృహములనుండియే ప్రణయింతురు. వితానమనఁగా శూద్రుని హోమాగ్నియనియు అగ్ని విస్తారమనియు నర్థము. ఇట పాఠములు తెలివిడిగాకున్నవి.

నపుడు *యజ్ఞములనుగుఱించి పాడినగాథలను జెప్పెదరు. అవి యేవనఁగా 'సూర్యుఁ డుదయించుటకు మునుపుగాని పిదపఁగాని జితేంద్రియుఁ డగుపురుషుఁడు శ్రద్ధగలవాఁడై ధర్మముచొప్పున నగ్నిహోత్రము వేల్చుచున్నాఁడు. ఇందులకు శ్రద్ధయే గొప్ప కారణము. అగ్నిహోత్రవిధులందు †స్కన్నమనునది మొదటిది; అస్కన్నమనునది కడపటిది; సర్వోత్కృష్టమైనదియు. యజ్ఞములుబహువిధములు. వాని కర్మములును ఫలములును నానావిధములు. ఏద్విజుఁడు శ్రద్ధగలవాఁడై వానినన్నింటని శాస్త్రజ్ఞానముచే నిశ్చయించి తెలిసికొనుచున్నాఁడో యా పురుషుఁడే యజ్ఞము సేయుట కర్హుఁడు. ఎవఁడు దొంగయైనను, పాపుఁడయినను, పాపాత్ములందు మిన్నయైనను, ‡యజ్ఞమును యజింపఁగోరునో వానిని సాధుపురుషుఁడనియే చెప్పుదురు. ఋషులు నట్టివానిని గొనియాడుదురు. ఇది సరియే. ఇందుల కెంతమాత్రము సందేహము లేదు. సర్వవర్ణములవారును, సర్వకాలములందును, సర్వవిధములచేతను యజ్ఞము సేయవలయుననుట నిర్ణయము. ఏలనఁగా మూఁడులోకములందును యజ్ఞమునకు సాటియైన దొక్క

* ఇట 'యజ్ఞగీతాః' అనియున్నది. ఇందులకు విష్ణుగీతలని యొక వ్యాఖ్య. యజ్ఞములను గుఱించిన గీతలనివ్యాఖ్యానము. మఱొకటి. అయినను బూర్వార్థమే ప్రకృతముగా నుండుటంబట్టి గయికొనఁబడెనని తెలియునది.

† బహ్వృచ బ్రాహ్మణమందు అగ్నిహోత్రములు. పదియాఱు చెప్పఁబడినవి. అందు 'మారుతం విష్యన్దమానమ్' అని స్కన్నముకూడ ఆద్యమగు అగ్నిహోత్రముగాను అస్కన్నమనఁగా యథావిధిగా వేల్పంబడి సర్వోత్కృష్టమైనదిగాను జెప్పంబడియున్నది.

‡ యజ్ఞ మనుటకు విష్ణువును యజించుట యని వ్యాఖ్య.

టియు లేదు. కాఁబట్టి పురుషుండసూయమాలి, శ్రద్ధగలిగి, పరిశుద్ధితో తన శక్తికొలఁదిని దన యిష్టముచొప్పున యజ్ఞము చేయువలయునని పెద్దలు చెప్పుదురు. ఇది యేఁబదితొమ్మిదవ యధ్యాయము.

—·◆·—

## రాజధర్మపర్వము.

### భీష్ముఁడు ధర్మరాజునకు నాలుగాశ్రమముల ధర్మములను జెప్పుట.

భీష్ముఁడు 'యుధిష్ఠిరా' ఆశ్రమములు నాలుగింటి నామములును వాని కర్మములును వినుము. వానప్రస్థము, భైక్ష్యము, (సన్న్యాసము), గార్హస్థ్యము, బ్రహ్మచర్యమని * బ్రహ్మదేవుఁడు చెప్పిన యాశ్రమములు నాలుగుగలవు. †చౌలమనెడు సంస్కారమునొంది, యుపనయనవిధిచేత ద్విజత్వమునుబొంది వేదముల నధిగమించి, అగ్న్యాధానము మొదలయిన కర్మములనుగావించి, గృహస్థాశ్రమమును దీర్చికొని యింద్రియముల నడంచి యాత్మశుద్ధితో నడఁకువగలిగి భార్యనుగూడియో భార్యలేకయో వానప్రస్థాశ్రమమును బొందవలయును. ధర్మవిదుండగువాఁడు, ఆ యాశ్రమమందు ‡వానప్రస్థునకు వలయుశాసనముల ననుష్ఠించి

---

* 'బ్రహ్మణేరితమ్' (దా.మూ.) 'బ్రాహ్మణైర్వృతమ్' (ఔ.మూ.) బ్రాహ్మణులనుష్ఠించు నాశ్రమములనుట.

† 'చూడాకరణ సంస్కారమ్' (దా.మూ.) 'జటాధారణ సంస్కారమ్' అని (ఔ.మూ.) ఉపనయనమునకుఁ బూర్వము చూడాకరణమే (చౌలమే) యుపపన్నముగాన నదియే గ్రాహ్యము.

‡ 'తత్రారణ్యకశాస్త్రాణి సమధీత్య' అని మూలము. అరణ్యకములను వైదికశాస్త్రముల నధిగమించియని ప్రతాపచంద్రుని యర్థము.

యూర్ధ్వరేతసుఁడై * సన్న్యాసమునొంది, బ్రహ్మసారూప్యము నొందుచున్నాఁడు. రాజా! ఊర్ధ్వరేతసులయిన (సన్న్యాసులయిన) మునులగుటకుఁ గారణములగు లక్షణము లివియే. ఎఱుకగల బ్రాహ్మణుఁడు మొదట వీనిని జేయవలయును. బ్రాహ్మణుఁడు బ్రహ్మచర్యాశ్రమమును జరపినపిదప మోక్షమును గోరి భైక్షచర్యము (సన్న్యాసము)ను బొందుట ప్రశస్తము. క్షేమంబగు నాలుగవ యాశ్రమమును బొందిన బ్రాహ్మణుఁడు గృహమును, నగ్నిని విడిచి, తనంతట దొరకినదానితో కడుపుఁ బ్రోచికొనుచు, ప్రొద్దు గ్రుంకినచోటనే పరుండుచు, మననశీలుఁడై, అంతరింద్రియములనడంచి, బహిరింద్రియములను గెలిచి, యాశలనుమాని, పెద్దఱికమునువదలి, భోగములను వికారములును లేక యుండునేని బ్రహ్మసారూప్యము నొందుచున్నాఁడు. మునులుగూడ ధర్మమున సేవించునట్టిదియు నాచరించుటకుఁ గష్టమైనదియు నగు గృహస్థధర్మమునం దుండువాఁడు వేదముల నధిగమించి వైదికకృత్యములనెల్ల నిర్వర్తించి సంతానములను గని యా యాశ్రమమందలి సుఖములననుభవించి మిక్కిలి యెచ్చరికతోడ దీని నాచరింపవలయును. అట్లు చేయునేని యతఁడును బ్రహ్మసారూప్యము నొందును. మఱియు నాగృహస్థుఁడు కపటములేక తనభార్యచేతనే తృప్తుఁడై ఋతుకాలములందే భార్యను బొందవలయును. మఱియు దుడుకును మోసమును లేక శాస్త్రవిధుల ననుష్ఠించుచుండవలయును. మఱియు మితముగాఁ గుడుచుచు, దేవతలందుఁ దత్పరుఁడై నెనరుగలిగి, సత్యము పలుకుచు, క్రూరుండుగాక మెత్తనిమనస్సుగలిగి,

* 'ప్రవ్రజిత్వా' అని (ఔ.మూ.) 'ప్రజాహిత్వా' (దా.మూ.)

క్షమతోఁగూడి యుండవలయును. అతడు దమముగలిగి, గురువు మొదలగువారి యాజ్ఞలకులోనై హవ్యకవ్యములయందుఁ బరాకు వడకుండవలయును. బ్రాహ్మణుల కెప్పుడును నన్నము పెట్టుచుండ వలయును. మత్సరములేక యన్ని యాశ్రమములవారికిని దానము లొసఁగుచుండవలయును. శ్రౌతకర్మముల నెప్పుడును విడువకుండవలయును. ఈ విషయమై మహానుభావులగు మహర్షులు నారాయణుఁడు పాడిన గీతము నొకటిని జెప్పుచున్నారు. అది మిక్కిలి యర్థవంతమై యెంతయుఁ దపఃప్రయుక్తమయినది. అది నేనుజెప్పెదను వినుము. 'సత్యము, ఆర్జవము, అతిథిపూజనము, ధర్మము, అర్థము, స్వభార్యలతోడి రతి యను వీనిచేత నొకఁడు సుఖము లిహమందును బరమందును ననుభవింపవలయును. ఇది నామతము' అనియే. మహర్షు లీ యాశ్రమమునందలి వారికి దారపుత్త్రాదులను భరించుటయు, వేదములను బరిపాలించుటయు మిక్కిలి శ్రేష్ఠములని చెప్పెదరు. ఈ విధము చొప్పున బ్రాహ్మణుఁ డెవ్వఁడు యజ్ఞములనాచరించుచు గృహస్థధర్మమును గలరీతిని జరుపుచున్నాఁడో యతఁడు గృహస్థాశ్రమమును జక్కఁగా నిర్వర్తించి స్వర్గమునందుఁ బవిత్రంబగు ఫలము నొందును. ఆ గృహస్థుఁడు దేహమును విడిచినపిదప వాఁడు కోరిన కామములన్నియు నేదేశమునను నేకాలమునను నాశము నొందక భృత్యుఁడొడయునింబోలె *నతిమాత్రమయిన యెచ్చరికతోఁ గలకాలము నతనినెదురుచూచుచుండును. యుధిష్ఠిరా! బ్రహ్మచారి యొంటిమెయి నుండి యన్ని వేదములను జపించుచు,

* 'సర్వతోక్షిశిరోముఖాః' అన్నిప్రక్కల కన్ను తల మొగము గలిగినవి అని యర్థము-అనఁగా అంత యొక్కుడు ఎచ్చరికతోననుట.

నొక్క యాచార్యునికే శుశ్రూషసేయుచు, దేహమును వస్త్రములును మన్నును మఱికియుఁ గలిగియుండ, నిత్యవ్రతమును నిత్యదీక్షయుఁ గలిగి యింద్రియముల జయించి గురువుతోడి నీడ వలె ననుసరించుచు నతని కెంతయు నడఁగి మడిఁగి యధ్యయనము చేయుచు వ్రతమునుండి యెంతమాత్రము చలింపక విహితకృత్యముల నెప్పుడు ననుష్ఠించుచు నుండవలయును. మఱియు గురువునకు మ్రొక్కి యెప్పుడును బరిచర్యసేయుచు యజనయాజనాధ్యయనాధ్యాపనాదు లనెడియీ యాఱుకర్మములందును బట్టుదల కలిగి, యన్ని కార్యములందును నాసక్తితోఁ బ్రవర్తింపక, యెవరియందును నిగ్రహానుగ్రహములు చూపక, విరోధులకయినను మంచి సేయవలయును. ఇవన్నియు, బ్రహ్మచర్యాశ్రమమునం దున్నవానికి ధర్మములగును' అనెను. ఇది యఱువదవ యధ్యాయము.



## రాజధర్మపర్వము.

### { భీష్ముఁడు ధర్మరాజునకు బ్రాహ్మణ ధర్మములను జెప్పుట. }

ధర్మరాజు 'ననుబోఁటివారికి మంగళకరములును మీఁద మిక్కిలియు సుఖప్రదములును హింసారహితములును లోకసమ్మతములును సులభము లయినయుపాయములు నగు ధర్మములను మరలఁ జెప్పుము' అనెను.

భీష్ముఁడు 'ప్రభూ! బ్రాహ్మణునకు నాలు గాశ్రమములును విధింపఁబడియున్నవి. వానిని దక్కిన మూఁడువర్ణములవా రనుసరింపరు. రాజా! స్వర్గప్రదములును రాజులకు ముఖ్యముగా నాథా

గములయినవియు నగుకర్మములు వెక్కలింతవఱకే చెప్పఁబడి యున్నవి. *అయిన నవియెల్ల నీవిపు డడిగినదానికి నుత్తరముగా నుదాహరింపఁ జూచెదు. ఏలన నవియెల్ల క్షాత్ర (క్రౌర్య) ధర్మమునం దాసక్తులయిన రాజులకు విహితములయినవి. క్షాత్రకర్మములును వైశ్యకర్మములును శూద్రకర్మములును మందబుద్ధియగు బ్రాహ్మణుఁ డెవఁడు సేవించునో వాఁ డీలోకమున నిందితుఁ డగుటయే కాక పరమందును నరకమునొందును. లోకమందు పనివాఁడు, కుక్క, తోడేలు, పశువు అను వీని కేపేళ్లు పెట్టఁబడియున్నవో యాపేళ్లే తనకు విరుద్ధకర్మముల నాచరించు బ్రాహ్మణునికిఁ బెట్టుదురు. ప్రాణాయామ ప్రత్యాహార ధ్యానధారణాతర్కసమాధు లనెడి యోగయుక్తకర్మములందుఁ బ్రవృత్తుఁడై నాలు గాశ్రమములందును వర్తించుచు సమస్తధర్మముల నాచరించుచు, †అవిశ్రాంతుఁడు గాక, యాత్మజయము గలిగి, పరిశుద్ధుఁడై, తపమునం దాసక్తుఁడై, యాశ దిగవిడచి, దాతృత్వము గలిగి యున్న బ్రాహ్మణునకు నాశరహితము లయినలోకములు గలుగును. ‡ ఏమనుష్యుఁ డేప్రాయమున నేకాలమందు నేప్రదేశమున నేకారణమునుబట్టి యెట్టికర్మము చేయునో యామను

---

* 'నేమాని దృష్టాంతవిధాన్యకృతాని । క్షాత్రే తేహి సర్వం విహితం యథావత్' అని(కుం.మూ.) 'శాస్త్రాణి సర్వస్య విధాన్యకృతాని క్షాత్రే తేహి సర్వం విహితం యథావత్' అని (దా.మూ.) ఈ పాఠ మెంతయు సంగతము గాకున్నది కాన త్యాజ్యము.

† 'సంవృత్తస్య' అని మూలము. 'తద్భూతస్య' అని దాక్షిణాత్యపాఠము. పూర్వపాఠమే యిట గ్రహింపఁబడినది.

‡ 'యో యస్మిన్ కురుతే కర్మ యాదృశం యేన యత్రచ । తాదృశం తా

ష్యుఁ డాకారణమునుబట్టి యాకర్మమును (దానియందలి లోభ మువలనను నభ్యాసమువలనను) గుణవంతమయినదని తలఁచునే కాని నింద్యమని దానినుండి విరమింపఁడు. (ఎవఁ డేప్రాయమున నెచ్చట నెప్పు డేఫలమునుబట్టి యెట్టికర్మమును జేయునో వాఁ డట్టిదానిచే నటువంటి గుణము నే పొందుచున్నాఁడు). రాజేంద్రా! వడ్డిగొనుటయు, వర్తకమును, సేద్యమును, వేఁటయు, వేదాధ్యయనమునకు సాటియైనవని తెలియుము. కాలము మనుష్యునిఁ బురికొలుపుచున్నది. పూర్వజన్మకాలపు వాసనలంబట్టి వానిని సంబంధించిన విషయము లేర్పడుచున్నవి. కనుక వాఁ డాకాలమునకు లోనై యుత్తమ మధ్యమాధమ కార్యములు చేయుచున్నాఁడు. పూర్వజన్మమునందుఁ జేసిన మంచికర్మములందు ముఖ్యములయినవి, మీఁద నెంతయు శ్రేయస్కరము లయినవి; అవి యంతయు నొందఁగలవియే కాని యెన్నఁడు నుడుగనవిగావు. మనుష్యులు దమతమ పూర్వవాసనలను బురికొలుపు పనులయందే యెప్పుడును దగిలియుందురు. ఆవాసనలును మనుష్యుని నన్నిదెసలను బురికొలుపుచుండును.' ఇది యఱువదియొకండవయధ్యాయము.



వృత్తేనైవ సగుణం ప్రతిపద్యతే' అని మూలము. ఎవఁ డెచ్చట నెప్పు డెట్టి కర్మమును జేయునో యటువంటి గుణము నే పొందునని ప్రతాపచంద్రరాయుల యర్థము, 'సగుణమ్' అనుచో సః+గుణమ్ అని విచ్ఛేద మీయర్థమునఁ దెలియునది. ఇది బాగు.

## రాజధర్మపర్వము.

భీష్ముఁడు ధర్మరాజునకు బ్రాహ్మణునికిఁ ద్యాజ్యములగు ధర్మములనుజెప్పి రాజధర్మమును బ్రశంసించుట.

భీష్ముఁడు 'అల్లెత్రాటి నీడ్చుటయు, శత్రువుల నుక్కడఁచుటయు,* సేద్యమును, వర్తకమును. పశువుల మేపుటయు, ధనముఁ గోరి పరులకుఁ బనులుసేయుటయు ననునివి బ్రాహ్మణునకు మిక్కిలియుఁ జేయఁదగనివి. బుద్ధిమంతుఁడును గృహస్థుఁడునగు బ్రాహ్మణుఁడు వేదము నధిగమించి, యజనాదు లయినయాఱుకర్మములను గావింపవలయును. గృహస్థ కృత్యములన్నియుఁ జేసి వీడినపిదప బ్రాహ్మణుఁ డడవికిఁబోయి వసించుట యెంతయుఁ దగును. రాజున కూడిగముచేయుటయు, దున్ని ధనము సంపాదించుటయు, వర్తకముచేసి బ్రదుకుటయు, కపటవృత్తియు, ఱంకుతనమును, కుసీదమును బ్రాహ్మణునకు మిక్కిలి నింద్యములు, తన ధర్మమునుండి తప్పి దుష్టం బగునడవడి నెవఁడుగైకొనునో యాచెడుబ్రాహ్మణుఁడు. శూద్రుఁడగును. శూద్రస్త్రీని నిల్లాలుగఁ జేసికొని కొండెములు జెప్పుటయు, నట్టుఁదనమును, గలిగి గ్రామమువారి కూడిగము చేయుటమొదలగు విరుద్ధకర్మములు

---

*'వృద్ధ్యాకృషి వణిక్త్వేన జీవసంజీవనేనచ, వేత్తుమర్హాపి రాజేంద్ర స్వాధ్యాయగణితం మహత్ (జె. మూ.) (స్వాధ్యాత్మగుణితేనచ' అని (దా. మూ.)

*'అన్తవన్తి ప్రధానాని పురాశ్రేయస్కరాణిచ' అని (జె. మూ.) 'అన్తవన్తి ప్రదానాని పరంశ్రేయస్కరాణిచ' అని (దా. మూ.) ప్రథమపాఠమే సాధువుగాన యంగీకృతమైనది.

చేయునేనియు శూద్రుఁడగును. బ్రాహ్మణుఁడు తొలఁగి మంద బుద్ధియై మంచినడక విడిచి యిట్టివాఁడగునేని యతఁడు వేదమును గఱచినను గఱవకున్నను, శూద్రునకు సాటిగాను దాసునకు సాటిగాను దొలఁగించి పెట్టిభోజన మిడవలయును. ఇట్టివారందఱును శూద్రునకు సాటియగుదురుగాన వైదికములయిన దేవకార్యములందు వర్జింపవలయును. మరియాదలేనివాఁడును, వంచన మాటలాడువాఁడును, క్రూరంపు నడవడిగలవాఁడును, హింసింపఁ దివురువాఁడును, మంచినడవడిని స్వధర్మమును దిగవిడిచినవాఁడును, నగు బ్రాహ్మణునకు, హవ్యములు కవ్యములును మఱియుఁ దక్కినవి యియ్యఁదగినవి యెల్ల నియ్యరాని వగుచున్నవి. కాఁబట్టియే, బ్రాహ్మణునకు, దమము, శౌచము, ఆర్జవము ననుధర్మములును విధింపఁబడియున్నవి. అట్లె నాలుగాశ్రమములును బ్రహ్మ (వేదము)చే బ్రాహ్మణునకు మునుపే విధింపఁబడియున్నవి. దమమును బూజ్యమయిన శీలమును గలిగి, సోమపానము చేసినవాఁడును, ఆశలేనివాఁడును, అన్నిటిని సైఁచువాఁడును, దయయు నోర్పును గలవాఁడును, బరులకుఁగీడుదలంపనివాఁడును, క్రూరుఁడు కానివాఁడును, కపటము లేనివాఁడును నగువాఁడే బ్రాహ్మణుఁ డగునుగాని పాపకర్ముఁ డగువాఁడు బ్రాహ్మణుఁడు గాఁడు. * ధర్మమునుగోరు జనులు శూద్రులయు వైశ్యులయు క్షత్రియులయు సాయము గోరుచున్నారు. కాఁబట్టి యీ

* 'శూద్రం వైశ్యం రాజపుత్రం చరాజన్, లోకాస్సర్వే సంశ్రితా ధర్మకామాః, తస్మాద్వర్ణాన్ శాంతి ధర్మేష్వసక్తాన్, మత్వావిష్ణుర్నేచ్ఛతి పాండుపుత్ర' అని (జై. మూ.) 'విప్రం వైశ్యం... వర్ణాన్ జాతి ధర్మేషుసక్తాన్, శేతుంవిష్ణుర్నేచ్ఛతి...' అని దా.మూలము. ధర్మమునుగోరు లోకము ల్బ్రాహ్మ

మూఁడువర్ణములవారును శాంతియుక్తములగు ధర్మములందుఁ దగులు లేకుండిరేని (తక్కినవారి ధర్మప్రాప్తికి సహకారులు లేక పోవునుగాన) విష్ణుఁడు వారియెడ ననుగ్రహము చూపఁగోరఁడు. విష్ణుఁ డనుగ్రహింపఁ గోరఁడేని, స్వర్గలోకమునంగల యెల్లవారల సుఖమును, చతుర్వర్ణ ధర్మఫలములును, వేదవాదములును, సమస్తములయిన యజ్ఞములును, లోకుల సమస్త క్రియలును సమస్తములయిన యాశ్రమ ధర్మములును దోడనే లేకపోవును. తన రాజ్యమందుఁ గలమూఁడువర్ణములవారును తమతమ యాశ్రమ ధర్మములను సరిగా నడపుచు రావలయు నని కోరురాజు తెలియవలయు ధర్మములను వినుము. ఎక్కుడు కులమువారికి పనిపాటులుచేసి, తన కృత్యమును దీర్చుకొని, సంతానములను గని, తక్కిన వైదికులకును దనకును నంతగా నాచారశుద్ధియందు భేదము లేనివాఁడును దేశాచారమును బొందినవాఁడు నగుశూద్రునకు, రాజు ననుమతినొంది యాశలేకుండుట యొకటి తక్కఁదక్కిన యాశ్రమములన్నియు విహితములై యున్నవి. ఆ ధర్మములనుజెప్పు పెద్ద లిట్టిధర్మముల నాచరించు శూద్రునకును వైశ్యునకును క్షత్రియునకును నటమీఁద* భైక్షచర్యము (సన్న్యాసము) విధించియున్నారు. వైశ్యుఁడు తనయాశ్రమకృత్యముల నెల్లఁదీర్చి, రాజునకుఁ

---

ణుని, వైశ్యుని, క్షత్రియుని నాశ్రయించియున్నవి. కాఁబట్టి తమతమధర్మములందుఁ దప్పకయుండునట్టి వర్ణములను విష్ణువు విడనాడఁగోరఁడు' అని యర్థము.

* 'భైక్షచర్యాం తతః ప్రాహుః' అని (ఔ. మూ.) 'భైక్షచర్యాం నచైవాహుః' అని (దా. మూ.)

గొలువుగొలిచి వయసుచెల్లినపిదప రాజు ననుమతినొంది మఱి యొక యాశ్రమమును బొందవచ్చును. ధర్మము చెప్పిన వేదముల నధిగమించి, రాజశాస్త్రములను దెలిసి సంతానాదులను బడసి, సోమపానముచేసి, ధర్మమునఁ బ్రజలనెల్లఁ బాలించి, బ్రాహ్మణులకు దక్షిణలొసంగి రాజసూయము, అశ్వమేధము మొదలయిన యాగములను, మఱియుఁ దక్కినవానిని గావించి యుద్ధమందు కొంచెముగానో యెక్కువగానో జయము నొంది, రాజ్యమందుఁ బ్రజలను బాలించు దిట్టయగు పుత్రునినో పుత్రుఁడు లేనిచో నితరగోత్రమువాఁడును బ్రశస్తుఁడునయినమఱి యొక క్షత్రియునో నెలకొలిపి, పితరులను శ్రాద్ధములచేతను పితృయజ్ఞములచేతను యథావిధిగ నర్చించి యజ్ఞములచేత, దేవతలను, వేదాధ్యయనముచేత ఋషులను, బ్రయత్నంబునఁ బూజించి యంత్యకాలమున మఱియొక యాశ్రమమును బొందఁగోరు క్షత్రియుఁడు *క్రమముగా నాశ్రమములనుబొంది సిద్ధిపొందును. గృహస్థాశ్రమమును విడిచి తొలఁగిన క్షత్రియుఁడు, ఋషివృత్తి నుండునేని భైక్షము నాచరింపవచ్చును. కాని విషయసుఖము లనుభవించుటకై యట్లు చేయరాదు. గృహస్థధర్మమునువిడిచి తన బ్రతుకుటకుమాత్రము వలయునంత భిక్షించుచు, భైక్షము నాచరింపవచ్చును. ఈ భైక్షచర్యము క్షత్రియులు వైశ్యులు శూద్రులనెడి యీ మూఁడువర్ణములవారికిని నిర్బంధముతోఁ గూడినవిగావు. వారి కిచ్ఛయుండినయెడల వరింపవచ్చునుగాన నాలుగు వర్ణములవారికిని నిది చెల్లును.మను

* 'ఆనుపూర్వ్యాచ్ఛ్రమాన్' అని (దా. మూ.) 'ఆనుపూర్వ్యాచ్ఛ్రమాత్' శా. మూలము.

ష్యులయందు, మిక్కిలి శ్రేష్ఠమయిన ధర్మములు రాజు లాచరించునవియె యగును. లోకమంతయు వారి బాహుబలమిికి లోనయియున్నది. మూఁడువర్ణముల వారి ధర్మములు నుపధర్మములును జరుపఁబడుటకై క్షత్రియధర్మమునూఁది యున్నవని వేదములవలన వినుచున్నాను. ఏనుఁగు నడుగులోపలఁ దక్కిన జంతువుల యడుగులన్నియు నడఁగి యుమఁడునట్లు, తక్కిన వర్ణములవారి సమస్తధర్మములును సకల సందర్భములందును రాజధర్మములం దిమిడిపోయి యున్నవి. ధర్మవిదులగు మనుష్యులు, తక్కిన మూఁడువర్ణములవారి ధర్మములును, నల్పములయిన యాధారములును నల్పములయిన ఫలములు నొసంగుచున్నవని చెప్పెదరు. పెద్దలు, క్షత్రియులధర్మము గొప్ప యాధారమును గొప్పఫలములను నొసంగునుగాని తక్కినవట్లు లొసంగవని చెప్పెదరు. సమస్త ధర్మములకు రాజధర్మములు ప్రధానములయినవి.సమస్తవర్ణములవారును రాజులవలననే పాలింపఁబడుచున్నారు.సమస్తమయిన త్యాగములును రాజధర్మములందున్నవి. త్యాగమును శ్రేష్ఠమయిన పురాతన ధర్మముగాఁ జెప్పుదురు; దండనీతి హతమయినచో మూఁడు వేదములును మునిఁగిపోవును; మనుష్య ధర్మశాస్త్రములు నన్నియు నశించును. పురాతనమగు క్షత్రియధర్మము నశించెనా సకలమయిన యాశ్రమములు *(ధర్మములునశించును.సమస్తభోగములును రాజధర్ములందుఁ జూపట్టుచున్నవి.సమస్తవిషయములును రాజధర్మములందుఁ జెప్పఁబడియున్నవి. సమస్తములయిన విద్యలును రాజధర్మములందే కూడియున్నవి.) సమస్తములయిన లోకములు:

* ఈకుండలీ కరణములలోనిది ఔత్తరాహప్రతులందులేదు.

రాజధర్మములం దడఁగియున్నవి. సర్వధర్మములును, సర్వభోగములును, సర్వయోగములును, రాజధర్మములందు నెలకొనియున్నవి. కాఁబట్టి రాజధర్మమునకంటె విశేషించిన ధర్మము మఱియొకటి లోకమునం గలుగదు. సకలములయిన యీకర్మములును సమస్తములయిన ప్రాణిసమూహములును రాజధర్మమునందుఁ బ్రతిష్ఠింపఁబడియున్నవి. ప్రాణులు నీచులచేత వధింపఁబడునేని, వారలధర్మములను వైదికకర్మములను నాశము సేయునట్లు, సమస్తధర్మములును రాజధర్మముల సహాయము వీడినచో నాశమొందుటయే కాక మనుష్యులును బెక్కులు విఘ్నములచేతఁ దమతమ ధర్మములను బాలింపనివారగుదురు. ఇది యిఱువది రెండవయధ్యాయము.



## రాజధర్మపర్వము.

(భీష్ముఁడు రాజధర్మమును బ్రశంసించి యింద్రునకు మాంధాతకు నయిన సంవాదమును జెప్పుట.)

భీష్ముఁడు 'పాండవా! నాలుగాశ్రమముల ధర్మములును (విశేషించిన) యతిధర్మములును లోకమునను వేదమునందును నుత్తమములని వాసికెక్కిన ధర్మములును రాజధర్మములం దడఁగియున్నవి. రాజధర్మము నెలకొనియున్నచో నీకర్మములన్నియు సార్థకములగుటయే కాక ప్రాణిసమూహములును కలఁకలేక సుఖంబుండును. రాజధర్మము నెలకొనక పోయెనా జీవలోకమంతయుఁ గీడుపొరయును.* ఆయాయాశ్రమము లాచరించు మను

* 'అప్రత్యక్షం బహుఫలం ధర్మమాశ్రమవాసినామ్। ప్రరూపయ న్తి

ష్యుల ధర్మములు ప్రత్యక్షములుగావు. మఱివానికి ఫలములును ద్వారములును బెక్కులు; వారట్టిధర్మముల శాశ్వతమయినస్వరూపమును నాగమములచేతనే యిట్టివని నిరూపించుచున్నారు; కాని, ప్రత్యక్షముగా నెట్టిదో తెలియలేరు. మఱికొందఱు లోకములు చేసిన సిద్ధాంతములే సరియని మంచిమాటలచే వాదించుచు ధర్మములకలరూపును శాస్త్రములందు నిశ్చయింపఁబడియున్న రీతిని నెఱుంగక తుదకు నేసిద్ధాంతమునందును బర్యవసింపనిపర ధర్మమందుఁ బడి కలగుండు నొందుచున్నారు. క్షత్రియుల ధర్మ మోయట్లుగాదు. అది ప్రత్యక్షమైనది; మిక్కిలి ఫలముగలది; తనకుఁ దానే సాక్షియైనది; కపటములేనిది; సర్వలోకహిత మైనది. గృహస్థాశ్రమమం దున్న బ్రాహ్మణుల ధర్మమునందుఁ దక్కిన మూఁడువర్ణములవారి ధర్మములును నడంగియున్నట్లు రాజధర్మములందు లోకములన్నియును వానిపుణ్యకర్మములును నడంగియున్నవని మును పేయెత్తి చెప్పియున్నాను. శూరులయిన రాజులు పెక్కండ్రు తొల్లి దండనీతి(నిగుఱించి సందేహములడుగు) కొఱకు సర్వభూతేశ్వరుండును మహాతేజుండును నారాయణుండునగు విష్ణుకడకుఁ బోయిరని ముందే నీ కుదాహరించి యున్నాను. ఆరాజులు తమదండనీతి కర్మము నొక్కొక్కటిని నాశ్ర

తద్భావ మాగమై రేవశాశ్వతమ్' అని మూలము 'ప్రకోపయన్తి తద్భావమ్' అని జౌ. మూలము. వారధర్మముల స్వరూపమును విరుద్ధములయిన యాగమముల చేతఁ జెలుపుచున్నారు. ఆయాగమములవలన వాని యెప్పటిస్వరూపమును దాఱుమాఱుగాఁ దెలియుచున్నారు; కాని, కలరూపునఁ దెలియఁజాలరనుట. ఇట యితరధర్మముల స్వరూపమంతగాఁ దెలియమిని జెప్పుప్రకరణము గాన నీపాఠమే గ్రాహ్యముగానున్నది.

మధర్మములతోఁదులదూఁచి యేదియెక్కుడో యద్దేవుఁడు సిద్ధాంతముచేసి చెప్పఁగా వినుటకు నతని నుపాసించియుండిరి. అయ్యాదిదేవుండు తొల్లి సృజించిన సాధ్యులు, దేవతలు,వసువులు, అశ్వినులు, రుద్రులు, విశ్వేదేవతలు, మరుద్గణములు, సిద్ధులు నందఱును క్షత్రియధర్మమందుఁ బ్రవర్తించుచున్నారు. ఈవిషయమై నీకు నిజము నిరూపించుటకు నొకధర్మమును దెలిపెదను. తొల్లి యీలోకమున నసురులోకమే సముద్రమువలె నావరించి యుండుటవలన మరియాదదక్కియుండఁగా మాంధాత యని వీర్యవంతుఁడయిన యొకరాజుండెను. అక్కాలమునం దీభూమి నేలుచుండినయారాజు, అనాదిమధ్య నిధనుండును సర్వేశ్వరుండునగు నారాయణుని జక్కఁగాఁ జూడఁగోరి యమ్మహాత్మునిపాదములను శిరసుసోఁక మ్రొక్కి యొకయాగమును జేయఁదొడంగెను. విష్ణుదేవుం డవ్వుఁ డింద్రరూపంబున నతనికి దర్శనమొసంగెను. మాంధాతయు, రాజులు పరివేష్టించియుండ నాప్రభునిఁ బూజించెను. ఆరాజునకును మహాత్ముఁ డయినయాకల్లయింద్రునకునుమహాద్యుతియగు విష్ణుదేవునిఁగూర్చి యీగొప్పసంవాదముకలిగెను. ఇంద్రరూపుఁడగు భగవంతుఁడు 'ధార్మికోత్తమా! నీకోర్కియేమి ? నీ వానారాయణునిఁ జూడఁగోరుచున్నావు. అతఁడప్రమేయుఁడు. అతని మాయ యనంతము.అతనిమంత్రశక్తి యమితమైనది. అతం డాదిదేవుఁడు, పురాణుఁడు, విశ్వరూపుఁడు. అట్టిదేవునిని జూచుటకు నాకు సయిత మలవికాదు. నాకేకాదు; సాక్షాద్బ్రహ్మకును నలవిగాదు. రాజా ! నీయుల్లం ఁగల తక్కినకామములు వేనినయినను నీకొసంగెదను. ఏలన మనుష్యులందు రాజవు.నీవు సత్యమునందును శమమందును

నెలకొన్నవాఁడవు. ధర్మపరుఁడవు; జితేంద్రియుఁడవు; శూరుఁడవు. కావున నీయందు దృఢమయిన ప్రీతికలదు. మఱియును భక్తిచేతను బుద్ధిచేతను, శ్రద్ధచేతను,నీ వుత్తముఁడవై యున్నాఁడవు. కావున నేను నీకు వలచినట్లు వరము లొసంగుచున్నాను' అనెను. అందులకు మాంధాత 'నీప్రసాదమునకై శిరసు సోఁక మ్రొక్కుచున్నాను.మహాత్మా! అయిన నయ్యాదిదేవునిఁదప్పక చూడఁగోరుచున్నాను. కామములన్నియు దిగవిడిచి ధర్మమును గోరి సాధువులు వర్తించు సత్పథమందు మెలఁగఁదలఁచి యడవికిఁ బోవఁదలఁచుచున్నాను. విపులమును నప్రమేయమునయిన క్షత్రియధర్మమువలన మంచిలోకములు నాకుఁ బ్రాప్తములయినవి,నా యశస్సును స్థాపితమయినది. అయిన నాదిదేవుని వలననుండి * ప్రవర్తించినదియు లోకమందెల్ల శ్రేష్ఠమయినదియునగు ధర్మమును నేను జేయనెఱుంగను' అనెను.

అందుల కింద్రుఁడు 'రాజులుకానివా రెంత ధర్మపరులుగా నుండినను ధర్మమునకుఁ గలుగుపరమం బయినగతిని సులభముగాఁ బొందనుగాని పొందింపనుగాని శక్తులుగారు. ఆదిదేవుని వలననుండి మొదట వెలువడినది రాజధర్మమొకటియే. తక్కిన ధర్మములన్నియు దానికంగములుగాఁ బిదపవెలువడినవి. తక్కిన యనంతములయిన ధర్మములును వానప్రస్థధర్మములును బిదప సృజింపఁబడినవి. వానిఫలము లంతముగలవి. క్షాత్రధర్మ

---

* అరణ్యామిచ్ఛేగన్తుం సత్పథం సాధుజుష్టమ్' అని (దా.మూ.) వరేణ్యామిచ్ఛేగన్తుం సత్పథం లోకజుష్టమ్' అని ఔ. మూలము. లోకులందఱును గౌరవించునట్టిదియు సజ్జనులు మెలఁగునట్టిదియు శ్రేష్ఠమయిన మార్గమును బొందఁగోరుచున్నాను.

ములో వానికంటె విశిష్టములయినవి. ఈధర్మమునందు సమస్త ములయిన ధర్మములు నడఁగియున్నవి. కాన క్షత్రియధర్మమునే మిక్కిలి శ్రేష్ఠమయిన ధర్మముగాఁ జెప్పెదరు. తొంటి కాలమందు మహావిష్ణువు రాజధర్మముచేత శత్రువులనోర్చి ఋషులను దేవతలను నందఱను రక్షించెను. ఈభగవంతుఁడు లోకవిరోధులయిన యసురులనందఱను హతులం గావింపకపోయినచో బ్రాహ్మణులును లోకకర్తయగు బ్రహ్మదేవుఁడును నీధర్మమగు ననాదిధర్మమును లోకమునందుండి యుండవు. దేవశ్రేష్ఠుండును నాదిదేవుండునగు నారాయణుఁ డసురులతోఁగూడిన యీభూమిని బరాక్రమంబున జయింపకపోయినచో బ్రాహ్మణులు నశించిపోవుటచే నాలుగువర్ణములును నాలుగాశ్రమములును వానిధర్మములును నన్నియు లోకంబున లేకపోవును. ఒక్కొక్కయుగమందును శాశ్వతములయినయీధర్మములుపలు విధములుగా నాశ మొందుచు రాజధర్మముచే మరల నవి వర్ధిల్లుచున్నవి. కాఁబట్టి రాజధర్మము లోకమందు శ్రేష్ఠమయినదని చెప్పెదను. యుద్ధమునందు దేహమువిడుచుట,సమస్తభూతముల యందును దయ,లోక విషయములందు జ్ఞానమును, ప్రజలను బాలించుటయు, ఆరినపాయమునుండి విడిపించుటయు, పీడితులయి దుఃఖించుచుండు జనులకు విడుమర కలిగించుటయు, ననునివి రాజులాచరించు క్షత్రధర్మములం దుండునవి. కామ క్రోధములందు వర్తించుచు మరియాదల నతిక్రమించి నడచునట్టి మనుష్యులు రాజువలని భయముచేత పాపముఁ జేయకుందురు. సహజముగా శిష్టులయి సదాచార పరులగువా రాకారణముననే సమస్తధర్మములు నిర్వహింపఁగలుగుదురు.కావుననే రాజధర్మమును

మంచిదిగాఁ జెప్పుదురు. రాజులు, తండ్రిపుత్రులంబోలెఁ, బాలించుచుండఁగా లోకమునం గలసమస్తప్రాణులు తమతమ ధర్మములతోడఁ జరించుచుందురనుట కెంతమాత్రమునసందేహము లేదు. కాన క్షత్రియధర్మము సమస్తధర్మములకంటె నతిశయించినది; సనాతనమైనది; లోకమందు శ్రేష్ఠమయినది. అది సర్వప్రాణుల రక్షయందునువర్తించునది.తనంతట నాశరహితమై యది శాశ్వతముక్తియందుఁ బర్యవసించును." ఇది యఱువది మూఁడవయధ్యాయము.



## రాజధర్మపర్వము.

భీష్ముఁడు ధర్మరాజునకు నింద్రరూపియగు విష్ణువు మాంధాతకుఁ జెప్పినరాజధర్మాదులను జెప్పుట.

ఇంద్రుఁడు 'ఇటువంటి ప్రభావముగలదై సర్వధర్మములును దనయం దడంగినదై సర్వధర్మములందును శ్రేష్ఠములై యొప్పు రాజధర్మమును నినుబోఁటి యుదారులగు లోకపాలురు పరిపాలించుచు రావలయును. ఈనెఱి తప్పినయెడల ప్రజలకు నాశముగలుగును. రాజు భూమిని బంటలచే సంపన్నముగావించుట, రాజసూయము మొదలయిన యాగములుచేయుట, * దీక్షనొందుట, ప్రజలను బాలించుట, సమస్తప్రాణులందును దయగలిగి యుండుట, యుద్ధమునందు దేహమువిడుచుటయు, తనకు శ్రేష్ఠమయినధర్మమని తెలియవలయు. వీనియందు యుద్ధమున

* 'దీక్షాచర్యామ్' అని (దా.మూ) 'అక్షైక్షచర్యాం' అని (జొ.మూ.)

దేహమువిడుచుట మిక్కిలి యుత్తమధర్మమని మునులు చెప్పు చున్నారు. అదికారణముగా *రాజధర్మమందు వర్తించు రాజు లందఱును మిక్కిలియుఁ జదువుచదివి గురువులకు శుశ్రూషయు సేసి తుదకు నొండొరులను యుద్ధమునఁ దార్కొని తమదేహ ములను విడుచుట నీవు కన్నారఁజూచి నదియే. ధర్మమునుగోరు క్షత్రియుఁడు, బ్రహ్మచర్యము జరపినపిదప నిత్యధర్మయుక్తమగు గృహస్థాశ్రమము నాచరింపవలయును. సామాన్యములగు జనుల వ్యవహారములందు రాజు 'వీఁడుప్రియుఁడు, వీఁడప్రియుఁ'డను పక్ష పాతములేక వర్తింపవలయును. మఱియు నాలుగువర్ణములను నాయాయుపాయములచేతను గట్టుపాట్లచేతను † పౌరుషములచే తను మఱి సమస్తములయిన పూనికలచేతను వారివారి ధర్మ ములందు నిలిపి పరిపాలించుటవలనను, సమస్తధర్మములు నడఁగి యుండుటవలనను క్షత్రియధర్మము మిక్కిలిశ్రేష్ఠమని చెప్పెదరు. తమతమధర్మముల నేవర్ణములవా రాచరింపరో మఱియు నాయాధర్మములను విపరీతములుచేసి చెప్పుదురో వారు మర్యా దమాలి యెప్పుడును ధనమందే తగులు గలిగినవారుగాన యట్టి మనుష్యులను బశువులని చెప్పెదరు. ధనసంపత్తి పెంపుచేత నీతిని నెలకొలిపి లోకము శ్రేయమును బొందించునుగాన క్షత్రి యధర్మము తక్కిన యాశ్రమములకన్న నుత్తమమగును. మూఁ డువేదములును జదివిన బ్రాహ్మణుల కేర్పఱచిన నడవడియు, సామా న్యముగా బ్రాహ్మణుల కేర్పఱచిన యాశ్రమములును బ్రాహ్మణు

---

* 'నిత్యంవ్యక్తం రాజధర్మేషుసర్వే' అని దా. మూ. 'నిత్యంయుక్తా రాజ ధర్మేషుసర్వే' అని ఔ. మూలము.

† 'ఔరసైః' అని మూలము. 'ఔషధైః' అని దా. మూల.

నకు నన్నింటికినిలో ముఖ్యమయినది. *దానినిగాక మఱొకటిని జే యుబ్రాహ్మణుని శూద్రునింబోలె నాయుధముచేత వధింపవల యును. నాలుగాశ్రమముల ధర్మములును వేదోక్తవిధానము లును బ్రాహ్మణుఁ డనువర్తింపవలయును. ఇది తప్ప నతనికి మఱె ద్దియును నెప్పటికిని లేదని తెలియునది. బ్రాహ్మణునకు వేఱువిధ మున రాజు మనుగడఁ గలిగింపరాదు. అతని కర్మములచేత నతనిధర్మము పెరుఁగుచున్నది. బ్రాహ్మణుఁడు ధర్మమెట్లో యట్లె. ధర్మమే యతఁడు. తనకు విహితములు కాని ధర్మములందు వర్తిం చుబ్రాహ్మణుఁడు సమ్మానమున కెంతమాత్ర మర్హుఁడుగాఁడు. అతఁడు తన స్వకర్మములను బ్రయోగింపనియెడల నతఁడెవ్వరి నమ్మికకును బాత్రుఁడుగాఁడు. † తమధర్మములను మాలిన యేవర్ణ మువారినిగాని మేలయిన పదవికిఁ దేవలసినది క్షత్రియుని ధర్మము గాన రాజధర్మమే తక్కినవానికంటె శ్రేష్ఠమయినది. ‡రాజధర్మ మే ప్రభావమం దన్నిటికంటె నతిశయించినదని నామత'మనెను. అందులకు మాంధాత 'యవనులును, కిరాతులును, గాంధారు

---

* 'ఏతత్కర్మ బ్రాహ్మణస్యాహురగ్ర్యమ్' అని ఔ.మూ. 'క్షత్రియస్యాహురగ్ర్యమ్' ఔ.మూ. అదిగాక మఱియొకటిని జేయు క్షత్రియుని శూద్రునింబోలె నాయుధముచేత జంపవలయును నని యర్థము.

† 'ఏతేవర్ణా స్సర్వధర్మైశ్చహీనాః, ఉత్కృష్టవ్యా క్షత్రియైరేవధర్మాః' అని (దా.మూ) ఏతేధర్మా స్సర్వవర్ణేషులీనా । ఉత్కృష్టవ్యాక్షత్రియై రేవధర్మాః' అని ఔ. మూ. 'అయాధర్మములం దడంగియున్న ధర్మములివియే. క్షత్రియుంలే వానిని' ముందుకుఁ దేవలయును. ఇది వానికి ధర్మమగును' అనియర్థము.

‡ 'వీరజ్యేష్ఠాః వీరధర్మా మతామే' ఔ. మూ. అదివీరులధర్మముగాన వీరులే ముందాచరించుచున్నవారు.

లును, చీనులును, శబరులును, బర్బరులును, శకులును, తుషారులును, కంకులును, పల్లవులును, ఆంధ్రులును, మద్రకులును, ఉష్ట్రులును, పులిందులును, అరట్టులును, కాచులును, మ్లేచ్ఛులును, బ్రాహ్మణక్షత్రియులవలనఁ బుట్టిన జాతులును, వైశ్యులును, శూద్రులును నిట్లు రాజుల దేశమందు వసించువారందఱును ధర్మముచేయుట యెట్లు పొసఁగును? వీర లాచరింపవలసిన ధర్మము లెట్లు? దొంగతనము వృత్తిగాఁ గలయిట్టివారల నంద ఱను ననుబోఁటివారికి ధర్మమునందు నిలుపవలసిన విధమెట్లు? దేవేశ్వరా! క్షత్రియులమగు మాకు నీవు బంధుభూతుండవు కాన, దీనినివి నఁగుతుక పడెదు నాకుఁ దెలియఁజెప్పుము' అని యడిగెను.

ఇంద్రుఁడు 'దొంగవృత్తి గల తెగలవారందఱును తలిదండ్రులకును, పెద్దలకును, ఆచార్యులకును, ఆశ్రమముల వసించువారికిని శుశ్రూష సేయవలయును. ఆ దొంగలందఱును రాజులకును శుశ్రూష సేయవలయును.* దేశమునకు సామాన్యములయిన ధర్మకార్యములును వారికి ధర్మముగా విధింపఁబడియున్నవి. వారు పితృకర్మములు చేయవలయును. (లోకమున కుపయుక్తమగు కొఱకు) బావులు త్రవ్వవలయు. చలిపందిరులు పెట్టవలయును. బ్రాహ్మణులకు శయనములునుఁ గాలమునకుఁ దగిన దానములు నొసంగవలయును. అహింసయు, సత్యమును, అక్రోధము లేమియు బ్రాహ్మణులకును దాయలకును వలయునవి యొసంగి రక్షించుటయు, దారపుత్రులను బోషించుటయు, పరిశుద్ధియు ద్రోహము లేమియు, సమస్త యజ్ఞములందు బ్రాహ్మ

* 'దేశధర్మ క్రియాశ్చైవ' అని (దా. మూ) 'వేదధర్మ క్రియాశ్చైవ' అని (జౌ. మూలము.) వేదములందుఁ జెప్పఁబడిన ధర్మకార్యములు నని యర్థము.

ణులకు దక్షిణల నొసంగుటయు, నీతెగలలో ధర్మము గోరువాఁడొక్కొక్కండు నాచరింపవలసినవి. అట్టివి వారందఱును జేసి మిక్కిలి ధనములను నొసంగవలయును. ఇవియు నిట్టి కర్మములును తొల్లి యీతెగలవారికి విధింపఁబడెను. ఇవియే కాక తక్కిన లోకులకెల్ల విహితములయిన కర్మములుగూడ నీతెగవారికిని గర్తవ్యములగును' అనెను. మాంధాత 'మనుష్యలోకమందు సమస్త వర్ణములయందును సమస్తములయిన యాశ్రమములందును నట్టి దొంగబ్రతుకుగలవారు మాఱుధర్మముల మఱఁగి చూపట్టుచున్నారు' అనెను. అందులకు నింద్రుఁడు, 'రాజుల దుర్బుద్ధివలన దండనీతి నశించియు రాజధర్మము లేకయుఁబోవఁగా ప్రాణులన్నియు మిక్కిలియుఁ దడఁబాటు నొందుచున్నవి. ఈకృతయుగము గడచిపోవఁగా నాశ్రమములు తాఱుమాఱగును. అప్పుడు లెక్కలేని సన్న్యాసులు, నానావిధములయిన తెగచిహ్నములను ధరించి చూపట్టుదురు. జనులు సనాతనములయిన ధర్మములకుఁ బెడచెవులంబెట్టి వందలకొలఁదిని కామక్రోధములచేఁ బ్రేరితులై తప్పుదారిని ద్రొక్కుదురు. మహాత్ములయినరాజులు దండనీతినిగొని పాపమును దొలఁగఁ ద్రొబ్బఁగా నపుడు శాశ్వతమయిన పురాతనధర్మము వర్ధిల్లి చలింపక కుదురుకొని యుండును. లోకుల కందఱకును బెద్దయగురాజు నెవఁ డవమానించునో వాని * దానములును కర్మములును జదువును నెందును గొంచెమేనియు ఫలింపదు. మను

---

*'నతస్యదత్తం నకృతం నశ్రుతం ఫలతిక్వచిత్' అని (దా.మూ.) 'నతస్య దత్తం నహుతం నశ్రాద్ధం ఫలతేక్వచిత్' అని (జొ.మూ.) వాని దానములును హోమములును పితృకర్మములును ఫలింపవు.

ష్యులకధిపతియు దేవతలరఁ బోనివాఁడును,మహాకాంతిఁ దళ్కొ త్తువాఁడును,ధర్మకాముండు నగురాజును దేవతలునుమిక్కిలిగా గౌరవింతురు. భగవంతుఁడు బ్రహ్మ, లోకము నంతయు సృజించి ధర్మములు ప్రవృత్తి నివృత్తులఁ బాలించుకొఱకు క్షత్రియునిఁ గోరెను. ఎవఁడు తన బుద్ధిచేత జనులు జరపుచున్న ధర్మము గతిని బాలించుచుండునో యట్టిపురుషుఁడు నాకు మాన్యుఁడును బూజ్యుఁడునగును. అట్టివాఁడే క్షత్రియుఁడు. అట్లు చేయుటయే క్షత్రధర్మము' అనెను.

ఇట్లావిష్ణుదేవుండు చెప్పి యంత దేవతాగణములు పరివేష్టింప శాశ్వతంబును నవ్యయంబు నగుతన పదంబునకు వేంచేసెను. ఇట్లు ధర్మము చక్కఁగా నాచరింపఁబడినదై ప్రవర్తించుచుండఁగా తెలివియు మిక్కిలి చదువును గలవాఁడెవఁడు క్షత్రియుని నతిక్రమింపఁగలఁడు?.దారియందుఁ బోవు గ్రుడ్డివారివలె, నీతిమాలిన ప్రవృత్తియు నివృత్తియు నడుమనే నాశమునొందును. ఆదికాలమందు బ్రహ్మదేవునివలననుండి వెలువడి ప్రవర్తించుచున్నదియు, పూర్వులకెల్లఁ బెనుప్రాపయినదియు నగు ధర్మచక్రమందు నీవు వర్తింపుము. నీవందుల కెంతయుఁ దగుదువని యెఱుంగుదును' అనెను. ఇది యఱువదిమూఁడవయధ్యాయము.



## రాజధర్మపర్వము.

### భీష్ముఁడు ధర్మరాజునకు వర్ణాశ్రమ ధర్మములను జెప్పుట.

ధర్మరాజు 'పితామహా! మనుష్యుల కందఱకును నాలుగాశ్రమములున్నవని మునుపు చెప్పఁగా వింటిని. దానిని విశ

దముగా మీఁదు మిక్కిలి తెలియఁగోరుచున్నాను. దానినిగుఱించి సవిస్తరముగా నుపన్యసింపుము' అని యడిగెను.

భీష్ముఁడు 'యుధిష్ఠిరా! ఈలోకమునందు సజ్జను లాచరించు ధర్మములన్నియు నాకుఁ దెలిసియున్నట్లే నీకును దెలిసియున్నవి. ధార్మికోత్తమా! ఇతరములయిన లింగములను (ఆశ్రమములను) ఆచరించువారలవలనరాజునకుఁ గలుగుధర్మము నడుగుచున్నావు. అది చెప్పెదను వినుము. ఈ నాలుగాశ్రమములవారి ధర్మము లివియన్నియును సదాచారపరులయిన రాజులను సంబంధించు చున్నవి. యుధిష్ఠిరా! కామద్వేషములు లేనివాఁడై సమస్త ప్రాణులయందును సమదృష్టిగలిగి దండనీతిని జెల్లించురాజు భైక్ష్యాశ్రమఫలమును (అనఁగా బ్రహ్మచర్యఫలమును) బొందు చున్నాఁడు. దానమును విసర్గమును నిగ్రహానుగ్రహములును దెలిసి శాస్త్రోక్తములగు విధులచొప్పున నడచుకొను ధీరుం డగురాజు, గృహస్థాశ్రమము ఫలమునొందును. అర్హులయిన వారిని వేఱువేఱ విభజించి తెలిసికొని పూజించుచు వారికి వలయునవి పంచియిచ్చుచు నుండురాజు దెచ్చుటను భైక్ష్యా శ్రమము ఫలమునొందును. జ్ఞాతులను సంబంధులను మిత్త్ర ములను నాపదలనుండి తనశక్తికొలఁది నుద్ధరించుచుండు రాజు వానప్రస్థాశ్రమము ఫలము నొందును. మనుష్యుల యందు ముఖ్యు లయినవారిని యతులందు మిన్నలయినవారిని మాటిమాటికి సత్కారము చేయుచుండురాజు వానప్రస్థాశ్రమ ఫలమునొందును. పితృయజ్ఞమును భూతయజ్ఞమును మనుష్య యజ్ఞమును దేవయజ్ఞమును ననెడి వీనిని విపులముగాఁ బ్రతిదిన మును జేయుచు నతిథులను దక్కిన ప్రాణులను నంతరువులకొ

లఁదిని వేలువేలనెఱింగి యర్చించునట్టి రాజు వానప్రస్థాశ్రమఫల మును బొందుచున్నాఁడు. శిష్టులను గాచుకొఱకు పరరాజ్యము లను మర్దించురాజును దానినే పొందును. ప్రాణుల నన్నింటిని బరిపాలించుటవలనను,తనరాజ్యమును జక్కఁగా నేలుటవలనను, రాజు తానెందఱను బాలించెనో యన్నియజ్ఞములు చేసిన ఫల మునే కాక సన్న్యాసాశ్రమఫలము నొందును. వేదాధ్యయన మం దెడతెగని ప్రీతికగలిగి, క్షమయు, నాచార్యునిఁ బూజిం చుటయు, ఉపాధ్యాయులకు శుశ్రూషసేయుటయు, బ్రహ్మచర్యా శ్రమఫలము నొసఁగును. ప్రతిదినమును వలయుమంత్రములను జపించుచు, నెప్పుడును దేవతలను బూజించుచు నుండురాజు య త్యాశ్రమఫలమును బొందును. ప్రాణమును బందెముగా నొడ్డు యుద్ధ మనెడిజూదమందు మరణమో లేక రక్షణమో యని నిశ్చయించు కొన్నరాజు సన్న్యాసాశ్రమఫలము నొందును. ఎప్పు డు నేప్రాణులయందును వంచనయు ధూర్తత్వమును నెఱ పనిమార్గమందు వర్తించునట్టి రాజు సన్న్యాసికి సముఁడగును. మూఁడువేదములను నధిగమించినవానప్రస్థు లగుబ్రాహ్మణుల యందు విస్తారములగు ధనములనొసంగు రాజు వానప్రస్థపదవి నొందును. * సమస్తభూతములందు దయఁజూపుచు క్రూరత్వ మెంతమాత్రమును లేకుండురాజు సమస్తాశ్రమములపదవినిబొం

---

* 'సర్వభూతేష్వనుక్రోశం కుర్వత స్తస్యభారత। ఆనృశంస్య ప్రవృత్త స్య సర్వావస్థంపదం భవేత్' అని ఔ. మూ. 'ఏవం కుర్వత స్తవ భారత। ఆనృశంస్యే ప్రవృత్తస్య నియతః పుణ్యసంచయః' అని (దా. మూ) ఇట్టి వాఁడ వగునీకు పుణ్యములు తప్పక ప్రోవుగొనుననియర్థము. అయిన నీపాఠ మ ప్రస్తుతము.

దును.*పిన్నలయందుఁగాని పెద్దలయందుఁగాని యేయవస్థయందును గనికరముచూపురాజుసర్వాశ్రమములపదవిని బొందును.బలవంతముగాఁ బీడింపఁబడి,†తన్నుశరణుఁజొచ్చినప్రాణులను రక్షించురాజు గృహస్థాశ్రమపదవిని బొందును. స్థావరజంగమము లగు ప్రాణుల నెల్లవిధములను రక్షించుటయు యోగ్యతకుఁ దగురీతిని బూజించుటయు గృహస్థధర్మపదవి నొసంగును. అన్నలభార్యలను, దమ్ములను భార్యలను, అన్నదమ్ములను బుత్రులను, మనుమలను, శిక్షించుటయు రక్షించుటయు రాజునకు గృహస్థధర్మములగును. మఱియు నది యపారమయిన తపంబునగును. సాధువులును బూజనీయులు నగువారిని బూజించుటయు నాత్మజ్ఞానసంపన్ను లయినవారిని బాలించుటయు గావించురాజు గృహస్థాశ్రమపదవినిబొందును. ఒక్కొక్కయాశ్రమమందును గలమనుష్యులకుఁ దనయింట నవ్వారిగా భోజనము పెట్టించుట రాజునకు గృహస్థధర్మమగును. బ్రహ్మ సృజించిన ధర్మములందు యథార్థముగా వర్తించుచుండు నట్టిరాజు, సమస్తాశ్రమముల పుణ్యఫలమును బొందుచున్నాఁడు. సుగుణము లెప్పుడు నేరాజునందు నశింపకుండునో యతనిని సమస్తాశ్రమములపదవి గలవానినిగాఁ జెప్పుదురు. పూజ్యము లయినయధికారస్థానములు గలవారిని, పూజ్యములయిన కులములవారిని, వయసుచేతఁ బూజ్యులయిన

---

* 'బాలవృద్ధేషు కౌంతేయ సర్వావస్థంయుధిష్ఠిర । అనుక్రోశక్రియాపార్థ సర్వాశ్రమపదంభవేత్' అని ఔ.మూలము. 'పార్థ ధర్మ ఏషసనాతనః' అని దా. మూలము. ఈపాఠమును బ్రకృతముగాదు.

† 'శరణాగతేషు కౌరవ్య కుర్వన్ గార్హస్థ్యమావసేత్' అని ఔ. మూ. 'కుర్వన్ కారుణ్య మాచర' అని దా.మూలము.ఇది ప్రకరణానుగుణముగాదు.

వారిని, దగురీతిని గారవించు రాజు సర్వాశ్రమముల నాచరించి నట్టి వాఁడగును. దేశధర్మములను గులధర్మములను బాలించు చుండురాజు, సర్వాశ్రమఫలముల నొందును. తగినకాలములందు సాధువులయినవారికి సంపదలను గానుకలను నొసంగురాజు సకలాశ్రమముల పదవులను బొందును. అపాయమును భయమును బయికొన్నను సకలమనుష్యుల ధర్మములందుఁ గన్ను గలిగియుండు రాజు, సకలాశ్రమముల ఫలమునొందును. లోకమం దేరాజుపాలనమందుఁ గలజనులు ధర్మమందు సమర్థులై ధర్మమును జేయుదురో యామనుష్యుల ధర్మములందుఁ బాతికపాలారాజును జేరును. ధర్మమునందే మిక్కిలియాసక్తులై ధర్మపరులగు మనుష్యులను రక్షింపనిరాజు వారల పాపమును బొందును. జగమును బరిపాలించుటయందు రాజునకు సహాయులై యుండువారందఱును లోకులు చేయుధర్మమునం దొకపాలును బొందుదురు. మనము సేవించుచున్న గృహస్థాశ్రమమును, ఆశ్రమములందు మిక్కిలియు నెక్కుడయినదని చెప్పెదరు. ఈనిర్ణయము మిక్కిలి స్పష్టముగానే యున్నది; మఱి పావనమునగును. ప్రాణులను దన్నుంబోలె నెన్నికోపమును గెలిచి దండమును జెల్లించు రా జిందు నందును సుఖమొందును. * సత్యమనెడు జలమును, శీలమనెడి

* 'ధర్మోచ్ఛ్రితా సత్యజలా శీలయష్టిర్దమధ్వజా । త్యాగవాతాధ్వగా శీఘ్రా నౌస్తయా సన్తరిష్యతి'(దా. మూలము) 'ధర్మేస్థితా సత్త్వవీర్యా ధర్మసేతువరాటకా । త్యాగవాతాధ్వగా శీఘ్రా నౌస్త్వాం సంతారయిష్యతి' అని ఔ. మూలము. ధర్మముల (నెడుజల మ)ందున్నదియు సత్త్వమే ఓడనడపు వాని బలముగాఁగలదియు, ధర్మసేతువులను (అనఁగా శాస్త్రములనెడు) కట్టు

త్రెడ్డును, దమమనెడి ధ్వజముగలిగి, త్యాగమనెడు వాయువుచే దారిని బోవునదియు వేగముగలదియు నగుధర్మమనెడు నావనెక్కి సంసారసముద్రమును రాజు దాటఁగలఁడు. సమస్త విషయములందు సంగమువీడి కామము మనస్సునందు లేక మంచి నడవడులతోఁగూడి సత్యసంధుం డగుమనుష్యుఁ డీబ్రహ్మమునొందును; మనంబునడంచి నిష్కలంకమయిన భావముతో నీవు ప్రజలను బాలించితివేని యుత్తమధర్మము నొందుదువు. అనఘా! సమస్తలోకులను, విశేషించి వేదాధ్యయనముచేయువారును సత్కర్మపరులు నగుబ్రాహ్మణులను రక్షించుటయందు బ్రయత్నము గలిగియుండుము. రాజు ప్రజలను బాలించుటవలన నడవులం దాశ్రమములనుండి సాధువు లాచరించు ధర్మమునకంటె నూఱుమడుంగు లెక్కుడు ధర్మమును బొందుచున్నాఁడు. ఇట్లు నీకు ధర్మమునకుం గలపలుదెఱుంగులను జెప్పితిని. శాశ్వతములును బూర్వమునుండి యాచరింపఁబడుచు వచ్చునవియునగు * రాజధర్మముల ననుష్ఠింపుము. నీవు ప్రజలను బాలించుటయం దాసక్తుఁడవగుదువేని నాలుగువర్ణములయు నాలుగాశ్రమములయు ధర్మముల నంతయుఁ బొందుదువు' అనెను.

ఇది యఱువదియేనవయధ్యాయము.



మోకులుగలదియు, త్యాగమనెడు గాలిచే దారినిపోవునదియునగు రాజధర్మమనెడి నావనెక్కఁగా, అది నిన్ను (అనఁగా రాజును) సంసారసముద్రమును దాటించును' అని యర్థము.

* 'అనుతిష్ఠత్వమేనం వై పూర్వదృష్టంసనాతనమ్' (ఔ. మూ) యుధిష్ఠిర త్వమేనం వై పూర్వం దృష్టం' అని(దా. మూ).

## రాజధర్మపర్వము.

భీష్ముఁడు ధర్మరాజునకు లోకమునకు రాజుండుట వలని గుణమును లేమి వలని దోషమును నిరూపించుట.

ధర్మరాజు 'పితామహా! నాలుగాశ్రమములును నట్లేనాలుగు జాతులును జెప్పితివి. రాష్ట్రమునందలి జనులకు ముఖ్యమయిన కార్యమేమియో చెప్పుము' అనెను. అందులకు భీష్ముఁడు 'రాజు నభిషేకముచేయుటయే రాష్ట్రమునకు మిక్కిలి ముఖ్యమయిన కృత్యము. రాజును, సైన్యమును లేనిరాజ్యమును,దొంగలు కీడ్పఱుతురు. అరాజకము లయినరాజ్యములందు ధర్మము నెలకొనియుండదు. మఱియు జనులు నొకరినొకరు భక్షింతురు. అరాజకమగు రాజ్య మేవిధమునను నిందింపఁదగినది. రాజును మ్రొక్కుట యింద్రుని మ్రొక్కుటయె యగునని శ్రుతులు చెప్పుచున్నవి. సంపదనుగోరిన మనుష్యుఁడు రాజు నింద్రునిం బోలె నారాధింపవలయును. అరాజకమయిన రాజ్యములందు వసింపరాదని వేదము విధించుచున్నది. అరాజకమయిన రాజ్యమందగ్నియు హవిస్సును వహింపవు. రాజును వీరులును లేనియొక రాజ్యముండఁగా మిక్కిలి బలవంతుఁ డగువాఁడొకఁడు వాని నేలుటకై వచ్చెనేని యతని నెదుర్కొని పూజించుట మిక్కిలియు మంచిది. ఇదియేమంచి యాలోచనము. అరాజకముగా రాజ్యముండుటకంటె పాపము మఱొక్కటిలేదు. కాఁబట్టి యాశూరుఁడు దీనిని జక్కఁగాఁ బాలించినయెడ సమగ్రమయిన క్షేమముగలుగును. ఇట్లుగాక బలవంతుఁ డయినయాశూరునకుఁ గోపము కలిగించినయెడల రాజ్యమును నిశ్శేషముగా

నతఁడు నశింపఁజేయును. పాలుపిదుకుటకుఁ గష్టమైన యావు మిక్కిలియు కాఁచియపడుచున్నది. సులువుగా పిదికెడి యావును జనులు హింసింపరు. వేఁడిచూపకయే వంగునట్టి వస్తువునకు జనులు వేఁడిమిచూపరు. తానే వంగెడు మ్రాఁకును వంచుటకై జనులు కష్టపెట్టరు. ఈ యుపమానమును దెలిసిన బుద్ధిమంతుఁడు బలవంతుని యెడఁ దానే నమ్రుఁడై యుండవలయును. బలవంతునికిఁజూపు మ్రొక్కు నింద్రునికిఁ జూపిన మ్రొక్కే యగును. కాఁబట్టి క్షేమమునుగోరు మనుష్యుఁ డెప్పుడును రాజు నేర్పఱచుకొనవలయును. రాజులేని జనులు, ధనవాంఛయు, దారభోగమును బడయుఁజాలరు. అరాజకమయిన రాజ్యమందు పాపుఁడగువాఁడు పరులసొమ్ము నపహరించి సంతోషించును. వీని ధనమును దక్కినపాపు లాక్రమించు కొందురు. ఇట్లుండఁగా రాజ్యమునకు రాజునుగోరక పాపాత్ములగు మనుజులును క్షేమమును బడయుట యేసమయమందును సాధ్యము గాదు. ఒకని ధనము నిరువురును, నిరువురదానిని వేఱుపెక్కండ్రును నపహరింతురు. దాసత్వమునకుఁ దగనివానిని దాసునిఁగాను జేయుదురు. బలవంతముగా స్త్రీల నపహరింతురు. ఈ కారణమును బట్టియే దేవతలు రాజుల నేర్పఱచిరి. దండమును జెల్లించు రాజీలోకమున లేనిచో నీటియందుఁ జేఁపలుంబోలె బలవంతులు బలహీనులను మ్రింగివైతురు. పూర్వకాలమునఁ బ్రజలు రాజులేని కారణముంబట్టి, నీఁటియందలి చేపలు కృశించిన చేఁపలంబోలె నొకరినొకరు భక్షించి నాశమునొందిరని వినియున్నారము. పిదప నాజను లొక్కటిగాఁజేరి 'కటువుగాఁ మాటలాడు వానిని, కటువుగా దండించువానిని, పర

భార్య నపహరించువానిని, తోలఁగఁ బుచ్చవలయును. మనము చేసికొన్న యీ యొడంబడికను మీఱి నడచువానిని దొలఁగఁ బుచ్చవలయును' అని గట్టిగా నిర్ణయించుకొనిరి. ఇట్లు భేదము లేక యన్ని జాతులవారికిని నమ్మిక కలుగఁగోరి తాము చేసి కొన్న సమయమునకుఁ దగునట్లుగా నా ప్రజలు నడచుకొనుచు వచ్చిరి. ఇట్లుండియు ప్రజలు, సుఖమునొందక యార్తులై యంద ఱు నొక్కటిగాఁగూడి బ్రహ్మకడకుఁబోయి 'మహాత్మా! రాజు లేని కారణమున నాశము నొందుచున్నారము. మమ్ముఁ బరిపా లించుటకుఁ దగిన రాజును బంపుదువేని మేమందఱ మతనిని బూజించుచు వచ్చెదము' అని ప్రార్థించిరి. బ్రహ్మయు, మనువును వారలకు రాజుగా నుండునట్టు లాజ్ఞాపించెను. మను వందులకు సంతోషము నొందక, 'రాజ్యమునేలుట మిక్కిలియు దుష్కర ము; అందును నెప్పుడును దప్పునడకలుగల మనుష్యులయెడ విశేషించి యిది దుష్కరముగాన యీ పాపకార్యమునకు నేను భయపడుచున్నా'నని యాప్రజలకుఁ జెప్పెను. ప్రజ లామను వునుజూచి 'మనూ! నీవు భయపడవలదు, మేము నీకు వలయు ధనము వృద్ధిఁ బొందించెదము. పసులందును బంగారమందును నేఁబదింట నొకపాలును, ధాన్యమందుఁ బదింట నొకపాలును, బొక్కసమును బెంపొందించుటకుఁగాను నిచ్చెదము. వివాహ ములు పొసఁగినపుడు శుల్కముమాట కలిగెనేని, మిక్కిలి చక్కని కన్నియను నీకు నిచ్చెదము. ఇంద్రుని దేవత లను సరించునట్లు, మాయందు ముఖ్యు లయినమనుష్యు లాయుధము లను వాహనములనుగొని నీవెంట ననుసరించి రాఁగలవారలు. రాజా! ఇట్లు పరు లెదిరింపఁ దగనిబలమును బొంది, ప్రతా

పము మెఱసి వెలుంగుసీవు, కుబేరుఁడు రాక్షసులనుంబోలె మమ్ము
నెల్ల సుఖముండఁ జేయుము. నీచేత సురక్షితులమై మేముచేయు
సకలధర్మములందును, నాలుగింట నొకపాలు మిమ్ముఁ జేరవల
యును. రాజా! ఏశ్రమయులేక యిట్లుచేరు పెనుధర్మముచేత
పేరిమినొందు రాజుగా వెలుంగు నీవు, ఇంద్రుఁడు దేవతలంబోలె,
మమ్ము సకల కార్యములందును బరిపాలింపుము. తపింపఁజేయు
సూర్యునివలె శత్రువులజయింప వెలువడి వారలకావరము
నడంచి యెప్పుడును మాకు ధర్మమును గలిగింపుము' అని
చెప్పిరి. ఇట్లు వారు చెప్పఁగా మహాతేజుండును మహాకుల
ప్రసూతుండును మహాపరాక్రముండునై తేజంబున జ్వలించు
చున్నట్లున్న యామనువు, ఆమహాజన సమూహము బలసికొలువఁ
బయనమయ్యెను. ఇంద్రుని మహత్త్వము గాంచిన దేవతలుం
బోలె నామనువు మహిమను గాంచిననాలుగువర్ణములవారును
నాశ్రమములవారును మ్లేచ్ఛులును, ముచ్చులును మొదలుగాఁ
గలవారు వడఁకుచుఁ దమ మనస్సును స్వధర్మమం దుంచినవా
రయిరి. పిదపఁ బాపములనుబోఁగొట్టి ప్రాణులను స్వధర్మము
లందుఁబూనికగలవారిం గావించి వర్షించుమేఘముంబోలె మను
వు భూమిచుట్టు సంచరించెను. క్షేమమునుగోరిన భూమియందలి
మనుష్యులు, జనులకు హితముగోరి యిట్లు మొదట రాజునే
యేర్పఱుప వలయును. దేవత లింద్రునివలెను,శిష్యు లాచార్యుని
వలెను,సమీపమందున్న ప్రజలు రాజు నెప్పుడు భక్తితోఁడఁగొని
మ్రొక్కవలయును. ఈలోకమందు, తన జనముచేతఁ బూజి
తుండగు మనుష్యునిఁ బరులును బహుమానింతురు. తనవారి
చేత నవమానింపఁబడిన వానిని పరులును బరిభవింతురు. రాజు

నకుఁ బగవారిచేఁ గలుగుపరిభవ మెల్లవారికిని దుఃఖము గానే యుండును. కాఁబట్టి, ఛత్త్రములు, వాహనములు, వస్త్రములు, ఆభరణములు, భోజనము, పానములు,గృహములు, ఆసనములు, శయనములు, మఱియుఁ దక్కిన యుపకరణముల నన్నింటిని రాజున కొసంగవలయును. అట్లు సేయుటవలన రాజు, ప్రజలను మఱింతఁ గాపాడ శక్తుండగును; ఎదిరికిఁ జెనకరాని వాఁడునగును. అతఁడు చిఱునవ్వుదొలఁక మాటాడవలయును. తనతో మాటాడువారితో మధురముగా ప్రతి మాటాలాడ వలయును. మఱియు నెనరుగలిగి, పెద్దలయందు దృఢభక్తితోఁ గూడి, జితేంద్రియుఁడై వారివారికి నీఁదగినది పంచియిచ్చు వాఁడై యుండవలయును. తన్నుఁ జూచువాని మృదువుగను నింపుగను జక్కఁగను జూడను వలయును' అనెను. ఇది యఱువదియాఱవయధ్యాయము.



## రాజధర్మపర్వము.

(భీష్ముఁడు వసుమనస్సునకు బృహస్పతిచెప్పిన రాజగుణములను ధర్మరాజునకుఁ జెప్పుట.)

ధర్మరాజు 'పితామహా ! మనుష్యుల కధిపతియైన రాజును బ్రాహ్మణులు దైవమని చెప్పుటయేల?' అని యడుగఁగా, భీష్ముఁడు 'ఈ విషయమందు వసుమనస్సు బృహస్పతి యనువీరికి జరిగిన సంవాదమగు పురాతనమయిన యితిహాసము నుదాహరింతురు. వసుమనసుఁడను రాజొకఁ డుండెను. అతఁడు కోసల దేశాధిపతి; మిక్కిలి బుద్ధిమంతుఁడు. అతఁ డొకప్పుడు ప్రజ్ఞా సంపన్నుండగు బృహస్పతిని ప్రశ్నము సేయుటకుఁ బోయెను.

ఆరాజు వినయవిధి నెఱింగినవాఁడుగాన బృహస్పతి కడకుఁబోయి ప్రదక్షిణముచేసి యథావిధి నమస్కరించి యభివాదనాదులయిన మర్యాదల నెల్లఁ గావించి సర్వలోకహితపరుఁడై రాజ్యపరిపాలన విధి నడుగఁజొచ్చెను. ఆరాజు ప్రజలసుఖము నరసి యాధర్మశీలుం డగుబృహస్పతితో 'మహాప్రాజ్ఞా ! ప్రాణులు దేనిచేతఁ బెరుఁగుచున్నవి? దేనిచేత నశించుచున్నవి? ఎవని నర్చించినయెడ నవి యవ్యయంబగు సుఖమునొందును? దేవర్షీ ! ఈ విషయమును ధర్మార్థకామములను గుఱించిన సందేహములు తొలఁగునట్లు నాకుపదేశింపవలయును' అని యడిగెను. అందులకు నా మహాప్రాజ్ఞుఁడు బృహస్పతి రాజులయెడఁ జూపవలయు గౌరవమును రాజ్యమును వృద్ధిఁబొందించు విధమును దండనీతి చొప్పున నతనికిఁ జెప్పువాఁ డయ్యెను.

'రాజా ! లోకుల ధర్మమునకెల్ల మూలము రాజుగాఁ జూపట్టుచున్నాఁడు. రాజువలని భయ మొకటిచేతనే ప్రజ లొకరినొకరు భక్షింపకున్నారు. మర్యాదమాలి పరుల ధనమునకై యువ్విళులూరుచు లోకమంతయు నుండును; రా జట్టు గానీక వానిని ధర్మముచే శుద్ధముగావించి తానును బరిశుద్ధుండయి వెలుంగుచున్నాఁడు. రాజా ! చంద్రుఁడును సూర్యుఁడును నుదయింపనియెడల, ప్రాణు లొకరినొకరు గాననేరక పెనుఁజీఁకటియందు మునుంగునట్లును, నీరు సురిఁగినచోటఁ జేఁపలును, కలకలములేని (జంకులేని) చోటఁ బిట్టలును విచ్చలవిడిఁ గ్రీడించుటయేకాక, కొంతవడికి నొండొంటి నెదిరించికొట్టుకొని పలువిధముల హింస గావించుకొనుచు సందేహములేక నాశము నొందునట్లును; ఈ ప్రజలును రాజులేనిచో, మేపు గొల్లవాఁడు

లేని పసులుంబోలె, దిక్కుమాలి చీఁకటిని మునిఁగి నాశ
మొందును. రాజు రక్షింపనిచో బలహీనుల ద్రవ్యమును బల
వంతు లపహరించుటయే కాక, యెదిరించి వచ్చువారిని జంపి
వైతురు. రాజు పరిపాలింపనిచో, పుత్త్రులు, భార్యలు ధనమును
దక్కఁగల వస్తువులును, నశించుటేకాక యీలోకమందు 'ఇది
నాది' అనుతలంపు నెలకొనఁజాలదు. ఎచ్చటను దొంగతనము
జరుగును. రాజు పరిపాలింపనిచో, వాహనములును, వస్త్రములు
నాభరణములును,పలువిధములయిన రత్నములును, పాపాత్ములు
బలవంతముగా నపహరింతురు. రాజు పరిపాలింపనిచో, ధర్మము
నాచరించువారిని పెక్కువిధములయిన యాయుధములచేతఁ
గొట్టుటయే కాక, యధర్మమునుగూడఁ జేయుదురు. రాజు పరి
పాలింపని యెడ, తల్లి, తండ్రి, పెద్దలు, ఆచార్యులు, అతిథి,
గురువు నను వీరిని గష్టపెట్టుదురు; చంపను జంపుదురు; కూపెట్టు
తక్కిన జనులను గొట్టుదురు. ఈలోకము దొంగలమయ
మగును. రాజు పరిపాలింపనియెడల, ధనవంతులగు జను
లకు క్లేశమును బంధమును వధమును నేసమయమందైనను
గలుగును. ఎవరును 'నాది' యను స్వతంత్రత నెఱపఁ
జాలరు. రాజు పరిపాలింపనియెడ రాజ్యము పలువిధముల నశిం
చును ; ఈ లోకము దొంగలకు లోనగును. జను లకాలమున
నశింతురు. రాజు పరిపాలింపనియెడ, వర్తకమును గృషియు
నడవనేరదు ; స్త్రీల వ్యభిచారమును దోషముగాదు. మూఁడు
వేదములును ధర్మమును మునిఁగిపోవును. రాజు పరిపాలిం
పనిచో, సంపూర్ణదక్షిణలు గలయాగములు యథావిధిని
వర్తింపవు. వివాహములును సభయు జరుగవు. రాజు పరిపాలిం

పనియెడ నెద్దులును నావులయందు వర్తింపవు. పెరుఁగు కుండలును జిలుకఁబడవు. గొల్లపల్లెలును రూపుమాయును. రాజు పరిపాలింపనిచో, క్షణంబున లోకమంతయు భయమునొంది మనంబుల నదుంకుచు, బ్రజలను ఘూలి 'హా! హా!' యని నశించిపోవును. రాజు రక్షింపనియెడల, వత్సరముల కొలఁదిని జేయు సత్త్రయాగము లెట్టిభయమును లేక, విధ్యుక్తములగు దక్షిణలతో జరుగవు. రాజు పాలింపనియెడల, తపంబు చేయఁదగు బ్రాహ్మణులు, విద్యలందును వ్రతములందును దీక్షితులై నాలుగు వేదములను యథావిధిని నభ్యసింపరు. రాజు రక్షింపనియెడల జనులు మోహముచేత నెంతయుఁ గొట్టువడి ధర్మములను దిగవిడుతురు; మఱియు జంకుమాలి పరులధనముల నపహరింపనుంకింతురు. రాజు పాలింపనియెడల, మనుష్యులచేతనున్న ధనమును, వారిచేతనుండి దొంగలు ముచ్చిలింతురు; ఎట్టి కట్టుపాటులును మాఱిపోవును; ఎవ్వరును భయముచేత బీడితులయి పరుగెత్తుదురు. రాజు రక్షింపనియెడల నీతిమాలి తోఁచినట్లెల్ల జనులు నడతురు. వర్ణసంకరము కలుగును. రాజ్యమున దుర్భిక్షము పట్టును. రాజుచేత సురక్షితులగు మనుజు లెందును నెట్టి భయమును లేక యింటివాఁకిటి తలుపులను దెఱచికొని యిష్టము చొప్పునఁ బరుండి నిదురింతురు. ధర్మము తప్పనిరాజు భూమిని జక్కఁగా బాలింపనియెడ నెవఁడును బరుని చెడుపలుకులకే సైఁపఁడు. ఇఁకఁ జేతితోఁ దాఁకుటను నోర్చుటయెక్కడిది? రాజు రక్షించినచో, నబలలగు పడఁతులు భయముమాలి సర్వాభరణములఁ గయిసేసి పురుషునిసహాయము లేక యొంటిమెయిదారిని బోవుదురు. రాజు రక్షించు కాలమందు, జను లొకరినొకరు

బాధింపక యథాదరించుటయేకాక ధర్మమార్గంబునఁ బ్రవర్తిం తురు. రాజు రక్షించుకాలమున బ్రాహ్మణులు మొదలయిన మూఁడువర్ణములవారును నియమముగలిగి విద్యలను గఱచు టయేకాక, నానావిధములయిన మహాయజ్ఞములను గావింతురు. వేదమును జీవనము మూలముగాఁ గొని జీవించెడి యీలోక మంతయు రాజు రక్షణమందు నెలకొనవలయును. రాజు తన వెనుబలముచేత, గొప్పదియగు భూభారమునుదాల్చి ప్రజలను రక్షించునేని, లోకము దోషములేక తెలివి దొలఁకుచుండును. ప్రాణుల యునికికిని లేమికిని రాజునునికియు లేమియునే వరుసగా బలీయమయిన కారణములు. కాన యట్టిరాజును బూజింపని వాఁడెవఁడు? లోకమునకంతయు సుఖము నొసంగునట్టి రాజు భారమును దాల్చుటయేకాక యతని హితమందును బ్రియమం దును నెలకొనియుండువాఁ డీరెండులోకములను జయించును. రాజునకు మనస్సుచేతనయినను గీడుదలంచు మనుజుఁడు సందే హములేక యిహమందు దుఃఖపడుటయే కాక మృతుం డయిన పిదపను నరకమొందును. రాజుకూడ నొక మనుష్యుఁడేకదా యనియతని నెప్పుడుగాని యవమానించుట దగదు. 'రాజు' అని మనుష్యరూపముతో నొక పరమదైవమున్నదని తెలియవల యును. కాలమునకుఁ దగినట్లు, ఐదురూపములను జేయురాజు క్రమముగా అగ్ని, ఆదిత్యుఁడు, మృత్యువు, కుబేరుఁడు, యముఁ డను నైదుదేవరూపములు గలవాఁడగును. దాపుననున్న దుర్మా ర్గులగు పాపులును, కటువయిన తేజస్సుచేతఁ గాల్చునపుడు, అ గ్నియగును; చారుల మూలమునఁ బ్రజల నెల్లవారిని గనుఁగొని వారల క్షేమములను గావించుకొని వర్తించునపుడు ఆదిత్యుఁ

ఢగును. రాజు మిక్కిలి కోపముతోడ నపరిశుద్ధులగు (దుష్టవర్తు లగు)మనుష్యులను వారలపుత్రులతోడను,పౌత్రులతోడను,మంత్రులతోడనుబలువిధములుగా నాశము సేయునపుడు మృత్యువగుచున్నాఁడు. అధర్మమున వర్తించు మనుష్యుల నెల్లవారిని క్రూరమయిన దండనములచే శిక్షించి ధార్మికులను రక్షించుచు వచ్చునపుడు యముఁడగును. ఎప్పుడును రాజుపకారపరులయిన జనులకు ధనములను వర్ధించి తృప్తిగావించియు విరోధుల పలుదెఱంగుల రత్నములను నపహరించియు, ఒక్కనికి సంపదనొసంగియు, నొకనివలననుండి ధనము నపహరించుచువచ్చునో యప్పు డతఁడు లోకమునఁ గుబేరుఁడగును. క్రూరమయిన నడవడిలేక ధర్మమునుగోరుచు సమర్థుండగువాఁడు లోకమున రాజునందసూయలేకయు రాజుతోడ విరోధముచేయకయు నుండవలయును. పుత్రుఁడుగా నుండినను, చెలికాఁడుగా నుండినను, తోడఁబుట్టినవాఁడుగా నుండినను ప్రాణసముఁడుగా నుండినను రాజునకు విరోధముచేయుమనుజుఁడు సుఖము నొందఁజాలఁడు. గాలితోఁగూడినదై మండుచున్న యగ్నియందు నగపడినను మిగతపడవచ్చును. రాజుకోపము బారిఁబడినవాఁడు కొంచెమైనను మిగతపడఁడు. మనుష్యుఁడు రాజు పాలనమందుఁగల యెట్టి వస్తువులనయినను మిక్కిలిదూరమున దిగవిడువవలయును; (కాని పొంతఁబోవరాదు). మృత్యువునెడ భయపడునట్లు రాజు ధనమును గయికొనుటకు భయపడవలయును. వంచనమెయిఁజంపు జంత్రమునఁజిక్కిన మృగములవలె రాజుధనము నెత్తికొనఁ దొడంగు మనుష్యుఁడు తోడనే చంపఁబడును. ఈలోకమందు బుద్ధిగలవాఁడు తన ధనమువలె రాజధనమును నెచ్చరికతో రక్షింపవలయును.

బుద్ధిమాలి రాజధనము నపహరించు మనుజులు, పలువిధములయి ఘోరమగు మహానరకమందుఁ జిరకాలము పడుదురు. రాజు, భోజుఁడు, విరాట్టు, సమ్రాట్టు, క్షత్రియుఁడు, భూపతి, నరపతి యనెడి యీపదములచేత స్తుతింపఁబడును. రాజును బూజింపఁదగనివాఁడెవఁడు? కాఁబట్టి క్షేమమునుగోరు మనుజుఁడు మనసును నింద్రియములును నడఁచుకొని, మంచిబుద్ధియు ధైర్యమును సామర్థ్యమును గలవాఁడై యవశ్యము రాజు నాశ్రయింపవలయును. మంచిబుద్ధియుఁగృతజ్ఞతయుఁ గలిగి,పదవియు నింద్రియజయమును బెద్దటికమును దృఢభక్తియుఁ గలిగి, ధర్మమున నెలకొన్నవాఁడై తనస్థానమందున్నట్టివాఁడగుమంత్రిని రాజు పూజింపవలయును. దృఢభక్తిగలవాఁడును, ప్రజ్ఞాసంపన్నుఁడును, ధర్మజ్ఞుఁడును, జితేంద్రియుఁడును, గఱువతనము గలవాఁడును, శూరుండును బ్రసిద్ధుండు నయినమనుష్యుని రాజు పడయవలయును. *ప్రజ్ఞ మనుష్యుని గర్వితునిఁగాఁ జేయును. రాజు మనుష్యులను లోఁకువయినవారినిగాఁ జేయును. రాజు తన్నాశ్రయింప సుఖముఁజేయును. రాజు నెదిరించినవాని కెందును సుఖముగలుగదు. ప్రజలు రాజును దమ మొదటిశరీరముగాను రాజు ప్రజలను తనయొనలేనిశరీరముగాను భావింపవలయును. రాజులేని దేశమును దేశములేని రాజును నెలకొనియుండనేరరు. రాజు ప్రజలకు మనసును మంచిగతియు ప్రతిష్ఠయు పరమసుఖము

---

* ప్రజ్ఞా ప్రగల్భం కురుతేమనుష్యం । రాజాకృశాన్వై కురుతే మనుష్యాన్' అని ఔ. మూలము. రాజా ప్రగల్భం పురుషంకరోతి । రాజాభృశం బృంహయతే మనుష్యాన్' అని దా. మూలము. రాజు మనుష్యులను ప్రగల్భులఁగాను గొప్పవారినిగాను జేయునని యర్థము.

నగుచున్నాఁడు. రాజును జక్కఁగా నాశ్రయించిన జను లీలోక మును బరలోకమును జయింతురు. తపము, సత్యము, సౌహార్దము నను వీనితోడ భూమిని బరిపాలించుచు వచ్చు రాజును గొప్ప యాగములుచేసి మిక్కిలి పొగడ్తనొంది స్వర్గమందు శాశ్వతమయిన పదమును బొందును' అనెను. బృహస్పతి యిట్లుపదేశింపఁగా రాజసత్తముఁ డా కోసలాధిపతి వసుమనుండు ప్రజాపాలనమనెడు నుత్తమధర్మమును మిక్కిలి జతనంబుతోడఁ జేయుచువచ్చెను' అనెను. ఇది యఱువదియేడవయధ్యాయము.



## రాజధర్మపర్వము.

### భీష్ముఁడు ధర్మరాజునకు రాజనీతిని చెప్పుట.

ధర్మరాజు 'భారతా! రాజు విశేషించి చేయవలసిన కార్యమేమున్నది? జనపదము నెట్లు రక్షింపవలయును? శత్రువులను జంపవలసిన విధమెట్లు? వేగులవారి నెట్లు ప్రయోగింపవలయును? నాలుగు జాతులవారికిని భృత్యులకును భార్యలకును బుత్రులకును నమ్మిక గలిగింపవలసిన రీతియెట్లు?' అని యడిగెను.

అందులకు భీష్ముఁడు 'మహారాజా! మొదట రాజునుగాని రాజకృత్యము వహించువాఁడుగాని, జేయవలసిన రాజకృత్యముల నన్నింటి నాలించి వినుము. రాజెప్పుడును మొదటఁ దన్నును పిదపఁ దనశత్రువులను జయింపవలయును. తన్ను జయింపనిరాజు శత్రువులను జయించుట యెక్కడిది? ఐదు విధములయిన యింద్రియములను నడంచుటయే తన్ను జయించుట యగును. ఇంద్రియములును జయించిన రాజే, శత్రువులను జయింప సమ

ర్థుఁడగును. కోటలయందును, ఎల్లలయందును, బట్టణపు నుపవనములందు, నుద్యానవనములందును, జనులుగూడు చోటులందును, రహస్యములయిన వెక్కుకందువ పట్టులయందును,నగరము నడుమను, అంతఃపురమునందును, గావఁదగు పదాతులను నుంపవలయును. జడులవలెను, అంధులవలెను, బధిరులవలెను బయికిఁ గనఁబడునట్టివారిని వేగులవారుగా నుపయోగింపవలయును. వారందఱును(వారి శక్తులంబట్టి) చక్కఁగాఁ బరీక్షింపఁబడిన వారుగను, బుద్ధిమంతులుగను, ఆఁకలిదప్పులను శ్రమములను నోర్చువారుగను, నుండవలయును. రా జెచ్చరికగలిగి మంత్రులందఱయెడలను మూఁడువిధములగు మిత్రులయందును, బుత్రులయందును, బట్టణమందును, గ్రామమందును, సామంతరాజులయందును, ఒకరినొకరు తెలిసికొనని విధమునఁ జారులను నుంపవలయును.సమర్థుండగురాజు,అంగడులయందును, విహారస్థానములందును, జనులు గూడుపట్టులందును, వీథులందును, తోఁటలందును, చిన్నతోఁటలందును, పండితులసంఘములందును, భోగమువాటికలందును, చత్వరములందును, (రచ్చ చావడులందును) పసివాండ్ల పట్టులందును, ధనవంతుల యిండ్లయందును, బరులచేఁ బంపఁబడిన చారులను, దన చారులనుగోని వెదకి తెలిసికొని కొట్టి పుచ్చవలయును. *చారుఁడు తెలియఁబడెనా రాజునకది మిక్కిలి హితమగును. రాజు తాను తక్కువవాఁడుగాఁ దనకుఁ దోఁచినపుడు, మంత్రులతోడ నాలో

* 'చారేతు విదితే పూర్వం హితం భవతిభారత' అని మూలము. చారేచ విహతే సర్వంహతం భవతిభారత' అని (దా. మూ.) చారుఁడు కొట్టువడెనా అన్నియుఁ గొట్టువడునని యర్థము.

చించికొని తనకంటె నెక్కుడు బలముగల రాజుతోడ సంధిచేసి కొనవలయును. పెక్కులు శాస్త్రములుచదివినవారును విద్వాంసులును దండనీతిఁ జక్కఁగా నధిగమించినవారునునయిన బ్రాహ్మణులును క్షత్రియులును, వైశ్యులును రాజునకు మంత్రులుగా నుండవలయును. నీతియందు సందేహముగలరాజు, వీరలయందు మొదట నీతితత్త్వముల నెఱింగిన బ్రాహ్మణునిఁ, బిదప నీతి నిపుణుం డయినక్షత్రియునిని, పిదప శాస్త్రజ్ఞులును దనకుహిత కారులు నగు వైశ్యశూద్రులనును నడుగవలయును. తనకే తక్కువయు నున్నట్లు తెలియకుండినను, సమర్థుం డగురాజు పగరాజుతో సంధిని, దానివలనఁ దన కేదేని గొప్పప్రయోజనము కలుగఁగూడునేని, త్వరితముగాఁ జేసికొనవలయును. ధర్మమున రాజ్యమును రక్షించురాజు, సద్గుణము గలవారును మంచి యుత్సాహము గలవారును, ధర్మజ్ఞులును, సాధువులునగు రాజులతోడను సంధి చేసికొనవలయును. తన్ను నపాయము పొరయుటయుఁ దాను నాశమునొంద నుండుటయు రాజు గనుఁగొనునేని, లోకమునకు విరోధులును మున్ను దన కపకారము చేసినవారును నగువారిని నేవిధమునను జంపవలయును. ఉపకారమును గాని లేక యపకారమును గాని చేయుటకు శక్తిలేనివాఁడును, ద్రోసిపుచ్చరానివాఁడును నగు రాజునెడ నుదాసీనుఁడై యుండవలయును. సమర్థుండును, వీరుండును, విద్వాంసుండును, సేనలబలిమిచే సుఖంబుండువాఁడును నగు రాజు, దండయాత్రయందుఁ గోరికగలఁడేని మొదటఁ దన పట్టణమును రక్షింపవలసినయుపాయములను బన్ని బంధువులు సుహృదులును లేనివాఁడును, వీరులచే నెదిరింపఁబడినవాఁడును,

ప్రయత్నశూన్యుఁడును బలహీనుఁడునుగాఁ దెలిసినరాజును గూర్చి దండయాత్రకు నాజ్ఞ సేయవలయును. బలవీర్యములు తక్కువ యగురాజు, ఎక్కుఁడు వీర్యవంతుఁ డగురాజునకు లోఁపడక యెప్పుడును వానినిబట్టి లాగుటకు, వీలు చూచుచుండవలయును. వాని రాజ్యమును, శస్త్రములచేతను, అగ్నిచేతను, విషముచేతను, మూర్ఛనములచేతను బీడింపవలయును. ఆరాజులకును వతనికి ననుంగు లయినమంత్రులకును, వివాదములను గలిగింపవలయును. రాజ్యము గోరునేని బుద్ధిమంతుఁ డగురాజు, బలవంతునితోడ నేసమయమందుఁగాని యుద్ధము వర్జింపవలయును. ఎప్పుడును సామమును, దానమును, భేదము ననెడుమూఁడుపాయములచేఁ బడయందగినవస్తువును బండితుఁ డగురాజు పడసి సంతోషింపవలయు'ననియు బృహస్పతి చెప్పెను. అమితమయిన బుద్ధి గలరాజు ప్రజలనుగావంగోరునేని వారివలననుండి యాఱింట నొకపాలు పన్ను పుచ్చుకొనవలయును. దండింపఁదగినవాని వలననుండియు, నున్మత్తుఁడు మొదలగువారల నుండియు కొంచెమో యెక్కువగనో దండుగను, ప్రజలను రక్షింపఁగోరియే బలిమిని దీసికొనవలయును. ప్రజలను సందేహములేక తనబిడ్డలవలెఁజూచుకొనవలయును. వ్యవహారమునుజూచునపు, డేమనుజుని యందును, స్నేహబుద్ధిని బచరింపరాదు. రాజు సమస్తములయిన యర్థములను నెఱింగిన ప్రాజ్ఞులను వ్యవహారములను విచారించుటకు నేర్పఱుపవలయును. ఏలన రాజ్యము వ్యవహారములయం దెప్పుడును, నెలకొనియున్నది. బంగారును రత్నములును నెత్తు గనులందును, ఉప్పు అళములందును, సుంకపు చావడి యందును, లేక ధాన్యములు మొదలయినవి యమ్ముచోట్లను,

ఎగుమతి చేయుచోట్లను, ఏనుఁగుల గుంపు లున్న చోట్లను, మంత్రులను, లేక యాప్తులును హితులు నయినమనుష్యులను, రాజు నియమింపవలయును. ఎప్పుడును లెస్సగా దండమును జెల్లించుచువచ్చు రాజు, ధర్మమును బడయును. దండము రాజున కెప్పుడును తమ ధర్మమని పొగడఁబడుచున్నది. రాజు వేద వేదాంగములఁ గలిచినవాఁడును, జ్ఞానసంపన్నుఁడును, మహాతపస్వియు, నెప్పుడు దానపరుఁడును యాగశీలుండును నయి యుండవలయును. ఈ గుణము లన్నియు రాజునం దెప్పుడును నెలకొని యుండవలయును. వ్యవహారమునకు హానికలుగునేని, రాజునకుఁ గీర్తియు, స్వర్గమును నెక్కడనుండి కలుగును? బుద్ధిమంతుఁడగు రాజు తనకంటె బలవంతుఁడయినరాజుచేతఁ బీడితుండగునపుడు, దుర్గమును బ్రాపునొందవలయును. విధిచొప్పున స్నేహితుల నాశ్రయించి పగవానిని గెలువనుంకించి సామము భేదము ననెడియుపాయములను దక్కఁగల మార్గములను, వచ్చునట్లు చేయవలయును. రాజమార్గములందు, నడవివారి నుంపవలయును. వలసెనా గ్రామముల నున్న జనములనెల్ల వెలువరించి సమీపమందున్న పేటలయందు, వసింపఁ జేయవలయును. ధనవంతులగు ప్రజలనును సేనాపతులనును బలుమాఱు నమ్మికగలుగఁ బుజ్జగించి వెలిదేశముల నున్న ప్రజలను చక్కఁగా రక్షితములయిన కోటపట్టులందుఁ జొప్పింపవలయును. వెలుపలనున్న ధాన్యపురాసులను కోటలలోపలికి రాజు తానే తెప్పించుకొనవలయును. అది సాధ్యముకానియెడల వానినెంతయు నగ్నిచేతఁ గాల్చి వేయవలయును. రాజు, (పగవారి ప్రజలయందు భేదము పుట్టించి) యతని క్షేత్రములందుఁ గలపంటలను నాశముసేయుట

కై పగవారిజనులను వశపఱచుకొనవలయును. లేదా, తనసేనల చేతఁగాని యాపంటలనెల్ల నాశము సేయింపవలెను. నదీమార్గములందు (శత్రువులు రాఁగూడిన) వంతెనలను బడఁగూల్పవలయును. తనరాజ్యమున కొలంకులందలి జలములనెల్ల వెలుపలికిఁ బాఱించి వ్యయింపవలయును. అట్లు చేయందరముగాని బావి మొదలగువానిని విషాదులచేఁ జెఱుపవలయును. ఆసమయము, రాఁగల కాలమును బరామర్శించి * మిత్రులకుఁ జేయవలసినకార్యము పొసఁగియున్నను దానిని బాటింపక, తనపగవానికిఁ బగవాఁడును వానిని యుద్ధరంగమున మార్కొనఁజాలినవాఁడునగు ననంతరదేశపురాజుతోఁ జెలిమిచేసికొని యుండవలయును. కోటలకుఁ జుట్టునున్నవియు చైత్యవృక్షములుకాక తక్కినవియునగు చిన్నమ్రాఁకులనెల్ల వేఱుతోడ నఱికి వేయవలయును. ముదిరినమ్రాఁకుల కొమ్మలను గోయించి వైవవలయును. చైత్యవృక్షముల యాకులను నేవిధమునను గ్రిందఁబడకుండునట్లు వర్జింపవలయును. చైత్యవృక్షములు, దేవతలు, యక్షులు, రాక్షసులు, భోగులు, పిశాచములు, పన్నగులు, గంధర్వులు, అప్సరసలు, రుద్రపరివారము లయినభూతములు, ననెడి వీనికి నునికిపట్టులయిన మ్రాఁకులను నఱికి కూల్పక వర్జింపవలయును. వారణాసి యనుదేశమందు ప్రమథగణముల యధిపతియగు నికుంభునిచే సౌదాసుం డనురాజు సేన చంపఁబడినట్టు వినుచు

* 'మిత్రకార్యే పృ్యపస్థితే' అని మూలము. 'యుద్ధకాలే పృ్యపస్థితే' అని (దా. మూలము.)

న్నాము, *ప్రగండిక లనుపట్టులనును † ఆకాశజనను లనుపట్టులను జక్కఁగాఁ జేయింపవలయును. శూలములుగల స్థాణువులచేతను, మొసఁడులచేతను, తిమింగిలములచేతను, అగడ్త నిండింపవలయును. ప్రాకారపుగోడలందు కోటనుండి వెలుపలికిఁ బాణు తెంచి పయిఁబడుటకై చిన్నచిన్నరంధ్రము లుంపవలయును. వానిని బెద్దద్వారములంబోలెఁ బదిలముగాఁ గాపాడుటకు వలయు జతనములు చేయింపవలయును. ఒక్కొక్కద్వారమందును బెద్ద యంత్రములను శతఘ్నియనెడి యాయుధముల నెక్కించుటయేకాక వానిని గైవసముగా నుంచుకొనవలయును. కట్టియలను జేర్చిపెట్టుకొనవలయును. అల్లె బావులను ద్రవ్వింపవలయును. నీళ్లుగోరి పూర్వులు త్రవ్విన బావులను నల్లె శుద్ధము చేయవలయును. గడ్డిపులుతోఁ జేయబడిన యిండ్లనెల్లను మన్నుఁ బూయింపవలయును. చైత్రమాసముగా నుండినచో నగ్నిభయము లేకుండుటకై యాపచ్చికను గడ్డిరాసులను ముందుగానే యెత్తి వేఱొక పదిలమయినచోటఁ జేర్పింపవలయును. రాజు అగ్నిహోత్రము నొకటినిదప్పఁ బగటిపూఁట వేఱగ్గిని దరికొల్పనీయక యన్నము మొదలగువానిని సయితము రాత్రియందే పాకము చేయింపవలయును. దేశమును బలాబలములను నెఱంగి కూడినంతవఱకు తాలచేతను, నిటికలచేతను, మంటిచేతను,

---

* 'ప్రగండికలనఁగా బహుదూరమున వచ్చు జనులు చూడఁగూడునదియు వెలుపలి ప్రాకారపు గోడలయం దమర్పఁబడినదియునగు శూరస్థానము.

† ఆకాశ జనములనఁగా శూరులు తమ్మురక్షించుకొనఁ గూడినదియు వెలుపలనున్న శత్రువులను గూర్చి పెట్లను బ్రయోగింపఁ గూడిన ద్వారములు గలదియునగు, వెలుపలి ప్రాకారమందలి స్థానము.

నిండ్లనుగట్టుకొనునట్లు చేయవలయును. కమ్మరకొట్టములందును బురుటిండ్లయందును, నిండ్ల తక్కిన గదులందును నగ్ని సురక్షితముగా వెలుఁగవచ్చును.పగటిపూఁట నగ్నిని దరికొలిపెడివానికి మరణదండనము విధింపవలయును. మఱినగరమును రక్షించుటకై యట్టిదండనము నందఱకుఁ దెలియునట్లు చాటింపను వలయును. బిచ్చగాండ్రను బండివాండ్రను, నపుంసకులను పిచ్చివాండ్రను, పయిరువృత్తిగలవారిని (కుశీలవులను) పట్టణము వెలుపలికిఁ దఱిమివేయవలయును. ఏలన వారు శత్రులు గాన వారలు లోపలనుండుట కీడున కేయగును. చత్వరములందును, (మంత్రి మొదలయిన పదునెనిమిది) తీర్థములందును, సభలందును, పౌరులగృహములందును రాజు తగినచారుల నుంపవలయును. రాజు,రాజమార్గములను విరివిగావింపవలయును. చోటునకుఁ దగినట్లు దుకాణములను జలిపందిరులను, నేర్పఱచునట్లు నాజ్ఞాపింపవలయును.ఆయుధములును ధాన్యములును భాండములును గజములును నశ్వములును సేనలును నుండునట్టి పట్టులనును, నగర్తలను, వీథులను,రహస్యమార్గములను, నెవ్వరు నొకప్పుడు నెఱుంగకుండునట్లు రహస్యముగా నుంచుకొనవలయును. పరసేనలచేతఁ బీడితుండగురాజు ధనములను బోగుచేసికొనవలయుటయేకాక నూనె, నేయి, తేనె, ధాన్యము, మందులు, అగ్గి, దర్భలు, ముంజిగడ్డి, ఆకులు, ఱెల్లు, లేకరులును, కరణములు, పచ్చిక, కట్టెలు, విషముపూసిన బాణములు, శక్తులు, యష్టులు,ప్రాసములు,పలుకలు, మఱి వీనినింబోని వెక్కువస్తువులనును, పోగుచేసి యుంచుకొనవలయును. సమస్తములయిన యౌషధములను, మూలములను ఫలములను (విషవైద్యులు

శల్యవైద్యులు, వ్యాధివైధ్యులు, మంత్రవైద్యులనెడి) నాలుగు విధముల వైద్యులను, విశేషముగా వెదికియుంపవలయును. నట్టువులను, నర్తకులను, మల్లులను మాయావులను చేర్పవలయును. వీరలుపట్టణము నలంకరింతురు; సమస్తజనులను సంతోషపఱతురు ఏమంత్రులవలననుండియు సేవకులవలననుండియు పట్టణజనులవలననుండియు, రాజువలననుండియు శంకగలుగుచున్నదో వారిని రాజు తనకు వశులను గావించుకొనవలయును. వారు తమ పనులునెఱవేర్చినంతనె రాజువారలను మిక్కుటమయిన ధనములచేత, సంతోషపెట్టవలయును. ఒక మనుష్యునికి, తగినకారణము లేకగాని, కోపముగానికాని, శిక్షవిధించికాని, ద్వేషము కలిగించియుండినయెడల దగినధనములచేతను బలుదెఱంగుల మంచిమాటలచేతను వానిని సంతుష్టునిఁగావించి శాస్త్రోక్తవిధిని రాజు తన ఋణమునీఁగికొనవలయును. రాజు రక్షింపవలసిన యేడంగములను నీవు తెలిసికొనుము— అవి, తాను, మంత్రి, బొక్కసము, దండము, మిత్రులు, నగరము, జనపదము అనునవి. ఈ యేడింటిమయమైనరాజ్యమును రాజు విశేషప్రయత్నమున రక్షించుచు రావలయును. షాడ్గుణ్యమును, త్రివర్గమును, త్రివర్గమునకంటె నెక్కుడయినదానిని దెలిసిన రాజీభూమి ననుభవించును. పరునితోడ సంధిచేసికొనుట, పరునెదుర్కొనఁబోవుట, పరునితోఁబోరాడుట, పరునకు భయమును గలిగించు యాత్రను బ్రకటించుట, పరునిచోటను దనచోటను సంధిచేసికొనుట,కోటనుగాని శత్రువునుగాని యాశ్రయించుట, యని యీయాఱును షాడ్గుణ్యమని చెప్పఁబడినవని తెలియుము. త్రివర్గమని చెప్పఁబడినదియు సావధానముగ విను

ము. రాజ్యమునకు క్షయము,(హీనత) స్థానము, (సమస్థితి) వృద్ధి (అధికత్వము) అను నీమూఁడును త్రివర్గమని చెప్పఁబడును. ధర్మము, అర్థము, కామము, అనునీమూఁడును, సనాతనమగు త్రివర్గమని చెప్పఁబడును. శాస్త్రప్రోక్తమయిన మంత్రశక్తి, ప్రభుశక్తి, ఉత్సాహశక్తి అను నీమూఁడు శక్తులును త్రివర్గమునకు నెక్కుడయిన సనాతనముగాఁ జెప్పంబడినవి. కార్యము, కారణము, కర్తయనెడి మూఁడును, త్రివర్గమునకంటె మిక్కిలిమేలయినవిగాఁ జెప్పఁబడునని తెలియుము. ఇవి యన్నియుఁగొఱఁత పడినను సత్త్వము, రజస్సుతమములనెడి మూఁడు గుణములును, శాశ్వతమును మోక్షకారణమును నగుత్రివర్గమని చెప్పఁబడును. ఈత్రివర్గమునుండి మిక్కిలియు విడివడిన మనుష్యుఁడు ముక్తుఁడని చెప్పఁబడుచున్నాఁడు. సమస్తకార్యముల నాశమును మోక్షమని చెప్పఁబడుచున్నది. కాబట్టియే, మోక్షకాములైై దేవదేవుండగు పితామహుఁ డెప్పుడును లోకయాత్ర నెలకొనియుండునట్టిదియు సంతుష్టికి సాధనమయినదియు నగు త్రివర్గమునకై నరయావిధిని జగమున కుపదేశించెను. ధర్మము, అర్థము, కామము ననెడి యీమూఁటిని గాలమునకుఁ దగునట్లు లనుష్ఠింపవలయును. కార్యముల కన్నిటికిని ధర్మము మూలము. రాజు ధర్మముచేతనే భూమిని జిరకాలము రక్షించుచున్నాఁడు. అర్థకామములు లేనివాఁడయినను దుఃఖము గలవాఁడయినను, ధర్మవర్తనుం డగురాజు చిరకాలము భూమిని బరిపాలించుచు వచ్చును. ఈవిషయమై అంగిరస్సు (బృహస్పతి) రెండు శ్లోకములను పాడియున్నాఁడు వానిని వినుము. — రాజు ధర్మముచొప్పునఁ గార్యములనుజేసి భూమిని నగరమందలి జనులను జక్కఁగాఁ

బరిపాలించి పరలోకమున సుఖముగా వెలుంగును. ప్రజలను లెస్సగాఁ బరిపాలించు రాజు ధర్మములెల్లఁ జేసినట్టివాఁడగును. తపముచేతను యాగములచేతను వానికిఁ బనయేమి?' అనుటయే. [శుక్రుఁడుపాడిన గీతములను వినుము. ఇవి దండనీతికిని త్రివర్గమునకును మూలములయినవి. రాజు తనసిద్ధికిఁ గారణమయిన పదియాఱంగములుగల సేనను,విషమును,మాయను, దైవమును, పౌరుషమును, తూర్పు నుత్తరపు(ఈశాన్యపు)భాగమందుఁదగ్గయినదియు మూఁడు విధములయిన త్రివర్గములచేత నిండినదియునగు కోటనుబడసి వెట్టుకొని యుండవలయును. (సంధి మొదలయిన) యాఱును,(శత్రువు,పదార్థము,స్త్రీ,వాక్కు, అపరాధములను వీని చేతనైనవైరములు)ఐదును,(లోభము,కోపము,ఆలస్యముఅసత్యము, అజాగ్రత్త,భయము, చాంచల్యము,మూఢత్వము, అన్యాయము, అవమానము అనెడు) పదియును, (కృషి, వ్యాపారము, కోట, అనకట్ట, ఏనుఁగులు పట్టుచోటు, రత్నము లున్నచోటు, పన్నుదీయుచోటు, నాథుఁడు లేనిచోటనెడి) యెనిమిదిని జయించి, పదివిధములయిన త్రివర్గములతోడఁ గూడిన రాజును దేవతలకును గెలువనలవిగాదు. రాజు, స్త్రీలును, వివేకశూన్యులును, దైవముచేఁ బుద్ధిగొట్టువడిన వారును, వేదాధ్యయనము చేయనివారును, నగువారల బుద్ధిని నెంతమాత్రము వినరాదు. వీరల బుద్ధి ఋజువుగాఁ జెల్లుటకుఁ దగినదిగాదు. చదివిన వారులు లేనివియు, స్త్రీలు ప్రధాను రాండ్రుగాఁ గలవియు, మూర్ఖుఁడు మంత్రిగాఁగలవియు, అగ్నులచేత దహింపఁబడినవియు నగురా

[ ] దీనిలోని పాఠము ఔత్తరాహప్రతులందుఁ జూపట్టదు. మఱియును అధ్యాయ విచ్ఛేదమును లేదు.

జ్యములు (వేసవియందలి) జలబిందువులవలె పాడుపడిపోవును. ప్రసిద్ధులయిన విద్వాంసులును,ఆప్తులయిన సుహృదులును, కర్తవ్యములను జెప్పునవిగాఁ జూపట్టు సమస్తకార్యములందును వారి మాటలు రాజువినవలయును. దైవమును బౌరుషమును ద్రివర్గమును నాశ్రయించిన రాజు దేవతలకును బ్రాహ్మణులకును మ్రొక్కి జయసంపన్నుఁ డగును " అనెను.] ఇది యఱువదియెనిమిదవ యధ్యాయము.



## రాజధర్మపర్వము.

{ భీష్ముఁడు ధర్మరాజునకు కృతము మొదలయిన నాలుగు యుగముల గుణములు నిరూపించుట. }

ధర్మరాజు 'పితామహా ! దండనీతిగలదు. రాజుగలఁడు. ప్రజలునుగలరు. (లేక యీ రెంటిచేరిక యుఁగలదు)* ఈమూటియందు నేది కారణముగా నెవరికి నెట్టిసిద్ధికలుగునో నాకుపదేశింపుము' అని యడిగెను.

భీష్ముఁడు "దండనీతివలననుండి రాజునకును బ్రజలకును గలుగు మహత్త్వమును దానికిఁ గారణమును గలరూపునఁ జెప్పెదను వినుము. రాజుచేతఁ జక్కఁగాఁ జెల్లింపఁబడు దండనీతి, నాలుగువర్ణములవారిని స్వధర్మములందు నిలుపుటయే కాక యధర్మములందుఁ బ్రవర్తింపకుండునట్లును గావించును ప్రాణులకు దండనీతియే భయమును లేకుండునట్లు గావించు క్షేమము

* 'ఈమూటియందు నొకరివలన దక్కినవారికిఁ గలుగు ప్రయోజనమేమి చెప్పుము', అని ప్రతాపచంద్రరాయల వ్యాఖ్య.

తోడ నాలుగువర్ణములును దమదమ ధర్మములందుండు నేని మరి యేదలకు నూఱుపాటు లేక మొదటి మూఁడుజాతులవారునుయ థావిధిని సోమాదులయిన యాగములందుఁ బ్రయత్నపడుదురు] నాలుగు వర్ణములవారును దమతమ ధర్మములందు వర్తించు చుండఁగామరియేదలు గజిబిజినొందక వర్తింపఁగా, దండనీతి వలన నెమ్మదియు, క్షేమమును గొనసాఁగుచుండఁగా, ప్రజలు దేనివలనను భయమునొందుటకు వీలులేకుండఁగా, మొదటి మూఁడువర్ణములవారును దమతమ విధిచొప్పున * స్వస్థతకై పాటుచుండఁగా, నట్టికాలములందు మనుష్యులు నిక్కముగా సుఖమునొందుదురని తెలియుము. కాలము రాజునకుఁ గార ణమా!రాజు కాలమునకుఁ గారణమా!యని యీవిషయమై నీకు సంశయమువలదు. రాజే కాలమునకుఁ గారణమనుట నిజము. రాజు పరిపూర్ణముగా దండనీతి చెల్లించుచుఁ బరిపాలించునపుడు కాలములందు శ్రేష్ఠంబయిన కృతయుగము లోకమునందుఁ బ్రవర్తించును. కృతయుగమందు సకలవర్ణముల మనములును నధర్మమునందు వర్తింపవు; కావున నెచ్చటను నధర్మము లేక ధర్మమే వెలుంగును. ప్రజలయోగక్షేమములు సందేహము లేక సాగును; వైదికములయిన కర్మములన్నియు కొంచెమేనియుఁ గొఱవడక విలసిల్లును. సకలబుతువులు నీరోగమును లేక సుఖ ముగానుండును. మనుష్యులకు నెలుంగును, ఛాయయు, మనసును తెలివి తేట దొలఁకుచుండును. మనుష్యులే తెవులును లేక దీర్ఘా

* 'స్వామ్యే ప్రయత్నం కుర్వన్తి త్రయోవర్ణా యథావిధి' (కుం.మూ.) స్వామ్యమనగా స్వాస్థ్యము. కుదురుపాటు. 'సోమే ప్రయత్నమ్' అని (దా. మూ.)సోమాదులయిన యాగములందని యర్థాంతరము.

యుష్మంతులై యుందురు. ఆకాలమందు విధవలు కలుగరు. కూఁరులుపుట్టరు. భూమియు దున్నుటలేకయే పంటలుపండును. ఓషధులు నట్లెఫలించును; పట్టయు, ఆకులును, పండ్లును, వేళ్లును, వీర్యము (సత్తువ) గలవిగా నుండును. అక్కాలమందు, అధర్మమను మాటలేక ధర్మమొక్కటియే యెక్కడను నుండును. ఇవి కృతయుగము గుణములని తెలియుము. రాజు దండనీతియం దొక భాగమును దోఁసిపుచ్చి తక్కినమూఁడుభాగముల ననుసరించి నిలుచునప్పుడు త్రేతయనెడు యుగమునడచును. అక్కాలమందు ధర్మము మూఁడుభాగములతో నధర్మము నొక్కభాగము కలసియుండును. భూమియు నోషధులును దున్నిననే ఫలించును. రాజుదండనీతియందు సగభాగమును వర్జించి సగభాగము ననుసరించి నిలువఁగా నపుడు ద్వాపరమనెడుకాలము లోకమునవర్తించును. అక్కాలమందు పాపము రెండుభాగములును బుణ్యము రెండుభాగములును గలసియుండును. భూమిదున్నుట మొదలయిన పాట్లవలనను సగభాగము ఫలించును. రాజు పూర్ణముగా దండనీతిని విడిచి దుర్మార్గంబునఁ బ్రజలను బాధించునపుడు కలియుగమువర్తించును. కలియుగమందెచ్చటఁ జూచినను నధర్మము పెచ్చుపెరిఁగి నిండారుటేకాక ధర్మ మెచ్చటను గానరాదు. సమస్తవర్ణముల వారిమనసులును దమదమ ధర్మములనుండి భ్రంశమునొందును. శూద్రులు భిక్షావృత్తిచేతను బ్రాహ్మణులు సేవావృత్తిచేతను జీవింతురు. యోగక్షేమములు నశించును. జాతులు సంకరమునొందును. వైదికకర్మమును మిక్కిలి తగ్గిపోవును. ఋతువులన్నియును బ్రాణులకు సుఖముగాక వ్యాధులను గలిగించుచుండును. మనుష్యుల గర్వములును వర్ణములును మన

నులును మిక్కిలి తగ్గిపోవును. ఈకలియందుఁ బెక్కులువ్యాధులు గలుగుటచే మనుష్యులు నూఱేండ్లునిండకమునుపే మరణింతురు. స్త్రీలు విధవలగుదురు. క్రూరములయిన ప్రజలుపుట్టుదురు. మేఘములు వర్షించుటయు, పయిరులు కలుగుటయుఁ గొన్నియెడల మాత్రమేయుండును. రాజులెస్సగా దండనీతినిజెల్లించి ప్రజలను గావఁ గోరకుండునపుడు రసములన్నియు నాశము నొందును. కాఁబట్టి రాజే కృతము, త్రేత, ద్వాపరము, కలియను నాలుగుయుగములకును గారణమగును. కృతయుగమును జేయుచుండురాజు అవ్యయంబగు స్వర్గలోకమునొందును. త్రేతాయుగమును జేయు రాజించుక తక్కువయగు స్వర్గమునొందును. ద్వాపరమును సాగించురాజు తనకుఁదగినట్లుగా స్వర్గమందలి యొకభాగమును బొందును. కలినిబ్రవర్తింపఁజేయు పాపకర్ముండగురాజు మిక్కిలియుం బాపుఁడై యప్పాపమునకుఁ దగిననరకమందు నెలకొని పెక్కేండ్లు వసించియుండును. మఱియుఁ బ్రజలపాపములందు మునింగి యపకీర్తియును బాపమునుబడయును. కాఁబట్టి ప్రాజ్ఞుండగురాజు దండనీతిని మున్నిడికొని పడయనిదానినిబడయుటయుఁ బడసినదానిని రక్షించుటయు వలయును. అపుడు ప్రజలయోగక్షేమములడ్డిలేక కొనసాగును. రాజుదండనీతిని జక్కఁగాఁ జెల్లింపఁగా నది తలిదండ్రులుంబోలె లోకములకు మేరలేర్పఱచుమర్యాదలను రక్షించుటయేకాక లోకములను బావనములుగను గావించును. ప్రాణులన్నియును దండనీతియందే నెలకొనియున్నవని తెలియుము. ఈ దండనీతియొక్కటె రాజునకుఁ బరమధర్మమగును. కాఁబట్టి నీతిచొప్పున ధర్మంబునఁ బ్రజలను బరిపాలింపుము. ఇట్టి వృత్తముతోడ ప్రజలను రక్షించుచుందువేని నీవుజయింపరాని

స్వర్గమును * జయింపఁ గలవు " అనెను. ఇది యఱువదిలొమ్మిదవయధ్యాయము.

---

## రాజధర్మపర్వము.

{భీష్ముఁడు ధర్మరాజునకు రాజునకు వలయు ముప్పది యాఱు గుణములను జెప్పుట.}

ధర్మరాజు 'పితామహా! నీవు మంచినడవడులనెల్ల నెఱుంగుదువుగదే! రాజిందును బరలోకమందును సుఖప్రదములయిన ప్రయోజనములను సుఖముగాఁ బడయుట యేనడవడిచేత?' నని యడిగెను.

భీష్ముఁడు † 'అది ముప్పదియాఱు గుణములతోఁ గూడినది. ఆముప్పదియాఱుగుణములును ననుష్ఠించు సుగుణములుగలరాజు శుభమునొందును. ఆగుణము లెవ్వియనఁగా:—రాజు రాగద్వేషములు లేక ధర్మములాచరించుట, ఆస్తికత్వముగలిగి స్నేహము చేయుట, క్రూరమార్గంబులేకయే ధనమునొందుట, ధర్మార్థములకు హానిలేకుండునట్లు కామమునుబొందుట, పిన్నఁదనములేక యింపుగా మాటలాడుట, తన్నుఁదాను బొగడుకొనని శూరుఁడుగానుండుట, అపాత్రముల కొసఁగని దాతగానుండుట, దయతోఁ

---

* 'జేతాసి దుర్జయమ్' అని మూలము. జయింపరాని స్వర్గమును జయింతువని యర్థము.

† 'ఇయంగుణానాం షట్త్రింశీ షట్త్రింశద్గుణ సంయుతా' అనిమూలము. అది ముప్పదియాఱు గుణములు; ఇవి మఱివేఱు ముప్పదియాఱుగుణములతోఁ గూడియున్నవని ప్రతాపచంద్రవ్యాఖ్య.

గూడిన సమర్థుఁడుగానుండుట, పెద్దవాఁడుకాఁడని తెలిసి పొత్తు చేయుట, శత్రువని చక్కఁగానిర్ణయించినపిదప యుద్ధముసేయుట, హితులుకానివారితో దూతలను జేరనీకుండుట, పరులకు బాధ కలుగనట్లు పనులుచేయుట, అసత్తులుకానివారితో ప్రయోజన మెఱింగించుట, తన గుణములనుగాక పరులగుణములను జెప్పు ట, సాధువులుగానివారివలనఁ బన్నుదీయుట, అసత్తుకాని మను జునాశ్రయించుట, చక్కఁగాఁ బరీక్షింపక దండము విధింపకుం డుట, మంత్రమును వెలిపుచ్చకుండుట, లోభులుకానివారి కొసం గుట, అపకారముచేసినవానిని నమ్మకుండుట, అసూయలేక భార్యనురక్షించుట, అఱమఱలేక పరిశుద్ధుఁడై యుండుట, అధి కముగా స్త్రీలను గూడకుండుట, అహితముకాని రుచిగలదానిని భుజించుట, పూజింపఁదగినవారిని గర్వములేక పూజించుట, కపటములేక పెద్దలకు శుశ్రూషసేయుట, డంబులేక దేవతలను బూజించుట, నిందకు వీలుగానియట్లు సంపదనుగోరుట, అడఁకు వతోఁ బనిచేయుట, కాలమెఱింగి సమర్థుఁడుగానుండుట, పస మాలినదికాని మంచిమాటలాడుట, అడ్డుచెప్పక యుపకరించుట, తప్పును దెలియక యెదిరింపకుండుట, పగవారిని జంపినపిదప దుఃఖింపకుండుట, కారణములేకయే కోపింపకుండుట, అపకార ముచేసినవారియెడ మృదువుగా నుండకుండుట, అనునివియె. నీవు రాజ్యమందుండి యీలోకమందు క్షేమమును గోరుదువేని యీవిధమున నుండవలయును. ఇట్టిగుణములకు వ్యతిరిక్తముగా నుండురాజు కొలఁదిలేని భయమునొందును. ఇట్లు చెప్పఁబడి యీగుణముల నన్నిటిని జెప్పినరీతి ననుష్ఠించుగా

క్షేమము లనుభవించి మృతుఁడయినపిదప స్వర్గలోకమందును మహిమనొందును'' అనెను.

భీష్ముఁ డిట్లు చెప్పఁగావిని యుధిష్ఠిరుఁడు భీమాదులచేఁ బరివృతుండై పితామహుం డగునతని కప్పుడు వందనముచేసెను. బుద్ధిమంతుండగు ధర్మరాజు నతఁ డుపదేశించినయావిధులను నట్లు కావించెను. ఇది డెబ్బదియవయధ్యాయము.

---

## రాజధర్మపర్వము.

{ భీష్ముఁడు చింతలేకుండుటకు ధర్మమునతప్పుట లేకుండుటకును నుపాయము నుపదేశించుట. }

ధర్మరాజు 'పితామహా! ప్రజలను రక్షించురాజు మనస్సునందుఁ జింత యనుబంధము లేకుండుట యెట్లు? ధర్మమునందుఁ దప్పకుండుట యెట్లు? ఈ రెంటిని నాకుపదేశింపుము' అని యడిగెను.

అందులకు భీష్ముఁడు 'రాజా! శాశ్వతములయిన ధర్మములను నీకు సంగ్రహముగానే యుపదేశించెదను; ధర్మములను విస్తరించిచెప్పినచో నవి యెప్పుడును ముగియవు. ధర్మనిష్ఠులును శాస్త్రజ్ఞులును, నియమంబున దేవతల నుపాసించువారును, గుణవంతులును, బూజ్యులునయిన బ్రాహ్మణులను నీవు నీగృహమందు వసించునట్లు చేయవలయును. మొదట వారె నీవెదుర్కొని చని యడుగులనుబట్టుకొని మ్రొక్కినపిదపఁ బురోహితుని మున్నిడుకొని కార్యములన్నియును జేయవలయును. ధర్మకార్యములను శుభకర్మములను జరిపి బ్రాహ్మణులనుగొని కార్యసిద్ధిని జ...కమును నను గ్రహించునట్లు చేయవలయును. కప

టము లేమియు ధైర్యమును దెలివియును బొంది కామక్రోధము లనువర్జించి * ధర్మార్థములను రెంటిని బడయవలయును. కామక్రోధములను మున్నిడికొని ధనమును వెదకఁగోరునట్టి మూఢుం డయినరాజు ధర్మమును బోఁగొట్టుకొనుటయే కాక ధనమును బడయనేరఁడు. ఇది ధర్మము తప్పకుండుట కుపాయమగును. లోభులనును మూర్ఖులనును నర్థకామముల విషయములందు నియోగింపకుము. లోభము లేనివారును బుద్ధిసంపన్నులు నగు వారినేసమస్తకార్యములందునునియమింపవలయును. మూర్ఖునకు కార్యములం దధికారము కలిగించినచో వాఁడు కార్యములందు సామర్థ్యము లేనందునను, కామక్రోధములతోఁ గూడియుండు టవలనను, దనయిచ్ఛ కొలఁకుఁ దప్పుదారినిబడి ప్రజలను గుందించును. పంటయం దాఱింట నొకపాలు పన్నుచేతను, నపరాధులకు విధించు దండుగులచేతను, శాస్త్రమునందుఁ జెప్పఁబడిన రీతిని వర్తకులు మొదలగువారివలన రక్షణమునకుఁ బ్రతిగాఁ గయ్కొను వేతనములచేతను, సుంకములచేతను తెసవచ్చు బడిని గలిగించుకొని బొక్కసము నించుకొనవలయును. [పన్ను లిచ్చినమిగత ప్రజలకుఁ జాలకున్నకాలములందు న్యాయ యథావిధిని దీసినదియు ధర్మయుక్తంబునగు స మరలనిప్పించి రాజు ప్రాలుమాలిక లే నడపుచు రావలయును.] లముగా సంతరించి

* 'ధర

గ్రహీ

రాజు ప్రాలుమాలికలేక ప్రజలకు యోగక్షేమములఁ గల్పించు చుండవలయును. రక్షించువాఁడును, వలయునది యొసంగువాఁడును, ధర్మమునం దెప్పుడును వర్తించువాఁడును, సోమరితనము లేనివాఁడును, గామమును ద్వేషమును లేనివాఁడును నగు రాజునందు మనుష్యులు రంజిలుచుందురు. కాఁబట్టి, యధర్మముచేతను, లోభముచేతను, నీవు * ధనమువచ్చుబడిని బొందరాదు. శాస్త్రయుక్తంబగు లాభముచేత ధనమురాకను గోరవలయును. శాస్త్రపరుఁడుగాని రాజునకు ధర్మార్థములు రెండును నిలుకడగావు. కేవల మాధనము నార్జించు విషయమందే తగులుగల రాజు తుదకు ధర్మమును ధనమును రెంటిని బొందఁడు. అతఁడు గడించిన ధనమునంతయుఁ దగనిచోటఁబడి నశించును. మోహమున (అవివేకమున) ప్రజలను శాస్త్రవిహితములుకాని పన్నులచేతఁ బీడించునట్టి రాజు, ఆధనము మూలముననే తనకుఁ దానే గీడుకలిగించుకొనును. పాలునుగోరిన మనుష్యుఁ డావుపొదుఁగును గో... ...ఁ బాలును బడయనేరఁడుగదా. అట్లె నీతికి విరుద్ధముగా ...జ్యమును నలఁపినచో నది ఫలమును నొసంగఁ ...ను. పులువైచి నీరు త్రాగించి మంచిమాటలచేత మెల్లనబు ...గుకునట్టి యావును గాచుచు వచ్చుమనుష్యుఁ ...ు రాజ్యమును బరిపాలించుచువచ్చు ...ు న్యాయంబున రక్షించి ...సములను సాటిలేని

---

౧ ౘో. మూల
...ము.

రీతిని వృద్ధినొందించును రాజు చక్కఁగాఁ బరిపాలించిన భూమి, తృప్తినొందినతల్లి పాలు మిక్కిలి చేఁపునట్లు ధాన్యమును సువర్ణమును స్వజనులవలననుండియుఁ బరులవలననుండియు నెప్పుడును బిదుకుచుండును. రాజా! చెట్టునఁ బువ్వులుగోయువానిని బోలి యుండుము. బొగ్గులు చేయువాఁడవు గాకుమా! ఆరీతినుండి పరిపాలించుచు వచ్చినచోఁ జిరకాలము రాజ్యము ననుభవింప శక్తుండవగుదువు. శత్రువుల సేనలను మార్కొనఁ బో నీకు ధనక్షయము గలుగునేని, యప్పుడు బ్రాహ్మణులు కా వలన మంచిమాటలచేత ధనమును బడయఁగోరవలయుఁ క్కిలియు సంకటమునఁ జిక్కియున్నను గాని, ధనవంతు ల హ్మణులనుజూచి నీమనస్సు పేరాశచేఁ జలింపకుండవలయున ఇఁక నీవు సొంపు పెంపారునప్పు డిది చెప్పవలయునా? నీవు నీ క్తికిని బ్రాహ్మణుల యర్హతకును దగి... వారలకు ధనప నొసంగవలయును. ఇట్లు మంచిమాటల బుజ్జగించుచు నీవు పాలించుచు వత్తువేని గెలువనలవిగాని స్వర్గమును బొందుద ఇట్లు ధర్మయుక్తంబగు నడ...తోఁ బ్రజలను బరిపాలి దానివలన స్వర్గప్రదమును బుణ్యంబును శాశ్వ యశంబునొందుదువు. నీవు ధర్మయుక... నెచ్చరికగలిగి ప్రజలను బా... గలిగి నిన్నుఁగట... నకుఁ బరమ... యెడ వి... కా...

తలంచుచున్నారు. రా జొకనాఁటికిఁ బ్రజలను భయమునుండి రక్షింపక పోయె నేని యతఁడు వేయేండ్లు నరక మనుభవించియే యాపాపము తీర్చుకొనును. ఒకనాఁటికి ధర్మంబునం బ్రజలను బాలించుట యనెడుపుణ్యమును గావించినరాజు దేవలోకమునకుం బోయి పదివేలసంవత్సరములు నాపుణ్యమువలని ఫలము ననుభవించును. చక్కఁగా యజ్ఞములు చేయువాఁడును, చక్కఁగా
నమ చేయువాఁడును, జక్కఁగా తపముచేసినవాఁడును
కములను జయించునో యన్నింటిని ధర్మంబునఁ బ్రజల
ణము పాలించినరాజు పొందును. ఇట్టిధర్మమును బ్రయ
నఁ బరిపాలింపుము. ఇట్లు చేయుటవలన పుణ్యంపు ఫల
నుబడసి మనస్సునొవ్వనకుఁ గట్టువడక యుందువు; స్వర్గలోక
ందు మిక్కిలియు గొప్పసిరిని బొందుదువు. ఇటువంటి యుత్త
ధర్మములు రాజు... కానివారికి సంభవింపవు; కావున రాజో
డుతప్పఁ దక్కినవా రిట్టిధర్మఫలము నొందఁదరముకాదు.
బట్టి యట్టిరాజవగు నీవు ధైర్యంబున రాజ్యంబును బొంది
బునఁ బరిపాలింపుము. సోహంబున నింద్రునికిఁ దృప్తిగా
కోరినవెల్లనిచ్చి సుహృదులగు జనులకుఁ దృప్తిగావిం
...ది డెబ్బదిరెండవయధ్యాయము.



